# విశ్వదాభిరామ వినురవేమ

త్రిపురనేని వెంకటేశ్వరరావు [విజయవాడ]

వేమన వికాసకేంద్రం
మొగల్రాజపురం :: విజయవాడ-10

# విషయసూచిక

1. వేమన అంతరాంతరాల్లోకి.... I నుండి XC

ఎప్పటెప్పటికి ఎంతెంతదూరం – బ్రౌన్ మదింపులో వేమన – వేదాంతానికి దూరంగా.... బ్రౌను దొడ్లో ఓమూల : అద్వైతం × వీరశైవం – రాళ్ళపల్లి ఖండనలో విశ్వనాథశర్మ – రాళ్ళపల్లి చేసినపని – పండితరాయల శ్లోకం : బ్రౌన్ శోకం .... తల్లి రంకుదెలుపు తద్దినములు – మళ్ళీ అభిరామయ్య.... వేమన సమాసాలు – మాలపల్లి నవల, ధర్మకన్నాలు .... మతస్థుల దొంగతనాలు – వాళ్ళవారి అర్థపద్ధతి–వేమన ఆర్థికప్రస్థానం– గోపీ 'వేమన్నవాదం' – 'వ్యాపారస్థుల కవి' – 'వేమనలు, వేమన సంప్రదాయం' – 'ప్రజాకవి వేమన'మీద – వేమనతో విరసంవారి విరసం – దండి వార్తాభిదానం – ఆబ్దిక మంత్రంలో తల్లి రంకు.

2. వేమన చిత్రాలు XCI – XCVI

3. విశ్వదాభిరామ వినురవేమ 1

4. మతసమత్వమేకాదు, మతరాహిత్యము 6

5. విగ్రహములు విసరివేయుము 11

6. శూన్యము : సున్నము 17

7. తత్త్వము, అద్వయము 21

8. జైన శైవములు – దినమొలులు 24

9. అచలము : వేమన్న 27

10. వేమన్న ఆర్థిక దృష్టి 33

11. పెట్టి పుట్టితివి : పుట్టి పెట్టుము 39

12. నీ భావికి నీవేకర్తవు 44

13. కలిమిలేములు రెండును రెండు కడలు 46

14. కలిమిలేముల నడుమనే నెయ్యము 53

15. యోగి హేతువును చెప్పెను 60 – 77

16. నాస్తికయోగి చెప్పిన నీతి, సృష్టికర్త : శూన్యవాదము
నిరీశ్వరత : యోగము, ఆత్మానుభవము : శాస్త్ర పరిశోధనలు 77 – 90

17. అతని విమర్శకులు 90 – 96

18. స్త్రీయెడ సంస్కర్త గాకపోయెను 96 – 100

19. విశ్వదాభిరామ వినురవేమ 101 – 108
పండితులిచ్చిన అర్థాలు – వేమన చెప్పిన అర్థము –
మనము చెప్పుకోదగిన ఇతర తాత్త్వికారాలు

20 వార్తలోని వార్త వరకవిజేయుడా 109 – 154
వార్తాకవిత్వము – ఛందో విశేషములు – యతికానుప్రాసల
ప్రాముఖ్యము – అలంకారతత్త్వము – భారతీయ పాశ్చాత్య
సిద్ధాంతముల చర్చ–గుణము, రీతి, ధ్వని, – శక్తి ప్రదర్శనము–
రసము : ఉపహాసము, తిట్టు–అతనిరాకొట్టు, సంబోధన,
అవధారణా సంవిధానము, ప్రశ్నార్థప్రక్రియ–అతని పాండిత్యము

21. అతని జీవిత రేఖలు 155 – 208
కాలము–స్థలము–కులము–సంచారము–చార్వాక కాపాలికమత
ఖండనము – అతని జీవితము : ఒక ఊహాచిత్రము

22. పోలికలేని ప్రజ్ఞ 209 – 213

23. కదిరీపతి శుకసప్తతిలో వేమన 214

24. ముఖ్యమైన తప్పులు 215 – 216

25. నామపదసూచి 217

అంకితం

వేమన అంతరాంతరాళ్లో ......

విశ్వదాభిరామ వినురవేమ

తూర్పు తావరు తిరగక ముందే
తొందరపడి తోవతప్పి శ్రీకాకుళం కొండల్లో
కూలి పోయిన తమ్ములు తాము
ఒరిగి, ఒరిగించిన సైన్యాలకు నేపథ్యమైన
మంగళకర మానవతా స్పందనకు

- - - - (త్రిపురనేని వెంకటేశ్వరావు (విజయవాడ)

## వేమన అంతరాంతరాల్లోకి నేను......

ఇంగ్లీషువాడి పుణ్యమాయని ఎలిమెంట్రీస్కూల్లో నేర్పే తొలి తెలుగు పద్యమే వేమనపద్యం. కాలేజీలోచేరి తెలుగు ప్రోజుటెక్సు తీస్తే అందులో మళ్లీ వేమన్నే. అయితే అతడు రాళ్ళపల్లివారి వేమన. ఆంధ్రాయూనివర్సిటీ విద్యార్థులకు వారివేమన ఎలిమెంట్రీస్కూలు పాఠంలో వేమన పద్యంలాగానే తప్పనిసరిపాఠం. ఇంటర్లో కాకుంటే బి. యే లోనైనా అతడు తగలవలసిందే. అదంతా రామలింగారెడ్డిగారి చలువ. అదీ మంచికే జరిగిందనుకొంటాను. ఆ తర్వాత అతనెవరో, మనమెవరమో..... .....అంతే.

కాని ఆ తర్వాత యిరవై యేళ్ళకు— అనగా 1967 కడలో— మళ్లీవేమన తగిలాడు. సాహిత్య అకాడెమీ చలువవలన బ్రౌను సంకలనంలో అతడు దొరికాడు. బ్రౌను ప్రతిగావున గౌరవం. కాని తీసుకువెళ్ళానింటికి. చదివి ఒకపనిచేశాను. అతని ఆ ప్రతిలో ముందటి తెల్లకాగితం మీద రెండు కారికలు, పుస్తకం చివరి పేజీ చివరిపద్యంక్రింద మిగిలిన ఖాళీలో ఏడుకారికలు ఉల్లేఖించుకొని మరీ పుస్తకం మూశాను. ఉల్లేఖించినవి నాగార్జునకారికలు. మొదటి రెండూ మూల మాధ్యమక కారికలనుంచీ, కడపటి ఏడూ రాజపరికథ రత్నావళీలేఖనుంచీ చేసిన ఉల్లేఖనాలు.

అలాచేసి, వేమనపద్యాలు కొన్నిటిని గుర్తుపెట్టి, నాప్రతిని మిత్రులు జి. వి. కృష్ణరావుకు పంపించాను చూడవలసిందిగా. నాతోపాటు తానుకూడ కొని చదివేశాడప్పటికే వేమన్నని. నా ఉల్లేఖనాలు, నేపెట్టిన గుర్తులుఉన్న పద్యాలు చూచుకొని మళ్ళీ మొత్తం అంతా చదువుకొన్నాడు. తర్వాత ఒకరోజు ఇద్దరం కలుసుకొన్నాం.

"నిజమే .. వేమనలో నాగార్జునుడున్నాడు. నేనుకాదనలేదు" అన్నాడు డాక్టరు జి. వి. కె., నాగార్జునుణ్ణి ప్రామాణికంగా చదువుకొన్న ఏకైక పండితుడు, నాగార్జున వ్యాఖ్యానువాదకారుడు. "పైగా వేమన్నను పదిపన్నెండేళ్ళక్రిందకావాలని

చూశాను. చూచి అతనిమీద ఇంగ్లీషులో వ్యాసం వ్రాశాను, నార్ల సమ్మానసంచిక Half-way (1958) లో. అది చూడలేదా? అందులో నాగార్జున ప్రస్తావనకూడ తెచ్చాను. అతణ్ణి ఒకందుకు (మాయావాదంకొరకు) ప్రస్తావించానుగాని వేమనలోని శూన్యవాదంకొరకుగాదు. నువ్వుచూపేదాకా వేమనలో శూన్యవాదం వుందని గమనించనేలేదు. చూడు వెంకటేశ్వర్రావ్! సంస్కృతంలో చదువుకొని అదే తేట తెలుగులోవుంటే పోల్చుకోలేకపోవటం చిత్రమే!..... సరే, యిప్పుడు నువ్వేం చేస్తావ్?..... వేమనమీద ప్రసంగం వేస్తాను మరి,...ఆకాశవాణిలో నీఫైండింగ్సు ముందుగా యిచ్చేయ్.... తర్వాత త్వరలో పుస్తకరూపం యివ్వు, తప్పకుండా యివ్వు...."అన్నాడు. అలాగే రేడియో ప్రసంగం. 1969లో..

రేడియోప్రసంగం వినీవినగానే గుంటూరుజిల్లా తాడికొండలో విద్యార్థి మానులు పిలిచి ప్రసంగం చేయించుకొన్నారు వేమనమీద. డాక్టర్ జి. వి. కె. ఇంగ్లీషువ్యాసాన్ని తెలుగుజేసి 'నవతోరణం' అనే తన వ్యాససంకలనంలో చేర్చి, గుంటూరులో దాన్ని ఆవిష్కరించేప్పుడు 1971 లో వేమననుగూర్చి కూడ ఉపన్యసించవలసి వచ్చింది.

పుస్తకరచన అలాగేవుండిపోతోంది. నేనా బహువ్యాసక్తుణ్ణి. సాహిత్యం—పరిశోధన నన్ను పోషించేవృత్తులుకావు. .... 'నిర్వ్యాపారత .... రాపురుష గుణంబులంద్రు కౌరవనాథా యనడంచేత దాన్నుండి తప్పుకోడానికి వ్యాపారించేస్తున్న వాణ్ణి. వేమన్నో చూచినకొలదీ పెరిగిపోతున్నాడు. అతడు తెలుసుకోనితత్త్వంలేదు. అతడుప్రయోగం చెయ్యనిసాధనలేదు. అతడొక పెద్ద ప్రయోగశాల. ఇదేగొప్పది-ఇదే సత్యం అనుకొంటూ ప్రతిదాన్నీ అనుష్ఠానంలోకిదీసుకొని, శోధించి, తర్కించి ఆలోచనచేతా అనుభవంచేతా మళ్ళీ తిరస్కరిస్తూ, తుస్కరిస్తూ వచ్చాడు. అందుకే అతనిలో చాలాచాలా తత్త్వాలను గూర్చి సాధనలనుగూర్చి మండనఖండనలు రెండూ వుంటై. పరస్పరవిరోధాలుగా కనిపించుతై. అదంతా అతని పరిశోధన, అన్వేషణ, పరిణామక్రమం. అతని ప్రయోగశాలలోకి మధ్యయుగ భారతంలో తలెత్తిన తత్త్వ శాఖలు (ఉపశాఖలు) అన్నీవిషయమై కూర్చుండినై. వేమన్న మధ్యయుగ భారతీయ మత-తత్త్వశాస్త్రవిషయాల ఎన్‌సైక్లోపేడియా అనిపిస్తాడు. అతనిలో వైరుధ్యం పరిణామ చిహ్నం—వికాససంకేతం అనిపిస్తుంది. అతనికి నాగార్జునుడిపేరు లేకుండ, బౌద్ధ వైముఖ్యంలో శూన్యతత్త్వం దొరికింది. అదేఅతని అన్వేషణకు అంతిమఫలం.

అదేమీ మధ్యమశిలీతాదు. అతడక్కడికి పర్యవసించాడు. అదిఅతని పరిణత తత్త్వం అనిపించింది నాకు. ఇకదానికి అనుగతభావజాతమే, తత్సంగతమైన బహుముఖ వ్యాపారమే తత్తర్కపర్యవసన్నమైన ఉపదేశమే, సిద్ధాంత నిర్మితే, రచనే, అంతాకూడ.

మహాత్మగాంధీ అన్నాడు M. N. రాయ్‌ని గూర్చి : అతని మొదటి వాక్యాన్ని అంగీకరించావో జాగ్రత్త, అతనిచివరివాక్యాన్ని అంగీకరించవలసి వస్తుంది అని. వేమన్న తత్త్వం శూన్యతత్త్వం అనుకొంటే, అతని 'ఆర్థిక శాస్త్రం' సామాజిక సంస్కరణం, హేతువాదం, యోగం, నీతి,కవితాస్వభావం, మకుటం అన్నీ దాన్నిబట్టే ఒకదానివెంట ఒకటిగా తర్కతోపనతాలుగా వస్తయ్. సర్వవైరుధ్యాలూ వైదొలగిపోతూ ఒక పెద్ద సమన్వితార్థ విశ్వరూపం, అనేకానేక విషయాలకొక సమీకరణం దానివల్ల కానవస్తుంది. ఇదంతా ఈసమీకరణమంతా నాకు వెంటనే స్ఫురించలేదు. ఒక్కసారిగా స్ఫురించలేదు. అకాదెమీ బ్రౌను సంకలనంతోనే సమకూరలేదు. N. V. గోపాల్ & కో ప్రచురణ బాగా ఉపకరించింది. వావిళ్ళ, నేదునూరి ప్రచురణలుకూడ కొంతలోకొంత తోడ్పడినై.

## ఎప్పటెప్పటికి ఎంతెంత దూరం....

1968 నాటికి వేమనలో నాకు అగుపించింది శూన్యతత్త్వమే—రేడియో ప్రసంగంలో శూన్యతత్త్వమూ తదనుగుణమైన యితరమైన మత-తాత్త్విక విషయాలే వున్నై.

1972లో ఆంధ్రప్రదేశ్ టీచర్సు ఫెడరేషన్ రజతోత్సవ మహాసభలో విద్యాసభలో ఉపన్యసించవలసిందిగా పిలుస్తూ, వారి ఉపాధ్యాయ పత్రికా రజతోత్సవ సంచికకు వ్యాసం అడిగితే— "వేమన్న శూన్యతాసిద్ధి" అనే శీర్షికతో సుదీర్ఘమైన వ్యాసం యిచ్చాను. అందులో అతనికొక ఆర్థికదృష్టివుంది, అదీ శూన్యవాదానికివలె మధ్యమప్రతిపత్తు: అతనిలో ఒక వివాహసంస్కరణం వుంది, అదీ అతని ఆర్థిక సంస్కరణనుబట్టి వుంది, అన్నంతవరకు చెప్పాను. అయినప్పటికీ వేమనలోని ఆరనితపన, ఆదినుంచీవున్నతపన సంఘంలోని ఆర్థిక సమస్య అని దానికి తగినంత ప్రాధాన్యం యింకా యివ్వలేదనుకొంటాను.

1967లో తెనాలి 'అరవింద సాహిత్యసమితి' వారు పిలిచి ప్రసంగం చేయించారు. మధ్యయుగ భారతంలోవున్న ప్రాచీన మతాల అవశేషాలు, ఆనవాళ్ళు క్రొత్తగా తలెత్తిన ఎన్నో చిల్లర మతశాఖలు, ఆయా వాటిల్లో బౌద్ధప్రభావాలు,

పేరూ వేషం మార్చుకొని బ్రతుకుతున్న బౌద్ధ సిద్ధాంత శిథిలాలు, తన్ను నిర్మూలించిన శైవాన్ని, శివుణ్ణి, అద్వైతాన్నీ మళ్ళీ అది ఆక్రమించిన బహుభంగుల్నీ, ఆంధ్రదేశంలో 13, 14 శతాబ్దాల వరకూ ప్రత్యక్షంగా బౌద్ధం బ్రతికివున్న ఆనవాళ్ళూ శ్రీనాథ తెనాలి రామకృష్ణుల వంటి కవులకు అందుతున్న శూన్యవాద స్వరూపం, అల్లమప్రభు ముఖంగా వీర శైవ పరమతత్త్వమై కన్నడం నుండి అందుతున్న బయలు గానం మొదలుగా వేమన్నలోకి సంక్రమించిన తత్త్వ చారిత్రక పూర్వరంగం యొక్క చిత్రాన్ని, ఒక్క మాటలో నాగార్జున శూన్యవాదం నాగార్జుననామకం, బౌద్ధనామకం కాకుండా కాలావధుల్ని దాటి వేమనకు యే యే మార్గాలలో ముట్టిందో చెప్పాను. అదంతా యీగ్రంథంలో యింకా వివరించి చెప్పలేదు.

1975లో సెప్టెంబరు 'అనామిక' సంచికలో వేమనను గురించి చిన్న వ్యాసం వ్రాశాను. 'హేతువాద ప్రవక్త వేమన్న' అనే శీర్షికపెట్టి నాలుగు మాటలు చెప్పాను. భారత సంస్కృతికి వేమన్న ప్రత్యేకంగా యిచ్చిన కాన్క — మత ప్రసక్తి రాహిత్యం — మతాలకు మతాలకు దూరంగా వుండుమన్న ఆధ్యాత్మికతత్వం—మత రహిత ఆధ్యాత్మికత అని చెప్పి దాన్ని — 1972లో అన్నదాన్నే — హైలైట్ చేశాను. ఇంకా ఆ 1975 ఏప్రిల్లోనే వేమనమీద 40 పేజీలు అచ్చువేశాను. అదే యీ పుస్తక ప్రచురణకు నాంది. అవే దీనితొలిపేజీలు.

1976లో యీ పుస్తకం అచ్చుని 104 పేజీలకు తెచ్చి విడిచాను. మాతమ్ముని ఆకస్మిక మరణం చేత వికలమైన మనస్సుతో అక్కడ ఆపేశాను. అప్పటికి వేమన్న యోగం ప్రత్యేకమైనదనీ, నాలుగు యోగాలకు అది భిన్నమనీ, విచిత్రమైనదని, అది సహజ యోగమని — యోగానుభవానికి హేతుబుద్ధికి విరోధం లేదన్న స్థితి అతనిదని కనుగొని, నేటి మనస్తత్వ శాస్త్ర పరిశోధనలో యోగానుభవాన్ని కళానుభవాన్ని సమీక్షించి అబ్రహాం మాస్లో Peak Experiences మీది ప్రయోగ ఫలితాలతో సమన్వితం చేశాను. అతని నీతిలోని విశిష్టతని గుర్తించాను. విశేషించియీకాలంలో అతని మకుటాన్ని — విశ్వదాభిరామ వినురవేమని Decipher చేశాను.

"సహజమైన యర్థము దీనికిదివరకు లభింపలేదు. ఇకముందు లభించునను నాశయు నాకులేదు. దీనికర్థమే లేదనుకొని యింతటితో నూరకుండుట క్షేమము. ఇది 'తందనానతానా' వంటిద"ని రాళ్ళపల్లివారు 1928లో యీ 'అపండితుని' మాట అర్థము లేనిమాటగా తేల్చివేసి పరిశోధన నపతలబెట్టించారు.

కాని వేమనే ఇటువంటి భాషా పండితుల్ని, దర్శన శాస్త్రాచార్యుల్ని నీళ్ళు తాగించి, తాగించి, తానే దాని అర్థం విప్పి చెప్పినట్లు కనుగొన్నాను. "విశ్వదాభిరామ వినుర వేమ" అనే అధ్యాయం సగంలో అచ్చూ, నా వ్రాతాకూడ ఆగిపోయినై అప్పట్లో. 104వ పేజీ వరకు అందుకే యీ పుస్తకంలో కాగితాలు రంగులు కగ్గి పాత తిరిగి వున్నాయి

మళ్ళీ 1980 మేలో వ్రాయడం ఆరంభించాను, అచ్చుకు పూనుకొన్నాను. 'మరొక విశేషార్థమును బౌద్ధమునకు సంగతముగా జెప్పుకొందము' అని ముగించిన నారచనను మళ్ళీ మొదలుపెట్టి బౌద్ధానికేగాదు అద్వైత్వానికి,అద్వైతంలో వేమననాటికి వచ్చివున్న పరిణామాల వరకు, అదేమీ యిదేమీ అనకుండ అవిద్యనంటూ చెప్పిన సర్వతత్త్వాలకు శూన్యవాదానికికూడ సరిపోయేట్టు, సులభమైన సహజమైన అర్థాన్ని- 'స్వచ్ఛందచారిగను, సన్యాసిగను' వున్న వేమన జీవితం ఉభయదశలకు, వేమన్న సర్వతాత్త్విక దశలకుకూడా చెల్లే అర్థాన్ని చెప్పాను. చిత్తగించగలరు.

ఈ పుస్తకాన్ని యింకో యిరవై పేజీల్లో ముగించాలనుకున్నాను. కొంచెం కవిత్వాన్నిగూర్చి, కొంచెం జీవితాదికాన్ని గూర్చీ చెప్పి ముగించుదామనుకొన్నాను. ఇంతలో వేమన తన కవిత్వాన్నిగూర్చి చెప్పుకొన్నట్టు తోచింది. పండితుడేననిపించ సాగాడు. తన పద్ధతి కవిత్వానికో పేరు పెట్టుకొన్నట్టుంది. అది వార్తా కవిత్వం.అదే అప్పట్లో నవకవిత్వం. అందుకే అతడు నవకవులనుకూడ వినుతి చేశాడు. కవితారీతిలో అతిపొకత నవీన పఠగంతనన్న స్ఫురణ అతనిలో వుంది. వార్తాకవిత్వ సంప్రదాయం కోసం వెదికాను. రాళ్ళపల్లివారి పుస్తకంలోనే అనంతపురపు వార్తకవి రామచంద్ర రావుగారితో కలిసి కటారుపల్లెకు పోయివచ్చినట్లు వ్రాయడం గుర్తుకువచ్చి అనంత పురం మిత్రులకు వ్రాశాను. వార్తకవి బిరుదుగాదు; గృహనామమే; ఆ యింటి పేరివారెందరో ఇక్కడ వున్నారని జవాబువచ్చింది. తెలుగుదేశంలో వార్తాకవిత్వం అన్నదొక కవిత్వ ఫక్కిగా ఒకానొకప్పుడున్నదన్నమాట. దాన్నొక కవితాధోరణిగా మన సాహిత్య చరిత్రకరులు సూత్రించలేదు; ఇంకా దాని పుట్టుపూర్వాలు వ్రాయవలసి వుంది.

చేమకూర దగ్గరవిన్న జాతివార్తలు చాలమంది కవులవ్రాతల్లో వచ్చినై. చేమకూరే వేమనకు మునలి సమకాలికుడేమో. వేమనకీ చేమకూరకీ ముందే వార్తా కవిత్వం ఉండాలి. అవును, వార్తాకవి రఘునాధయ్యగారుండనే వున్నాడు. అన్నట్లుఒక లక్షణదీపికాకర్తగా. ఇంకాకొంచెం ముందేమైనాదానిఆరంభం కనిపిస్తుందేమోమరి.... శివదేవముఖనవకవుల్లో శివదేవుడో మరి :

ఏమైనా వేమన 'వార్తలోనివార్త వరకవిజేయురా' అన్నతర్వాత అతడు కవిత్వంలో ఒకానొక ఉద్యమం వాడనుకొన్నాక, మన పండిత లోకాన్ని ఎంతో తికమకపెట్టిన చేమకూరవాని 'వార్త' తో కవిత్వం చెప్పినవాడు, కావాలని ఉద్యమించిన కవి ఉద్దండుడై వుంటాడనుకొని అతని కవిత్వాన్ని గూర్చి విశేషించి వ్రాయాలని ఇంతైనా దీర్ఘంగా వ్రాశాను. అయినా ఇంకెంతో ఎన్నెన్నో విశేషాలతో వ్రాయాల్సి ఉందికూడా. అతని ఛందోవిశేషాలే యింకా చెప్పవలసివున్నై. యితరుల చేత తప్పనుకొని దిద్దేయబడిన విషయంలోనే వేమన సాభిప్రాయుడై నట్టు వివరించుకోవాల్సినవి వున్నై.

కాలక్రమాన ఇలా వేమన అంతరాంతరాల్లోకి చొరబడిపోయి నేను, వ్రాసిందేదో వ్రాస్తూ నాకు అంతగా కన్నులేని జీవితరేఖలు గీయబోయిగీస్తూ కాలం దగ్గర ఆపేసి యీ పీఠిక జోలికిపోయాను.

బహుముఖ కార్యకలాపంతో తీరిక కరవై కావాలని ఒక్కొక్కసారి తీరిక చేసుకొని వేమనలోకి దిగినకాలమే ఎప్పటికప్పుడు ఏదో ఒక కోణం కన్పిస్తూనే వచ్చింది గతదశాబ్దంగా ఇంకా తగుల్తూనేవున్నై. ఈపుస్తకం అచ్చు 1975లో మొదలయిందంటే వ్రాత పూర్తిచెయ్యకుండానే, పూర్వాపరసుసంగతత్వం వగైరా విషయాలన్నీ సరిచూచుకొని అచ్చుకు సిద్ధం చేసిన శుద్ధప్రతి అంటూ ఒకటిలేకుండానే, అచ్చుఅయ్యే ఫారంకంటే అదనంగా వ్రాసినభాగం కొంత చేతిలోలేకుండానే, ప్రెస్సు వారిని నామీద ప్రెషర్‌తెమ్మని చెప్పుకొని ఇంత వ్రాస్తూ, ఇంత అచ్చువేస్తూ చేసిన రచనయని యీపాటికి పాఠకులు గ్రహించే ఉండొచ్చు. దీనివల్ల బాధలున్నై. అవే కొన్ని చెప్పుకొంటాను.

## ప్రపంచ తెలుగు మహాసభల తొందరలో . . . .

1975లో 40 పేజీలు అచ్చయిందన్నప్పుడు అప్పటి ప్రణాళిక ప్రకారం వేమనమీద 50—60 పేజీల్లో చెప్పి ముగించాలని వుద్దేశం. ఆయనగారొక్కడిమీదే గాదు మరో మహాపురుషుడి మీద కూడ అంతపాటిలో చెప్పాలని. వారెవరోగాదు నాగార్జునుడే. ఇద్దర్నీ ఒక పుస్తకంలోనే పెట్టి చెప్పాలని సంకల్పించాను. ఆ పుస్తకం పేరు "ప్రపంచ మెఱిఁగిన తెలుగునాటి తాత్త్వికులు" — ఇద్దరిబొమ్మలతోనూ ముఖపత్రం గీయించింది గీయించినట్లే యిప్పటికీ అలాగే ఉంది. మార్చిలో ఆరంభించి

ఏప్రిల్‌నరికి అచ్చుపూర్తిచేయాలని త్వరపడ్డాను. నాగార్జునుడిమీద 36 పేజీలు అచ్చైచ అలానేవున్నై. ఇలావీరిద్దర్నీగూర్చి అవ్యవధికంగా త్వరపడడందేనికో ఆసంవత్సరం ఆ నెలలయొక్క ప్రాధాన్యం గుర్తున్నవారికి తెలుస్తుంది.

ప్రపంచ తెలుగుమహాసభల సంవత్సరంగదా అది. ఆసందర్భంగా అకాడెమీ ఎవరెవరిచేతనో ఎవరెవరిమీదనో ఏమేమో వ్రాయించి ప్రచురించే ప్రణాళికలో నాగార్జునుడిమీదగాని, వేమన్నమీదగాని వ్రాయించడం లేదని కొంచెం ముందుగా విన్నాను.కాని ఆ సభల వ్రాయసగాండ్ల 'క్యూలో' నిలబడి కోటాకోసం చూడకుండా నా ఓపానశక్తిగా ప్రచురించి ప్రభుత్వం చేస్తున్న పటాటోపపుపండుగకు నాకానుకగా పంపుదామనుకొన్నాను. ప్రెస్సుకలిసిరాలేదు. ప్రభుత్వ మహోత్సవానికి యీ సామాన్యుని కానుక అందకపోయింది. అప్పటికీ యిప్పటికీ అకాదెమీ వీరిద్దరి విషయంలోను అపచారం చేసిందన్న స్ఫురణఎక్కడా ఎవ్వరిలోను లేదనుకొంటాను. అదేమంటే ద్వారాలుపెట్టాం బొమ్మలుపెట్టాంగదా అని తమ్ముతామునంబాళించు కోవచ్చు.

అలా అవ్యవధికమైన, అతిక్లుప్తమైన, ఆ ప్రణాళికలో కర్చుపడి అచ్చు వేసిన 40 పేజీలే తర్వాత పెరిగిన యీ పెద్ద ప్రణాళికలోకి ఆర్థిక కారణంచేత గ్రహించవలసి వచ్చింది. ఎంతో వివరణ అపేక్షించే ఆ తాత్త్వికభాగం, ఇంకా నిరూపణం యింకా యింకా విశేషాలు చెప్పవీలున్న అతని ఆర్థిక విచారధార, అతని జీవితప ణామ సర్వస్వానికి అదేచోదకమైనదన్న విషయప్రతిపాదనను కుదించి కుదించి చెప్పినట్లయింది ఆ రెండు విభాగాలే నూరు నూటయిరవై పేజీల వైశాల్యాన్ని ఆక్రమిస్తాయి. మరో ముద్రణంచూస్తే యీపుస్తకం, ఆ భాగాలు విషయపుష్కలం కావలసినవే; వివరణా విశదిమను పొందవలసినవే. ఈలోగానే మరోప్రణాళిక కలిసివస్తే ఆ ఖాళీలు నింపఒడనూవచ్చు, చెప్పలేను.

## ఇతరులవా నేనవా . . . .

ఓప్రక్కన ఈ సంగతులిలా తేలుతూవుండగా, మరోప్రక్కన అసలైన విషయం గూర్చి—భావవ్యవస్థనుగూర్చి యిప్పటికి విశదమయ్యేవుండాలి. అదేనన్ను గూర్చిన భయంకర విషయం. ఎందరో మహానుభావులు గునపాలూ గడ్డపారలూ పట్టి ఎక్కడెక్కడోత్రవ్వి త్రవ్వి ఇదిగో వేమన్న విగ్రహామని వెలువరించి చూపించారు.

వారందరికి వంగి వంగి వందనములు చెప్పి, మన్నించవలసిందిగా వినతిచేసుకొని ఆ మహామహులు చూపించే వేమన్న విగ్రహం అసలు వేమన్నది కాదని, వారు ఊరేగించే ఆ ఉత్సవవిగ్రహంలో మూలవిరాట్టుపొ ల్తి వాలకంలేదని, ఇదిగో వేమన మూలవిరాణ్మూర్తి అంటూ ఆ పెద్దలుచూపిన వేమనతో మౌలికంగా భేదించే ఒక తాళప్రమాణమైన విగ్రహాన్ని త్రవ్వి వెలువరించ సాహసించాను. ఈ పురాతత్త్వఖననంలో నేనేకాకిని. ఎవ్వరితోనూ ఏకీభావంలేదునాకు. నాకు నేనుగా త్రవ్విన త్రవ్వకం ఇది. ఎవ్వరి ఏ యదృచ్ఛాసూచనా, ఏఅనుద్దిష్ట అస్పష్టసంజ్ఞానాకు ఖనిత్రంకాలేదు. తాళపత్రాల్లోనికి, అవియిచ్చేమూలపాఠాలలోనికి నాతవ్వుగోలలువెయ్యలేదు. అందరికీ అందుబాటులోవున్న అచ్చుకెక్కిన అక్షరాల పాటిదిబ్బను మాత్రమే కుళ్ళగించాను. ఇంకా కుళ్ళగించవలసివున్నది భాషతెగమేసి బలిసిన పండితుల కళ్ళకు కానరాక తీరైన తేటతెనుగు నిరాడంబరతలో మాటుకొనిపోయి మరొకటిగా కనిపిస్తున్న వేమన్నభావనగర్ పూర్తివెలువరింపుకై అవైదిక దర్శనాద్యష్ట బాహుళ్యబహుస్వల్పసామాగ్రితో చేసిన త్రవ్వకంగా— స్ఫురించి వుండాలిమరి.

అయితే ఇతరులెంతవరకు చెప్పారో వేమునను గూర్చి, వారిలో వారెలా విభేదించారో వెరశి ఏం మన ముందుంచారో చెప్తే ఆ పెద్దల నుండి నేనెంత దూరమయ్యానో స్పషపడుతుంది.

తమిళంలో కనిపించి- ఫ్రెంచి పుస్తకంలోకి ఎక్కి, ఆ ఫ్రెంచి పుస్తకం యొక్క ఆంగ్లానువాదంలో, ఈస్టిండియా కంపెనీ పరిపాలనాధికారి చార్లెస్ ఫిలిప్ బ్రౌన్‌ను ఆకర్షించగా, ఆ బ్రౌన్ అదితిమాతయై తెలుగు తాత్త్వికకవి వేమనను వామనునిగా ఇంగ్లీషుటీకతో తెలుగునేలమీదకని విడిచిపెట్టాడు. వామనుడు ఇంతింతై ...... బ్రహ్మాండాంతసంవర్ధియై' నాడన్నట్లే నేటి యునెస్కో ప్రణాళికతో విశ్వకవి-విశ్వ విచారకుడుగా ఆవిష్కృతుడవుతున్నాడు. బ్రౌనువల్ల వెలుగులోకి వచ్చినందున బ్రౌన్ అంచనాతోనే ఉపక్రమిస్తాను.

## బ్రౌను మదింపులో వేమన తత్త్వం :

మహానుభావుడు బ్రౌను రెండువేలొకవంద పద్యాలంటూ సంపాదించిపెట్టి పోవడమేగాదు, వేమన్నని కవిగా, తాత్త్వికునిగా, నీతిశాస్త్రకారునిగా ఏకోవలోవాడో, ఎంతబరువైనవాడో మదింపుచేశాడుకూడా. కాలం కులం దేశంవంటి చారిత్రకాంశాలు కూడ ఇచ్చాడు.

1824 నవంబరులో అన్నాడు :

"Vemana was evidently, in Philosophy, of the Vedanta school, a desciple of Vyasa, whom Sir William Jones has (in the Asiatic Reasearches, Vol. I) entitled the Plato of India. With the mystic tenets of Plato, those of Vemana closely correspond while his moral doctrines as closely answer to those of Democritus."

1829లో మార్చుకొని అంటున్నాడు :

"I hence imagine him to have been a Jangam: the sect of Sudras known by this name are seceders from the common religion............. Their creed also corresponds with that taught by Vemana........ ....."

1839లో మరికొంచెం సవరణతో :

It appears that he was not a Jangama as is indeed shown by his silence regarding their great teacher Basava. But his tenets coincide more closely with those of the Jangamas than with those of any other sect. Vemana indeed belonged to no sect.

1840లో మరింత :

'జంగమువారు వేమన తమ మతసిద్ధాంతములనే ఉపదేశించుచున్నాడని చెప్పుకొందురు. కాని వేమన బ్రాహ్మణులను చులకనచేసి తూలనాడినట్లు కాన్పించినను, బసవేశ్వరుని ధర్మములపట్ల చాల మొగ్గుచూపినట్లు కనబడినను, వీరశైవ సిద్ధాంతములను మాత్రము అవలంబించినవాడుకాడు. ఇంతేగాక, స్త్రీ జాతిని గర్హించిన తీరు ఆయన వీరశైవుడు కానే కాదనే దానికి ఇంకొక నిదర్శనమగుచున్నది. వేమన పునర్జన్మను గూర్చి ప్రస్తావించియున్నాడు. గాని, జంగమ మతస్థులు జీవికిజన్మలు ఇంతటితో తీరిపోయినవని చెప్పుదురు "వేమన-పాశ్చాత్యులు" నుంచి.

# వేదాంతానికి దూరంగా, జంగాలకు దగ్గరగా వేమన్న

వేమన దార్శనిక సిద్ధాంతం వేదాంత సంప్రదాయంలోనిదని, వ్యాసప్రోక్తం అనీ బ్రౌను తొలి నిర్ణయం. అది ప్లేటో తత్త్వ సిద్ధాంతంతో సరిపోలుతుంది, కాని వేమన నీతిసూత్రాలు మాత్రం ప్లేటోతో విభేదించే డిమోక్రిటస్ అనే గ్రీకు భౌతికవాది చెప్పిన నీతిసూత్రాలతో తూగుతున్నాయని వ్రాశాడు. అతని తత్త్వం వ్యాస వేదాంతమయితే, అతని తత్త్వానికి అతని నీతికి పొంతనలేదని సున్నితంగా ధ్వనించాడన్నమాట. అయితే అప్పటికీ యిప్పటికీ అతని ధ్వని మనకు వినపడలేదు. నిన్న మొన్నటిదాకా నాకే వినపడలేదు. 1975లో అచ్చైన యీ పుస్తకం తొలిపుటల్లో దాని ప్రస్తావనలేదు. అదీ ఒక లోపంగా తలంచే, దాన్నే సమస్యజేసి తిరుగ వ్రాసి తొలి నాల్గుపుటల్నీ పునర్ముద్రించానిప్పుడు.

ఆ వ్యాసుని వేదాంత సంప్రదాయం, సిద్ధాంతం ఏమిటో — వేమన తాత్త్విక కవితకు వివరణంగా వుండేదాన్ని డాక్టర్ విల్కిన్స్ కామెంట్రీ తోడి భగవద్గీతనీ, సర్ విలియం జోన్సు యొక్క Mystical Poetry మీద వ్యాసాన్నీ చూడమన్నాడు. అందాకా ఎందుకని "I have subjoined a short explanation of the system" అన్నాడు. కాని దాన్ని అకాడెమీ ప్రతిలో పొందుపరచలేము. ఆ వ్యాస వేదాంతం అద్వైతమానో కాదో అతని మాటల్లోనేస్పష్టమయ్యేది. బ్రౌను వేమన పద్య సంకలనంలో అది అనుబంధంగా వెయ్యదగును.

ఆ మీద అయిదు, పదైదు ఏండ్ల అవగాహనాఫలితంగా పరిణతుడయ్యాడు బ్రౌను. వేమన తత్త్వసిద్ధాంతాలు ఆ వేదవ్యాసుణ్ణి దూషించే జంగాల శాఖకు-అంటే వీరశైవానికి చాల దగ్గరివాడని నిర్ధారణచేశాడు. అయితే అతడు జంగముదై పోలేదు వీరశైవశాఖలో చేరినవాడు కాడు; అసలు ఏ శాఖకూ మతస్థుడుగా చెందడన్నాడు. అతని తత్త్వం వ్యాస వేదాంతానికి దూరమని, వీరశైవ దర్శనానికి దగ్గరిదని, అతని నీతిఐహిక ప్రాధాన్యం కలదని అవైదికమైనదని అతని తుదిమదింపు, తీర్పు అని స్పష్టపడుతున్నది. వీరశైవాన్ని బ్రౌను అధ్యయనంచేసి 1840లోనే Essay on the Creed, Customs and Literature of the Jamgams అని ఒకటి వ్రాశాడని తెలుస్తున్నది. అది కూడా బ్రౌను 'వేమన పద్యాల'కు అనుబంధంగా వెయ్యాల్సింది; ఇకముందైనా యీ రెండూ అనుబంధాలుగా వెయ్యడం ఔచితీనిచిత మౌతుంది. వీరశైవ తత్త్వంలో అల్లమ ప్రభుతత్త్వం దాకా అతడు వెళ్ళాడో లేదోమరి నాకు తెలియదు. అలాగే వెళ్ళి అతని శూన్యతత్త్వాన్నే

నిర్దేశించే వుంటే, అందులో ఎక్కడేనా వేమనలో అల్లమే వున్నాడని ఒక్కమాటే మైనా అనేవుంటే నా ఫైండింగ్' యొక్క ప్రాధాన్యాన్ని నేను వదలుకోవలసిందే. అయితే అప్పటికి నాలో మిగిలేది— నా నిర్ణయం స్వతంత్ర నిర్ణయం అన్న తృప్తే, వివరణమేమైనా యిచ్చానన్న తృప్తే. బ్రౌను అల్లమను—అతని శూన్యతా తత్త్వాన్ని గుర్తించలేక, వేమనలో అది వుందని అతడనకపోతేనే స్వతంత్రనిర్ణయం అనేగాదు, ఆ నిర్ణయం క్యాలెండరు ప్రకారం మొదటిది కూడా అవుతుంది.

ఇక్కడే యింకోమాట చెప్పాలి. W. H. Campbell, R. M. Macdonald వ్రాసిన వ్యాసానువాదాలలో "వేమన పునర్జన్మ సిద్ధాంతమును కొన్ని చోట్ల గట్టిగా ప్రతిపాదించి, మరికొన్నిచోట్ల యీ విశ్వాసము చాల అసంగతమని విమర్శించుటచే, భిన్నమైన యీ పద్యములు ఆయనవి కావేమో అని బ్రౌను సంశ యించుచున్నాడు'— [111వ పేజీ, 98వ పేజీ వేమన—పాశ్చాత్యులు] అని చదువు తున్నాంగాని పునర్జన్మమికలేదనో, అసలు లేదనో, మరి వేమన చెప్పినాడన్న ఆ పద్యాలేవోగాని అవి అచ్చులో నేను చూడలేదు. అవంటూ వుంటే వెలువరించ వలసినవని మనవి.

## మన సంస్కృతికి మనమే మానకలశులం !

పరదేశీ బ్రౌనువచ్చి ఆ వేమన పద్యాల్ని ఎన్ని పోగుజేసిపెట్టి పోయాడో అంతకు రెట్టింపు సంఖ్యకు అందేటట్లు 1913 నాటికి అతని పద్యాల్ని మనంతమనం పోగుజేసుకొన్నాం. [రాయపరం పూర్ణయాచార్యులవారు 4035 చెయ్యగా, అందులో లేని 125 అదనంగా పమ్మిత్యాగరాయసెట్టి ప్రచురణలో వున్నవని లెక్కజెప్పారు రాళ్ళపల్లి వారు. పమ్మిత్యాగరాయసెట్టి 1906 నరికి3000వేల పైకి తెచ్చాడు] అప్పటికే మనల్ని మనం అభినందించుకోవాల్సినంత చేసుకొన్నాం గదా! పద్యసేకరణలో బ్రౌన్ని వెనక్కు నెట్టేసిన మనం, వేమన బహుముఖ సిద్ధాంత వ్యవస్థయొక్క మదింపులో పెలకట్టులో బ్రౌన్ని దాటి, బ్రౌన్ని తీసికట్టు చేసేసి ఒక Historical Curiosity గా తేల్చేసి, తక్కిన పాశ్చాత్యుల్ని కూడ అంతేజేసేసి మన సంస్కృతికి మనమే మాన కలశులం సుమా యని అనిపించుకోవలసి వుంది. అక్కడేం జరిగిందో చూద్దాంమరి.

అన్ని పద్యాలు కళ్ళంలో రాశి చేసిన తర్వాత మనదేశవాళీ Weights and Measures రకరకాలవి పట్టుకొని ఎక్కడ రాశి నక్కడికి తూకంబెట్టి, కొల గారం చేసి గ్రేడింగుచేసి ఎంతో పనిచేశాం మొత్తం మీద. అందులో చిన్నలూ

ఉన్నారు, పెద్దలూ ఉన్నారు. అంతా వెరశి అర్ధనూటపదహార్ల అంకెకు జంకరను కొంటాను వింటూంటే. అందులో లబ్ధప్రతిష్ఠులు : పంచాగ్నుల, చిలకమర్తి, కొమర్రాజు, శేషాద్రిరమణ కవులు, వావిళ్ళవారు, వంగూరి, వేటూరి, బండారు, రాళ్ళపల్లి, డాక్టర్ జి. వి. కృష్ణరావు, నార్ల......

వీరిలోఎందరో వేమన తత్త్వాన్ని నిర్వచించారు. కాని వీరందరి కృషినీ మింగేసి, వేమన పేరుతో పెనవేసుకుపోయిన పేరు రాళ్ళపల్లి వారిది. తక్కుంగల వారినందరినీ సైడు కర్టెన్లోకి త్రోసేసి రంగస్థలం ఆక్రమించుకొన్నవారు వారే. కడవరకూ పెనగులాడుతూ రంగస్థలంలోకి యింకా కొంత కన్పిస్తూ వుంటున్నవారు బండారు తమ్మయ్యగారు. వినయ సౌజన్యాలు మితిమీరి Centre of the stage నుండి అవతలికి జరిగి రాళ్ళపల్లిని పైకెక్కించుకొని అణగారినవారు వంగూరి సుబ్బారావుగారు. వేమన్నభావ జీవిత కోణాలన్నింటిని వున్నవారిలో అధికంగా విస్తృతంగా స్పృశించినవారు వీరే, యీ ముగ్గురే. మనవారిలో బ్రౌనుపీఠికలను, అనువాదాన్ని వీరు ముగ్గురూచూచినవారే. వేటూరి, రాళ్ళపల్లి, వంగూరి బ్రౌనుమాన్యుస్క్రిప్టుల్ని నోట్సుతోసహా బాగా తిరగేసినవాళ్ళు. 'ఇంకెవరూ అప్పట్లో అంతచూడలేదేమో !

## బ్రౌనుదొడ్లో ఓమూల : అద్వైతం×వీరశైవం

వంగూరి : వేమన్న శైవుడైనను 'అద్వైతభావములనే ప్రకటించియున్నాడు ఆ యద్వైతము.. శంకరుడు పునరుద్ధరించిన యద్వైతమతమే, ఐనను శంకరునివలె వ్యవహారజ్ఞానము వేఱు సత్యజ్ఞానము వేఱునుగావున లోకసంగ్రహార్థము కర్మయవసరమని, చెప్పునట్టి యద్వైతముకాదు. సర్వజీవరాసులును సృష్టియు(దానేయను 'అహం బ్రహ్మాస్మి'యను సూత్రముపై నాధారపడునట్టి, ద్వైతభావములేని పరమాద్వైతము....ఇది శివాద్వైతమనవచ్చును-(86వ పేజీ, వేమన) మనవేమన్నకవి కూడ శైవమతాభిమానియైనను వీరశైవుడుకాడు-41వ పేజీ, వేమన.

బండారు : వేమన వీరశైవమత ప్రాశస్త్యమును గుర్తించి........పద్యములలో వీరశైవమును, ........ పురాతన వీరశైవులను నుతించినను మొత్తముమీద నాతని పద్యములనుబట్టి చూడ నాతడు వీరశైవుడగునాయని నా సందేహము- [ఆంధ్రపత్రిక-రక్తాక్షి, ఉగాది సంచిక, 1924]

ఇక సందేహం విశ్వాసంగా ఘనీభవించిపోయి, పైనుదాహరించినట్లు 1829లో బ్రౌనువెలివరచిన అభిప్రాయమును, 1917లోవిఆనందముద్రణా లయంవారివే మన పద్యాలపీఠికలో దేవరాజ సుధీమణి తేవప్పెరు మాళ్ళయ్యగారి మాటను-ఇతడువీరశైవ దర్శనములోని జంగమమతము వాడని తోచుచున్నదను మాటను _ ఉదాహరించు కొని, 'ఎవరెట్లు దలంచినను నేనుమాత్రము.... వేమన తన తల్లిదండ్రుల వలంబించిన వీరశైవమతము విడిచి యన్యమతము స్వీకరించెనని యంగీకరింప జాలకున్నానని గడ్డకట్టినారు. వేమన. -171వ పేజీ (1934కుపూర్వమేనట)

సామాన్య వీరశైవధర్మముల నాతడంతగా పాటింపక విశేష వీరశైవము నాశ్రయించియుండునని నాయాశయము-వేమన, 53వ పేజీ,

రాళ్ళపల్లి : మన వేమన శైవ ప్రపంచములో పుట్టి పెఱిగినవాడేగాని కడకు త్రిమూర్తులను త్రోసి రాజని శుద్ధాద్వైతిగా మాఱినాడు-29 పేజీ, వేమన.

తల్లిదండ్రులుఁతాతాచార్యుల ముద్రకుఁదప్పిన పూర్వీక శైవులై, కేవల వీర శైవమునుబోధించు జంగముల యుపదేశములకు పాత్రులై యుందురు. కాన అప్పటికి వీరశైవ ప్రాబల్యము తక్కువయై యుండుటచే ... .. సహజముగాశివభక్తి నెక్కువగా జూపు అద్వైత బ్రాహ్మణ పండితుల సహవాసములో మెలగిన వారనుకొనెదను-40వ పేజీ, వేమన.

వీరశైవమతమందు బుట్టి. సంసార సుఖ దుఃఖములన్నియు ననుభవించి, రసవాద స బంధమున శివయోగులసహవాసమునబడి విరక్తుడై హఠ యోగముఁసాధించి యాపిమ్మటరాజయోగియై, సగుణోపాసనమీఱి, అద్వైతానందమ నుభవించి- జీవన్ముక్తుడైనాడు. (87వ పేజీ, వేమన).

సామాన్య విశేష (వీరశైవ)ముల భేదమెట్టిదో, అది వేమనసూక్తులలో ఎక్కడ ఎట్లు స్ఫురించుచున్నదో వారు (బండారు) వివరించియుండిన బాగుండెడిది- (9వ పేజీ, తమ్మయ్యగారి వేమన చరిత్రకు వ్రాసిన ఉపోద్ఘాతము-1870)

పరబ్రహ్మమునకు విష్ణుపర్యాయనామములు గూడ నందందు వాడబడినను, శివపర్యాయ నామముల నతని బేర్కొనుటయందే యితని (వేమన) కభిమానము మెండు. ఇదియే యితనిని జంగాల లో బ్రౌను చేర్చుటకు గారణమని తోచెడిని (22వ పేజీ, వావిళ్ళవారి వేమన పద్యములపీఠిక)

బ్రౌన్ అంచనాలు ఆగిపోయినతర్వాత నూటముప్పై యేళ్ళ(1840-1970) లోగా మన గ్రంథ కర్తలు తేల్చివెలువరించిన పరిశోధనా ఫలితాలు ఇవి, ఇలాగునైన్నై. ఏమంటే ఏ వస్తుందిగాని, పరిస్థితి బహూదయనీయంగా వుంది. బ్రౌన్లోపడి కొట్టు కొంటున్నట్టుంది వీరిపరిస్థితి. బ్రౌన్నిదాటి పోయినమాటగాదు, బ్రౌనుపాటిగాకపోయి, బ్రౌన్లోపదేళ్ళవెనుక నొకరూ, పదిహేనేళ్ళ వెన్కా-అంటే-అతడు మొదలుబెట్టినదగ్గరే-ఒకరూ ఆగిపోయి, బ్రౌన్అప్పట్లో వాటివదిలేసిన పాతకత్తులకి పదునైనా పెట్టు కోకుండా పెనగులాడుతూ కన్పిస్తున్నారు వీరు. కాదేమోపాఠకులు కానవలసినమాట.

బండారునీరాళ్ళపల్లినీ తలచుకొంటే మరీజాలేస్తుంది. వీరశైవునిగా స్థిరప రచాలనిఒకరూ, ససేమిరా అదిఅసలేకాకుండా చెయ్యాలని ఒకరూ పెనుగులాడారు. సమస్యను వీరశైవం వెర్సెస్ అద్వైతం చేశారు. “సంపదధికునుండి సాధించి ధనమును బడుగుకిడుట బాగని” వేమన ఉగ్రపంథ చూపడానికి ఒరవడి వైష్ణవ పురుషులదేననిఒకరు, వీరశైవ మహాపురుషునిదేననిఒకరూ చెప్తారు. వీరువారిపేర్లనీ వీర్నిపేర్లనీ చెప్పరు వారు. ఒకరు తిరుమంగై ఆళ్వారునీ రామదాసునీ చెప్తే, మరొకరు కన్నద బ్రహ్మయ్యనే చెప్తారు. ఆ రెండింటినీ దాటి అవతలికి చూడ లేకపోయినా, ఆ రెండింటి మేలగింపువేపయినా చూడలేకపోయారు. వీరవైష్ణవం వీరశైవం అనిపించారు. వీరవైష్ణవులు తమకోసంగాక, వేమననువీరశైవుడుగాకుండా చెయ్యడంలో సౌఖ్యం వుంది. అద్వైతంకోసం అద్వైతులకన్నా అధికంగా కొట్టాడారు. అదేమంటే అదేయథార్థమని తోస్తున్నదనడానికి అవకాశం దండిగా వుందిగదా! అద్వైతులు కొందరు వేమన అద్వైత సంప్రదాయోల్లంఘనంజేసి మంచినే చేశాడన్నారు. అనిముందు చూస్తారు.

ఇందులో ఎవరిపక్షాన్నివారు బ్రౌనుకన్నా ఎంతో ఎక్కువ సాక్ష్యసమా చారంతో భాష్యపరిశ్రమతో బలపరచుకొన్నప్పటికీకూడ, అదొకసాఫల్యం అనిపి చేది. అదీలేకపాయె. అద్వైత వీరశైవాలు, అందులోని పలుశాయలు, సంప్రదాయాలు వేమన గడచిన దశావిశేషాలు గావున, వేమనలోగల ఆయామతవిశేష అవగాహనల వర్ణపట్టకాలను నిర్మించి యిచ్చినా బాగుండేది.

## బ్రౌన్ని బ్రౌనే దిద్దుకోవాలి

బ్రౌను వేమనను వీరశైవంవేపుకు వాల్చుతూవుంటే, ఎంతవరకు వాల్చాడో, ఎందుకలావాల్చవలసి వచ్చిందో కనుగొనడంలో పరిశోధక ప్రమాణాలకు తప్పి,

రాళ్ళపల్లి తమపై ఫల్యాన్ని కప్పిపెట్టుకోజూచారు. బ్రౌనుఅన్నదానిని అన్నట్టుగాఅను భాషించక (restate) అపార్థంగా చెప్పి, బ్రౌన్ దొరగారీతనిని జంగాల జాతిలో జేర్చుట న్యాయ్యముగాదు. (వావిళ్ళ పీఠిక) అని చెప్పి, అందుకేమో ఒకకారణా భాసంమాపించి (పైన ఉదాహరించినట్లుగా) చమత్కారంచేసి, ఆ చమత్కార స్పర్శ మత్తులో "Their creed also corresponds with that taught by vemana" అన్న ఆబ్రౌనుయొక్క అప్పటి అతి ముఖ్యసూత్రీకరణను తన నిరాకర ణకుతీసుకోక వదలివేయడం పరిశోధకుని సత్యాన్వేషణా నిష్ఠనీ, సమర్థతనీ సంశ యసంశ్రితంగావించుతుందనుకొంటాను.

మళ్ళీ బ్రౌనే 1840లో వేమన వీరశైవ మత శాంఖాంతర్గతుడు కాడను కొనడానికి చెప్పుకొన్న కారణాలు మన రాళ్ళపల్లివారి అవగాహనకు మీరి వున్న వనుకోవలసివస్తే, ఆ అప్రాచ్యునిముందు మన సంస్కృతీ మాన కలశత్వం మాటే మవుతుంది ?

స్త్రీనిందనమే వేమన వీరశైవమతస్థుడు కాడనడానికి కారణమన్నాడు బ్రౌను. మనుస్మృతికారుడే ఒకానొకప్పుడు చూపినపాటి ఔదార్యాన్ని కూడ వేమన స్త్రీ జాతిపట్ల చూపలేదని, అంతఘోరమైన దృష్టికలవాడు తాంత్రిక సరణిలోవాడు అసలే కాజాలడని, అతని స్త్రీ నిరసన నేమొదటి కారణంగా చూపించారు రాళ్ళపల్లి. అంతేగానిఅదే అతడు వీరశైవుడు కాడనటానికి కూడ నిదర్శనమనలేక పోయారు. పునర్జన్మలో విశ్వసించిన వేమన వీరశైవుడు కాడని చూపలేదు. వీరశైవ సం స్కృతీ సంప్రదాయం బ్రౌనుపాటి తెలిసినవారే అనుకొందామా మరి? ఇవే తెలిస్తే, బ్రౌనుకుసమాధానం చెప్పరా ? బండారుకు చెప్పరా ? బౌర్రినుకుబౌర్రినే సమాధానం చెప్పుకొ. ఎట్టుమిగలనిచ్చేవారా ?

అయితే బ్రౌను సూత్రీకరణ తన యీసమాధానంతో కూడాతీరదు. ఇంకావుం డనే వుంటుంది. వేమన ఏశాఖకూ చెందడు, అయినా, అతని సిద్ధాంతాలుఏ ఒకశాఖా సిద్ధాంతాలకన్న జంగాలసిద్ధాంతాలతోనే ఎక్కువ ఏకీభావం కలిగిన వన్నమాట మిగిలేవు టుంది.

## తెలివివమాయ్య, తన్నుదెలియుమమాయ

రాళ్ళపల్లికి వేమనలో అద్వైతమయితే అతిస్పష్టంగా-శుద్ధాద్వైతంగా 'సర్వా ద్వైతంగా' అంటే 'శంకరాద్వైతం'గా-కన్పించిందటగాని వేమనలో మాయ శబ్దానికి

'నిజమైన యర్థమేమో తెలిసికొను మార్గములేద' ట-[వేమన-82వ పేజీ]. మరి 'తెలివి మాయ తన్ను దెలియమాయ' అని వేమన ఘంటాఘోషంగా అంటోంటే, దాని అర్థం అద్వైత సిద్ధాంతమేమాయ, చిద్రూపాత్మమేమాయ, అద్వైత పరబ్రహ్మమే మాయ అని వేమనమాట అనిగాని, అది అద్వైతం అరుపుకోలేని మాటయనిగాని, అయితే అలా అన్న దర్శనాలీదేశంలో వున్నవనిగాని, అవి అద్వైతానికి పైన పర బ్రహ్మాన్ని చూచినవనిగాని అనిపించలేదంటే, అర్థంగాలేదంటే, అర్థమయితే దాని సంగతేమిటో తెల్చకపోయారంటే ఏమనుకోవాలో ఆలోచించండి.

బయలంటే ఆకాశమనే అర్థం తప్ప, శూన్యమని, శూన్యవాదమని తెలిసినట్లు వీరెక్కడా తమ పుస్తకంలో తార్కాణించ లేదంటే, యీ పండితుణ్ణి గూర్చి భయపడవలసి వస్తున్నది. తెలియదందామా ? తెలిసికూడ అనలేదందామా ? ఏలాగను కొన్నా పరిస్థితి భయంకరంగానే వుంది.

ఇలాంటి వీరు 'విశేష సామాన్య వీరశైవముల భేదమేమి ? అది వేమనలో ఎక్కడ ఎట్లున్నదో' చెప్పుము చూపుము అని బండారు తమ్మయ్యగారి మీద దూకుడు చేశారు. ఆ తమ్మయ్యగారిలో మొండి విశ్వాసం ఒక్కటి తప్ప చెప్పనూ చూపనూ ఏమీలేకుండా పోవటం మరీ ఘోరంగా వుంది. బయలంటే శూన్యమన్నంత దాకా తెల్సి, వేమనలో కోకొల్లలుగా బయలు పద్యాలుచూచి, ఒక్కగా నొక్కదాన్ని చర్చించక, వివరించక అంత తమ వేమనమీది వ్యాఖ్యలో కన్నడపు అల్లమయ్యను బండారు తలవకపోవడం, తడవకపోవడం ఆశ్చర్యం. వీరన్న మాటేమిటీ, రాళ్ళపల్లి వారైనా వేమన సందర్భంలో అల్లమ ప్రభువుని ప్రస్తావించలేకపోవడం ఆశ్చర్యమే. వీరిద్దరినుంచీ ఆంధ్రలోకం ఆశించవలసిన కనీస విషయమే అది. ఎందుకంటే వీరిద్దరూ కన్నడం తెలిసినవారు. అనువాదాలు చెయ్యగలవారు. ఇందులో శర్మగారు కన్నడదేశంలో కన్నడసంస్కృతీపీఠంలో కాపురమున్నవారు. బండారు ఆజన్మ వీరశైవులు-విశేషించి వీరశైవతత్త్వ భాండాగారికులు, శైవసాహితీ సార్వభౌములు, సోమసాహిత్యాచార్యులు. ఇంతటివారు వీరిద్దరూ వీరశైవతత్వం ప్రకృతాంశంగా ప్రసక్తంగా వేమనను గూర్చి వ్రాయవలసియుండి, అల్లమప్రసక్తి, వీరశైవంలోని బయలుతత్త్వం ప్రసక్తీలేకుండా, వేమనలో అల్లమను కానకుండా వ్రాయడం నిజంగా శోచ్యం. వీరితాత్త్విక పరిజ్ఞానాన్ని ప్రశ్నార్థసంజ్ఞితం చెయ్యవలసి వస్తున్నది.

## అద్వైతం అవధుల్లోనే ఇతరుల విశిష్టత

వీరిద్దరికన్నా నిజంగా వంగూరి నయం. శంకరాద్వైతంలో తత్త్వానికీ, వ్యవహారానికీ పొంతనలేదని తెలిసిన వాడతడు. ఆ విరోధాన్ని వేమన సవరించినవాడన్న అర్థంలో అతనిది శివాద్వైతమన్నాడు. అయితే వీరశైవుడు మాత్రం కాదన్నాడు. ఈపాటి విచక్షణ రాళ్ళపల్లిలో కానరాదు.

శంకరాద్వైతం ఎక్కడైనా ఎప్పుడైనా తనమునుపటి చరిత్రలో సంఘస్వరూప నిబంధనంలో ఆచార నీతినియామకంలో స్మృతుల్ని, అవి చెప్పిన నీతిని, చాతుర్వర్ణ్యాన్నీ దాటిగాని, దాటమని చెప్పిగాని ఎరుగదు. మరి వేమన అవైదిక, స్మృతీతర నీతిరీతులు శాంకరమార్గ విరుద్ధాలుగదా అన్నస్ఫురణ, సంశయం, ప్రశ్న, దానికో సమాధానం అంటూ ఏమీలేకుండా వేమనను అద్వైతి అని ఒకమాట అనేస్తే చాలదు. ఈ విషయం తెలిసి బాగావ్రాసిన వారొకరున్నారని ఇక్కడ చెప్పుకోవాలి. అద్వైతం పరిధుల్లో నిలబడి అందులోని వైరుధ్య పరిహారణాన్ని సాధించిన అనుభవవిచారోభయ విశిష్టుడిగా వేమనను నాన్యతోసాధ్యంగా, ఆవిష్కరించినవాడు మాత్రం డా॥ జి. వి కృష్ణరావు.

## బ్రౌను చూడని తాంత్రిక కోణం నుంచీ . . . .

బ్రౌన్ వేమన్నని వేదాంత వీరశైవ కోణాలనుంచి చూచాడు. కడకతడు ఏశాఖకూ చెందడన్నాడు. ఆమాటకర్థం ఆ రెండింటిలో దేనికీ పూర్తిగా చెందడనో, అసలు ఇంకేవొక శాఖకుకూడా చెందని స్వతంత్రుడనో మరి ? అంత స్వతంత్రుడంటే మనవాళ్లు నమ్మనిమాట. ఏ శాఖకూ చెందనివాణ్ణి మనవాళ్ళూహించలేరు. కాని బ్రౌన్ చూడనివేపునుంచి, అంటే వేదాంత వీరశైవ కోణాలనుంచి గాకుండా వేమనను యింకా యితర శాఖల వేపునుంచీ చూడవచ్చుగదా! అలా ఎవరేనా యింతకుముందు పరిశోధకులు చూచివున్నారేమో మరి ?

తంత్రశాస్త్రం వేపునుంచీ చూచినట్టున్నారు ఒకరు. రాళ్ళపల్లివారు వేమన స్త్రీ నిందనం తంత్రవిరుద్ధమన్న సంగతివిన్నారుగదా. ఆ వెంటనే వేమనతాంత్రికుడు కాడని యితరకారణాలతో ఉపన్యసించారు. కులార్ణవ, మహానిర్వాణ, యోగినీ, లక్ష్మీ తంత్రాల నుండి రాళ్ళపల్లి ఉదాహరించారు, వేమన తాంత్రికుడు కాదని ఖండించడానికి. వేమనను తంత్ర సంప్రదాయంలోని వాడిగా ప్రతిపాదించి, రాళ్ళపల్లివారి

ఖండనకు గురియైన ఈ ప్రాణివేమూరి విశ్వనాథశర్మ. వారివాక్యం ఒక్కటైనా రాళ్ళపల్లి ఉదాహరించకుండా తమకొక దీర్ఘలేఖ వ్రాసిన వారినిగా మాత్రం చెప్పివూరుకొన్నారు. అతని లేఖలోని వ్రాతనిమొత్తం బ్లాకౌట్ చేశారు. వీరికి లేఖ వ్రాయడం గాకుండా తమ ప్రతిపాదనను ఏ పత్రికలోనైనా వ్రాశారేమో వెలికి దీయాల్సిందే. వీరుచేసిన ఖండనకు బదులు తప్పక వ్రాశేవుంటారు.

విచారించగా విశ్వనాథశర్మ వేమనమీద వ్రాశారని, వారిరచనల్ని చూడమని కూడా సి. ఆర్. రెడ్డిగారు, రాళ్ళపల్లికి వారి ఉపన్యాసాలలో ఏఏవిషయాలుండాలో సూచిస్తూ యిచ్చిన Blue Print లో సూచించారని తెలుస్తోంది. అంటే, రెడ్డిగారి సూచన మీద విశ్వనాథ శర్మగారికి వీరు వ్రాయగా, వారు దీర్ఘమైన లేఖ వ్రాసివుంటారు. అది మనకింకా దొరకలేదు. విశ్వనాథశర్మ తన మాటల్లో తానింకా దొరకలేదు. వేమనను కేవలం తాంత్రికుడన్నారో, తంత్రసంప్రదాయం ఎరిగినవాడన్నారో, దాన్నికొంతతనలో యిముడ్చుకొన్నాడన్నారో మనం ఆయనను వినలేదు; చదవలేదు. తత్వవిషయంలోనే యీ కనుమరుగు.

వీరు వంగూరుసుబ్బారావుగారి పుస్తకం 1922లోరాగానే, విమర్శకు ఉపక్రమించిన ప్రథములనుకోవచ్చు. బండారు తమ్మయ్యగారి రచనల్నిబట్టి, 1922లో ఆంధ్రపత్రిక సారస్వతానుబంధాలలో వేమన స్థలం, కులం, కుటుంబం, కొంతగ., కాలం గూర్చి వ్రాసినట్టు తెలుస్తోంది. ఇటువంటి విషయాలన్నీ, అటుతత్వాన్ని, రసాయనాన్నీ, వైద్యాన్నీ గూర్చి చెప్పినవీరు రాళ్ళపల్లి, తమ్మయ్య, వంగూరిలాగా ఒక గ్రంథం వేమనమీద వ్రాయవలసిన వారనిపిస్తారు.

## రాళ్ళపల్లి ఖండనలో విశ్వనాథశర్మ

ఒక్క విషయం చెప్పొచ్చు. బాహ్యాచారనిరాసకమైన వేమనపద్యాలకు ఉపమానాలకు పైజెప్పిన తంత్ర గ్రంథాలనుంచీ మాతృకలనిచెప్పి కొన్నింటిని చూపించి వుంటారు. వాటిని వారు చూపించారని చెప్పకుండా రాళ్ళపల్లివారు తాముగా చెప్తున్నట్టే ఉపన్యసించారు. వేమన జన్మమంతైన సంస్కృత గంధమెరుగడని చెప్పే రాళ్ళపల్లే, వేదవిద్యలెల్ల వేశ్యలవంటివి, గుప్తవిద్య యొకటి కులకాంతవంటిది అన్న వేమన పద్యం కులావర్ణవతంత్రంలోని " వేదశాస్త్రపురాణాని సామాన్యగణికాఇవ " అన్నశ్లోకానికి మెరుగులుదిద్దిన తెనిగింపు అని, శివయోగసారకర్తకిన్న బాగా తెనిగించినట్లు మనం అర్థం చేసుకొనేట్టుగా-తన మాటలకు తానే విరుద్ధంగా—ఇక్కడ చెప్పుకోవాల్సిన అగత్యం విశ్వనాథశర్మ వల్లనే కలిగింది.

దక్షిణాచార వామాచార తంత్రాలు రెండింటాకూడ వేమననిరసనకు గురియైన బాహ్యాచారం, అనగా, మంత్రాలు, బీజాలు, శక్తిపూజ, వామాచారం ఉన్నవని చూపించి, " ఇవిలేక , శక్తిపూజ చేయక, వామాచారమును వదలిన తాంత్రికులు మన దేశమందున్నారా ? నేనెఱుగను " ( వేమన - 88వ పేజీ ) అని చెప్పి, వేమన తాంత్రికుడు కాడని తీర్మానించారు.

వారెరుగక పోవచ్చు: విశ్వనాధశర్మ కూడ ఎరుగకపోవచ్చు గాని, అటువంటి తాంత్రికు లీదేశంలో వున్నారు. బౌద్ధతాంత్రికులఅనుత్తరతంత్రం అటువంటిది. సహజయానికులు యోగాన్ని వ్యాయామంనుండి, తంత్రాన్ని పూజాదికంనుండి విముక్తం చేసినస్థితి ఒకటుంది. పంచమకారాలులేని స్థితి ఒకటుంది. యోగం సహజయోగం అయిపోయింది. శూన్యత సహజ శూన్యత అయిపోయింది. అదెంతో వేమనలోకి సంక్రమించింది. ఇటువంటిది కాక సామాన్యతంత్రాచారమంటే వేమనకు పరమ అసహ్యత. స్త్రీ స్పర్శ వున్నంత మేరకు తంత్రమంటే కంటగింపు. ఇదంతా యీ పుస్తకంలో కొంత - కొంతే - చర్చించాను.

## రాళ్ళపల్లికన్నా . . . .

ఇక్కడో మాట చెప్పాలి. మన యోగశాస్త్రం చెప్పిన రాజయోగాన్ని కూడ వేమన దాటిపోయాడని,అతడు కడపటికి చెప్పినరాజయోగం వివేకానందుడువివరించిన రాజయోగంకాదని రాళ్ళపల్లికి స్ఫురించలేదు. వంగూరికి స్ఫురించింది.వినండి;

> " ఇతని సిద్ధాంతము అద్వైతము. సాధనకు హఠయోగమూలమగు రాజయోగము." రాళ్ళపల్లి వేమన. 89వ పేజీ.
>
> "ఇతడు రాజయోగము శ్రేష్ఠమనును. తానాచరించినది రాజయోగముగాదు."
> - వంగూరి వేమన పీఠిక, 4వ పేజీ.

కాని వంగూరిసహజ యోగం మాటనుగాని, అచలమతస్థులు చెప్పే రాజయోగం మాటగాని ఎరుగడు. హఠ, మంత్ర, లయ, రాజయోగములనే నాలుయోగాలలోనూ వేమన నిలువలేదని తెలిసినవాడు. అంతే. రాళ్ళపల్లికన్నతత్త్వవిషయంలో సూక్ష్మతలు తెలిసిన, తెలియగల స్థితి వంగూరిలోవుంది.

వావిళ్ళ వెంకటేశ్వర శాస్త్రిగారి మాటొకటి, ఒక్కటే వుంది. " వేమన అద్వైత సిద్ధాంత భ్రమను దాటి ఆత్మధ్యాన నిష్ఠుడయ్యెను. మాధవ సేవకన్న మానవ సేవయే పరమార్థమని గ్రహించెను" అన్నారుగాని ఆ మీద ఏదో అస్పష్టపు అనవాయితీ పాత మాటలు చెప్పారు. కాని యింతవరకైనా రాళ్ళపల్లి కన్న తత్త్వ గ్రహణ చూపించారు.

## ఇకనేను .. .......

అద్వైతం, వీరశైవం, యోగం, తంత్రశాస్త్రం అంటూ వీరు చేసిన తీర్మానాలను, ఆయాదర్శనాల్లో, ఆయామత ఆచార సంప్రదాయాల అవగతిలో, విమర్శలో వేమన విశిష్టతయంటూ వీరు చెప్పి చూపినదేమైనావుంటే దానితో సహా అంగీకరించి, ఆ పరిధుల్లో యింకావీరు కానని విశేషాలేమైనా వేమనసంపదగా తోస్తే వాటిని కూడ నేనుగా చూపి, చేర్చి, యీ దశలన్నీ, యింకామరికొన్నీ వేమన Philosophical Long March దారిలో వేసిన మజిలీలని, కడకతడు చేరుకొన్న, నిల్చుకొన్న, స్థిరపడిన తావుమాత్రం (స్వభావ) శూన్యతాతలం అనీ, అక్కడ అద్వయత (అద్వైతం గాదు), మధ్యమప్రతిపత్తు వున్నదని నిరూపించడం నేను చేసినపని అయితే ఆ శూన్యవాదాన్ని నేనంగీకరించనక్కరలేదు. అదే వేమనతత్త్వ పారమ్యం అని చూపించడమే నావంతు. దానివల్ల వేమన మానవునికి బహురంగాలలో బహుధా చెప్పిన సిద్ధాంతాలుసూత్రాలనన్నిటినీ ఏకసూత్ర బద్ధం చేస్తున్నదని చూపడం నావంతు.

మతాలు కల్పితాలని, సతములు గావని, తరచు దుఃఖకారణాలని చెప్పిన ఆధ్యాత్మిక మహాపురుషుడు వేమన్న. తత్త్వాన్ని మతవ్యవస్థ నుండి విడదీసి చూచిన ఏకైక భారతీయుడు. వ్యవస్థాగతమైన మతం (Organised religion) బాహ్యాచారంతో ముడివేసుకొన్నట్టిది. బాహ్యాచారనిష్ఠలులేక మతంలేదు. బాహ్యాచారం ఆంతరిక సిద్ధికి శుద్ధికీ దారిమూసేసే ప్రమాదం వ్యవస్థాగత మైన మత నిర్మాణంలోవుంది. బాహ్యాచార నిరాకర్త, తదపాయద్రష్ట సంఘటితమతస్వరూపాన్ని కాదనటం తర్క పర్యవసన్నమే.

విగ్రహారాధనం వద్దనడం వేమన గొప్పతనం అని చెప్పుతుంటారు. కాని ఆ మాటలో అతనికి ముందు కబీరువున్నాడు. వేమన కబీరును మీరిచెప్పిన విషయం విశేషం వుండనేవుంది. విగ్రహాలను విసిరేయమన్న కబీరు, రామనామం జపించమన్నాడు. కబీరు నిర్గుణపంథలో భక్తి వుంది. అతనిది నిర్గుణ భక్తి. వేమన భక్తినిమొత్తంగాకడకువదలినవాడు.నామజపం,నామకీర్తనంకూడవద్దన్నవాడు.అవును, అన్నట్టు అతనిది యోగం, అతడు యోగివేమనకదా అని సరిపెట్టుకోవచ్చును. కాని సాంప్రదాయకమైన యోగాన్నిమాత్రం అవతల బెట్టినవాడు. అందులో బాహ్యక్రియా కలాపాన్ని చూచినవాడు. ఆసనముద్రాది వ్యాయామం, ఉపవాసం, శరీరశోషణం తీసేసి సహజమైన పారవశ్యానుభవాన్ని తత్త్వావగతిమీద, పరిణతిమీద లభించే సరికొత్త యోగంగా, రాజయోగంగా చెప్పి పాతయోగాలను అవశ్యకంగావన్నాడు

## మతరహిత ఆధ్యాత్మికత

పరమతసహనం, సర్వమత సమన్వయం - ఇందులో యితర మతాలు మెట్లు, అవి ఒకదానితర్వాత ఒకటిమెట్లవరుసై లేచి, మనమతముమేడ ఎక్కడానికి ఉపకరిస్తాయి - మనదిమేడ, యితరులవిమెట్లు అనే సమన్వయం మనకు పాతఅలవాటు. దాన్నికాస్త దాటి సర్వమతసమత్వం కొంత చెప్పుకొనజొచ్చాము. ప్రపంచ మతాల విషయంవరకే ఆమాట పాటిస్తాం. ఈ సర్వమతసమత్వం, సహనం, సమన్వయం నూటగాదు వేమన కడపటిమాటగా చెప్పింది. మతరాహిత్యమే వేమన కడపటిమాట. ఆ మాటను కేవలం వ్యవస్థాగత మతాల దృష్ట్యా మాత్రమే చెప్పలేదు. ఇంకాపైకిపోయి, దేనినీ ఏ తత్వాన్ని కూడ అంతిమ వాక్యంగా తీసుకోకు. గాథ దృష్టి కలితుడవు కావద్దు. Dogmas కూడదు. మనసుతెరచివుంచు. నమ్మినమ్మకున్న నయమెల్లకద్దురా - ప్రతిదీ Hypothesis - ఇది జీవితంలో సర్వరంగాలకూ వర్తిస్తుంది. మానవుని Scientific activity నుండి అన్నిరకాల జనరలైజేషన్ను చేసేదగ్గరా వర్తిస్తుంది. మతంఅంటే అభిప్రాయం కూడ. సర్వవిధఅభిప్రాయీకరణం లోనూ మూసిన మనస్సుకూడదు, రెలిజియన్ అన్నఅర్ధంలో మతాలపట్లనూ అంతే. మతముమమత చిక్కకు, సర్వమతములందు సన్యసించుము, మతములుకల్పితములు, అనుభవమే గమ్యము అంటూ మతరాహిత్యాన్ని ఆధ్యాత్మికతతో మేళవించడం వేమనసాధించిన విజయం, నాన్యఃపంథా.విశ్వరంగంమీద అదేఅతణ్ణివిశిష్టుణ్ణి జేస్తుంది.

మతాన్ని వ్యక్తిగతవిషయంగా చెప్పటంవుంది. రాజ్యవ్యవహారంలోదాన్నిప్రసక్తం కానివ్వొద్దనటంవుంది. గాంధీగారే అన్నారు. ఇప్పటినేతలు సర్వమతసమదృష్టే మనసెక్యులరిజం అంటున్నారు. ఆధ్యాత్మశిఖరారోహణం చెయ్యలేనిమనస్సు, బాహ్యాచారమైన మతం పరిధిలోని వారు యీఅర్ధంతోనే తృప్తులవుతున్నారు.ఆధ్యాత్మికతలో ఉన్నతులు-గాంధీ మహాత్ముడు-సర్వమతసమత్వంలోనే మతప్రసక్తిరహిత రాజ్యవ్యవహారంచెప్పగలరు. విశాలము అగాథము మౌలికముఅయిన వేమనఅర్ధంలో మతరాహిత్యం, అంటే గాంధీజీఅర్ధంలో రాజ్యాంగవ్యవస్థనేకాదు, సంఘజీవితం మొత్తాన్ని,వ్యక్తిభావనా విశ్వాస వ్యాపారాన్ని మొత్తాన్నికాంతివంతం చేస్తుంది. మార్మికానుభూతికి, హేతుబుద్ధికి విరోధాన్ని పరిహరిస్తుంది.

నాగార్జునుల దృష్టిరాహిత్య మన్నమాటే వేమనలో మతరాహిత్యమయింది. నాగార్జునులు దానికి చూపిన application కన్న వేమన ఎక్కువమేరకు, ఎక్కువ రంగాలకు విస్తరింపజేశాడు. ఇటువంటి దృష్టే అల్లమ ప్రభువులో వుంది. అత

డిటువంటి వివృత మనస్సును చెప్పడంచేతే వీరశైవం అతనికి పట్టం గట్టుతున్నా వీరశైవాన్నికూడ కాదనగలవాడు అయ్యాడు. వేమన ఏ మతశాఖకు చెందినవాడందాము ?

## అల్లమ ప్రభు వచనాలు

అల్లమను అతివేలంగా పేర్కొన్నాను. కాని అతన్ని అతనిమాటల్లో వినిపించనేలేదు. ఆ లోపపూర్తికై అతని వచన శకలాలను విన్పిస్తాను. మచ్చుకు ఇవిగో, కొన్నివినండి, ఇతరులిచ్చిన భావార్థంతో .. .. .... ..........

భస్మవహూసి బత్తలె ఇద్దరేను బ్రహ్మచారియె ?
అసనవ నుండి వ్యసనవ మరెదరేను బ్రహ్మచారియె ?
భావబత్తలె ఇద్దుమనవు గంభీరవాదరె అదు సహజ నిర్వాణకాణా,
గుహేశ్వరా !

[భస్మముపూసి దిగంబరుడైన బ్రహ్మచారియా? ఆశనముతిని వ్యసనము మరచిన బ్రహ్మచారియా? భావము నగ్నమె మనస్సుగంభీరమైయుంతిన అది సహజ నిర్వాణము గుహేశ్వరా!]

కండుద హిడియలొల్లదె కాణదుదనరసి హిడిదిహెనెందరె సిక్క౯దెంబ
బళలికెయనోడా,
బెట్టకెక్క౯ చళియాదడె ఏనహొద్దిసువరయ్యా!
బయలు బత్తరె ఇర్దరె ఏన నుడిసువరయ్యా!.... .......గుహేశ్వరా !

[కనిపించిన దానిని పొందక, కనిపించనిదాని వెంటపడి పట్టుకొంటినని దొరకదను ఆయాసముచూడు. కొండకు చలియైన ఏమికప్పెదరు?శూన్యము(బయలు) నగ్నమైన ఏమికప్పెదరు ? గుహేశ్వరా!

అరియ బారద ఘనవనరిదవరు అరియదంతిర్పరు,
ఘనవ మనకండు అవనొందు మాతింగె తందు నుడిదరె అదకదె
కిరుదనోడా,
నిరాళవెంబ కూసింగె బెణ్ణెయనిక్కి౯ హెసరిట్టు కరెదెవరారో,
అకటకట శబ్దద లజ్జెయనోడా.

తెలియరాని ఘనుని తెలిసికొన్నవారు మిన్నక ఉన్నారు. ఘనునిమనమున జూచి మాటలలో చెప్పయత్నించిన అపరిపూర్ణమనిపించును. శాంతిశిశువునకు వెన్న పెట్టి పేరిడినవారెవరో ? అకటకట ! శబ్దము తన అసమర్థతకు లజ్జించును.

## రాళ్ళపల్లి చేసినపని

రాళ్ళపల్లి వేమననుగూర్చి ఏంచెప్పినా, ఏంచెప్పక పోయినా, విభ్రాంతులం గావలసిన విషయం ఆనలోకటుంది. వేమన యోగానుభవంగూర్చి, తత్త్వజ్ఞానం గూర్చి తన 'అంతిమాభిప్రాయా'న్ని బ్రౌన్ని అడ్డంపెట్టుకొని బ్రౌన్ని అపార్థం కూడచేసి రాళ్ళపల్లి చెప్పినతీరు.

"రాజయోగసాధనవలన వేమననిజముగా తత్త్వజ్ఞానమును సంపాదించెనా? అతడు బోధించిన అద్వైతమే పరమతత్త్వమా? అను ప్రశ్నలకు బదులు చెప్పుట నాశక్తికి మీఱినపని.

బ్రౌనుదొర ఇతని సిద్ధాంతము అర్థముకాదనియు నిష్ఫలమైనదనియు జెప్పెను. (See Brown's Vemana, Preface P. II)

నాకింతమాత్రమునమ్మికగలదు. వేమన్నతానుతత్త్వజ్ఞుడనైతిననిదృఢముగా నమ్మెననుటలో సందేహములేదు. (వేమన, యోగసిద్ధి—మతప్రచారముP. 81, 82)"

అద్వైతమేపరమతత్త్వమాయన్న ప్రశ్న కలగటంగాని, దానికిసమాధానం తాను చెప్పలేననటంగాని తాను విశిష్టాద్వైతిగనుక అర్థంచేసుకోవచ్చు. అంతేగాక, వేమన తత్వమేమిటన్నదేప్రశ్నగాని, దాని గొప్పతోగాని, దానితో పరిశోధకునిఏకీ భావముగాని ప్రశ్నేగాదు.

యోగసాధనవల్ల వేమన నిజంగా తత్వజ్ఞానం సంపాదించాడాఅంటే బ్రౌన్ ఇతని సిద్ధాంతం అర్థంకాదు, నిష్ఫలం అన్నాడని పరప్రసక్తిదెచ్చి, తాను తత్త్వజ్ఞుణ్ణని వేమునకు గట్టినమ్మకమనిమాత్రం తనకు తెలుసు అనటంలో అర్థం ఏమిటి ?

"అతడు బోధించిన అద్వైత"మంటున్నారు, రాజయోగ పరమావధి యైన యద్వైతాను భవమును సాధించిన వెంటనే ... ....... అని (8. 80) అంటున్నారు, రాజయోగియై ........ ... అద్వైతానంద మనుభవించి జీవన్ముక్తుడైనాడని" P. 87. అంటున్నారు; యోగసిద్ధాంత రహస్యముల గొన్నింటిననుభవ పూర్వకముగా గ్రహించె"నని(1917లో)వావిళ్ళపీఠికలో అనియున్నారు గాని మళ్ళీ ప్రశ్నలేవదీసి జవాబు తనశక్తికి మీరినదని, బ్రౌనుశక్తికిలోబడినదన్నట్టు ఉదాహరించడం, వేమన ఆత్మవిశ్వాసం మాట తేవడం అంతా బ్రౌన్‌పేరిట బ్రౌనుమాటున తన అభిప్రా యాన్నే చెప్పేస్తున్నాడని, అందులోవేమన కాళ్ళు తెగిపోతున్నాయని అర్థం కావడం లేదా ? ఇవి దాగుడు మూతలు గావా ?

దీనికిగాను, వేమన కాళ్ళుకత్తిరించడానికి ప్రత్యేకంగా బ్రౌన్ని తెచ్చి, అతని వెనుక దాక్కొని అతని వెనుకనుంచి తామే మాట్లాడు తున్నట్టుగా ఎందుకీ దురవస్థ ? అనుకొన్నదేదో పరిశోధకుడనగలగాలి. "యోగ సిద్ధి" అని శీర్షికయిచ్చి యోగానుభవం, తత్వజ్ఞానం కేవాడిగా పుస్తకమంతా చెప్పిచెప్పి, ఒకమూల ఎక్కడో ఎవరిపేరనో కానరాకుండా ఒక బాంబుపెట్టి, చెప్పినదాన్నంతా పేల్చేసే యీ పనియేమిటోమరి ?

ఇక నీరు బ్రౌన్ని తిన్నగా మనకిచ్చారోలేదో అసలు చూడండి :

A system of obscure and unprofitable doctrine regarding mysticism is much studied among the Telugus. In such reveries, Vemana has indulged at great lenght and there his meaning is often doubtful. Of such verses I have ratained only a few of the easiest.
- 1829

The reveries contained in this chapter are of a strangely abstruse nature. - 1824

ఇక్కడ బ్రౌన్ అంటున్నది మార్మికానుభూతి Reveries ని గూర్చి కదా। అతని తత్వ సిద్ధాంతాన్ని గూర్చేనా ? అదైతే వేదాంతశాఖకు వ్యాసోపదేశానికి చెందిందని "Evidently" అన్నాడు గదా। అంతేగాకుండా, అతని mystic tenets ప్లేటో వాటితో పరిపోలుతున్నవని కనుగొన్నాడే। అవీ నిప్పలాలనే బ్రౌన్ అభిప్రాయమం దామా? అసలు mystic reveriesలో స్పష్టతగుణమేనా? mystic poetryఅన్నదే ఎక్కడా abstruse గదా ! అందుకే అతడు అటువంటి పద్యాలు తగ్గించటం. అది చెప్పడానికే గదా ! తత్త్వం వేరు, మార్మికానుభూతి, అరివెరీస్ వేరు.

రాళ్ళపల్లి బ్రౌన్నే కాదు అపవదించడం, వంగూరినీ అపవదించాడు. రాయవరం పూర్ణయాచారిగారు అన్ని పద్యాలు సమకూర్చి నందుకైనా ఒక్కగా నొక్క మంచి మాట అనలేకపోయి, అతని సంకలనంలోనుంచే ఎక్కువగా ఉదాహరించుకొంటూ తూటాకులో పురుగులాగ తీసేశారు. విశ్వనాథశర్మను పూర్తిగా ఝాకొట్టు చేశారు. అపవదించ లేదనలేము.

అట్టిఆలోచించగా, 1922లోని వంగూరి 'వేమన' పుస్తకంమీద వేమూరి, వేటూరి, బండారూ, వెలువరించిన పరిశోధనా ఫలితాలే, విశేషాలే 1928లో రాళ్ళపల్లి వారి నోటపలికినై. కాగా, వారివారి ఫలితాలనువారి వారికిచ్చేసి, వీరివి అనే పరిశోధనా ఫలితాలంటూ ఇక ఏవిమిగులుతాయో తేల్చితే అందరిపరిశోధకులకూ న్యాయం చేసినట్లవుతుందని అనిపిస్తోంది.

వంగూరి : (1922) బందరు, రాయవరం పూర్ణయాచార్యులవారి కట్టుకతను బాగా కత్తిరించి, కటారుపల్లెద్విపదవేమన చరిత్రను పట్టుకొని, రెంటికీ మధ్యస్థంగా వేమన జీవిత చిత్రాన్ని తయారుచేశారు.

Further I now learn it is the general belief that his writings are fully 4 centuries old ... Yet in every page we find the common colloquial expressions used at the present day. (Brown, 1839)

కొండవీటిరెడ్డి రాజుతమ్ముడైతే కాడుగాని, రాజబంధువు. కొండవీడు, రాజమహేంద్రవరం రెడ్డిరాజ్యాలు 1424, 1435సం॥రాల్లో కళ్ళముందు కూలిపోవడం చూచి క్రుంగిపోయి, తనలో బీజప్రాయంగా వున్నవిరక్తి విజృంభించి, సన్యసించినవాడు. 15వ శతాబ్దివాడు. (బ్రౌను గట్టిగాత్రోసి పుచ్చినమాట ఇది)వావిళ్ళ వెంకటేశ్వరశాస్త్రివాదమూఇదే. గోదావరి ప్రాంతంలగాయతురాయలసీమదాటితంజావూరు దాకా దిగంబరుడై సంచారం చేశాడు. తెలుగు మాండలికాలన్నీ - గోదావరి, కొండవీడు, కడపవీ - అతనిలోవున్నై. కొండవీడులోపుట్టి కడపదగ్గర గండికోటలో పెరిగి, కదిరిసీమ కటారుపల్లెలో వుంటూ కన్నుమూసి సమాధిలో పూజలందుకొంటున్నాడు. కవిస్తుతుల కెక్కాడు.

ఇట్టిలోకములోఁగంటి, పల్లెముత్తడంటే పల్లెముత్తడెవడో యనుకొనేప్పుడు గుంటుపల్లి ముత్తన్నగా తాను పరిష్కారం చెప్పినవాడై, వేమన 15వ శాతాబ్దము వాడనే తన పాత నిర్ణయం వదిలించుకోలేక, ముత్తన్న పేది పద్యం అసలు ప్రక్షిప్తం పొమ్మని (శతకకవుల చరిత్ర), వేమన కాల నిర్ణయంలో ఆ పద్యాన్ని కీలకం జేసి సిద్ధాంతించే అవకాశం మరొకరికి చేజేతులా వదిలేశారు.

1897లో పమ్మిత్యాగరాయచెట్టి తమిళదేశంలో వేమన దిగంబర చిత్రాన్ని సంపాదించి ప్రచురించగా, తమిళ దేశంలోనే 1914లోగోచితోపద్మాసనంలో వున్న చిత్రాన్ని సంపాదించి 1917లో వావిళ్ళవారు ప్రచురించగా, తంజావూరు రాజాంతఃపురంలో వేమన చిత్తరువుందని విని విచారించి భోస్లేరాజుల సౌజన్యంతో సంపాదించి 1922లో ప్రచురించారు. అదే బాగా ప్రచారంలోకి వచ్చిన దిగంబరచిత్రం.

విశ్వనాథశర్మ : (1922)

వేమన కొండవీటి రాజవంశానికి గాని, మరేరెడ్డిరాచతనానికి గాని చెందని పల్లెటూరి రైతుకుటుంబం వాడని నిర్ద్వంద్వంగా తేల్చాడు.

పొదిలె తాలూకా మూగచింతలలోపుట్టి, మార్కాపురం తాలూకా కటారు పల్లెలోను, రెడ్లరాజధాని కొండవీడులోను కొన్నాళ్ళుండి, దేశాటనంలో ఎక్కడో సిద్ధిపొందాడు అన్నారట.

" ఊరు కొండవీడు - ఉనికిపశ్చిమ వీధి - మూగచింత పల్లె మొదటియిల్లు- ఎడ్డెరెడ్డి కులమదేమని చెప్పుదు . " అన్న పద్యంలోని మూగ చింతపల్లెను పొదిలెసీమ 'మూగచింతల'గా పోల్చి, ద్విపద వేమన చరిత్రలోని కటారుపల్లె మార్కాపురం తాలూకా కటారుపల్లెయని పోల్చినవి వీరే. రెండో కటారుపల్లెను వెలుగులోకి తెచ్చారు. అతని భాష కర్నూలు గుంటూరు నెల్లూరు (పాత) జిల్లాల్లోని మాండలికంగా చూపించారు. 'ఇంగిలీక మహిమ హేమింప నేరక చిత్తరువులు వ్రాసి చెరచినారు' అన్న పద్యం కాలనిర్ణయానికి ఉపయోగించారు. ఇంగిలీకం యొక్క ఉపయోగం ఆయుర్వేదంలో 14వ శతాబ్దాంత గ్రంథాలలోనే కనవస్తున్నదని, చిత్తరువులు వ్రాయడానికి ఉపయోగించడం మరింత నవీనకాలమని అనగా, వేమన 15వ శతాబ్దమువాడని వంగూరితో ఏకీభవించారు.

వేటూరి : (1924)
It is beleived that he lived about the beginning of the 17th century....
(Brown, 1829)

" ప్రాకటముగ నిట్టిలోకములో గుంటుపల్లి ముత్తడెన్న పరమగుణుడు, అన్నదానమునను హరపూజ చేతను హరునియందు నైక్యమాయె వేమ। " అన్న పద్యాన్ని వేమన కాలనిర్ణయానికి మూలస్తంభంగా ప్రతిష్ఠించిన వారని పించుకొన్నారు. " పరగరాయనికులు బాచని ధనమెల్ల భట్లపాలు కవులపాలు ..." అన్న పద్యంలో బాచన్నను తప్పుగా అర్థంచేసుకొని తమ వాదం మీద విమర్శకు ఎడమిచ్చారు. ముత్తన్న మృతి 1623 అని చాటు పద్యాన్ని బట్టి తేలుతుండగా, అతని దానశాసనాలు సన్నదులు (1601 నుండి 1713 వరకు) కానవస్తున్నవి. ఈ పరిష్కారం వల్ల వేమన 15వ శతాబ్దం గడచి, 17వ శతాబ్దం తొలి సగంలోకి వచ్చిపడ్డాడు.

బండారుతమ్మయ్యః
(1924)

షేకుసైదు మొగలు చెలగుపఠాణులు తురకల దొరతనము తొలుతజేసి రాగరాగ విడిచిరాతులై కొలిచిరో ........ అన్నపద్యాన్ని పైకిదీసి, ముత్తన్న మృతి ప్రశస్తి పద్యాన్ని వెన్కకు నెట్టి వేమన కాలనిర్ణయంలో అవశ్యం తీసుకో వలసిన దాన్ని చేశారు. తురకల దొరతనం పతనంఅంటే ఔరంగజేబు చావుతర్వాత దాకా అంటే 17వ శతాబ్దం రెండోసగంనుండి 18లో సగందాకా తీసుకెళ్ళారు. 1650-1750 మధ్యనెప్పుడో వేమన ఉన్నాడని వీరి నిర్ణయం,

Many verses, however, prove that he wrote in the later part of the 17th century when mohammadens were Governors of that part of India.
He lived in the begining of 18th century.
Brown 1824,

కొండవీటిలో పుట్టిపెరిగి, తెనుగు తమిళ దేశములందు విస్తారముగా తిరిగి, ఏ స్థలమందును స్థిరపడక, ఎక్కడో మరణించాడు.
వంగూరివారు పూర్వకవిస్తుతులలో చూచినవేమన్నయితడు కాజాలడని, బెలిదేవ వేమనారాధ్యునిగా చూపించారు. సంఘంలోని దారిద్ర్యము సమస్య వేమన్నని ప్రచలితం చేసిందని గట్టిగా గుర్తించి, అతని జీవితం పటంగీచారు. నవీన సిద్ధాంతపు వాసనలు పట్టని వీరి చిత్రణం సనాతన సంప్రదాయంలోని ఒక ఉన్నత కోణాన్ని చూపిస్తుంది.

ఇంత ఉదాత్తునిగా వేమన నెవ్వరూ యిదివరకు ఏ భాషలోనూ చూపలేదు,

శేషాద్రి రమణ కవులు : 16వ శతాబ్దాంతంవరకు ఉన్నాడన్నారు. దానికి కారణం ముత్తమంత్రి ప్రసక్తిపద్యం మృతిప్రసక్తిలేని పద్యంగా మరొకపాఠాంతరం వారివద్ద వుంది.

" అన్నదానమునను హరపూజచేతను హరుని లోనగాంచె నరసి వేమ" [ముత్తన చావు 1623 అని వీరికితెలుసు] గ్రియర్సన్ కూడయీకాలం ప్రతిపాదించాడు.

ఒంగోలు తాలూకా మూగచింతలలో పుట్టి, కొండవీట పెరిగి, కటారు పల్లెలో మృతుడయ్యాడు. [ వీరు వే. వి. శర్మవాద మెరిగినట్లు లేదు. ]

వేమన భాషాపరిచయముకలిగి, సంస్కృత శ్లోకాలకు అనుకరణ పద్యాలు చెప్పాడు.

వేమన దిగంబరుడనుట అనుమానాస్పద మన్నారు.

బాలచక్ర వేమ, శతకము నుంచి యీ పద్యా లిచ్చారు :

కదిరి తూర్పునందు ఘనత శోభిల్లగా
బరగు వరకటారు పల్లెయనగ
అచట నునికి జేసి అమరియుండెదరయా
బాల చక్రవేమ భవ్యనామ.

(1913 బందరు ప్రతిలో యీపద్యం మకుటం మార్పి యివ్వడానికి ఆధారంద్విపద వేమనచరిత్రతాటాకుల్లో చివరగలబాల చక్రవేమశతకమే. కానిరాళపల్లి అదికానలేదు.)

తల్లి దండ్రి యన్నదమ్ములాత్మ సఖులు, ఎలమిబంధులాది ఎల్లజనులు, కలిగి వర్ధిలి రాయూర ఘనత మెర, బాలచక్ర వేమ భవ్యనామ.

1వ రాళ్ళపల్లి :
[వావిళ్ళవారి పీఠిక
పైంగళ–1917]

ఇతని స్థలమిదియే యని యేర్పరుపగాదు. తెలుగు దేశ మంతయు నించుమించుగ నితని స్థలమే. కాని బ్రౌన్ చెప్పినట్లే దత్త మండలములకు చేరినవాడని తలచుట న్యాయ్యతరము. గండికోట కితడు సమీపస్థుడు. కదిరి దగ్గర కటార్లపల్లెలో ఇతని సమాధి యున్నది.

17వ శతాబ్దమని బ్రౌను, కాదు, 15వ శతాబ్దమని కొందరు అనుచున్నారు. ఇందేదైనను కావచ్చును, కాకపోవచ్చును. ఎందుకనగా రెండు సిద్ధాంతములును నిష్కారణములు. వేమన వంటి వాని కవనమున నాతని కాలము నిర్ణయించుటకు దగిన యాధారము లుండునని యాశించుట నిరర్థకము. ['గంటుపల్లి ముత్తడను నొక్కడే జాతికి జేరిన వాడోయితని భూషణమునకుబాత్రుడై నాడ'న్నారుగాని అదే అతని కాల నిర్ణాయకమగునని కానలేదు.]

వేమన జాతిచేత కాపు—రెడ్డి గాడు.

యోగ శాస్త్రోన్మాదము, విద్యాద్వేషము గలవాడు. కఠిన స్వభావుడు. ప్రపంచపు నడవడులందే మాత్రము సానుభూతి లేనివాడు. ముంగోపి. పద్యములు చెప్పి విననివారిని బూతులు తిట్టుచు ముందుకు వెడలుచుండువాడు. 'మరుగు మర్యాదలేని మోటు విధముగా తిట్టడ'ని రామలింగారెడ్డి గారన్నది యితని యందు చెల్లదు.

ఇతని వేష చరిత్రాదులెంత విచిత్రములో ఇతడు బోధించు నర్థములంత దుర్గ్రహములు.

కవిత్వమందు నవ్యతయను గుణము తాండవ మాడుచుండును. ఎంత కొంచెము మాటలలో నెంత యర్థ మిమిడింపవచ్చునో యితనికేగాని యితరులకు తెలియదు. తిక్కనకీ గుణము కలదు గాని యీ సౌలభ్య మతని యందు అపూర్వము. సహజమైన హాస్య ప్రియత్వ మున్నది. లోకోక్తులితని కవితలోని జీవితములు

[రామలింగారెడ్డి కవిత్వ తత్త్వ విచారములో వేమనను గూర్చి చదివిన పిదప వీరిని చదువవలసినది.]

2వ రాళ్ళపల్లి : [వేమన ఉపన్యాసములు—1928 ఆంధ్ర యూనివర్సిటీ అధ్వర్యము. రామలింగారెడ్డి సూచన ప్రేరణలు]

అసలు కొండవీడు. సంచారము దత్తమండలము లందెక్కువ. అరవదేశము తిరిగినాడు. కర్నాటకము తిరిగిన జాడలేదు.

18వ శతాబ్దాది యందున్నాడనుట సమంజసము.

వేమన ప్రభురెడ్ల తెగకు చెందినవాడు.

వేమన నిజముగా తత్త్వజ్ఞానమును సంపాదించెనా ... అను ప్రశ్నలకు బదులు చెప్పుట నా శక్తికి మీరినపని. బ్రౌను దొర ఇతని సిద్ధాంతము అర్థము కానిదనియు, నిష్ఫలమైనదనియు చెప్పెను— (ఈ కథ విన్నారు)

అనేక పద్యములందు ఆట వెలది నడకకు సీసపు నడకకును భేదమే యితడు గమనించినట్లు తోచదు. బోధకుడును సంస్కర్తయు గావున హాస్య రసమితని యందును కలుషితమై ఇతడు సహజముగా నసభ్య రచనలు చేసినను ఒకొక్కమారు తన పని తాను మరచి స్వచ్ఛమైన హాస్యముతో తృప్తి కలిగించును.

కటారు పల్లెలోని సమాధియు, నల్లచెఱువుపల్లో నామాలున్న కొయ్యవిగ్రహము, ద్విపద వేమన చరిత్రయును అసలు వేమనవే గావు. కటారుపల్లె వేమన నకిలీవేమన— వానిపేరు తుంగ పుల్లారెడ్డి. రామలింగారెడ్డి గారేమనుకొని పంపినారోగాని, వెళ్ళి మాత్రము కదిరి కటారుపల్లె పుక్కిటి పురాణాణ్ణి పేల్చివేసిన వారయ్యారు. వాచక భాష అనిపించేంత ప్రాసంగికమైన గ్రాంధికం, చమత్కార సుందరమైన కమ్మని వచన పాటకారి తనంతో వేమన పేరుమీదుగా మనకిచ్చారు మనమీద మత్తుమందులాగా చల్లి మనల్ని మైకంలో పెట్టగలిగారు.

3వ రాళ్ళపల్లి : 1970 [తమ్మయ్యగారి వేమనచరిత్రపీఠికలో]

1917లో వీరికిఅంతుబట్టని గంటిపల్లిముత్తనిమీది ఆ పద్యమొక్కటే వేమన కాల నిర్ణయానికి ఆధారమని, 1600 తర్వాత వేమనకాలము నికరముగా దేల్చు సాధనములు లేవన్నారు. *

(వేమన విషయంలో రాళ్ళపల్లి వారిని గూర్చియింతవిన్న తర్వాత, రాళ్ళపల్లి—రామలింగారెడ్డి—వా॥వెం॥శాస్త్రి Triangle తయారైన సంగతి సందర్భాలను వావిళ్ళ వారి 'వేమన పద్యముల'కు 'ఉదాత్తమర్శ కవితాధురీణుడు వేమన' అనే శీర్షికతో వా॥ వెం॥ శాస్త్రి వ్రాసిన పీఠికలోరాళ్ళపల్లి వారి కథతోవున్న ముగింపు పేరా నుండి తెలుసుకోవచ్చును.)

1917లో వావిళ్ళవారి వేమన పద్యాలకు చిన్న పుస్తకమంత పెద్ద పీఠికతో వేమన్నను త్రాసులోబెట్టి తూచిన యీ ప్రథమదేశి పండితుడు, వంగూరి పుస్తకాన్ని పురస్కరించుకొని జరిగిన ఆ పెద్ద చర్చనంతటినీ కేవలం సమీక్షించి స్వాయత్తం చేసుకొన్నంతలో వారి Contribution అంటూ వారిఖాతాకు జమకట్టడానికి ఏమి మిగుల్తుందో ఏమి మిగలదో పాఠకులే తేల్చుకోవచ్చనుకొంటాను.

## బ్రౌన్ కానని వేమన గొప్పతనం

వీరు చేసిన ఈ చేర్పులూమార్పులూ ఏమంత లెక్కలోనివిగావు. కాని బ్రౌన్ని మనవాళ్ళు ఒక ముఖ్యమైన విషయంలో త్రోసేశారు. అది కవిగా వేమన స్థానమేమిటన్న విషయంలో. ఏమైనా, ఎంతజేసినా బ్రౌను దృష్టిలో కవిగా వేమనకు పెద్ద స్థానంలేదు. బ్రౌను మాటల్లో 'Vemana is not a classical poet ఇంగ్లీషు-తెలుగు నిఘంటువులో Classical అనే యింగ్లీషు పదానికి అర్థం యిస్తూ పై యింగ్లీషు వాక్యం వ్రాసి, 'వేమన సామాన్య కవి'యని దానికి తర్జుమా జేశాడు. పీఠికలో అయితే, యింకా చిన్నచూపు చూచాడు : Neither poetical nor classical అన్నాడు. ఇది మరింత హానికరంగా వుంది. Classical అంటే సాంప్రదాయకమైన, ప్రయోగ సిద్ధమైన అనే అర్థాలు కూడ నిఘంటువులో

* 4వ రాళ్ళపల్లి : బంగోరె వద్ద వున్నాడనుకొంటాను. ఎదురుచూద్దాము.

యిచ్చాడు గావున, ఈ పీఠికలో వేమనను సాంప్రదాయక కవి కాదన్నాడులే యను కొని, సంప్రదాయోల్లంఘనం ఘనం చేసుకొని చెప్పుకొనే మనం దాన్ని ఒక Compliment గానే తీసుకొందామని లౌల్యంబోతే, Neitherpoeitical అనే మాట ప్రాణాలు తినేస్తుంది. ఇంకేం చేసేట్టు ? బ్రౌన్ దృష్టిలో వేమన సామాన్య కవి అనుకోవలసిందే.

బ్రౌన్‌యొక్క ఆ మదింపు మీద తిరుగబడినవాడు సి. ఆర్. రెడ్డి. తెలుగు సాహిత్య విమర్శనంలోనే, విలువల నిర్ణయంలోనే మౌలికంగా కొత్తపంథా చూపిందే ఆయన. ఆ కొత్త పంథా నిర్దేశం ఆదిలోనే కవిగా వేమన విగ్రహాన్ని నెలకొల్పి మరీ తన సాహిత్య సిద్ధాంతాన్ని చెప్పారు. వ్యుత్పత్తిలేని కేవలప్రతిభగా చెప్పినా అతని నిజమైన ప్రతిభను పటంగీచి చూపించాడు. [దాని వెనక W. H. Campell ఏమేనా వున్నాడేమో సరి]. రాళ్ళపల్లి దాన్ని అందుకొన్నాడు. వంగూరి అందు కొన్నాడు. బ్రౌన్ ఓడిపోయాడు. తెలుగు పండితలోకం వేమన్నని మహాకవిగా చూడవచ్చింది ప్రపంచానికి చూపదగిన ఒకే వొక తెలుగుకవిగా ఇప్పుడు వేమనను చూస్తున్నాం. అతడు విశ్వకవిగా విస్తరిస్తున్నాడు.

కవిత్వం విషయంలో బ్రౌన్ని తీసి దూరంగా పెట్టాముగాని పాండిత్య విషయ ములో కూడ అతన్ని దూరంగా తోసేసి, మనమే సత్యానికిదూరమై పోయాం. పోవలసింది కాదు

## వేమన పద్యం × పండితరాయల శ్లోకం..
## మన పండితరాయుళ్ళు, బ్రౌన్ శోకం

" ప్రస్తుతంపువేళ పద్యంబు చదివిన తప్పుగలిగి యున్న నొప్పియుండు
వెలది సురతవేళ బిత్తరై యొప్పదా ....... ... "
" అవసర పఠితా వాణీ గుణగణ రహితాపి వహతి పరమోదమ్
రతి సమయే యువతీనాం భూషాహానిశ్చ భూషణం భవతి ॥ "

వేమన పైపద్యానికే యీ శ్లోకం అనుకరణ మని, శ్లోకంజగన్నాధపండిత రాయలిది ని వంగూరి తవ గ్రంథంలో వేమనకు కవిగా కలిగిన గుర్తింపు ఎంత పెద్దదో చెప్పాలని యీ సామ్యం చూపారు. మన వాళ్ళెవరూ దాన్ని పండిత రాయల అనుకరణంగా అంగీకరించలేదు. రెండింటి సామ్యం స్పష్టమేగాని

వేటూరి వారు దాన్ని (1924లో) ఖండించారు. వేమనదే అనుకరణ మన్నారు. ఆగలేదంతటితో ఇతరులు. రాయలు షాజహానుఆస్థానకవి - అతన్ని అనుకరించిన వేమనషాజహానుకాలానికి ముందు వాడు కాడన్నారు.

ముందువాడు కాడని పూరుకోవడమేమిటి? 1628నుండి1658దాకాషాజహాను రాజుగావున్నాడు. అతడుదిగిపోయినతర్వాతే అతని ఆస్థానకవిగారిపద్యం ఆంధ్రకుప్రాకి వుండాలి. అంటే, వేటూరి వారు వేమనను 1650 దాట నియ్యక పోవడమే మిటీయని 17వ శతకం మలుసగంలో పుట్టినట్టు చెప్పడానికి కూడా యీ అనుసరణ పద్యోదంతాన్ని వేటూరి వారికే ఎదురు తిప్పబోయారు తమ్మయ్యగారు.

అన్నా, ఎంతపనీ అనుకొన్న ఆ వేటూరివారు, ఆశ్లోకం అసలు పండిత రాయలిదే కాదు పొమ్మన్నారు. పైగా అది 1475లో సంకలితమైన ప్రసంగరత్నావళిలోనిదని ప్రకటించి వేమన కాల నిర్ణయంలో దానికి గాలి తీసేశారు. దానితో 1700దాకా వేమనను బ్రతికించడానికి త మ్మ య్యగా రి కి మిగిలిన పద్యం ఒకటే, "షేకుసైదు మొగలు చెలగుపఠాణులు .....కాని తమ్మయ్యగారేదో వేటూరి వారి డూప్లిసిటీనిపసికట్టినట్టు వంగూరివారిని అసలలాఎందుకుచెప్పనిచ్చారు వారివ్రాతప్రతిని చూచికూడా, మళ్ళీ యింత తంతుదేనికి నడిపారు, అయినా ప్రసంగ రత్నావళి * యొక్క వ్రాతప్రతుల మూలపాఠంలో యిది వుందోలేదో చూచిచెప్పమన్నారు. అసలు వంగూరి సుబ్బారావుగారు ఈ శ్లోకం పండిత రాయలిదిగా ఎలా గణించారో తెలియడంలేదే అనిబిగ్గరగా అనుకొన్నారు.[1924,1925,1926ఆంధ్రపత్రికఉగాదిసంచికలు]

తమ్మయ్య నివేదనని, వేదనని అంతా విని కూడ వేటూరి వారు ఇక మాటాడకుండా, మౌనవ్రతులయ్యారు. తమకు సమాధానం రానంతవరకు తమవాదం నిరాక్షేపం అనుకొందామనుకొన్నారు తమ్మయ్యగారు.వారికి తోడువచ్చి కలిసినట్లుంది రాళ్ళపల్లివారు. 1928 ఉపన్యాసాల్లో ఆ శ్లోకం రాయలిదిగానే మాట్లాడారు. తమ్మయ్యగారి వేమన కాలాన్ని తామూ సరేనన్నారు. రాళ్ళపల్లి ఆ శ్లోకం రాయలిది

---

* నాకిందులో ఆసక్తి వేమన పాండిత్యవిషయమే. పండితుడై కూడ తేలికగా తెలుగుగా లోకోక్తివతుగా వ్రాసే కవితోద్యమం అతనిదని చెప్పే మేరకే నా ఆసక్తి. ప్రసంగ రత్నావళి వ్రాతప్రతిలో ఆ శ్లోకం వుందోలేదో, కాలనిర్ణయం విషయంలోకూడ దాని ప్రాధాన్యం పోయినతర్వాత, అవసరం గాకపోతున్నది.

గానే పునశ్చరణ చెయ్యడం తమ్మయ్యగారికి అందులో నమ్మకం తిరిగి కలిగించింది. 1970లో అదంతా వ్రాశారు మళ్ళీ.

ఇంతకూ సంగతేమిటి? వంగూరి సుబ్బారావుగారు ఆ శ్లోకన్ని పండిత రాయలదని ఎలాగన్నారు? ఎలాగన్నారో వేటూరికి తెలియాలి. ఈ మూగ సంత ఎందుకు నడిచినట్టు? వీరందరూ బ్రౌన్ని దొంగిలించి, కన్నంలో తేలుకుట్టిన దొంగలై పోవడమే కారణం.

ఆ శ్లోకం పండిత రాయలదన్నవాడు బ్రౌన్. వేమన పద్యం appears to be translated from the following by Pandita Rayalu [See సి. పి. బ్రౌన్ P. 10—కొత్తపల్లి వీరభద్రరావు] అది తమ్మయ్యకు తెలియదు. వంగూరికి, వేటూరికి రాళ్ళపల్లికి తెలుసు. బ్రౌన్ మాన్యుస్క్రిప్టుల్ని ముగ్గురూ చూచినవాళ్ళే. మాన్యుస్క్రిప్టుల గర్భవాసం లోనే బ్రౌన్ని భ్రూణహత్య చేస్తున్నారుగదా। ఆ పనికి వీరికో పెద్ద మనుషుల ఒప్పందం ఉందనుకొంటాను. బ్రౌను బ్రతికియుండగానే ఇంగ్లాండు నుంచే మన పండిత రాయుళ్ళ ఘన కార్యాలు చూచాడు. తనపేరైనా ఎత్తకుండా తాను కూర్చిన పుస్తకాలనే ప్రచురించటం చూచి బాధపడ్డాడట. చచ్చిపోయిన తర్వాత మరేముంది, ఇంకా బరితెగించి కాజేశారు.

బ్రౌను దృష్టిలో వేమన పండితుడు — సంస్కృతం వచ్చినవాడు. "Parts of them (Vemana'a proverbs) are evidently translations from Sanskrit works, particularly from Hitopadesa and Bhagavadgita. In a few of these, every word is pure Sanskrit ' - Introductory Remarks (1824). వేమనమీద బ్రౌన్ నోట్సంతా అచ్చువెయ్యటం త్వరగా చెయ్యాల్సిన పనుల్లో ఒకటి.

ఇతనికి పుస్తక జ్ఞానము ఇంచుమించు సున్న, అని ఒక మిత్ సృష్టించిన వాడు రామలింగారెడ్డి. వ్యాప్తి జేసిన వాడు రాళ్ళపల్లి కాని అందుకు విరుద్ధముగ కానకుండా అక్కడక్కడ ఇతరులను బట్టి వల్లిస్తూ వేమన సంస్కృతం నుంచి అనువదించిన పద్యాలిస్తాడు. వాటి మీద ఏమో సిద్ధాంతం నిర్మించ బోతాడు. పైగా వేమన ఒకప్పుడు 'ఒక గ్రంథము వ్రాయనారంభించినట్లు ......ఆ గ్రంథము నతడు పూర్తిగా ముగించినాడును నమ్మిక, నాకు లేద'నిఋడా వ్రాస్తాడు.(6వ పేజి వేమన)

వేమన మృచ్ఛకటికా శ్లోకానువాదం*మాటొకటి, ఆబ్దికకర్మకాండమాటొకటి చెప్పుకొని,రెడ్డి—రాళ్ళపల్లి పేర వేమన అపండితుడని లేచిన వాదానికిస్వస్తిచెప్పుదాం.

చంపదగిన యట్టి శత్రువుతన చేత చిక్కెనేని కీడుచేయరాదు
పొసగమేలు చేసి పొమ్మనుటే చావు — (చాలు) ............

చావని ఎక్కడా ఇటీవలఅచ్చులో లేదు. ఇటీవల అలాగే అచ్చువేస్తే అచ్చు తప్పనుకొని అలవాటు చొప్పున 'పొమ్మనుటేచాలు' అని దిద్ది చదువుకొంటున్నాం. 'పొమ్మనుటే చావు' అని ఇంగ్లీషుఅర్థంతో వ్రాతప్రతుల్లోనూ, బ్రౌనుముద్రణలోనూ వుంటే మనపండితులు బ్రౌన్ని దిద్దేసి 'పొమ్మనుటేచాలు' అని అచ్చువేశారు యింతకాలమూను.

"శత్రుః కృతాపరాధః శరణ ముపేత్యపాదయోః
పతితః శస్త్రేణ హంతవ్యం ఉపకార హతస్తు కర్తవ్యః"

శూద్రకరాజకవి చారుదత్తుని చేత పలికించిన శ్లోకం యిది. దీన్ని వేమన అనువదించాడు. అనుకరించాడు. ఈ అనువాదాన్ని కనుగొన్న వాడు బ్రౌన్. వేదంవెంకటరాయశాస్త్రిగారూ సొంతంగా కనుగొన్నారట వేమన వారికి సంస్కృత కావ్యాలు చదువుకొన్న పండితుడుగానే కన్పించారన్నదే సంతోషం.

దీనికే తిరుపతి వెంకట కవుల అనువాదం వుంది. పోల్చి చూస్తే....

"శత్రువపరాధి యగుగాక శరణమనుచు
చరణముల మీద బడెగాన — శస్త్రమెత్తి
చంపరాదయ్య — ఉపకృతి సలిపివాని
బ్రాణములతోడ విడచుటే యగును శాస్తి॥"

## తల్లిరంకు దెలుప తద్దినములు

ఆలిరంకు దెలుప నఖిల యజ్ఞంబులు, తల్లిరంకు దెలుప తద్దినములు
కాని తెరువు కర్మకాండ కల్పితమాయె .......

ఈ పద్య కూడ 17వ శతాబ్దంలో శూద్రునిశ్రుతపాండిత్యాన్నే తార్కాణిస్తుందనే అనుకోగలమా? పొరపడి అనుకోవచ్చు తొలి చరణాన్ని గూర్చి. కొన్ని

---

* బంగోరె 'బ్రౌన్ లేఖలు' పీఠిక ఆధారంగా.

యజ్ఞాల్లో యజమానురాలు పురోహితులతో బూతు చెయ్యావలసి యుండటం కొంత ప్రసిద్ధం, అశ్వమేధంలో అసహ్యాచర్య వున్నది. అందుకే యిలా అంటున్నాడేమో అనుకోవచ్చు. అది కాకుండా, యజమానురాలు ఎందరితో తిరిగిందో అన్ని దర్భపోచలను వుంచి నిజం ఒప్పేసుకొని శుద్ధురాలై చిత్తశుద్ధితో యజ్ఞంలో పాల్గొనవలెనన్నకర్మకాండే వున్నదని వింటే శ్రుత పాండిత్యమే అనుకోగలమా ఆలోచించండి.

రెండో చరణం మాటేమిటి ? ఏమైనా అంతుబట్టుతున్నదా అసలు ? ఏదో నోటికి వచ్చినట్టు విమర్శకంగా అనేస్తున్నాడు వేమనఅనేగాని, దాని పునాదుల లోతులు — నిజంగా శ్రాద్ధ మంత్రాల్లో—దాని కర్మకాండలో వున్నవని తెలుసుకోవలసివస్తే, వేమనకు ఆ మంత్రాలు—అర్థాలు ఎలా తెలిసినవనుకోవాలి ?

వేదం వెంకటాచలయ్యను అభినందిస్తూ కట్టమంచి రామలింగారెడ్డిగారు వ్రాసిన లేఖ ఒకదాన్నితెచ్చి బంగోరె చూపించారు. అందులో మన నాయనమ్మల అమ్మమ్మల నడవళ్ళ గుట్టు శ్రాద్ధ మంత్రాలు చెప్తున్నవని చూపినందుకేమో అభినందనలాగా వున్నదా వుత్తరం. ఇక 'తల్లిరంకు దెలుప తద్దినములు' అన్న వేమన పక్తి ఎక్కడనుండి వెలువడిందో తెలుస్తున్నది గదా అన్నాను. శ్రాద్ధ మంత్రాల్లో పిండ తర్పణమప్పుడు చదివే భాగం ఎవరిని తండ్రిగా పేర్కొన్నప్పటికీ బీజమెవ్వరిదో తెలియక పేర్కొనకపోయినా, తప్పుగా పేర్కొంటున్నా అసలు బీజావాపకునికే తర్పణలు ముట్టుతాయని — ఆ భాగంలో 'తనయుని జననంబు తల్లి తానెరుగురా' అన్నట్లు తల్లివచ్చి నిలబడి శ్రద్ధగా వినే విధి విధించబడి వున్నదని తెలుసుకొంటే, వేమన శ్రాద్ధ మంత్రాలు ఎరిగినవాడని ఏర్పడదా ?

ఎంత తేలిక పద్యం, ఎంత సాదా భాష ఎంత చాటు విషయాలను పది నిలువుల పాతాళంలో పాతరవేసిన విషయాలను ఏ వేదం వెంకటాచలయ్యగారో వెల్లడించ వలసిన రహస్యాలనుచెప్పుతు న్నదో విశదమవుతున్నది.

యజ్ఞంలో, ఆబ్దికంలో బైటబడే తల్లి యిల్లాండ్ర 'రంకులు' అన్నవి క్షేత్రజ సంతాన వతుల గూర్చి మాత్రమేనని, శాస్త్రానుమతిగల తిరుగుడు మాటే గాని మరో గాలి తిరుగుడు మాటకాదని కొందరంటున్నారు.

అదలా ఉండనీయండి. ఈ పద్యానికి పంచాగ్నుల వారేమి వివరణయిచ్చారో చూడగలందుకు కుతూహలించి వారి తాత్పర్యంగల వావిళ్ళవారి వేమన పద్య ప్రచురణ (1955) తెరచి వెతుకులాడాను. ఏం చెప్పను, ఈ పద్యము అసలందులో లేదు. పంచాగ్నులవారి గౌతమ ధర్మసూత్రాల ఆంధ్రీకరణ, క్షేత్రజ సంతానం—తద్దినం విషయమైన వివరణ మిత్రులు తెరిపించారు గావున, అదేమంత నిర్దిష్టంగా అందులో తేలకపోయినా, యీ పద్య వివరణం వద్దనైనా వారు విషయం తేల్చి చెప్తారని ఆశించి నిరాశపడ్డాను. చెప్పవలసినవారు, చెప్పగలవారు తప్పుకొన్నారు. పైగా పద్యాన్నే ఎత్తివేశారు. అదేమి నిరూపిస్తుంది ?

1839నాటి బ్రౌన్ సంకలనంలో యీ పద్యం వున్నది. ఆ సంకలనాన్నే 1914లో వావిళ్ళవారు ప్రచురించారు. అందులోనే వా. వె. శాస్త్రిగారే దాన్ని కత్తిరించారేమోయని తనిఖీ చేశాను. అందులో యీ పద్యం వుంది. ఎటుదిరిగీ ఆ తర్వాత పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రుల వారి తాత్పర్యంతో వెలువడసాగిన వావిళ్ళ ప్రచురణలోయీపద్యంమటుమాయమై పోయిందనికనుగొని నివ్వెరపోయాను.

బ్రౌన్ ఏమైనా చెప్పి వుంటాడని వెతికాను. 1967లో మన సాహిత్య అకాడెమీ ప్రచురించిన D—1774 నంబరు బ్రౌన్ ప్రతిలో తాత్పర్యం కనుపించింది. మరో నాలుగు పద్యాలు తద్దినం విషయంగా అందులో అదనంగా కానవచ్చాయి. ముత్తయిదువుల శ్రాద్ధంలో ముత్తయిదువులకు చెప్తారు, విధవల తద్దినాల కెందుకని విధవరాండ్రకు జెప్పరు? స్త్రీల శ్రాద్ధాలకు స్త్రీలనేఎందుకు పిలవాలి ? అనే విమర్శ గల పద్యాలున్నాయి.

'తల్లిరంకు దెలుపు....నన్నదానికి బ్రౌన్ అర్థం :

The Periodical ceremonies being performed to the late husband of a widow lead to the conviction, at least in her own mind, of her having been true or adulterous. (207వ పేజీ) బ్రౌన్ అర్థాన్ని వూహించి చెపుతున్నాడుగాని అసలు విషయాన్ని నిర్దిష్టంగా తెల్పుకొని చెప్పడం లేదని తెలుస్తున్నదిగదా ! ఆయన ఆస్థాన పండితులు, వఠ్యంఅద్వైత బ్రహ్మశాస్త్రి, జూలూరి అప్పయ్యవంటి పండితులవల్ల యీపద్యం గుట్టుపూర్తిగా పట్టుబడలేదన్నమాట

ఆ కొత్తపద్యాలైనా వావిళ్ళ ప్రచురణలో పంచాగ్నుల తాత్పర్యంతో వున్నవేమోయని చూస్తే, అవీ కానరాలేదు. "గురుతు తిథులవలన కులమెల్ల చెడిపోయె " నన్న దొక్కటి మాత్రం పైపద్యం వంటిది, ఘోరమైన తాత్పర్యార్థంతో కానవచ్చింది. " తిథి వారాదుల బాటించి కర్మముల నాచరింపక పోవుటవలన జాతి యంతయు సంకరమయ్యెను" అనే అర్థంతో వున్నది. ఇంకేమి చెప్పేది ? దాపరికమంతా దేనికో తెలుస్తున్నది కదా । వేమనయందు గణ్యాతాశ్రద్ధలు కలిగి, వేమనను వెలుగులోకితెచ్చే పండితులే ఇంకాకొన్ని విషయాల్లో వెనుకాడుతూ సంప్రదాయాన్ని నిరర్థకంగా కప్పెట్టుతున్నారు

## నేను తేరుకొన్నదెప్పటికి ?

'తెనుగు దప్ప గీర్వాణ మెఱుగని వేమన్న' యని (27వ పేజీ) 1975 లోనూ, 'ఆపైనాతడు' భాషలో పేద' యని (109, 110 పేజీ) 1980 మేనెలలోనూ యీపుస్తకంలోనే వ్రాస్తూ వుండిపోయాను నేను.

అంటేరాళ్ళపల్లి—రామలింగారెడ్డిపెట్టిన మత్తుఅంతటిది. 'విశ్వదాభిరామవినుర వేమ' కు అంత అర్థ పౌష్కల్యం చూపించుతున్నప్పుడు కూడా యింకా ఆమత్తు నుండి తేరుకోలేకపోయాను.'వార్తలోనివార్తవరకవిచేయురా' అనిశీర్షికపెట్టి నాలుగు పేజీలు అచ్చువేసినంతవరకూ తేరుకోలేదు. వార్తాకవిత మన పూర్వ సాహిత్యంలో ఒకనవ్యధోరణి అనిఅర్థంకావడంతో వేమనకుకావ్యసిద్ధాంతగ్రహణ వున్నట్టు, దానికి భాష కావలసినట్టూ తోచి అతడు వ్యుత్పన్నుడనటానికి దాఖలా వుందేమో, అతని శబ్దాలు, వ్యాకరణసూత్రాలను అపేక్షించే శబ్దరూపాలు, సరైన దాఖలాలుగదా అని వెదికాను. గాఢసంస్కృతాలు, సాధారణంగా వాడని శబ్దరూపాలు, వ్యాకరణ శుద్ధాలు కనపడసాగినై. పాపిని, హృదయఖంబు, నయపక్ష్మము, వైయాసి, మోక్షి, మోక్షణము, భల్లుకము, గర్దభము, కర్మి, క్షుల్లకుడు శీతలభాతి, ఉదము, దంపతి మృగములు, .... యిత్యాది వెన్నో శబ్దాలు, కప్రత్యయం వాడుకలు కానవచ్చాయి. దానితో కళ్ళుతిరిగినై. "ప్రస్తుతంపువేళ పద్యంబుచదివిన .."అన్నది అనువాదంగదా అనిగుర్తుకువచ్చింది. శేషాద్రిరమణకవులు అనుసరణలని చూపినవి గుర్తుకు వచ్చినై.నా దృష్టిమారింది. వేమన లక్షణంగా చదువుకొన్న పండితుడుగా తోచాడు. వేమన సంస్కృతసాహిత్యం నాటకాంతమ్ చదివినట్లుగా వైదికమంత్రార్థాలెరిగినట్లుగా తేలుతున్నది.

# మళ్ళీ అభిరామయ్యను తెస్తున్నారు !

'విశ్వదాభిరామలో అభిరామ నామవాచకం కాదనుకొంటే అదొక సంశ్లిష్ట సంస్కృత సమాసం అవుతుంది. అంత జటిలమైన సంస్కృత సమాసం ఒక్క మకుటంలో తప్ప మరెక్కడా వేమనలో లేదు. 'ఒక్క మకుటంలోనే వేమనకు తెలుగుపదాలు దొరకక సంస్కృతసమాసం అరువు తెచ్చుకొన్నాడనవలసి వస్తుంది.' అంచేత 'అభిరామ పదం నామవాచకమయితే వేమన Vocabulary చిక్కిపోతుంది'....ఇదొక విశ్వబ్రాహ్మణ పండితుని వాదన అని వార్త—దానికేం సమాధానం అని ప్రశ్న.*

అభిరామ పదాన్ని నామవాచకంగా తీసుకొన్నప్పటికీ విశ్వదాభిరామ సంస్కృత సమాసం కాకుండాపోదు. అయితేసంశ్లిష్ట, జటిలసమాసం కాకపోతుందనివీరినమ్మకం గావొచ్చు; అయితే అభిరామ శబ్దం నామవాచకంకాదనుకొన్నప్పుడే అర్థక్లిష్టత గాని, లేకపోతేఅర్థక్లిష్టతలేదనివీరిఅభిప్రాయమన్నమాట. అంటే, 'విశ్వద'లోసమాస జటిలత అర్థకాఠిన్యం ఏమీలేదని వీరి భావం గావాలి.

అభిరామ శబ్దం నామవాచకంకాకపోయినా, అది గాఢ సంస్కృతంగాదు; వినికిడిలో లేనిశబ్దం గాదు. పట్టాభిరామ, మునిజన మనోభిరామ, గుణాభిరామ, నయనాభిరామ, లోకాభిరామ, వంటి వానిద్వారా రా మ క థ తో, రామభక్తితో ఆ మాటలు తెలుగువారికి బాగా వినికిడిలో వున్నమాటలు, అలవాటుపడిన మాటలు. అందుచేత అభిరామ నామవాచకం కాకపోయినా మారుమూల మాటగాదు.

విశ్వదలో సమాస జటిలత, అర్థకాఠిన్యం. కానక పోయి, అభిరామ శబ్దమే జటిలతకుకాఠిన్యానికీ ఆకరమనటం ఆశ్చర్యకరం. ఎందరెందరి పండితుల్నో ఎంత కాలమో తికమక పెట్టింది "విశ్వద" అన్న సమస్తపదమేగాని, అభిరామశబ్దమన్నది కాదుగదా! అనేకార్థమయిందీ, 'విశ్వద' యేగాని అభిరామ కాదుగదా! కాక అభిరామలో అర్థభేదం ఏమున్నది ? నామవాచకమా, కాదా అన్నదేకదా ?

విశ్వదలో వున్న క్లిష్టతకూడ భాషాపరమయింది కానే కాదని యిక్కడ స్పష్టపరచ వలసివుంది. గాఢసంస్కృతం అందులో ఏమి లేదని, సమాస జటిలత కూడ అందులో ఏమి లేదని, మనవి చేస్తున్నాను. భాషరీత్యా ఎంతో తేలిక అయిన

---

* బంగోరె జాబులో వార్త, ప్రశ్న.

యీ సమస్తపదం మన పండిత పరిశోధకులకు అర్థం కాకపోవటానికి కారణం వారు భాషా పరిధినిదాటి దార్శనిక పరిధిలో దాని అర్థంకోసం వెదకక పోవడమే నంటాను. 'విశ్వద'లో భాషరీత్యా అర్థంగాని శబ్దాలేమున్నై? గట్టిగా మాట్లాడితే 'విశ్వద' అన్న సమస్తపదం యొక్క తత్త్వార్థ కాదు ఆయాన పెట్టింది, 'విశ్వము' అన్నచిన్నశబ్దమే, అందరికీ తెలిసిన ఆ శబ్దము వెనుకవున్న తత్త్వశాస్త్ర సిద్ధాంతాలే —చాల తేలికైనవి, చాల కష్టమైనవీ— అవేమీ మనపండితులుమనసున బెట్టక పోవటం, వారికి తెలిసినదాన్ని యిక్కడఅన్వయించుకోక పోవటం— అంతేగాని, యిందులోభాషా సమస్యలేదు, వ్యాకరణ సమస్యలేదు.

అయితే కావచ్చుగాని, అసలంతపాటి సమాసం వేమన కట్టడం, కట్టలేని వాడనికాదు, కట్టేధోరణి లేనివాడుగదాయని, ఆతేలికసమస్త పదమయినా అది అతని రచనగా పొసగదన్న ఆక్షేపణ ఒకటింకా వుండవచ్చు.

వేమన భాషా స్వరూపాన్ని పూర్తిగా అజదీసుకోకుండా Superficial Impressions ప్రభావం లోనే వుండిపోయినందున కలుగుతున్న ప్రశ్న యిది.

## వేమన - సమాసాలు

వేమనలో సమాసాలు లేకపోవడం ఏమిటి? చాలవున్నై. ఉన్నవి జటిలాలు గావు. నడకలో కుంటపు. పేము ముద్రకు తప్పవు. చూడండి :

శైవ వైష్ణవాది షణ్మతంబులకెల్ల దేవుడొక్క డనుచు దెలియలేరు —
దానధర్మములును దయయు సత్యము నీతి, వినయ శౌర్యధైర్య వితరణములు
రాజుపాలిటికివి రాజయోగంబులు.... ....
మానినీమనోజ మందిరానందైక లోలురౌల్ల దూర్ధ్వలోక సుఖము
మాలవాడ కుక్క మధురాన్న మెఱుగునా . . ..
పర్వత వనవాసి పరిణామవర్తన కూపవాసికెట్లు గురుతుపడును .
జంగమాఖ్య భక్తిసంధి వేరేలేదు సగుణభావమిదియు శాస్త్రవిధియు....
సంకరంపు జాతి సంసార భిజ్జాతి ... ...

ఇంకా ఇంకా సమాసపు కట్టుగలవున్నై. ఇటువంటి సమాస రచన వేమన వాడుకలో వున్నదే. భాషాపరంగా 'విశ్వదాభిరామ'యింత లోపలిదేగాక విలక్షణ మైనదా? అయినా అభిరామను నామవాచకంగా దీసుకొంటే వేమన వైవాడంలోనిదై, నామవాచకంగా దీసుకోకపోతే వేమన వైవాడంలోని రచన కాకపోతుందనటం హాస్యాస్పదంగాదా?

అసలీ అర్థానికి వాక్య నిర్మాణం ఒప్పుతుందా ? విశ్వదాభిరామ అనేమాట వేమనకు విశేషణమయితే తప్ప ఆ వాక్యం అలా వుండటానికి వీల్లేదు. 'వినుర' అనే క్రియారూపం ఏకవచనంలోనేగాని బహువచనంలో చెల్లదు. బహువచనంలో వినుడి, వినుడు, వినండి, వినండిరా కావలసిందే. ఇక్కడ నిర్దిష్టంగా 'వినుర' అని మాత్రమే వున్నది. అలావున్నప్పుడు మరొక దారిలేదు. అసలిందులో క్రియారూపమే లేకపోతే మనకు కావలసినంత స్వేచ్ఛ—కాని అది వుండిపోయింది. 'విశ్వదాభిరామ వినుతవేమ' అను చొప్పున కేవలం సంబోధనాత్మకంగా ఆ పంక్తి వెలువడివుంటే మనయిష్టం. అభిరామయ్యను వేమనకన్న యితరుడని మనమెవ్వరిని గొబట్టితేవాణ్ణిగా చెప్పుకొనే వీలుండేది. హిందీ అనువాదం ఒకటి వచ్చిందిగదా, అందులో యీ సులువు వున్నది. "హే విశ్వదాభిరామ, వేమ" అని హిందీలో మకుటం పెట్టారు. తెనుగు మకుటంలో ఉన్నపళంగా వీరి అభిరాముడికి చోటులేదు.

వేమన తన మకుటానికి తానే అర్థం చెప్పినట్లు చూపించాను. 'విశ్వదాభిరామ వినురవేమ' ప్రకరణంచూడండి. వేమనే దీనికిఅర్థం చెప్పటమంటే విశ్వమన్న శబ్ద మొక్కదానికీ అర్థం చెప్పటమే. అదొక్కటి చెప్తే తక్కినది చెప్పేసినట్లే.

విశ్వమనగనేమొ వివరించి చూడుడీ, విశ్వమైదుచేత వెలయుచుండు
విశ్వము మదిలోన వెదకి వీక్షింపుడీ ........

దీనిలో 'విశ్వమైదుచేత వెలయుచుండును' అన్నదానికి వివరణంగా మరొక పద్యం కూడ చెప్పాడు· వినవచ్చు,

"పంచభూతములును పరగ నింద్రియములు సంచరించినపుడె జగతిగల్గు
సంచరింపకున్న జగమెట్లుగల్గురా........"

[వావిళ్ళ ప్రచురణ—1158వ పద్యం]

ఇదే అర్థం ప్రక్షేపకారులకు కొందరికి తెలిసినట్టు వుంది. ప్రక్షిప్తాలనదగ్గ గీత పద్యాలలో కూడ యీ అర్థ స్ఫురణవుంది. వెనక ఒకప్పుడీ యర్థం తెలిసియుండి, క్రమంగా ఎవరికీ తెలియకుండ మరుగైపోయింది.

వేమనే యిలా అర్థం చెప్పుకొన్నాడని చూపిన తర్వాత, 'అభిరామ' నామవాచకం గావాలని చేసే యీ వాదన విచారసహమే కాదని కొట్టివేయవచ్చు. కాని ఆ వాదం బలాన్ని ప్రత్యేకంగా విచారించే తేల్చాలి. దానికి సొంత సత్తా లేదని చూపడమే మంచిదని ఇలా చేశాను.

## మరికొన్ని అర్థాలు : అనర్థాలు

వేమనను విశ్వబ్రాహ్మణుణ్ణి చెయ్యకుండా, అభిరామయ్యను విశ్వబ్రాహ్మ ణుణ్ణిగా దక్కించుకొనే యత్నం మళ్ళీ యిలా సాగుతోంటే, వేమనను బ్రాహ్మ ణుణ్ణిగా తేల్చుకోవాలన్న యత్నం అమితాశ్చర్యకరమైనది ఒకటివుంది. విశ్వదుడనగా బ్రహ్మ, అతినికిఇష్టమైనవాడా, అంటే బ్రాహ్మణుడా అనిచెప్పినపేకుమళ్ళ కామేశ్వర రావు యత్నం* వుంది. శంకర సమకాలికుడనికూడ వ్రాసినవారు వీరు. వేమన శతక కర్తయని - అతనివి నూరే నూరుపద్యములని, తన వ్యాసంలోనే 31 పద్యాలను వ్యాఖ్యానించారు. కానిమిగతా 69 పద్యాలను వారేచూపిముగిస్తేబాగుండేది. వేమనను బట్టి అతని శిష్యులు వేమన పరంపరగా ఏర్పడుతూ వేలకొలది పద్యాలు చేర్చా రన్నారు. వేమన్నను బ్రాహ్మణునిగా చేయ యత్నించడం వేమన గొప్పతనానికి తార్కాణం కదా ! విశ్వబ్రాహ్మణు డనడానికి కూడ అర్థసౌకర్యం, యితరాంశాలూ వున్నా అంతపని చెయ్యకపోవడం విశేషమే. వేమన ముందొక ట్రాజిక్ హీరోగా అభిరామయ్యను నిలుపుకోవడమే వారికి చాలు ననుకొంటాను.

అభిరామయ్యను ఆహ్వానించే చారిత్రక పరిశోధకులే ఒకరున్నారు. వారు ఇం కొక అర్థవిన్యాసం జోడించారుదీనికి. "విశ్వదుడైన అభిరామా వేమన్నను విను, సమస్తమును నాకిచ్చివేసిన అభిరామయ్యా! వేమన్న చెప్పేదివిను" అని (ఏకవచన క్రియమీద బహువచన భారం వెయ్యకుండా) డా॥ C V. Ramachandra Rao** అర్థం చెప్పారు. క్రియావాచకాన్ని అణగారిపోకుండా కాపాడారు; బాగానే వుంది. కాని 'వేమ' సంబోధనా రూపంకాకుండా పోవాలి. "వినురవేమ"లో 'వేమ' సంబోధన కాదంటే కుదురుతుందా? "వినుర వేమా" కాదు, "వినురా వేమనను" అంటున్నారు వీరు. అందుకు తెనుగుఒప్పుకోదు. అటువంటిమాట చెప్పుకోవాలంటే, 'విశ్వదాభిరామ వినురవేము'నని విధిగా చెప్పుకోవలసిందే. ముఖ్యటం అర్థం గాకుండా, వీరు చెప్పిన యితర కథ గూర్చి యీ పుస్తకంలోనే "అతని జీవిత రేఖలు"లో చూడవచ్చు షణ్మతాల్లో సౌరగాణాపత్యాలకు బదులు జైనచార్వాకాలను జ్ఞాపకం దెచ్చుకొని లిస్టు పూరించగల చరిత్ర శోధకులు వీరు !

రెండుసంబోధనల బరువుమొయ్యలేనుమొర్రో అంటున్న వినురఅనేక్రియా రూపం మీద మూడుసంబోధనల బరువు ఎత్తుతున్నవారు కూడ కానవస్తున్నారు. వేశ్యఅయిన

---

* 'వేమన విషయమేమి' ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక.

** 'A. K. Coomaraswamy & other Cultural Causerie'—(1980)

ఓ విశ్వదా! ఓ అభిరామా! ఓ వేమా! వినండి మీ ముగ్గురూ అంటూ విడివిడిగా పేరు పేరున ఎదుటవున్నట్టుగా సంబోధించి చూపుతూ అభినయిస్తూ ఏక వచనక్రియ మీద ముగ్గురి బరువు వేస్తున్నారు. వాక్యం అందుకు అంగీకరించదు

సర్వసామాన్యాంగీకారం పొందిన అర్థమని (Generally accepted meaning) ఇంగ్లీషు పాఠకులకు (Vemana - Foreword P. 10) నార్ల వారొక అర్థం యిచ్చారు : Hark ! O Vema the delighter of the world అని, విశ్వాభిరామ అంటే అర్థంయిదే. కాని, మకుటంలో వున్నది, 'విశ్వదాభిరామ', అని. విశ్వదాభిరామ అంటే అర్థం యిది ఎంతమాత్రమూ కాదు. ఎవ్వరూ ఆలాగున అర్థం చెప్పలేదు. చెప్పలేము.

సంస్కృతానువాదంలో 'వేమ, విశ్వద' అని మకుటంయిచ్చారు. కావాలంటే దానికి వేమన ప్రకారంగా అర్థం చెప్పుకొనేందుకు దారివుంది. అంటే అభిరామ శబ్దం లేకుండానే, (అలేనిది మళ్ళీవేశ్యానామకంగాకుండానే)కొంత అటువంటిఅర్థసౌలభ్యం వున్నది.వారెంత మేర ఊహించి "వేమవిశ్వద"తో ఆగినారోతెలియదు. తత్త్వార్థంగా నేనుచెప్పినదే కొంత ఉభయ దశానుగతంగానూ చెప్పడానికి కుదురుతుంది.

* * *

## మాలపల్లి నవల,ధర్మకన్నాలు-వేమన

ఈ మధ్య — అంటే ఆగస్టు 1980లో —— బంగోరె మా యింటికి వచ్చినప్పుడు వేమనను గురించి ముచ్చటిస్తూండగా మధ్యలో ఉన్నవవారి మాలపల్లి ఊసుదెచ్చారు. 'దాన్నెందుకు నిషేధించారో కూపీదీసి ఒక పుస్తకం వేశాను, చూశారా, అంటే చూడలేదన్నాను. 'అయితే చెప్పండి, ఎందుకు నిషేధించి, వుండొచ్చో వూహించి — తర్వాత నేను చెప్తానుగాని' అన్నారు.

మాలపల్లి నవలపై నిషేధం మాటే నిజానికి నేనెరగను. అలాగు వినలేదు ఇదివరకు. "జగ్గడి ధర్మకన్నాల సిద్ధాంతం వుందికదా ప్రళయంకరంగా —— కమ్యూనిజానికది త్రోవ చూపుతుందని భయపడొచ్చు —— ఇప్పుడయితే నక్సలిజంగానే పామేయొచ్చును" — అన్నాను.

"సరే, అలాగంటే ఉన్నవ వారేమన్నారో ప్రభుత్వంతో, తెలుసా అండీ! అది రష్యానుండి వచ్చిందిగాదు, మా సంప్రదాయంలోవుంది, సనాతనంగా వుంది అన్నారు సుమండీ, బుర్రకథలో సంగతుల్ని గూర్చి, చూశారా" అన్నారు.

నవ్వి నేనో విషయం చెప్పాను. విశ్వనాథవారి 'వేయిపడగల్నీ', ఉన్నవ

వారి 'మాలపల్లి'నీ పోలికబెట్టి మాట్లాడుమనిఒకప్పుడు (1965లో) గుడివాడవారు పిలిస్తే అప్పుడిదే విషయం విస్తరించానన్నాను. వారిద్దరూ మన సంస్కృతి నుండి చెటియొక సంప్రదాయాన్ని ఎత్తుకొన్నారు. ఇప్పటి భారతదేశం ఇందులో దేన్ని తీసుకొంటుందో చూస్తాము—చూస్తున్నాము. అందులో ఉన్నవవారు ఒకే లక్ష్యానికి గల రెండుదార్లనీ సంప్రదాయగతం, దేశీయం చెయ్యడానికి చాల ప్రయాసపడ్డారు. అయితే అవి రెండూ మతపు మార్గాలుగానే వున్నై—సమస్య మాత్రం ఆర్థికం ..., అంటూ ఉపన్యసించానండీ, అన్నాను.

జగ్గడి ధర్మకన్నాల సిద్ధాంతానికి గురువర్గుగా ఉన్నవవారు పేర్కొన్నవారిలో వేమన ఉన్నాడనుకొనే ఉపన్యసించాను. రాళ్ళపల్లివారు ఉట్టంకించిన వేమన పద్యాలు ఇంటరునుండి వెంటాడుతూనే వున్నై. అటువంటి సిద్ధాంతమేదో వేమనలో వున్నట్లు మనసుకు పట్టేసి వుంది. ఆ పద్యాలే చదివాననుకొంటాను గుడివాడసభలో.

బంగోరె ప్రస్తావనను ఒక్క జగ్గడి మీదికే మళ్ళించి, ఇలా మాట్లాడి ఆయన వెళ్ళిపోయిన తర్వాత మాలపల్లి నవలనీ, దానిమీద ప్రభుత్వ నిషేధాలు అన్న బంగోరె రచననీ తెప్పించుకొని చూచాను. తీరా చూస్తే ఏముందీ ! ఉన్నవ వారసలు తక్కెళ్ళపాటి జగ్గడి 'ధర్మకన్నాల' సింద్ధాంతగురుపరంపరలో వేమనను చేర్చి చెప్పలేదని తెలుసుకోవాల్సి వచ్చి విభ్రాంతుణ్ణయ్యాను.

## మతస్థులదొంగతనాలు - వేమన, సర్వాయి పాపన్నలు

ఉన్నవ వారిచ్చిన గురుపరంపర జాబితా : తిరుమంగైయాళ్వారు, కంచెర్ల గోపన్న, సర్వాయి పాపన్న. పోతే జగ్గడి ప్రత్యక్ష గురువు గరిమెళ్ళ గంగరాజు. ఇంతే, యీ నాల్గుపేర్లే నవలలో వున్నై. కన్నద బ్రహ్మయ్య అనే వీరశైవ చోర పురుషుని పేరూ లేదు. సరే, వేమన పేరు లేనేలేదు. ఇందులో నిజంగా పేదలకోసం వేసే ధర్మకన్నాల సిద్ధాంతానికి గురుస్థానంగా అన్వయించే పేరే వేమనది. సర్వాయి పాపడు కలవాళ్ళనికొట్టి పేదలకు పెట్టాలని ప్రారంభించినవాడు. అతడే కలవాడు. కాని గోలకొండమీదకన్నుపడి ది. గోలకొండ కొట్టి ఎందుకూ గాకుండా కూలిపో యాడు. ఒకక్షణప్రభ ఖజానాతెరచి పేదలకు పంచిన ఏడుదినాల ఏలిక. తురక నేస్తుల్ని చాకలి మంగలి కుమ్మరి కమ్మరి వృత్తుల వాళ్ళనీ, నెల్లూరి హను మంతునీ వేసుకొని చరిత్రతెరమీద జిగేల్మని మెరసి మాయమైనవాడు. చదువు సం స్కారం లేకుండా ఇంతమాత్రానికే ఆర్థిక విషయ విచారకుడు అనిపిం

ఇంతమాత్రం చెయ్యడానికి, చెప్పడానికి ఉద్రేక హృదయం మాత్రం ఉంటే సరిపోదా ? అంతమాత్రం వాడిగానే వేమన వాసనలో వుండేవాడు. గుడివాడ ఉపన్యాసం నాటికి, మాలపల్లి సంగతులతో కలసిపోయి నాలో అతడు మెదిలినంత వరకు అతడంత మాత్రంవాడే నాలో. కాని సర్వాయిపాపడికి ప్రేరణ వేమన సంప్రదాయమే కాదుగదా ! పరిశోధన నిర్ణయించాలి.

కాని తిరుమంగై యాళ్వారునీ, కంచెర్ల గోపన్ననీ, ఘరక్కన్నాల సిద్ధాంతానికీ ఉన్నవవారు కర్తలుగా చెప్పడం మాత్రం అన్యాయం—వేమన్నని కుల నిర్మూలనా ప్రవక్తల పొడుగైన జాబితాలో ఒకానొకడుగా చూపవలసినంతకే ప్రాధాన్యం యిచ్చి సభలోకి తేవడం దురదృష్టమే. రాళ్లపల్లే నయం యీ విషయంలో. ఆ వైష్ణవస్వాముల సమస్య ఆర్థికం కాదు—పేదలకు పంచడం కాదు—గుడిగోపురాలకు అయ్యవార్ల సత్కారాలకు అపమార్గం త్రొక్కినవాళ్లు వారు. కన్నద బ్రహ్మయ్య కన్నాలు వేసింది జంగాల కడుపు చల్లజెయ్యడానికే. అందుకే రాళ్లపల్లి తమ మతస్థులకన్న వేమన విశాలాశయం కలవాడన్నాడు. మంచిమాట. ఉన్నవవారీ భేదం గమనించలేదు. వారికీ విషయంలో వేమన లేకపోయినా, పాపడున్నాడుగదా ! వేమనకు మతపు తొడుగున్నది. అతడు మనవారికి యోగివేమనగదా ! పాపడికి మతపు యూనిఫారంగాని, ముద్రలుగాని ఏమీలేవు. ఉన్నవవారు పాపడి ప్రతిబింబంగానే జగ్గణ్ణి తయారుచేసి వుంటారు. కాని యీ సిద్ధాంతమంతటికీ మతపుపూత పూశారు. కాని అది పైపూతేయని తెలిసిపోతూ వుంటుంది జగ్గడిలో. నల్లమల అడవిలో తెల్లదొరల మీద కలియబడినప్పుడు 'హరహరమహాదేవ్' అన్నా, కావి కపిధ్వజం ఎత్తినా జగ్గడి ఉద్యమానికి మత సహజమైన మానమర్యాదలు లభించలేదు.

## మతం మొయ్యలేని ఆర్థిక బరువు

ఇక్కడో విషయం స్పష్టం చెయ్యాలి. శుద్ధమైన ఆర్థిక సిద్ధాంతం మతాలు మొయ్యగలిగిన బరువుగాదు. దిగువవర్గాల కనుకూల సిద్ధాంతమయితేనేగాదు, ఎగువ వర్గాలకు అనుకూలమైన దానినైనాసరే ఆర్థిక సిద్ధాంతంగా మతాలు మొయ్యలేవు. అయినా మతాలు పరోక్షంగానే మోస్తవి. పరోక్షరీతిన మోస్తాయి. అచ్చమైన ఆర్థిక దినుసును మోస్తే అవిమతాలుగా బ్రతకలేవు. కులభేదం మీద ఆచార విశ్వాసాల మీద చివరకు దేవుడిమీద దాడినికూడ మతం మొయ్యగలిగిన బరువే.

అలామతాలు మోస్తూ వచ్చినై యీ దేశంలో ఎప్పణ్ణుంచో. ఇక్కడ నాస్తికత్వం కూడ మతరూపధారణం చేసివుంది. మతం మోయలేనన్న బరువు మాత్రం ఒక్క ఆర్థిక సిద్ధాంతమే. అందులోనూ అణగువర్గాల కనుకూల సిద్ధాంతాన్ని పరీమొయ్య లేదు. మరి వేమనను యోగి అనుకొంటున్నదిగదా లోకం. మతరూపంలోగదా అతన్ని లోకం దర్శించింది. అందులో నివృత్తిమార్గంలో వాడని అవగాహన చేసుకొన్నది. 'యోగి'వేమనలోఆర్థికభావ వ్యవస్థ అనూహ్యం_అనుకోలేని విషయం. అశించని నిధి, నిక్షేపం. అందుకే అతనిలోని ఆ కోణం అంతుబట్టకుండా పోయింది. అజలోకి రాకుండా మిగిలిపోయింది.

అందుకే ఉన్నవ కానలేదు_ఆయన కానవలసినవాడు. కానవలసిన వార్ల కానలేదు. సరిగాకానలేదు. బయటివారిపాటి కానలేదు. ఇట్టే పసికట్టగల జి.వి.కె.అసలు కానలేదు. ఆరుద్ర తన 'వేమన్నవాదం'లోను, వారి ననుసరించిన డాక్టర్ ఎన్. గోపి తన 'వేమన్నవాదం'లోను వేమన కొన్ని కొన్ని ఆర్థికవిషయ ప్రస్తావనలను ఎడాపెడప తీసుకొని అంకొరగా వ్యాఖ్యానించసాగి కొంత నయమనిపించారు. వారు వేమనను ఒక ఆర్థికవ్యవస్థాద్రష్టగా, ఆర్థిక మానవతా నిర్దేశకునిగా, ఒక గొప్ప ఆర్థిక వివేచకునిగా అర్థంచేసుకొన్నవారు కారు; అలాగని చెప్పినవారుకారు. కనీసం అతనిలో సంఘ ఆర్థిక చేతన పెద్దభాగమని, అతని జీవిత పరిణామంలో అదొక పెద్ద కారణమని కూడా గ్రహణగలిగి వ్రాసినవారు కాకపోయారు. అతడు గట్టిగా విచారించిన ఆర్థిక సమస్యల్ని గుర్తెరుగను కూడ గుర్తెరుగలేదని చెప్ప వలసి వస్తున్నది.

## వావిళ్ళవారి అర్థపద్ధతి చూచికూడా కానలేదు :

వేమన ఆర్థిక సమస్యా వివేచనను తెచ్చి ఒక్కచోటికి ప్రోవుచేసి చూపడం గత శతాబ్దం నుండే వున్నది. విషయాన్నిబట్టి శీర్షికలు పెట్టి వేమన పద్యాలను విభజించి అతని భావశ్రేణిని వెంటనే తెలిసేట్టు చెయ్యడంలో 1897లో త్రి॥ పార్థసారధి అయ్యవారు చేసిన యత్నం ఇప్పటివాటితో పోల్చినా నాణెమైన యత్నమే. నిన్నమొన్నే చూచాను, పార్థసారధి పరిష్కరణతో 1800 పద్యాలు గల పమ్మిత్యాగరాయచెట్టి ప్రచురణ. 1917 లగాయితు వావిళ్లవారు భర్తృహరి సుభాషితాల విభజన పరిభాషతో వేమన పద్యాలను ఒకచోట చూపారు. కొంతై

అరింటిని చూపారు. పరోకరు నూటపదకొండుచేశారు. ఈ ఆర్థికాంశాల సంకలనాల నుండి తీసివేయాల్సినవికొన్ని, చేర్చవలసినవి మరెన్నోవున్నై. వాని యన్నిటినుండీ పిండితీయాల్సిన వేమన ఆర్థికసిద్ధాంతం రూపురేఖలయినా చక్కగా ఏర్పరచినవారింత వరకు లేరనే చెప్పాలి. అంత సంకలనం ఇంతకాలంగా జనకళ్యమందుండగా వేమన ఆర్థిక భావాలకు తగినంత ప్రాధాన్యం రాకపోవడం దారుణమే. వేమన్న వేదం, వాదం అన్నవాటిల్లో అయినా ఆర్థిక విషయంగా కొత్తపద్యాలు ప్రత్యేక ప్రాధాన్యం గలవి పెద్దగా సంకలితంగాలేదు, వ్యాఖ్యా వివరణాల బాగోగులమాట తర్వాత విషయం. వీరిచే కొత్తగా వ్యాఖ్యాతమైనపాటివి, పూర్వసంకలితాల పాటివిఅన్నీ పోగుజేస్తే మున్నూరు పద్యాలైనా ఆర్థికాంశం క్రిందికి వస్తాయి. అస్పష్టపాఠాలను అనియతార్థాలను అన్వయావ్యవస్థితాలను అభిమతార్థికార్థాలకై ఆయాస పెట్టకుండానే ఇన్నూరింటికి తగ్గకుండా చూపుకోవచ్చు.

## బయటి వారేనయం :

ఆర్థిక సమస్య మీద వేమనచేసిన వివేచనా విచారణలు, చెప్పిన పరిష్కారాలు తెలుగునాటి పరిశోధకులనుకన్న ఎక్కువగాఇతరభాషా ప్రాంతీయపండితులనే, పరిశోధకులనే ఆకర్షించినట్టు కన్పిస్తున్నది. 1950 సరికే మనవారికన్న యితరులు ఎంతోఅధికంగా వేమనలో ఆర్థిక సమస్యా ప్రాధాన్యాన్ని కనిపెట్టారు.వినయకుమార్ సర్కారును నార్ల వారు ఉదాహరించారు. In his sarcasm on the inequalities of material possession, he is no less radical and realist than in his invectives against the disabilities engendered by caste distinctions......

(Page 67, Vemana)

డాక్టరు ఎం.శ్వ్యరత్నం Saint Vemana: His Philosophyఅనే ఆంగ్లగ్రంథం 1950లో హైద్రాబాదు తెలుగుభాషా సమితి తరపున వేశారు. దాన్ని తెనిగించి ఉస్మానియా విశ్వవిద్యాలయంలో పాఠ్యగ్రంథం •చేశారట. తెలిసితెప్పించి చూచి వ్రాస్తున్నాను. అందులో ప్రత్యేకించి ఒక పెద్ద అధ్యాయమే వేమన ఆర్థిక విచారణగూర్చి కేటాయించారు. దానిలో వారేమి చెప్పారనే దానికంటె వారు దానికిచ్చిన ప్రాముఖ్యం గమనించవలసి వున్నది. మన వారితోపోల్చితే, ఎవ్వరికన్న

• తెనాలి ఓరియంట్ పబ్లిషింగు కంపెనీ

లోతుగానే విస్తృతంగా విషయవివేచన చేశారు. నార్ల వారినుండి ఆశించదగిన విశేష పరిశీలన, ప్రాధాన్యం ఏమీ వేమన ఆర్థికదృష్టి విషయంగా రాలేదు. యావద్భారతానికి వేమనను చూపదలచిన రచనలో ఇదొక పెద్ద వైఫల్యం.

## వేమనార్యుని ఆర్థిక ప్రస్థానం

కులంకన్న గుణం ప్రధానమనేమాటనుపూర్వ,నవీన సంస్కర్తలందరూ సామెతపాటిజేశారు. దానికి బదులు వేమనలో కులముకన్న కలిమి ప్రధానము అనే మాట పదేపదే వినిపిస్తుంది: పల్లవిలా తగుల్తుంది. గుణం ప్రధానమనే మాట అతనిలో అణగారిపోయింది. 'ధనమూలమిదం జగత్' అన్నది మనలో అనాది స్ఫురణే. అయినా దాని మౌలికత్వం మన పూర్వులెవ్వరికన్న వేమనకే అంతు బట్టింది. కులసమస్యకన్న ఆ కులనిర్మూలకుడికి కలిమిలేముల సమస్యే విషయమని విషమమనితోచింది. కులఘర్షణకన్న సంఘంలో ఆర్థికఘర్షణే అధికంగా వుందని, అదేసాంఘిక స్నిగ్ధతకు ముఖ్యవ్యాఘాతంగా వుందని వేమన గ్రహణ. కన్ను పోయినవాడు కాళ్లుపోయినవాడు ఒకరి కొకరై నడచినట్లుగా పేదాపేదా పెనవేసు కొన్నట్లు కూడుకొని కలవాళ్లను దంటగించుకొంటున్నారు. ఈర్ష్యాద్వేషాలతో చూస్తున్నారు. ఈ ఎచ్చుతగ్గు లేప్పడటమే సంఘానికి హాని అనుకొన్నాడు. ఆర్థిక సమస్యను, సంఘ ఆర్థిక వ్యవస్థను గూర్చి సాకల్యంగా విచారించాలనుకొన్నాడు.

దారిద్ర్యం మానుష గుణసంపత్తి నెలా క్రుంగదీస్తుందో, వ్యక్తిత్వ హారకం ఎలాగవుతుందో సూక్ష్మేక్షికతో చూచి చెప్పుకొన్నాడు. ష్మశీ ధనవత్తత మానవత్వానికి ఎంత చెరుపో, కానరాని బాధలకెంత నిలయమో అజదీసుకొన్నాడు. దనం తల్లిపిల్లలకే తగవులు పుట్టిస్తుందన్నమాటను విచారిస్తాడు. ధనమేఅసలు పీడ అన్నమాటను చూస్తాడు. గ సలేద గడచుట ఎట్లురా అంటాడు. మనిషి మనిషిగా–మనిషి అనే అర్థంలో–నిలబ–డానికి ఒకపరిమితిలోధనం, సొంతఆస్తి తప్పకుండా అవసరమంటాడు. మితమైన ధనం, ఆస్తి మానుషగుణ వర్ధకమని తేల్చుకొంటాడు

గడనతప్పదు. అయితే తప్పుగా గడించరాదు. యాచనజేసి బ్రతుకరాదు. గ్రోపలుగొట్టి బ్రతుకరాదు. అప్పుజేసి బ్రతుకరాదు. అప్పెబెట్టి బ్రతుకరాదు. తాత ఎంర్ముల పాపసత్వపు ఆస్తిమీదే బ్రతుకరాదు. పెట్టిచెయ్యటంతప్పు. పెట్టిచేయించు

కోవటం తప్పు. దొడ్డవారమని జనుల నంటగట్టి, దండుగలు విధించి గుంజటం తప్పు. వాగులుకట్టి, వల్లకాళ్లదున్ని, పుంతలు గదుముకొని, గోభూములు ఆక్రమించుకొని ఆర్జన చేయటం తప్పు. తాకట్టు సొమ్ములను వాడుకొనటం తప్పు. తాకట్టిడిన ఆస్తిని హక్కు భుక్తం చేసుకోవటం తప్పు. చెడి అమ్ముకొను వేళ హీనక్రయం పొందరాదు. పొందినా చెల్లరాదు. సరిహద్దులు గదుముకోరాదు. గడతో త్రాడుతో యితరంతో దొంగకొలతలు, దొంగతూనికలు చెయ్యరాదు. ఇవన్నీ కలుషతార్జితాలు.

గడనకు కాయకష్టమే సూత్రము. బ్రతుకు పోసుకొనుటకే గాదు. మిగిలి గడించుటకు శ్రమించవలసినదే. కలవాడుకూడ శ్రమమానరాదు. కలిగి కాయ కష్టం చేసేవాణ్ణి చులకనగా చూడరాదు. తాతతండ్రి సొమ్ము తాదింటూ సొంత శ్రమ, సొంత గడన లేకుండటం హీనాతిహీనం. ఆస్తి పరంపరా సంక్రమణ ఉండరాదు. పిత్రార్జితమ్ మధ్యమమ్ అన్న మెతకమాటను త్రోసేసి, స్వార్జితమ్ ఉత్తమమ్ విత్తమ్ అన్నమాటను 'విత్తమ్ స్వార్జితమేవ భోగ్యం' అని సవరించిన ఆర్థిక ప్రవక్త. స్వశ్రమ స్వార్జన అతని ఆర్థిక మతబోధ. పరులశ్రమను, పరుల యిస్తువును, ఆస్తిని పరులశ్రమఫలాన్ని కాజేయటం నేరం. కాయకష్టంజేసి, గడించి, అనుభవించి, మిగిలించి, అయిననాడు లేనిబడుగులకు పెట్టగలగాలని మనిషి లక్షించా లంటాడు. 'కాయకవే కైలాస' అన్నది కన్నడ వీరశైవులమాట. అదెంతగా వేమన ఆలోచనకు ప్రేరణ మోమరి.

## తిండితోనే చక్కబడదు :

ఆకలి ఆత్యయిక పరిస్థితి. అవశ్యం తీర్చాల్సింది. ఆ కొన్న అతిథి శివుడు. అన్నదానము గృహస్థవిధి. అన్న సమస్య గొప్పదికాదు. ఉదరబాధ సంఘం తీర్చలేనంత గడ్డుసమస్యకాదు. కరువులోనే అది సమస్య. కరువునైనా తట్టుకొనడం సంఘానికి మీరినపనిగాదు. కడుపురాతిలో కప్పకు నిండుతున్నది. అదొక గొప్ప మాటగాదు. తిండితోనే సర్వం సరిగాదు. పేదరికం తిండి సమస్యతో సమానం కాదు. పేదిరికం సమస్య చాలపెద్దది. అందులో ఆకలి చిన్నభాగం. పేదరికం మనిషి మానానికి సంబంధించింది. అన్నంమనిషిని జంతుస్థాయిలో ప్రాణంతో నిల బెట్టటం వరకే. ప్రాణాలతో నిలిచిన ద్విపాద జంతువు మానుషమానంతో, మానవ

త్వపు విలువలునిండి బ్రతికే సమస్యయే అతనికి పేదరికం సమస్య. పేదను శవంగా చూస్తారనియీశ్వరునికే అనుభవమయిందనీ దక్షాధ్వరంలో యింటిఅల్లుడికే తాను నిరుపేద కావడాన ఆహ్వానం లేకపోయినదనీ, అతణ్ణిబిచ్చగాడని పరిహసించి, ఆలేనివానిని చుల కనజేసి అధ్వరధ్వంసం కొనితెచ్చుకొన్న పురాణగాథని స్మరణకుతెస్తాడు. పేదరికం మానవుణ్ణి మానవునిగా పరిగణించడానికి సంబంధించిన సమస్యగా జూచాడువేమన. మనుజులందఱకునుమాన మొకటిఅన్నమాట ఆర్థికవ్యత్యాసంచేత భంగించబడుతున్న దని కనుగొన్నాడు. లేమిచేత ఘనతదప్పి, ధైర్యము చిక్కక, నిజమాడలేక, తెలివి తగ్గి, తలపుకగ్గి, గుణములుచెడి, తాల్మితూలి, విద్య నిలువక, గొప్పలేనిబుద్ధియై వ్యక్తికి గణుతి గౌరవములు లేకపోయి–ఒక్కమాటలో మానవత్వము లుప్తమై పోవటమన్నదే సమస్యలకు సమస్య అని వేమన నిర్ధారణ.

## ఆర్థిక మాధ్యమికం

ఆ మానుష ప్రతిపత్తిని నిలుపుటకు మధ్యతరగతి మర్యాద సంసారి తనము వేమన నిర్దేశము. అప్పులేనివాడు అధికబలాఢ్యుడు, దానమడుగకున్న పైప సముడు–చింతలేని ఉపస్థితిచెడిపోనిసంపద–చద్ది మిగులు సంసారమై పరులకుపప్పుతో బెట్టగలిగి, నేయితో గొంతు దిగునట్లుగా, కూరతోకూడ తానుతినగలిగి మారుగలిగిన తిండికినోచిన ఆర్థికస్థితి నతడువ్యక్తికి నిర్దేశించాడు. కలిమిలేములు రెండూమానవతా గుణధ్వంసకాలనిచూపి, మానవ విలువల నిలువరం కొరకు ఆర్థికంగా మధ్యమ ప్రతిపత్తుసంఘవ్యవస్థ గావలసివుంటుందని దర్శించినఆర్థికద్రష్ట, ప్రవక్త వేమన.

---

• ఇక్కడ గట్టుప్రభువు కుచేలోపాఖ్యానాన్ని వేమన ఆర్థిక భావాలతో పైపారీవెయ్యడానికి చూడమంటాను. అతనిదీఒక వార్తాకవిత్వమే–అన్నీలోకోక్తులే–సంస్కృత లోకోక్తులు. కుచేలుని దారిద్ర్యం సందర్భంగా కలిమిలేముల మంచి చెడ్డలు, అందులో కర్మవాద ప్రసక్తి, దానయాచనలు మొదలైన ఆర్థిక సమస్యల చర్చ ఆ ప్రబంధంలో చాలవుంది. దారిద్ర్య బాధపడలేక ధనంకొరకు కృష్ణుణ్ణి దర్శించి, సిరిసంపదలను వెక్కసంగాపొంది, వాని నపారంగా అనుభవించి మొకం గొట్టి, అంపలి బాధలు తెలిసి, కడపటికి 'దరిద్రతపాటియే సిరుల్'–(III–53)అని ప్రకటించి, ఇచ్చిన సిరుల్ని తిరిగి తీసేసుకొనిదేవుణ్ణి దరిద్రమేయిమ్మని వేడుకొన్న దృష్టికీ–వేమన దృష్టికీ సారూప్య వైరూప్యాలను గమనించగలరని మనవి.

# ఆర్థిక పునర్వ్యవస్థీకరణ: కన్యాశుల్క వరదక్షిణలు

అందుకుగాను సంఘంలో ఆర్థిక పునర్వ్యవస్థీకరణకు వివాహం ఒక సాధనంగా చూచాడు. వివాహ సంస్కరణం చెప్పాడు. కన్యాశుల్కం అంత్య జాత్యాది బ్రాహ్మణపర్యంతం అనాడుండటం గమనించుకొన్నాడు. లేనివానికి పెండ్లి కావటం ఎంతోకష్టమై పోతున్నస్థితిని చూచాడు. కలిగినవాడే కన్యాశుల్కం కావలసినంతగా యిచ్చి పెళ్లిమీదపెళ్లి, కన్నెపిల్లల్ని మరీపెళ్లి జేసుకొంటున్నాడు. వృద్ధులు ముద్దరాండ్రను పెళ్లాడుతున్నారు. ప్రేమలులేని పెళ్లిళ్లు కన్యాశుల్కంవల్ల జరిగిపోతున్నాయి. అందుకని కలవారి ఆడపిల్లల్ని 'వరదక్షిణ'నిరుపేదలైని మగపిల్లలికి ఇవ్వవలసిందని,లేనివారి ఆడపిల్లలను కలవాళ్ల మగపిల్లలు చేసుకోవాలని,మనువులు కలిమిలేముల మధ్యనే జరగాలని, కలవారు కలవారితోనే మనువులు చేసుకోరాదనీ, కూతుండ్రను క్రయమివ్వడం కూతురును చుట్టడం వంటిదని, కన్యాక్రయం చెయ్యరాదని చెవినిల్లు గట్టుకొని చెప్పాడు వేమన్న.

గురజాడ అప్పారావు కన్యాశుల్కాన్ని కాదనడంలో ఆర్థికసంస్కరణ దృష్టిశూన్యం. గురజాడకు రెండున్నర మూడుశతాబ్దాల ముందున్న వేమనయొక్క కన్యాక్రయ నిరసనంలో గురజాడవారి నవీన సంస్కరణ కారణాలన్నీవుండి, ఆ సాంఘిక హార్దిక కారణాలకు తోడుగా పునాదిగా అసలు ఆర్థికవ్యవస్థా స్వరూపానికి సంబంధించిన మహత్తర కారణాధిక్యం వున్నది. గురజాడవారి సంస్కరణలన్నీ వేమనలో వున్నవే. ఆర్థిక వ్యత్యాసాలు తగ్గి సంఘంలో మొత్తంగా మధ్యతరగతి ఆవిష్కృతం కావాలని అతని ప్రణాళిక. అది అతని తత్త్వవ్యవస్థకు అనుగతం. ఆ ఆర్థిక వ్యవస్థకు యీ వివాహ వ్యవస్థ సంగతం.

ఈ ప్రణాళికలో కలవారిసిరిని లేనివారికి పంచాలని, తనసొమ్మునే పంచడం గొప్పగాదు; పరులసొమ్ములు తన స్వాధీనంలోవుంటే వాటినికూడమరి యితరులకు పేదలకు యివ్వడమే గొప్ప; మోసంచేతగాని, బలాత్కారం చేతగాని, కలవానిధనం స్వాధీనం చేసుకొని లేనివానికి పెట్టమని ఉగ్రమార్గం బోధించాడు. ఉద్యమించాడు. రాజాధికారిగా తన సంస్కరణలు పేదవారి కనుకూలమైన తీర్పులు చెప్పి అమలు జరిపాడు. రాజుతో అతని కొండెగాళ్లతో ధనవంతులతో భేదించి, న్యాయందగ్గర మొరాయించినిల్చి, కొలువు-ఉద్యోగం మానుకొని, రాజాధికారి పంచాయితీలలో విశేష ప్రసిద్ధి పొంది ప్రజల్లోపడి ఉగ్రపంథకు వారిని పురి

కొల్పి పూనికచేసి ఏవోచేసి, చేయించి విఫలమై, రసవాదంనేర్చి, బంగారంచేసి పేద లకు పంచుదామని శివయోగులైన రససిద్ధుల వెంటబడి, అడవులుబట్టి, అదేమంతగా సాధించవీలుగాకపోయి, రకరకాల యోగుల గుంపుల్లో రకరకాల యోగాలు అభ్య సించి, సాధనచేసి,అనుభవంపొంది,తత్త్వసిద్ధాంతాలు సుసూక్ష్మంగా తెలిసి,అందులో ఎంతో పరిణామానికి గురియై వేత్తగా లోకం ముందుకు వచ్చాడు.

## పునర్జన్మ భయం చూపించీ, మోక్షం ఎరవేసీ,...

కలిమి కలగడం పూర్వజన్మ సుకృతం; నేడుకలిగినవాడవైనందుకు దాన ధర్మాలు తగిలిచేసి రాబోయే జన్మలోకూడ కలవాడివిగా పుట్టడానికి యత్నించు; ఈ జన్మలో ఎవరికీ పెట్టకపోతే ముందు జన్మలో కటికిపేదవుగా పుట్టి, పెట్టే వారెవ్వరూ లేక బాధపడతావు. ఇప్పుడుపెట్టి ముందుకూడ పెట్టగలవాడివై పుట్టుమని పునర్జన్మలో పేదజన్మ భయంచూపించి శ్రీమంతుల్ని దానపరులను చెయ్యడానికి యత్నించాడు.మతం కలవారి కావలికి పెంచి పోషించబడుతుందని, మతం ప్రజల పాలిటి మత్తుమందని, మతాల మూఢవిశ్వాసాలు కలవారికి ఉపకరించడానికేనని సూత్రీకరించే మార్క్సిస్టులను వేమన ఆశ్చర్యచకితుల్నిచేసి,ఆలోచనలో పెట్టుతాడు.

వేమన ఆర్థిక సర్వసమత్వ (Equalitarianism) సిద్ధాంతములో వాడుగాడు. కలుషితార్జనము జోలికి పోకుండానే కలిమి కలిసివచ్చి ధనవంతులు కావచ్చునని అట్టి సంపన్నత తప్పులేనిదిగాను భావించినాడు. నిధినిక్షేపములు తగిలి, పరిస్థితులను కూలించి, .... ధనవంతులు కావచ్చును. ఆర్థిక వ్యత్యాసాలు అమితంగా ఉండరా దనటం కన్న, అసలు వ్యత్యాసాలుండనే రాదన్న వాడుకాడు. గడనకు, ధనవత్తతకు మౌలిక వ్యతిరేకత అతనిది గాదు. కలుషితార్జనకు మాత్రం బద్ధవ్యతిరేకి. నీతిగా ధనవంతుడవైనను ముందుజన్మను గూర్చి దాన పరుడవు గమ్మని అతని ఉద్బోధ.

పిసిని గొట్టుతనము నేరమనే అతని భావం. వారిని వేళాకోళము పట్టిన పద్యాలు సాహిత్యపరంగా అనుపమానాలు. ధనము స్వభావమే నిత్యచలనము. గాలి వలెనే ధనము సదాగతి. చేతులు మారటమే దాని లక్షణము అనుభవించబడటమే, నిత్యోపయోగం తప్పకుండటమే దానికి ప్రకృతి సిద్ధమైన లక్షణము.ధనమును మూడు విధములుగా విభజించి వినియోగమున పెట్టవలెను. తన తక్షణానుభవానికి, పరులకు పేదలకు — భవిష్యంలో తనకూ తనవారికీ. ఆర్జనవ్యయం కొరకు, దానం కొరకు.

దాని గమనాన్ని నిరోధించరాదు. కూడబెట్టి, దాచిపెట్టి దానిచలనాన్ని నిరోధించడం తప్పు, నేరం. పిసినివాని దాపరికం సంఘవ్యతిరేకచర్య: ధన స్వభావానికి విరుద్ధమైన చర్య.

ఇటువంటి ఆర్థిక విచార సిద్ధాంతాలతో వేమన కనిపిస్తాడు. రాజువద్ద అధికారిగా ఉన్నప్పుడుగాని, తొలగి ప్రజలలో బడి ఉద్యమించినప్పుడు గాని, కాగి చల్లారి ఉపదేశకుడుగా తిరిగినప్పుడు గాని అతని స్మరణలో పేదరికం బాధేవుంది, పేదరికం పెరికివేయాలన్నదే పుంది. ఆర్థిక మానవత్వమే అతనిలో ప్రాణస్పందన. అతనిలో ఆరని తపన సంఘంలోని ఆర్థిక సమస్య.

## డాక్టర్ గోపి వేమన్నవాదంలో

వేమనలో ఇంత సువ్యవస్థితమైవున్న ఆర్థిక సిద్ధాంతం, మొట్టమొదటి సారిగా వేమన పద్యాలను 'ఆదిభౌతికవాద' నేపథ్యంతో(అదేమిటో నాకు అర్థంగాని విషయంగా వుంది) చూపిన అరుద్రగారి అవగాహనకు రాలేదు. వారి వేమన్న పేదం ఒరవడిలో ['వారికి వేమన్నవాదం యీ మార్గానికి ఒరవడి పెట్టింది.' _వేమన్నవాదం పీఠిక IXవ పేజీ] 'ప్రజాకవి వేమన' థీసిస్‌చేసి డాక్టరేటు పట్టం పొంది వేమన నుండి సిద్ధాంతప్రాముఖ్యం, వాదప్రాధాన్యం వున్నవని తాము కొన్న మేలిపద్యాలను ప్రత్యేకంగా పట్టుకొని ఎంపికజేసి , స్వీయవ్యాఖ్యతో 'వేమన్నవాదం'గా కూర్చిన డా॥ ఎన్. గోపిగారి అవగాహనకు అవతలగానే వుండిపోయింది. (ఇన్నూరు మున్నూరు పద్యాలు ఆర్థిక విషయమై వేమనలో వుంటే, అందులోనుండి ఒకపాతిక ఎంచి కూర్చితే,అందులో కూడ ఆర్థికసంబంధంకానివి నాలుగో వంతైనావున్నై-అప్రధానాలు మళ్లీ అన్నివున్నాయి యీ సంకలనంలో).

వేమన ఆర్థికవాదాన్ని నిండుగా తాము కానకపోగా, మార్క్సిస్టుల్లో ఏవర్గమో కోరినట్లుగా కోరినంతగా వేమనలోలేదని, అలా లేకపోవడానికి వేమన క్షమ్యుడని నివేదించే గొంతుకతో 'వేమన ప్రధానంగా తాత్త్వికుడైన కవి', 'సామాజిక దృష్టి ప్రధానంగా వున్న, పదునైన పరిశీలన వున్న కవి. సమకాలికు లెవరూ చూడనంత లోతుగా సంఘాన్ని పరిశీలించాడు. అయితే ఆ చూపుకైనా కొన్ని పరిమితు లుండక తప్పదు' —— "పేదరికానికి మూలకారణం ఆర్థిక వ్యవస్థలో దోపిడీ విధానం అని వేమన గుర్తించనందుకు మనం తప్పు పట్టకూడదు. ధనవంతులు తమ సంపదని పేదవారికి పంచితే పేదరికాన్ని తొలగించవచ్చుని వేమన్న భావించినట్టు

కనిపిస్తుంది. ఈనాటికీ యిట్లాంటి భ్రమలున్నవారు రాజకీయ నాయకుల్లోనే వున్నారు." (వేమన్న వాదం పీఠిక — పేజీ XI)

ధనవంతులు తమ ధనాన్ని పేదలకు పంచిపెట్ట మనడానికి ముందు వేమన ధనికుల్నికొట్టి పేదలకు పెట్టుమని 'ఉగ్రమార్గమో' 'వ్యగ్రమార్గమో' చెప్పాడని, చేశాడని వీరు గుర్తించనే లేదన్నమాట. అందుకే ఆ పీఠికలో వీరిచ్చిన వేమన జీవిత చిత్రం కేవలం స్వార్థకారణ పురస్కృతమైన పరిణామ పర్వంగా సర్వం చిత్రించ బడినట్టుంది. ఈ చిత్రణకు ఒరవడి నార్లవారి చిత్రణం కావచ్చు. స్వకీయ కారణాలే జీవిత పరిణామకారులవుతాయిగాని పరార్థమైన కారణాలు కాజాలవన్నట్టుగా యీలాగున వేమన జీవిత పరిణామ దశలను చిత్రించారు. వీరిద్దరు వినా మరెవ్వరూ ఇలా చిత్రించలేదు. దానధర్మాలు ధనికులు చెయ్యవలెనని భ్రమపడి బోధించలేదు వేమన—తన ఉగ్రమార్గం విఫలమై విధిలేక ఉన్న పరిస్థితులలో అలా చెప్పాడు. మతాన్ని కలుపుకొని భయపెట్టాడు; మోక్షం ఆశ చూపి అలా చెయ్యమన్నాడు.

ఆర్థిక వ్యవస్థలో దోపిడిని చెప్పలేదంటే, నేటి దోపిడీ రూపాలు నాటికేమీ అంతగాలేవు; నాడున్న దోపిడీ రూపాలను గమనించే చెప్పాడు. కలవారి కలుషితాజ్ఞలు చెప్పాడు. వెట్టిని జెప్పాడు. 'ఒకరి నోరుగొట్టి ఒకరు భక్షింతురు'— అన్నాడు. అదంతాగాదు. శ్రమములోను పుట్టు సర్వముతానౌను — [తనువులోన పుట్టుతత్త్వమెల్ల] అనే ఒక పాఠం పట్టుకొని, 'స్వయముగాను పుట్టు సర్వంబుతానౌను' అనే మరొక పాఠాన్ని, తాత్త్విక పాఠాన్ని త్రోసేసి, అసలు తత్త్వార్థమైన పద్యాన్ని శ్రమములోన పుట్టు సర్వము తనదౌను అనేమాటైనా లేకపోయిన పాఠాన్ని,-తానౌను అనివుంటే అన్వయం కుదరదనైనా గమనించకుండా — శ్రమయే సర్వానికీ మూలం అంటూ— Adam Smith and David Ricardo ల నుంచి మార్క్స్ గ్రహించి, పెంపొందించిన Labour Theory of Value ని — [అది వుంటేనే Theory of Surplus Value] వేమన దర్శించాగని ఆ పద్యానికి అర్థం చెప్పిన తర్వాత (దానికి ఒరవడి ఆరుద్ర వేమన్న వేదం), శ్రమించని ఉన్నత వర్గాలు దోపిడీ చెయ్యటం లేదని వేమన అనుకొన్నట్టు వారెలా అనుకోగలరు? ఈ పద్యంలో గాకపోయినా ఆ స్ఫురణ అతనిలో లేదంటారా? లేక, దోపిడీసారమని మార్క్స్ చెప్పిన శ్రమయొక్క అదనపు విలువ సిద్ధాంతం మాట వేమనలో లేదనా యీఅపాలెజెటిక్ ధోరణి? అసలున్నదంతా కానలేక, అనవసరంగా వేమన చేత

మార్క్సిస్టుల్లో కొందరెవ్వరికో అపాలజీ వంటిది చెప్పించడమేగాక, అతని సామాజికమైన చూపు ఎంత లోతుగాపారినా, దానికీ పరిమితులున్నాయని (మార్క్సుకు లేవా ?) వ్రాసి వేమనలో సామాజిక దృష్టి కూడ ప్రధానం కాదనిపించి, ప్రధానంగా తాత్త్వికుడైన కవి వేమన్న అని తేల్చడం 'ప్రజాకవి వేమన' అనితేల్చేపరిశోధనకు గమ్యమేనా ? సంగతమేనా ? అలాగైతే వేమనను 'తాత్త్విక కవి' అనిచెప్పాల్సింది. అతని తత్త్వమేమని చెప్పారో మరి ! దేశకాల పాత్రా లెరుగకుండా ఎప్పటివారి నుండైనా మార్క్సుని, అందులో తామనుకొనే మార్క్సునీ, తమకు కావాల్సిన మార్క్సునే డిమాండు చేసేవారికి సంజాయిషీ చెప్పుకొనే పొరపాటుకులొంగుబాటు ధోరణికి గురై తమ పరిశోధనను మలచు కొంటున్నారేమో ఆలోచించుకోవడం అవసరం. అదిగో, అప్పుడే వేమన ప్రజాకవి కాడన్న కంఠం వినబడుతోంది, వినండి.

## వేమన వ్యాపారస్తుల కవి !

'వేమన ప్రజాకవి కాడు. వ్యాపారస్తులకవి· వేమన కవిత్వానికి ప్రధాన ప్రేరణ వర్తక వర్గమే. వర్ణ వ్యవస్థని వ్యతిరేకించటం. పురోహిత సంస్కృతిని పరిహసించటం ఏ వర్గాల ప్రయోజనాలకు దగ్గరగా వుంది ? అని ప్రశ్నించి, వర్తక వర్గాలకు దగ్గరగా వుందని, అయితే ఆ వర్తక వర్గం అప్పుడు ప్రగతి శీలవర్గమే నని... సిద్ధాంతం చేస్తున్నారు.

వీరు వేమన వర్ణ వ్యవస్థను వ్యతిరేకించడం చూస్తున్నారు. పురోహిత సంస్కృతిని అవహేళన చెయ్యడం చూస్తున్నారు. అంతే, అంతవరకే. ఆపైన కానటం లేదు. అతని ఆర్థిక వివేచనను ఆనవాలు పట్టలేదు. అఖిలభారత రంగంమీద అతని ప్రత్యేకత అయిన అతని ఆర్థిక చేతన ఆర్థిక సమస్యా ప్రాధాన్యవాదులకు అగోచర విషయమయింది ! వేమనలో అందరూ చూచినమేరే వారూ చూస్తున్నారు. ఎంతో కాలంగా అందరూ గమనించిన ఆ రెండు విషయాల వరకే అయితే మాత్రం పెట్టుబడిదారీ వర్గానికి కూడా ఉపకరిస్తాయని, కులంమీద పురోహితసంస్కృతిమీద వారే ముందుదాడి ప్రారంభిస్తారని మార్క్సిస్టు పడికట్టు మాట ఒకటి అంటిస్తారు. అదేమంత కష్టమైనపని! ఆర్థికాంశాలు వేమనలో అడుగడుగు నిక్షేపాలుగా ఎంతో పెద్ద రాశిలో ఎంతో విచిత్రమైన విశేషాలు, సూక్ష్మాతి సూక్ష్మమైన పరిశీలనలు కొనవస్తోంటే ఆనవాలు పట్టలేకపోవడమే అన్యాయం.

వేమన ఎక్కడ గాని, ఏ దశలోగాని పేదలకు వ్యతిరేకంగా కలవారిపక్షమై సిద్ధాంతించిన పద్యం ఒక్కగానొక్కటి చెప్పలేదు. పేదరికం ఎన్నడూ అతని స్మరణ నుండి తప్పలేదు. రాచకొలువప్పుడూ పేదలవేపే, ఉగ్రమార్గమూ వాళ్ళకొరకే, కాగి చల్లారి తత్త్వబోధకుడై కలవారిపాలిటికి బూచిగా పునర్జన్మను చూపించడమూ పేదల కొరకే. అతను తప్పుదారిని పడినా పేదలకొరకే. కాదంటే చూపవచ్చు.

ఆనాడు ఏదో ఉవ్వెత్తుగా పెనుతుఫానుగా వర్గ పోరాట మొకటి లేవబోతోంటే ఆ విప్లవాన్ని తప్పించుదామని, ఆగబట్టుదామని ఆలస్యం చేద్దామని కలవాళ్ళని తగిలి, తగిలిదాన ధర్మాలుచేసి విప్లవోపద్రవాన్ని తప్పించుకోండని చెప్పడం కాదుగదా! అతని దానధర్మాల ప్రబోధం విప్లవప్రతీఘాతంగా లేచిందన గలమా? ఈ ప్రశ్నలు ముంచుంచుకొని వేమననొకసారి చదవండి. చదివి, నిజంగా తృప్తిగా వేమన వ్యాపారస్తులకవి అని అనగలగండి—చూద్దాం. అనలేరని నాకు తెలుసు.

అనలేక పోయిన తర్వాత, 14-17శతాబ్దాలలో Commercial Bourgeoisie దక్షిణభారతంలో — అందులోనూతీరానికి దూరంగాదేశం మధ్యలో — పార్వతేయమైనదేశంలో — ఏర్పడిందోలేదో గాని ఆ ప్రశ్న ఇక్కడ అనవసరం. వేరే చర్చించవచ్చు.

## 12వ శతాబ్దం - వీరశైవం, వీరవైష్ణవం —కమర్షియల్ బూర్జువజీ-

కులాన్నీ, పురోహిత సంస్కృతినీ, పెట్టుబడిదారీవర్గమే ఎదురిస్తుందా? 12 వ శతాబ్దంలో వీరశైవం కులాన్నీ పురోహిత సంస్కృతినీ కన్నడ దేశంలో వ్యతిరేకించడం కమ్మర్షియల్ బూర్జువావర్గంయత్నమేనా? వృత్తిపనివారి యత్నంకాదా? వాటిని ఇప్పటి పారిశ్రామిక బూర్జువా వర్గం ఎంతమేర వ్యతిరేకిస్తున్నది ? వేమన వ్యతిరేకత బూర్జువా వర్గాల వ్యతిరేకత వంటిదేనా ? మౌలికమైనభేదంలేదా ? కన్నడ దేశంలో కులంమీద తిరుగుబాటు 12వ శతాబ్దం అరవయ్యోపడిలో వీరశైవం ద్వారా జరుగుతోంటే, ఝించుమించు మరో పదేళ్ళలోగా కులంమీద తిరుగబడుతున్న వీరవైష్ణవంపైన కులాన్ని వెనుకేసుకొనివీరశైవం ఆంధ్రదేశంలోపల్నాటిలో శంఖం పూరించింది. ఈ తారతమ్యం ఏఏవర్గ స్వార్థాల ఘర్షణలో తారతమ్యాన్ని తెలియ జేస్తాయో మార్క్సిస్టులు పరిశీలనచేసి చెప్పవలసి వున్నారు. ఫ్యూడల్‌యుగంలోనే

కుల భేదాలమీద మతాలదాడి ఎందువల్ల జరిగివుందో వివరించుకోవలసివుంటారు, ఆవిశ్లేషకులు. ఇది చోటు కాదుగాని యీ సందర్భంలో చాలాప్రశ్నలున్నాయి. మార్క్సిస్టుచరిత్ర శోధకులంటూవుంటే మనదేశచరిత్రలో మతంవిషయంఆర్థిక విషయంతో ముడిపడిన తీరు వారింకా చెప్పవలసేవున్నారు.

తలకెంత తలంగాని తత్వాన్ని సాధించినా, దాని అసలువాళ్ళంటూ వేమనకు ముందున్నారు. కాని ఆర్థిక సిద్ధాంతంలో అతనికి ముందెవ్వరూ లేరు. అతని తత్త్వం మధ్యమ ప్రతిపత్తు అయినట్లే, అతని ఆర్థిక ప్రాణిదీ మధ్యమ ప్రతిపత్తే. ఇక్కడ వివరాలేమీ ఎత్తిచూపకుండా, E. F Schumaker వ్రాసిన Small is Beautiful అనే గ్రంథంలో Buddhist Economics అన్న అధ్యాయం చదివి వేమనవేపు తిరిగి చూడగలిగితే బాగుంటుందని సూచిస్తున్నాను.

ఆదం స్మిత్ పుట్టుకకు (1723) ముందెప్పుడో, పారిశ్రామిక విప్లవానికి ఇంకెంతోముందు, యుతోపియన్ సోషలిస్టు లనిపించుకొన్న సెయింటు సైమన్, ఓవెన్, ఫోరియర్(1799–1808)ల కంటే మరెంతో పూర్వం, ఇకఫ్రెంచి విప్లవం, మార్క్స్ వగైరాల వూసే తేవద్దు–ఈస్టిండియా కంపెనీ పుటకలకుముందు (1702), School of Political Arithematic (early eighteenth century) భావాల వంటి వేమైనా సయ్యద్‌మహమ్మద్ మీర్జుమ్లావంటి ముస్లిం సైన్యాధిపతులను ముస్లిం వర్తకులను మాత్రం ప్రచలితం చేసే రోజుల్లో, దక్షిణ భారతంలో నౌకా వాణిజ్య కేంద్రాలకు దూరంగా పార్వతేయమైన భూమిలో,వ్యవసాయార్థిక వ్యవస్థ మధ్యంలో వుండి వేమన యింత గాఢంగా, సూక్ష్మంగా ఆర్థిక విచారం చేసినవాడు. అడుగువారి కొరకు బడుగువారికొరకు అప్పుడేఉద్యమించినవాడు. ఇంగ్లాండులో తనకాలంలోవున్న Levellers (1648) వేమనకు సరికారు. భారతదేశ చరిత్ర మొత్తం ఇంత గొప్ప ఆర్థిక విచారకుణ్ణి ఎరుగదు. అతడే అందుకు ఆదిపురుషుడు. ప్రపంచం మాట నేను గట్టిగా చెప్పలేనుగాని అదికూడ చూడవలసిందేనని సవినయంగా మనవి చేస్తున్నాను.

ఆర్థిక సాంఘిక సమూల సంస్కరణానికి, భావ విప్లవానికి పూర్ణమైన పూర్వోదాహరణంలేని మూల పురుషుడైన వేమన్నను జెండామిదికి తీసుకొని, వేమ ధ్వజాంకితంగా విప్లవించడం కార్యకరణీయంగా భావించవలసి యున్నామనుకొంటాను. అందుకు మారుగా, యీ సూత్రీకరణలు* వినరావడం విషాదకరం.

---

* ఇవి త్రిపురనేని మధుసూదనరావు సూత్రీకరణలు · ఇంకావున్నై ఇతరంగా. విరసం మాసపత్రిక సృజన అక్టోబరు, 1980 (108వ) సంచిక.

## వేమన డిమోక్రిటస్ నీతి:

ఆర్థిక విచారం ఇంత చెయ్యడం, ఆర్థిక నీతినింత నిర్దేశించడం ఐహికజీవితానికి వేమన యిచ్చిన ప్రాధాన్యం ఎంతో తార్కాణిస్తాయి. 'ఇహము నందునేమి యిడుమల బడినను, పరము సాధనార్థ పదవి గాదు' — 'ఇహమునందు సుఖము లింపారలేవట, పరమునందు నెట్లు పడయవచ్చు' అంటూ భౌతికవాదిలాగా మాట్లాడుతాడు. 'కామిగాక మోక్షగామికాడు' అని సమర్థించుకొని గతవర్తనను గూర్చి నిర్విచారుడైనవాడు. అయితే భోగపరత్వాన్ని చెప్పినవాడు గాడు.

అతని నీతి సి. పి. బ్రౌన్‌కి గౌరవప్రదమైన భౌతికవాద నీతిలాగా కనిపించింది వేమనది Democritean Ethic అన్నాడతడు. Epicurean Ethic అని అనలేదు. Laughing Philosopher అనిపించుకొన్న ఆ డిమోక్రిటస్ నీతి ఎటువంటిదో Bertrand Russel మాటల్లో వినండి.

In ethics, he considered cheerfulness the goal of life and egarded moderation and culture as best means to its achievement. He disliked everything violoent and passionate. He disapproved of sex, because, he said, it involved the overwhelming of conciousness by pleasure. He valued friendship but thought ill of women. (History of western Philosophy)

స్త్రీ వైముఖ్యంతో సహా డిమోక్రిటస్‌తో వేమనకు పోలికలున్నై. ఇవి గౌరవ భాజనమైన భౌతికవాదతత్త్వనీతి. అందులో (ఇంద్రియ) సౌఖ్యంకంటె వేరుగా ముదిత భావం, తృప్తితోడి సంతోషం (Cheerfulness as distinguished from Pleasure) లక్ష్యంగాను, ఆ లక్ష్యసాధనకు అతి వర్జించి మితమెరుగుమని Moderation చెప్పటం — అనగా మధ్యమ ప్రతిపత్తునే, golden mean చెప్పడమే ఇక్కడ తెలుసుకోవలసిన భావ సారూప్యం.

'సత్యంవద ధర్మంచర' అని అందరూ చెప్పగలట్టు చెప్పి వూరుకోడు వేమన— ఆపద్ధర్మం పేర, కార్య సాధకత్వం పేర మళ్ళీ నీతియొక్క చెరుపు కట్టలు మొత్తం కొట్టివేయమని వాళ్ళలాగే మళ్ళీ చెప్పడు. నిత్యజీవితంలోని మెలికెలమీద కనుకలి గగ్గి మెలకువతో నీతిని ఎలా నిర్వహించాలో స్వైవల్‌లో ఆదర్శవర్తనం

ఎలా ఏ మోతాదులో నిలుపుకోవాలో యోచించి యోజించి చెప్తాడు. మానవనీతి దైవకృతంగాక మానవకృతమే అయినా, అదెంత అవసరమో ఎరిగి చెప్తాడు. "అన్నమైతే నేమిరా సున్నమైతేనేమిరా అందుచేతీ పాడుపొట్టకుసున్న మేవేతాయురా, మేడలైతేనేమిరా కరగోడలైతేనేమిరా అందుచేతామేగనే యీజొందినీవేతామురా..." అంటూ వేదం వెంకటరాయ శాస్త్రిలవారు అద్వైతం మీద (అనుకోని?) పారడీగా 'వెట్టితొట్టి వెంగళప్పా వెట్టి వేదాంతామురా'గా కాకుండా తన ఐహిక నీతికీ తన తత్త్వానికీ విరోధం లేకుండా చెప్పుకోగల్గాడు.

## అతని హేతువాద విశిష్టత :

అతని యోగము హేతువాదము గూర్చి యిప్పటికే చెప్పాను. లోపల చదువు కోమనటంకన్న అధికంగా యిక్కడ చెప్పనక్కరలేదు. అతని హేతువాదం గెలీలియో, బ్రూనో, కోపర్నికస్‌ల వంటి శాస్త్రజ్ఞుల పరిశోధనలు లేకుండా, Renaissance వంటిదేమీ లేకుండా, స్వయం ఆవిర్భవించింది. అతనియోగం శరీర శోషకంగాక, అతిని వర్జించిన మనోనియమనమై, సంసారం కోనూ సాధ్యమైనట్టిది. అది మధ్యమ ప్రతిపత్తును తార్కాణిస్తుందని చెప్పితే సరిపోతుంది. మించి, హేత్వ విరోధంగా యోగ, కళానుభవాలను, విజ్ఞాన శాస్త్రాన్వేషణానుభవాన్ని(సత్యాన్వేషణ) సమీకరణం చేసే ఇతని ధోరణి విషయంలో ఆర్థర్ కోస్లర్ రచన అయిన The Act of Creation ని తప్పక చదవమంటాను. హార్వర్డు యూనివర్సిటీ (అమెరికా) పోస్టు గ్రాడ్యుయేషన్ గేట్లో కాలుపెట్టడానికి యీ పుస్తక జ్ఞానాన్ని విద్యార్థులకు అవసరం చేసింది. ఆధునిక విజ్ఞాన సమన్వయానికి ఇది కనీసపు చదువు

హేతువాదం విషయంలో ఒకమాట చెప్పాలి, మతస్థులందరూ హేతువాదులే. ఇతర మతాల బాహ్యాచారం మీద, మత చిహ్నాలమీద హేతువాదులే. తమ బాహ్యాచారం దగ్గరే హేతువాదులు కాకపోతారు. పాతచిహ్నాలస్థానే కొత్తచిహ్నాలు ప్రవేశపెట్టుతూ, వాని పరిమితుల్ని కానలేక పోతుంటారు. ఆర్యదేవుని చతుశ్శతకంలో వేమన చేసినబాహ్యాచార విమర్శ ఎంతో కనబడుతుంది. కాని ఆ ఆర్యదేవుడు(నాగార్జున శిష్యుడు) మహాయాన బౌద్ధ బాహ్యాచారంలోని వాడే. సృష్టికర్తను తిరస్కరించిన కొందరు మీమాంసకులు వేదాలు అపౌరుషేయాలన్నారు! వేమన హేతువాదానికి అటువంటి పరిమితులులేవు. మతాలూ, ఆధ్యాత్మికతా యిమిడించుకోగలిగి కూడా యిమిడించుకోకుండా మిగిల్చేసిన నిరూపణలేనివిశ్వాసాలనిరసనమాట ఎంతో

వుంది. ఒకప్పుడు జ్యోతిషం యీ దేశంలో నాస్తికత్వం. తర్వాత ఆస్తిక విద్య అయిపోయింది. అటువంటి పరిమితులు లేకుండా ఆధ్యాత్మికతలో పూర్ణమైన హేతు విలసనం నెరపిన వాడు వేమన్న.

జ్యోతిషం, సాముద్రికం, గద్దె, సోదె, ముహూర్తబలం, విధవాదర్శనభయం. నానామృగ పక్షి క్రిమికీట మనుష్యాదుల శకునాల విశ్వాసంమీద దండయాత్రకు మాత్రం వేమనే మొదటివాడు.

జాతి యిప్పటికీ ఆదర్శంగా తీసుకొంటున్న పూర్వ లక్షణికకావ్యపురాణ పురుషులయొక్క శీల వివేచనకు, పురుషార్థ సాధనా పరామర్శకు తలపడిన తొలి మనీషి కూడ వేమన్నే. అదేదో ఎతిమతం కొరకుగాదు, కాదాచిత్కంకాదు. శీలాన్ని, జీవితపు విలువలను దిద్దటం కోసమే. ఉదాహరణకు రాముడు — బంగారులేడి వృత్తాంతం మాటేవుంది. ఆ విషయమై పాఠభేదాలనిపించేపద్యాలు తొమ్మిది, పది వున్నై. అవి పాఠభేదాలనుకొంటే పొరపాటు. భిన్నభిన్నమైన గుణపాఠాలు అయిదా రింటినిఆ కథా చిత్రప్రస్తారంతో నిష్పన్నం చేస్తాడు. చూడండి.

'దైవమైన ధనము తలచుచుండెను గాదె' — 'పొలుపు దప్పిపోవ బుద్ధులు నిలువవు' — 'చేటుగాలమునకు చెడు బుద్ధి పుట్టురా' — 'తలపుకొలదిబడదు దైలు కమేగాని'—'తరముగాని కర్మ మరగితానంటురా'—'తెలివిలేనివాడు దేవుడెట్లాయెరా'. పురాణ పురుషుల, దైవాల చరిత్ర విమర్శనం వేమన ప్రత్యేకత.

## అతని అతివాదం

ఇంతజేసీ అతనివిగా స్థిరపడిన తత్త్వంతో అతకని అహేతుక అతివాదం చివరంటా వున్నదనుకొంటున్నది ఒకటుంది. అదే దిగంబరత్వం. అనేకానేక తత్త్వాల ప్రయోగప్రాయమైన అనుష్ఠానంలో ఒక తత్త్వంలోబడి గోచిపాత కూడ తీసేశాడు. కానిఅలాగే అడివిలో వుండిపోలేదు. నగ్నశివాకారంతో వూళ్ళుచుట్టాడు- మంది ముందుకువచ్చి బోధించాడు. కడవరకు- అంతేనా ? లోకనీతినీ, రీతినీ లోకం వెనుకతత్త్వంతో పొసగే లౌకిక వ్యవహారాన్ని చెప్పుతూకూడ అలవాటు చొప్పున దిగంబరుడుగానే మిగిలిపోయాడా ? దిగంబరత్వం మాధ్యమక శూన్యతా తత్త్వానికి అవసరమయిందికానేకాదు. తిరిగి వేమన బట్టలు ధరించాడని-కావులేకానీండి, కల్యాణ వేషంలోని పసుపుబట్టలే కానీండి, నిర్విశేషంగా సాదాబట్టలే కానీండి- దాఖలా దొరికితే ఉత్తరోత్తర విశేష దశలవుతాయి. సాదా బట్టల్లో నిలిస్తే పెలిస్తే వేషధారి తనంపోయి అందమైన సంగతవుతుంది. ఆ దాఖలాకోసమే మరి.......

ఇక్కడో విశేషం చెప్పాలి. శిశ్నోదర పరాయణమైన జీవితం గడిపి, పాతకాలుపాతుకాలు అనేకానేకం చేసి ఒకానొక నాటికి హృదయ పరివర్తనం పొంది, పశ్చాత్తాపంతో సలసలమని కాగిపోతూ ఆవురు బావురుమని ఏడ్చే భక్తులే భక్తిసాహిత్యంలో వుంటారు. మచ్చుకు మన ధూర్జటి ఏడ్పువినొచ్చు.

వెనుకంజేసిన ఘోర దుర్దశలు భావింపంగ రోతయ్యెడున్
వెనుకన్ముందట వచ్చు దుర్మరణముల్ వీక్షింప భీతయ్యెడున్
ననునే జూచియు నావిధుల్ దలఁచియున్ నాకే భయంబయ్యెడున్
జినకున్ జీఁకటి యయ్యెఁ గాలమునకున్ శ్రీ కాళహస్తీశ్వరా॥

ఆజన్మ బ్రహ్మచారులై ధర్మభ్రంశములేని జీవితంతో లోకంమెప్పొక ప్రక్క పొందుతున్న భక్తుడున్నూ తానేదో పాపినని, పాప భారాన్ని మొయ్యలేక పోతున్నానని క్షమించి రక్షించమని దేవుడి కాళ్ళావేళ్ళాబడుతూస్వఊహాకల్పిత కృతక పాప మహాసంభారం మూట విప్పి ముందర పరచుకొని వైన వైనాలుగా శోకన్నాలు పెట్టి ప్రలాపించడం భక్తిలోవున్న చిద్విలాసం.

వేమన ఇందుకు అపవాదం. కట్టేసుకొన్న తనకట్టుతిరుగుబోతుతనాన్ని గూర్చి కుమిలిపోవటం క్రుంగిపోవటం గొంతెత్తి ఆక్రోశించటం వంటి భక్తిపర్వం లోని అనుభావ వ్యభిచారిభావ సంచారీభావ సంయోగం నెరపలేదు. గతాన్నిగూర్చి చింతాకంతైనా చింతలేదు సరిగదా కామిగాక మోక్షగామికాడు — తిరుగవలయు మనము తిరిగిన యందాక, విరుగవలయు మనముతిరుగునపుడె—(పైగా,) తిరుగ విరుగు వాడె దేవుండు తలపోయ అని స్వసమర్ధన చేసుకొన్నాడు.

ఎన్నెన్ని తత్త్వాలను తలపిదికి తీసుకొని దించేశాడోమరి ! అలా ఆ పొరపాటు తత్త్వాలను తలమోశానన్న ఏడ్పులేదు. జీవితం నిత్య పరిణామంగా నిత్యవికాసంగా జూచాడు. అంతే.

ఈ ప్రత్యేక మనస్తత్వానికి అనుగుణంగానే భోగంలోను, యోగంలోనూ, రెండురకాల తిరుగుడులోనూ అర్థవంతం కాగల ఒకే మకుటం కుదరటం అద్భుత మైన ఘటన

# వేమకాదు-వేమనలు, వేమన సంప్రదాయమూనట!

పుస్తక సమీక్షొకటి చదువగా యీ పీఠికలో యింకా చర్చించాల్సిన సూత్రీకరణ ఒకటి కళ్ళబడింది. అది శ్రీ గోపి 'వేమన వాదం' మీద సమీక్ష. అది 'అరుణతార' డిసెంబరు సంచికలో సమీక్ష. అ సమీక్ష పేరే వేమన్న(ల)వాదం, సమీక్షకులు —పి. సి ఎస్.

'వేమన పద్యాలు బహుకర్తృకాలు, వేమన బహురూపి....వాటిని (ఆ పద్యాలను) మొత్తంగానో, ఏరిన ఏకొన్నింటినో వ్యక్తికి అంటగట్టి వ్యక్తిపరంగా వ్యాఖ్యానాలు చేస్తే, పునాదుల్లేని వేమన వక్తిత్వానికి పూజాపురస్కారాలకోసం ఓ సమాధిని నిర్మించడమే అవుతుంది.(1) వేమన పద్యాలు ఆనాటి ప్రజల సామూహికవాణి వేమన వ్యక్తికాదు-సామూహిక సామాజిక అభివ్యక్తి....అసలు వేమన పద్యాలు ఇవీ అని నిర్ణయించడంలో తర్కాన్ని ఆశ్రయించాల్సిందే కాని, వాస్తవాన్ని నిరూపించలేము. ఇటువంటి పరిస్థితిలో వేమన పద్యాలు కొన్నిటి ఆధారంగానో, దొరికిన అన్నిటి ఆధారంగానో వేమన్న చెప్పింది వేదంగా, వాదంగా నిరూపించ యత్నించడం అర్థరహితం'—78వ పేజీ.

పత్రికలో సమీక్షక స్థానానికిగల అవకాశం ఆసరాగా, లోకంముందుకురాని యిష్టసిద్ధాంతాన్నొకదాన్ని నిరూపణాభారంనుండి తప్పించి, బద్ధ నిరూపితార్థంలాగా రెండు వాక్యాల్లో విన్యసించి, వేమన ఒకవ్యక్తిగా వ్యవస్థపొందిన సార్వ (పండిత) జనీనమైన విషయాన్ని కష్టపడకుండా సునాయాసంగా కొట్టేయటం ఆశ్చర్యం కలిగించింది

'అరుణతార' ఒక సాహిత్యోద్యమ పత్రిక. ఆ ఉద్యమంలోవారే సమీక్షకులు. ఆవుద్యమంలో ఇంకెందరిదో కావచ్చునుకొని విచారించాను. విచారిస్తే, ఉస్మానియా భాషాశాస్త్రాచార్యులు శ్రీ చేకూరి రామారావు, Oral Tradition వాదకర్త శ్రీ వెల్చేరు నారాయణగార్ల పేర్లు యీ వాదనేపథ్యంలో వున్నట్టు వినవచ్చినై. రామారావుగారిప్పటికే ఇటువంటి వాక్యాలు వ్రాసి అచ్చుచూపించారని, నారాయణ రావుగారు అనతికాలంలో ఆ వాద గ్రంథమేదో వెలువరించనున్నారని తెలియవచ్చింది. అందుచేత వ్రాయవలసి వచ్చింది.

వేమన పద్యాలనే వాటిలో పరస్పర విరుద్ధభావాలున్నవనీ, శైలిలో ఛందంలో కడకు భాషలోకూడ భేదంకలవి ఉన్నవని—అవి ఎవరెవరో వ్రాసి చేర్చిన ప్రక్షిప్తాలనీ, వానిని పట్టి తీసెయ్యాలని ఆదికాలంనుంచి అందరూ గోలపెట్టుతున్నారు. కాని అలాతీసేసి, ఇవే వేమన పద్యాలని తేల్చినవారు లేరు. ప్రక్షేపాలన్నవి సగానికి సగం వున్నవని—పైగా వున్నవని అన్నవారందరూ వేమన వ్యక్తికాదు—సంప్రదాయం, సామాజిక అభివ్యక్తి, వేమన పరంపర సుమాయని అన్నవారుకారు.

కటారుపల్లె వేమన పేరనితెలిసీ, అక్కడి 'బాలచక్రవేమ' శతకంచూచీ వినీ వాడుకొనీ వంగూరి, వేమూరి, రాళ్ళపల్లివంటి వారెవ్వరూ ఇటువంటివాదాన్ని ప్రతిపాదించలేదు. అటువంటిది యింత పాటికే అయితే అవసరంలేదు.

వేమన పద్యాల్లో భిన్నము, పరస్పర విరుద్ధమూ అయిన భావాలున్నాయి. భాషాశైలిచ్ఛందోభేదంకలవీ వున్నాయి. మకుట భేదంకలవీ వున్నాయి. భావభేదం గల పద్యాలు భాషాశైలిచ్ఛందోభేదం లేకుండా వున్నవి దండిగానే వున్నాయి. భాషలో మకుటంలో, ఛందంలో, శైలిలో భేదిస్తూ భావసారూప్యం గలిగినవీ మరిన్ని వున్నాయి. వేమనపద్యాల సమస్య ఇలావుంది. పాఠాంతరాలవిషయం మళ్ళీవేరు.

వేమనపేర బోగైన ఐదువేలపద్యాల్లో భావవ్యత్యాసాన్నిబట్టి భావశ్రేణికి ప్రత్యేకంగా ఒక్కొక్క వేమనను తయారించవచ్చు. కాని ఆభావవైషమ్యం, భేదం అంతా ఒక సంప్రదాయం కాజాలదు. అలాతయారించిన వేమనలందరూ వేమన పరంపరకానూకాలేరు. భావ సారూప్యంలేని సంప్రదాయం, పరంపర అపరిగ్రాహ్యం.

నాగుబాముగన్న నంబి బ్రాహ్మణుగన్న, చెవులపిల్లిగన్న చేటువచ్చు
గరుడునిగనుగొన్న కలకోర్కులీడేరు . బందరు ప్రతి 2177

కవితగూర్పబుద్ధి గల్గజేసెనజుడు, సముచితమతితోడ చక్కగాను
ఒనర సంధ్యనిష్ఠ హోమతర్పణములు చెలగికల్పనంబు చేసెవేమ॥
—(598—బ్రౌన్ అకాడెమీప్రతి)

ద్విజుల ఖేదపెట్టి తిట్టదొడగు వాడు మృతిని బొంది తాను వెతల బడగ
కాలుదరిని జేరు—కడతేరలేడయా వంటి పద్యాలున్నాయి. వీటికొకవేమనను చెప్పితే అతణ్ణి వేమన సంప్రదాయంలోవాడని అనగలమేమో యోజించండి. బ్రహ్మదేవునిగొప్పనీ, సగుణోపాసననీ, భక్తినీ, కాయసిద్ధిని, కంసాలిని, ఎప్పెట్రా

ఎప్పుడో పోగడేవి తెగిడే కూడా ఒకేలాటి భాషలో, శైలిలో, మకుటంలో, ఛందంలో వున్నైగదా! ఇవన్నీ భిన్నభిన్నమైన వేమన్నలవనే అందాము. కాని అవన్నీ ఒక సంప్రదాయంలోని ఎవుతాయా? ఆ వేమనలందరూ వేమన పరంపర వారనిపించుకోగలరా? అన్నది ప్రశ్న.

ఇక భావసారూప్యం గలిగి భాషలో శైలిలో ఛందంలో వేమ సంబంధమైన మకుటంలోనే భేదిస్తున్న పద్యాలున్నాయి. వాటిని ఆయా భేదాలనుబట్టి ఆది వేమనవని కొన్నిటిని, పిదపవేమనవని కొన్నిటిని విడదీసి కొంతమంది వేమనలను ప్రతిష్ఠించవచ్చు. అది చేసేముందుగా ఒకపని పూర్తిగావాలి. ఆదివేమన భావశ్రేణి ఏదో తేల్చిచెప్పుకోవాలి. ఇదమ్ ఇత్థమ్ అని తేల్చిన ఆభావకోటినే వేరైన భాషలో వేరైన ఛందంలో వేరైన శైలిలో, వేరైన మకుటంలో వుండడాన్నిబట్టి వేమనలను నిష్పాదించాలి. అలా నిష్పన్నమైనవారిని వేమన పరంపర అందాము.

అయితే, ఏది ఆదివేమన భావరాశి, బోధ అంటామో సంప్రదాయమంటామో దానికి భిన్నమైన భావధోరణులు ఎలాగో వుండనే వుంటాయి. ఎంతగానో వుంటాయి. భావభేదం, విరోధం వేమన పద్యాల్ని వేధించే సమస్యగదా! ఒకరకం భావాలను ఆది వేమనవనడంతో తక్కిన భావాలను పిదప వెమనలవని కూడా అనరాదు. వాటికి కర్తలు ఎవరోవేమనేతరులని అనవలసి వస్తుంది. ఆది వేమన భావ వ్యతిరేక పద్య కర్తలను వేమన లనకూడదు మరి అంటే సంప్రదాయం వుండదు; పరంపర వుండదు.

ఇక భావ సారూప్యం లేకుండా, భావ వైషమ్యంతోనే ఒక సంప్రదాయాన్ని పరంపరను దర్శిస్తామంటే వారికి నమస్కరించవలసిందే. ఇటువంటి ప్రతిపాదన విప్లవానికి ఉపయోగమని చేస్తున్నారో, అశ్రద్ధ చెయ్యడానికి వీల్లేని చారిత్రక యాథార్థ్యం అని చేస్తున్నారో తెలియదు. పునాదుల్లేని వేమన వ్యక్తిత్వం అంటు న్నారు. శంకర పీఠాధిపతులంతా శంకరాచార్యులనిపించు కొంటున్నప్పటికీ, ఆది శంకరులకొక వ్యక్తిత్వం మిగిలి వుంది మరి. ఆ శంకరుల పరంపరలో కూడ వారి వారి ప్రత్యేక నామధేయాలు చెరిగిపోలేదు దొరుకుతున్నై. వ్యాస పరంపరలో కూడ కొన్ని పేర్లు దొరికినై. వల్లభాదుల సంప్రదాయంలో ఏకనామ సంప్రదాయమేలేదు. వేమనను తమ ఆచార్య పురుషునిగా చెప్పే శివరామదీక్షితుని అచలమత పీఠంలోని గురు రంపరలో కూడ నామభేదమే వుంది. ఏమైనా గండికోటలో, ముదియంలో,

అరవ దేశంలో ఎక్కడెక్కడో వేమన పీఠాలు, యోగుల గుంపులు ఉండేవన్న విని కిడి నమోదై వున్నాయి. కుటుంబాలకు కుటుంబాలుగానే వున్నవని నమోదై వుంది. వీటి ఆచూకీలు తీయటం వ్యాస, శంకర పరంపర వంటి వేమన పరంపరను నిరూపించడం నిజంగా వీరి అవశ్య కర్తవ్యకరణీయం. ఆ ఫలితాల కొరకు ఎదురుచూద్దాం,

వేమన పరంపర ప్రతిపాదనకు ఆద్యులసలు వేరే వున్నారు. అ ప్రతిపాదనా స్వరూపాన్ని చూద్దాం. ఆ ప్రతిపాదనా కర్తలు ఎవరోగాదు, టేకుమళ్ళ కామేశ్వ రావుగారు 1967లోనే ప్రతిపాదించారు. ఇంతకు ముందొక సందర్భంలో వీరిని ప్రస్తావించే వున్నాను. మళ్ళీ యిందుకు ప్రస్తావించాల్సి వచ్చింది వీరి చిత్రణం.

ఆది వేమన శతకకర్త — శతకకర్త అంటే శతకకర్తే. నూరుపద్యాల శతకానికే కర్త. ఆదివేమన చెప్పినవి నూరు, నూటెనిమిది ఆట వెలదులు. [అసలు శతకకర్త అని నిర్ధారణ ఎక్కడదని అడక్కండి. వేమనదేననిగాని, తనదేననిగాని ఆశించవద్దు. వంగూరిదీ, వేదం వెంకట్రాయశాస్త్రిదీ నంటాడు. వారైనా వేమనవి నూరుపద్యాలే అనలేదు. అలాగనేది—నిరూపించేదిగాదు—వీరే.] నూరు ఆటవెలదులు వ్రాసిన వేమన పేరెంతో పెరిగి, అందులో అతని విజ్ఞానమెంతో వెల్లివిరిసి అతని పేరనొక మత సంప్రదాయ మేర్పడిందట. దానిని అనుసరించిన కొందరు వేమయ్యాలమని పేరు పెట్టుకొన్నారట. ఆ ఆదివేమన నన్నయ్యకు ముందటివాడు— [పండరంగని అద్దంకి శాసనం] యిప్పటికి తొలి తెలుగు పద్య శాసనంగా చెల్లుతున్న పండరంగని అద్దంకి శాసన కాలంకన్నా ముందు ఆది శంకరులకు సమకాలికుడుగా 8వ శతాబ్దంలో ఆంధ్రదేశంలో ఆదివేమన వున్నాడు. అతడు బ్రాహ్మణుడు. అవధూత.

అంత వెనకటి ఆ బ్రాహ్మణ వేమన తర్వాత వేమనలు నానాజాతుల నుండి వున్నారు. కాపువేమన, రెడ్డి వేమన, దేవర వేమన ..ఇతర వేమనలు వచ్చారు. వారంతా పద్యాలు వ్రాశారు. నూరు పద్యాలు ఐదువేలకు పెరిగాయి. ఈ పద్య సంకలనాల్లో షుమారు పది ఫలశ్రుతి పద్యాలున్నాయి ఒక కృతికో ఫలశ్రుతి అనుకొంటే పది ఫలశ్రుతులకు పది వేమనల పది శతకాలను తెలుపుతున్నై. పదకొండ వంద లేండ్ల కాలం నింపడానికి షుమారు నలభై మంది వేమనలు కావాలి. ఛందో భేదాన్ని బట్టి, మకట భేదాన్నిబట్టి, స్థల భేదాన్నిబట్టి కులభేదాన్నిబట్టి తక్కిన వేమనలను తయారు చేయొచ్చుగదా ! విమలగుణరాజయోగీంద్రవేమనార్య, బాలచంద్ర వేమ

భవ్యనామ, బౌద్ధరామ, పతనరామ, వెఱ్ఱివేమన, గోరాజవేమాహ్వయుడు, వేమన్నృపాల శేఖరుడు యోగిరాయడువేముడు, దేవరవేముడు, వేమారెడ్డి అని, సీసాలకు భారతీగతులకు, చౌపదులకు వేమనల వేర్వేరుగా పూరించుకోవచ్చన్న ధైర్యం వుంది. ఇలాంటి వేమన పరంపర కామేశ్వర్రావు తయారీ.

ద్విజుల ఖేదపెట్టి తిట్టదొడగువాడికి నరకప్రాప్తి చెప్పిన వేమనే ఉర్వివారినెల్ల ఒక్క కంచముబెట్టి పొత్తు గుడిపి కులము పొలియజేయుమన్న వేమన, ఆదివేమనఅట. అనగా భావ వైషమ్య వైరుధ్యాలు కూడ వారి వేమన పరంపరని, సంప్రదాయాన్ని బాధించజాలవు ! ఇదీ వారి ప్రతిపాదనా స్వరూపం.

ఇక విశ్వదాభిరామ వినురవేమ' అనే మకుటం తీసుకొని నిన్న మొన్నటిగో శ్రీశ్రీ, కృష్ణశాస్త్రి, మరికొందరు ఆటవెలదిలోనే 'నవయుగాల బాటనార్ల మాట', 'విశ్వవినుతనామ వినురరామ' యనే విధంగా వేరే మకుటం కూర్చుకొని సాంఘిక వ్యవస్థమీద తమ విమర్శను, అసంతృప్తిని వెల్లడిస్తున్నారు. వెనకటికి 1740నాడే వేమనగారి తాత్త్వికాభిప్రాయాలనే 'పటుగుణాభిరామ పరశురామ' అనే మకుటంతో ఒరంగల్లు దగ్గరి మట్టెవాడ పరశురామపంతుల రామమూర్తి రెండు శతకాల్లో పెట్టాడు. వేమన మకుటం బెట్టుకొన్నా, మరో సొంత మకుటం పెట్టుకొన్నా వేమన లాగా సాంఘిక వ్యవస్థమీద విమర్శ వెలిబుచ్చడమే ఒక సంప్రదాయం అనుకొన్నా వారందరూ వేమన పరంపర కావటంలేదు. వారు వేమన అనిపించుకోలేదు. ఇటు వంటి సంప్రదాయం కాదనుకొంటాను వారి మనసులో వున్నది కూడ. మనం మాట్లాడేది వేమన పద్యాలుగా చెల్లుతున్న వాటిని గూర్చేగదా !

ఇటువంటి వేమన సంప్రదాయ—పరంపర ప్రతిపాదన, వేమన ప్రయోగ శాలిత్వాన్ని, తత్త్వంనుండి తత్త్వంలోకి పెట్టా పరిమి అన్వేషకుడై ఒక తత్త్వ విజ్ఞాన సర్వస్వమయ్యే మహత్తర కృషిని వేమనకు కాకుండా చేస్తుంది.

## ఇపుడే అందిన 'ప్రజాకవి వేమన' :

శ్రీ గోపీ డాక్టొరల్ థీసిస్సే ప్రజాకవి వేమన అప్పుడే అచ్చై అంగడిలోకి వచ్చేసింది పెద్ద పుస్తకం— ఆధార గ్రంథాల పెద్ద పట్టిక 35 పేజీల పొడపుగల గ్రంథపట్టికతో అయిదు వందల పేజీల బృహద్రచన. అరవై పై చిలుకు వ్రాత ప్రతులు వెతికి వెతికి చేసిన రచన. తెలుగు తమిళ కన్నడ సంస్కృత ఆంగ్ల

హిందీ ఉర్దూ భాషలలో వెలసిన వేమన పద్య సంకలనాలు, అనువాదాలు దగ్గర దగ్గర నూరింటిని ఆధారంగా తీసుకొని చేసిన రచన. ఆ పైన మరో నూరుగురు వేమనను వివేచించి, శోధించి చేసిన చర్చల ప్రత్యక్ష ఫలితాలిచ్చిన రచనలను గమనంలో పెట్టుకొని చేసిన రచన. అంత మంది కళ్ళతో వేమనను చూచి, సొంత కళ్ళతో చూడడానికిగాను ఇతరమైన ఉపయుక్త రచనలొక అరవై తీసుకొని చేసిన రచన.

ఇదంతా చూచి, రచన మధ్యలో ముద్రణ మధ్యలో (188 పేజీలు పుస్తకం, 60 పేజీలు పీఠిక అయిన తర్వాత) నేను ఏ ఏ అభిప్రాయాలను వదలుకో వలసి వస్తుందో, ఏమేమి సవరించుకోవాల్సి వుంటుందో, అయినా అచ్చు మధ్యలో మార్చుకోలేని దుస్థితికి బాధపడాలో అనుకొంటూ ప్రాణాలు బిగపట్టుకొని చదివాను. చదివి ఆశ్చర్యపడ్డాను. అటువంటి ఉపద్రవం ఏర్పడక పోయినందుకు. నా రచన నిరాఘాటంగా నిశ్శంకంగా చేసుకు పోవచ్చని తేలిపోయింది ఇక. మనసు తేలిక అయింది.

ఇలా నాకు తప్పిన గండం మాట అటుంచి ఇంత వలమైన పుస్తకంలో వేమన భావనిర్దేశం ఇదీ అన్న మాటలేదు. రంగు రుచి వాసన లేని పదార్థం అయ్యాడు వేమన. అద్వైతలోకాయతాలు రెండూ వేమనవిలాగానే వున్నవన్నేట్టున్నారు. అతని నీతి, సంస్కారిణ ఆర్థిక సిద్ధాంతం రూపు రేఖలు వెలివరచడంలేదు. మూఢాచారం మీద దండయాత్రమాట ఎవరైనా ఎత్తుతారు. అందులో విశేషాలైనా అంటే అవీ లేవు.

తెలుగు ఉపన్యాసకులు గావున కవితా స్వారస్యం, సాహిత్య సిద్ధాంతం దగ్గరైనా విశేషాలు చూపుతారనుకొన్నాను. ప్రజాకవి అని తీర్మానించడానికి ఒక డాక్టొరల్ థీసిస్, ఒక పరిశోధన! ఏం చెప్పను? ఎంత చప్పన!

ఆధార గ్రంథాల పట్టికలో పుస్తకాలెన్నో యీరచనలో అప్రసక్తాలు. అవన్నీ చూచిన వనుకో నక్కరలేదు. వేమన గూర్చి వెలువడిన పుస్తకాల కేటలాగింగు అది. అది వేమన ప్రశస్తి. వేమన మీద వెలువడిన ఆ రచనల్లో చర్చించిన సమస్య లివీయని, వీరివీరి నిర్ణయాలివీయని క్లుప్తంగా సమాచార నిర్మాణం చేసి వున్నా బాగుండేది.

కాకపోతే, 'ఎద్దిరెడ్డి పలమదేమని చెప్పుదు' ననే పంక్తి కొండవీటి పద్యంలో పూర్ణయాచారి చేతి చలపేమోనని (176వ పేజీలో) శంకించి వ్రాత

ప్రతులు తనిఖీ చేయమన్నాను. చాల వ్రాత ప్రతులు వ్రాసుకొని తిరగేసిన వీరు వాటిల్లో లేదని వ్రాశారు. బాగుంది. వీరు చూడని ప్రతులింక కొన్ని దేశ విదేశాల్లో వున్నాయి అవీ వెదికేసి ఆఖరు మాట చెప్పుదాం. వీరి పరిశోధన తీరు ఆందోళన కలిగిస్తోంది. మచ్చుకీ క్రింద విషయాలు చూడొచ్చు.

## డాక్టరేటు పరిశోధన తీరు :

1. 'ముస్లిం పతనావస్థను సూచిస్తున్న వేమన పద్యాలలో ఒక పద్యమట :

రాళ్ళునమ్మియున్న రాజాధిరాజులు కూటికెడలి భువుని కూలిచనిరి
రాళ్ళు పగులగొట్టి రాక్షసపుత్రులు మాళ్ళనూళ్ళ గలిగిమనిరి వేమ॥

2. కేవలం యింటి చిరునామా వివరాలిచ్చే పద్యమే కావాలంటే పంక్తుల Permutations & Combinations అవసరం లేకుండా

ఊరు కొండవీడు ఉనికి పశ్చిమవీధి, మూలచింతకడకు ముందరిల్లు
అరసిచూడ బయలు ఆడనే శివుడుండు............ (D-1727 ప్రతి—324)

వుంటే అది పాఠం కాదనుకొంటూ.

ఊరు కొండవీడు ఉనికి పశ్చిమవీధి మూగచింతపల్లె మొదటివీడు

అరసిచూడబయలు ఆడనే శివుడుండు ..........(111 పేజీ) నన్నదాన్ని తయారుచెయ్యడం దేనికి ? కొండవీటి యింటికి గుర్తులు చెప్తూ పడమటివీధికీ— దానిముందు మైదానానికీ నడుమ అవాంతరంగా పూర్వం మూగచింతపల్లెవాసం చెప్పటం 'అన్వయసహిష్ణుతే'నా ? ఈ పద్యాలకి తాత్వికార్థం లాగటం పొసగదని, తాత్త్వికార్థం లేకుండా చిర్నామా పద్యమే తయారుచెయ్యాలనే ప్రయత్నందేనికి ? రెండర్థాలూ పొసగివుంటే బాధేమిటి ? వీరు పంక్తుల కలగలుపు తయారుచేసిన పాఠానికి తత్వార్థం చెయ్యవీల్లేదా ? బయలు అంటే శూన్యతత్వమని, శివతత్త్వం శూన్యతత్త్వమని కూడా వుంది అని తెలుసుకోవాలి. రెండోపంక్తి 'మూలచింత కడకు ముందరిల్లు' అంటే పడమటివీధి మూలమీద చింతచెట్టుకాడముందటి యిల్లు అని చెప్పుకోవడంలో కడను, ముందు అన్నవి తత్వార్థానికి కొంత బాధకాలు. అసలు నంది దుర్గం, ఉదయాద్రి వంటి స్థలనామాలను తత్త్వసంకేతాలుగా వాడు కోవడం వేమన అలవాటు. తత్త్వం— జాగ్రఫీ ఆత్మకథా కలపటం వేమన తీరు.

అదలా వుండనీయండి. కొండవీడు పద్యం తాత్త్వార్థకం గాకుండా కేవలం ఇంటిగుర్తులు చిరునామా మాత్రం చెప్పే పద్యంగా పాఠ పరిష్కారం చేసి చేసి హఠాత్తుగా అడ్డం తిరిగి 'వేమనకు కొండవీటితో ఎట్టి సంబంధం లేదు' (144, 145 పేజీలు) అని ఒక ప్రకటన జేశారు. ఇంతగా శ్రమించి పాఠ పరిష్కారంచేసి వేమన యింటి అడ్రసు సాధించివున్న యీ కొండవీటి పద్యాన్ని వీటిబుచ్చడమే గదా ! దాన్నెందుకు ప్రమాణంగా తీసుకోరాదో చెప్పలేదు. అప్రమాణమైనదాన్ని గురించి అంత పరిశ్రమదేనికి ?

(3) వేమూరి విశ్వనాథశర్మగారు 1923 ఆంధ్రపత్రికలో వ్రాసిన వ్యాసాలను చూచినట్లుగా బిబ్లియాగ్రఫీలో యిచ్చారు. కటారుపల్లెకు వెళ్ళి విచారించకుండానే వ్రాతల ఆధారంతోనే కటారుపల్లి వేమన మన వేమనకాదని 1923లోనే నిరూపించిన వాడు విశ్వనాథశర్మ. 1928లో రాళ్ళపల్లివారు ఆ వూరు వెళ్ళి విచారించి సేకరించిన సాక్ష్యంతో అక్కడి వేమన మన వేమన కాదని వాఙ్మూలం కూడా తీసుకొని నిరూపించారు. 'వేమన పేరుతో మన వేమనకాని వాడొకడు ఉన్నాడని కనిపెట్టినవారు రాళ్ళపల్లివారు' (113 పేజీ) అని వ్రాశారు. విశ్వనాథశర్మను చదివే ఇలా వ్రాశారను కోగలమా ? బిబ్లియాగ్రఫీ అంతా చదివిన పుస్తకాల జాబితాయేనా ? చదవనిది చూడ నిది కూడ కొంత వున్నట్లుంది.

(4) వేమనను కొండవీటి వాడని ప్రథమంగా వ్రాసినవాడే మాక్డోనాల్డు. కొట్టుట అనే అర్థంలో 'దుడ్డుట' అన్న శబ్దం కొండవీటి సీమలోనిదని, అది వేమన ప్రయోగించాడని వ్రాసినవాడు మాక్డొనాల్డే. ఆటువంటి మాక్డొనాల్డు వేమనను రాయలసీమ వాడన్నాడని, కటారుపల్లె వెళ్ళాడని (136, 142 పేజీలు) వ్రాస్తున్నారు. మాక్డొనాల్డు ఆ వూరు వెళ్ళిన జాడలేదు. వెళ్ళి వర్ణించినవాడు క్యాంబెల్.

'గండికోటలోన కస్తూరి మృగముండు' అనే పాఠాన్ని 1922 నుంచీ వంగూరి, వేమూరి యిస్తూ వచ్చారు. కాని దాన్ని Tamper చేసి అలా తయారు చేసింది తమ్మయ్యగారే నంటున్నారు. (140 పేజీ). జాగ్రత్తగా చదివి సమ్మరైజు చెయ్యడం అవసరం గదా ?

(5) వేమన భౌతికవాదాన్ని ఖండించాడు. అదికానక, లోకాయతిక ధోరణులని (239 పేజీ) శీర్షికపెట్టి, ఆరుద్ర చెప్పాడని వేమనలో లోకాయత భౌతిక వాద ధోరణులున్నవని వ్రాస్తున్నారు. దేహవాదానికి, దేహాత్మవాదానికి వ్యత్యాసం తెలియక లోకాయతికులదీ తాంత్రికులదీ దేహవాదం అని (240) వ్రాశారు చార్వాకంలో అసితకేశ కంబళుడు ప్రథముడట (246 పేజీ). వీరశైవులకు నరజన్మే కడజన్మ అయితే, వారికి పునర్జన్మ సిద్ధాంతంలో విశ్వాసం లేదన్నారు (181).

(6) 17వ శతాబ్దాన్ని గూర్చి వ్రాస్తూ (190 పేజీలో) 'గ్రామ వ్యవస్థ విచ్ఛిత్తి' అని శీర్షికపెట్టి వున్నారు. ఆ శీర్షిక క్రింద గ్రామీణ దారిద్ర్యం వుందిగాని, ఆ వ్యవస్థ విచ్ఛిత్తి చిత్రం లేనేలేదు. అప్పటికది వుండటానికే అసలు వీల్లేదు.

(7) వేమన్నకు సాహిత్యపు గొడవలేవీ పట్టలేదు (408 పేజీ) — నాటి కవితా పీఠాలను ఎదుర్కోవాలన్న దృష్టి వేమనకు లేదు (298 పేజీ). ఆలంకారికుల నిర్వచనాలు కవిత్వ పరిధిలోనే దర్శించినవి కావడండల్ల వేమన పద్యాలకు అవి పూర్తిగా వర్తించవు (204) అని వ్రాయగలుగుతున్నారు.

(8) నాగలింగ యోగి (తెలంగాణా) ప్రతిలో అచ్చుకెక్కని పద్యాలు కొన్ని వున్నాయి. ఈ పుస్తకంలో నేనే రెండింటిని ఉదాహరించాను. శ్రీగిరిపయితురక.... ..... కొంకణంబునందు కూహకపు విరక్తి....

'ఇందులో కొత్త పద్యాలున్నాయని రాశారుగాని ఇది నిజం కాదని' (14 పేజీ) మరీ వక్కాణించారు. ఇదే నమ్మితే ఇంకే పరిశోధకుడూ దాని జోలికే వెళ్ళక వదిలేయొచ్చు ఇదెంత ప్రమాదం !

(9) వేమన పద్యాల వ్రాతప్రతుల్లో ఏకింటిమీద సంవత్సరాల పేర్లున్నాయట. అవి ప్రభవ విభవల పేర్లు మాత్రమేగాని శక సంవత్సరాలు గావు. ప్రతి అరవై యేళ్ళకు ఆ పేర్లు ఆవృత్తమవుతాయి. అందుచేత సంవత్సర నామం ఒక్కటే కాల నిర్ణయానికి సరిపోదు: వీరు ప్రాచీన ప్రతి అని ఒకదాన్ని చూపుతున్నారు. దానిమీద ప్రజోత్పత్తి నామ సంవత్సరం వుందట. అది 1691 అని నిర్ణయించారు. 1751లోను, 1811లోను ప్రజోత్పత్తి సంవత్సరమే. ఆ ప్రతి 1811 నాటి ప్రజోత్పత్తిలోని దన్నప్పటికీ వీరి లిస్టులోకి ప్రాచీనమైనదే అవుతుంది. కాని 1691లో ప్రజోత్పత్తి అనేందుకు దాఖలాలు కావాలి. చెదలు తినగా శిధిలమైనంత మాత్రాన ప్రాచీనత సిద్ధింపదు. శకవత్సర వివరం లేకుండా సంవత్సర నామాలతో కాలనిర్దేశం సాధ్యంకాదు. వారి కాల పరిష్కరణ పట్టికలో లోపమే యిది.

వ్రాతప్రతులమీద వీరు శ్రమ చేశారు. పాఠ పరిష్కార దృష్టితో శ్రమించారు. మన పండితులిచ్చిన పాఠాలను ఎదురుబెట్టుకొన్నారు. చాల భేదాన్ని చూచారు. పండితులు పద్యాన్ని దిద్దారు. దిద్ది వాని పరిశుద్ధతను పాడుచేశారని అనుకొన్నారు. 'పరిష్కరించటమంటే దిద్దటమే' (వేమన్న వాదం పీఠిక—9 పేజీ) అని వ్రాశారు. తామాపని చెయ్యకుండా, వ్రాతప్రతులను గట్టిగా అంటిపెట్టుకొని వుండాలనుకొన్నారు. అలావుండి కొన్ని పద్యపాఠాలు పండితుల పాఠాలకు ఎంతో ఒకంత భిన్నంగా పరిష్కరించిన పాఠాలను వేమన్న వాదంలో యిచ్చారు. పండితుల పూర్వ పాఠాలు వేమనకు దూరస్థాలని. తమవి వేమనవో, వేమనకు చేరువలోనివో అనుకొంటూ తయారుచేసిన పాఠాల స్వరూపం చూడవలసి వుంది. రాబోయే వేమన పద్యాల స్వరూపమేమో !

## పండితులిచ్చిన పాఠాలను కాదని...

1. కులముకన్న మిగుల కలిమి ప్రధానంబు అని వుండగా కులముకన్న మిగుల

ధనము ప్రధానంబు అని (71) యతిని శ్రుతిహితవుని సహజతను భంగించి వేమనదంటున్నారు.

2. నడువనేరకున్న నడపీను గందురో అని వుండగా నడువ నేరని వానినని (35) మార్చి యిచ్చి గణభంగము దెచ్చి వేమనదే యీ పాఠమంటున్నారు.

3. పుత్తడి గలవాని పృష్ఠంబు పుండైన అని వుండగా పుష్టంబు పుండై తే అన్నదే (25) వేమనదంటున్నారు. పుష్టంబు వాడుక అని, యతి కలిసి వస్తుందని కాబోలు, ఐతే కు బదులు ఐన అంటే వేమన భాషకు అపచారమని నడక చెడినా గణభంగమైనా సరేనని 'పుష్టంబు పుండై తే' అనియిచ్చారు. పుష్టము గాక పుష్టంబు కూడా వాడుకేనంటారా ?

4. గుణవతియగు యువతి గృహము చక్కగ నుండు అని వుండగా గురము చక్కగా నుండునని (80) చూపుతున్నారు. గురము వాడుకభాషా ? గృహ మంటే అర్థంకాదనా? గృహమంటే యతిభంగమని వ్రాతప్రతికారుడు గురము చేస్తే అది వేమనదా ? హల్లుల మీది ఋకార ఉకారములకు యతిమైత్రి పాటించి వేమన కొత్తఛందో నియమం ప్రవర్తింపజేశాడు. ఉదాహరణలు ఎన్నో యివ్వొచ్చు. ఉచ్చారణనుబట్టి అదే సహజంకూడాను. పుత్తడిగల వాని పృష్ఠంబు అన్న దగ్గరకూడ ఇదే కన్పిస్తున్నదిగదా !

5. గండమైన దొంగ కవుల సొమ్మెగవేసి అని వుండగా గండమైన దొంగ (12) అంటే వేమన్న పాఠం అవుతుందనిగదా ! గండమైన దొంగ అన్నది కృతకమైన కూర్పుగాదా ? దొంక తిరుగుడుగా విగ్రహవాక్యం చెప్పు కోవాల్సి రావటంలేదా ? ఇది వేమన కైవాడమేనా ? గండ అనగా శూరుడు అని, రాచబిరుదుల్లో గండరగండ వంటి వాని వల్ల గండమైన దొంగ అనడంతోటే రాచదొంగ అనే స్ఫురణ కొంతలేదా ?

6. కరకకాయలు తిని కాషాయ వస్త్రముల్ అని వుండగా కరకుకాయలు తిని (55) అని అర్థవికారం కలిగించి వేమన దంటున్నారు.

7. చెరుపజూచువాడు చెలిమిజేయు అని వుండగా చెలిమిజేసు (7) అని యిచ్చి వేమనది వాడుక భాషయని చెలిమిజేయు అంటే కాక పోతుందను కొంటున్నారు.

8 పొత్తుగుడిపి కులము పొలియజేసి అని వుండగా 'పొలయజేసి' (76) అని యిస్తున్నారు. పొలియుట అంటే చచ్చుట, పొలయుట అంటే వ్యాపించుట, ప్రసరించుట etc. అర్థభేదం, వ్యతిరేకార్థం వస్తున్నప్పటికీ కానటంలేదు. ఇక 'పొలయజేసి' అనే తీసుకొంటే దానికి నిష్కృతేలేదు.

9. తలపతలపపుట్టుతనువునతత్త్వంబు అని (126) యివ్వగలిగిన వారు చంప దలచు రాజు ఛనవిచ్చుచుండురా (7) అని యిచ్చారు. తలపతలప అని గ్రాంథికం చేసిన వేమన తలచు అనక తలుచు అని మాత్రం అన్న

వాడని గాబోలు తలుచు అని పాఠ నిర్ణయం చేశారు. చదువ చదువ అంటే వేమన భాషకాక పోయి (127) చదవ చదవ అంటే వేమన భాష అవుతుందని కొత్తపాఠం యిచ్చారు.

ఈ నిర్ణయాల్లో అర్థమా, అందమా, ఛందమా, శబ్దశుద్ధా, వాడుక భాషా వాదమా ఏది పాటింపబడుతున్నట్టు? దిద్దుబాటుకో నియమం వుండాలి? వేమన ప్రతుల దిద్దకపోవడం సాధ్యమా? శ్రీ గిరిపయి పద్యమే వుంది? దిద్దకుండగలరా? వేమన రాశాడా? రాయించి O.K. అన్నాడా? వ్రాసినవారు ఎంత చదువరులు? ఎంత చక్కగా వ్రాశారు? పండితుల పాఠాలు అంతకన్న అన్యాయంగా వున్నాయా? దిద్దడానికి భాషమీద వేమన భావాల మీద అధికారం కావాలిగదా!

## వేమనమీద డాక్టరేటు డిగ్రీలు

'ప్రజాకవి వేమన' ఇలావుంటే మద్రాసు విశ్వవిద్యాలయ తెలుగు శాఖాధిపతి ఆచార్య గంధం అప్పారావుగారు 'వేమన సర్వజ్ఞులు' అని ఒక థీసిస్ చేశారంటే, అదీ చూచాను. వారిద్దరి సారూప్య వైరూప్యాలను చెప్పడానికిగాను వారిద్దరి గుట్టు మట్టులను బాగా త్రవ్వి తీస్తారనుకొన్నాను. 180 పేజీల పుస్తకంలో ఎంతో ఆశిస్తాము. కాని ఆశాభంగమే ఫలం. 1928 లోని రాళ్ళపల్లి వేమన ఉపన్యాసాలలో వేమన వంటివారినే శీర్షిక క్రింద సర్వజ్ఞమూర్తి అని పేరిచ్చి తొమ్మిది పెద్ద కాగితాలలో అతన్ని వేమనతో పోల్చి చెప్పిందే ఇప్పటికీ సువిశేష బహుళం; సూక్ష్మ పరిశీలనా .... ఆ చిన్న ఉపశీర్షికకే పది డిగ్రీలివ్వొచ్చు.

'వేమన శంకరులు' అని ఆంగ్లంలో తత్త్వ పరిశోధనా థీసిస్ ఒకటి నెల్లూరు V. R College Logic Lecturer డి. కృష్ణారెడ్డి చేశారట. 1973లో చేశారు. అచ్చులో రావచ్చు.

పశ్చిమగోదావరి జిల్లా గణపవరం మూర్తిరాజు కాలేజీ ప్రిన్సిపాల్ శ్రీ S.M. సుభానీగారొక డాక్టొరల్ థీసిస్‌కు సేకరణ పూర్తి చేశారని, ఇకవ్రాయబోతున్నారని తెలుస్తోంది. మైసూరు విశ్వవిద్యాలయంలో S. రమామణి వేమన-తిరువళ్ళువరు-సర్వజ్ఞులు ముగ్గురను తులనాత్మకాధ్యయనం చేసి 1980 మార్చిలో థీసిస్ పూర్తి చేశారట.

దక్షిణ భారత విశ్వవిద్యాలయాలలో వేమనమీద ఇంత పరిశోధన జరిగడం బాగుంది. ఇంకా ఎంతో జరగాల్సివుంది. అయితే, విశ్వ విద్యాలయాల ఆవరణలలో నుంచి వేమనపై వెలువడిన పరిశోధనలు పేలవంగా విశేషవిరహితంగా వుండటం తలచుకొంటేబాధగావుంది. చాలనివారు వేమనమీదపరిశోధనకు ఒడిగట్టుతున్నట్టున్నారు తేలిక పద్యాలను పరిశోధన అనే పెద్దపేరు క్రిందికితెచ్చి సులువుగా పరిశోధింపబట్టం

పొందగలిగేందుకే వేమన విషయం ఒక ఉపాయంగా, కన్పిస్తున్న లాగుంది. వేమన మీద డాక్టరేట్ పట్టం అంటే బంజరు భూములు పట్టా పొందటంగా తయారైనట్లుంది.

వేమన మన మధ్యయుగాల తాత్త్విక విజ్ఞాన సర్వస్వం అనీ. భారతీయ చింతనాపరులలో ప్రథమస్థానం అలంకరించ వలసినవాడని, భాషలో ఎంత పేదగా కనిపిస్తాడో అంత పెద్దభావాన్ని నిక్షేపించే పరమపండితుడని, దిగినకొలదీ అతడు లోతే అనీ గ్రహించి, ఆకళించుకొని అందుకు చాలినవారు బహుజాగరూకతతో బహుకాల మనన చింతనాఫలంగా, బహువిషయ పరిశీలనా పర్యవసానంగా, పరిశోధనా ఫలితాలను వెలయించేట్లు విశ్వవిద్యాలయాచార్యులు వేమనమీద పరిశోధనను కట్టుదిట్టం చెయ్యాలి. ఈ విషయంలో పరిశోధన ననుమతించడంలో, పర్యవేక్షించడంలో పరీక్షించడంలో, ప్రమాణ పరిరక్షణాదీక్ష, తెలుగుసంస్కృతీ గోపకతాభిరతీ వెలితి గాకుండా ఆచార్యవర్గం తమ ధర్మం నెరవేర్చవలసి వున్నదని మనవి చేస్తున్నాను.

## వేమనతో విరసంవారి విరసం

[పీఠిక ముగించబోయే సరికి ఆగండని యీ విషయంకానమనిబంగోరే వ్రాయగా. చలసాని, కొల్లాలు తమ తమ పుస్తకాలు పంపగా యీ కాస్తామరి....]

1. నిజానికి వేమన కవిగా గొప్ప చేయదగిన వాడు కాదు.

2. వేమన చెప్పిన తిరుగుబాటు చాలా గొప్ప దనటం Fantastic.

3. వేమన బలం ఆయన సాంఘిక దృక్పథంలో వున్నది.—పేజీ-3. 'ఉపోద్ఘాతంమారుగా' కొడవటిగంటి కుటుంబరావు.

4. వేమన కవిత్వం విలువ అంతా సామాజిక దృక్పథం మీద ఆధారపడి వున్నది— పేజీ-7. వీరేశలింగం, అప్పారావుగార్ల సేవకన్న వేమన చేసిన సేవ ఎక్కువైన దనటం అర్థంలేని మాట. 'ప్రజాస్వామిక పరిష్కారం గురించి'—పేజీ-5 కొడవటిగంటీ, చలసాని ప్రసాదులు.

5. వేమనగాని, బ్రహ్మంగారుగాని సులభశైలిలో పామరులకుతత్త్వబోధన చేశారు. వారి ప్రధానోద్దేశం జీవన్ముక్తి. వారు యథాశక్తి యోగులు.

సంఘసంస్కరణకు సంకల్ప పూర్వకంగా పూనుకొన్న వారు కారు. అయితే సంఘం లో వ్యాపించిన రకరకాల చెడుగులను వేమన చాలా కరుకుగా విమర్శించాడు— పేజీ-21. డా. రామకృష్ణ, రమణారెడ్డి.

6. మధ్య యుగాంతంలో వేమన అన్నికులాలనూ, అన్ని మూఢవిశ్వాసాలను ఖండించి, హేళన జేసి చివరకు చూపింది జ్ఞాన మార్గం. అయితే యీ వ్యక్తుల ఉద్యమాల ఫలితంగా కుల వ్యవస్థ గానీ, భూస్వామ్యం గానీ, మతం గానీ, చెక్కు చెదరలేదు —పేజీ—49. డా. రామకృష్ణ, రమణారెడ్డి.

[ప్రజాస్వామిక సంస్కృతి (కందుకూరి గురజాడల దోహదం) సొసైటీ ఫర్ సోషల్ ఛేంజ్—కావలి ప్రచురణ.]

వీరి ఈ మాటలకు నిమిత్తకారణులు శ్రీ కొల్లా వెంకయ్యగారు వారి 'దేశీయ భాషలూ జాతుల సమస్య, ప్రజాస్వామికపరిష్కారం' అన్న పుస్తకానికి విరసంవారి రీయాక్షన్ ఈ రూపం తీసుకొన్నది.

కందుకూరి — గురజాడలను కమ్యూనిస్టుపార్టీవారు యుగపురుషులుగా నెల కొల్పడం 'వాస్తవాలతో నిమిత్తంలేని ప్రచారం' వారు 'వలస పరిధికి లోబడిన సంస్కరణ కర్తలని వారిది వలస పరిధికిలోనైన సంస్కృతి' యని, శ్రీశ్రీ 'గురజాడ అప్పారావుని మహాకవిగా చిత్రించి వేమన సరసన నిలపడం తప్పిద మని- వేమన కవిత 'అభివృద్ధికరమైన సాహిత్యం' అని, వేమన మహాకవియని, ప్రజాకవియని శ్రీ కొల్లా నిశ్చయం చేశారు.

కొల్లా శ్రీశ్రీ లిద్దరికీ వేమన మహాకవే—ప్రజాకవే — వేమన వరకు అంతా ఏకీభావమే. కందుకూరి గురజాడ విషయంలోనే భేదాభిప్రాయం. కందుకూరి, గురజాడ, గిడుగులను అంత తేలికగా కొట్టి పారెయ్యలేము. ఆనాడు వారు చేసిన కృషివల్ల సామ్యవాద విప్లవం ఒక అడుగు ముందుకు వేసిందనే చెప్పాలి అని, వారిని బలపరచుకొన్నారేగాని వేమన సైజు కత్తిరించే పనికి దిగలేదు.

కొల్లావారు కందుకూరి-గురజాడలను క్రిందికిగుంజినందుకు ప్రతిగా శ్రీశ్రీగాక తక్కినవిరసంవారు వేమననుక్రిందికిలాగారు. రామకృష్ణ రమణారెడ్డి, కొడవటిగంటి చలసానీ వేమన మహాకవి కాడు, వేమన తిరుగుబాటు గొప్పదికాదు అనేంతవరకూ వెళ్ళారు. అంతవరకూ వారిలోఏకాభిప్రాయమే. వేమన బలం, వేమనకవిత్వం విలువ

అంతా అతని సామాజిక దృక్పథం మీద ఆధారపడి వుందనడంతో చలసానీ, కొడవటిగంటీ ఆగితే, ఆ సంఘ సంస్కరణకు కూడా వేమన వీరబ్రహ్మాలు సంకల్ప పూర్వకంగా పూనుకొన్నవారు కాదు—అన్నంతవరకూ రామకృష్ణా రమణారెడ్డిగారలు సంకోచించకుండా తీర్మానం చేశారు. వేమనకు సంకల్పలోపం ! సంస్కరణలోపం!! వారేమైనా అనగలరు, నిరూపణ లేకుండా.

కొల్లావారు - కందుకూరి గురజాడలు యుగపురుషులు గారనడానికి, వారు 'ప్రబోధించిన సంస్కృతి విప్లవకరమైనది గాదు' అని చాల సాక్ష్యం, సమాచారం యిచ్చి నిరూపించ యత్నించారు. వేమనపైన ఇంతింత మాటలు విసిరేసిన వీరు, ఈ విసుర్లు వినా ఏ విధంగానూ ఆధారాలుచూపలేదు, చూపాలని యత్నించలేదు. ఖండనకు పూనుకొన్నప్పటి కర్తవ్యం కరణీయం తెలిసినవారు కొల్లావారు. అది వీరిలో లోపించింది నిర్ణయాల బాగోగులు తప్పొప్పులమాట తర్వాతగాని, వాద ధర్మమే వదలి మెదులుతున్నారంటే ఏమనాలో మరి ! కందుకూరి గురజాడల పక్షాన డిఫెన్సు సాక్ష్యం పోగుజేసినట్లు వేమనమీద అభియోగమేగాని ఏం సాక్ష్యం పోగుజేశారు వీరు ? నిర్నిరూపణము నిస్సమాచారము అయిన అభియోగమే గదా వేమనమీద వీరు చేసినపని. ఇదెంతో పేలవంగానూ పేదరికంగానూ వుంది. ఇంతమంది అధ్యాపకులు, పఠన పాఠనమే, రచనమే, వృత్తిగా బెట్టుకొన్నవారు, పరిశోధనలో సాహిత్య వాదోపవాదాల్లో గడితేరినవారు చేసే ఖండనా నిర్వహణం ఇలా వుండ వలసిందేనా?

కందుకూరి-గురజాడల యుగపురుషత్వాన్ని, వారి మహాకవి ప్రజాకవి ప్రతిపత్తులను నిలబెట్టడానికి గాను ఏ ఔదార్యాన్ని, సహిష్ణుతను, ఏ సానుభూతి పూర్వకావగాహనలను 'చారిత్రకనేపథ్యం' పేర, 'రాజకీయ చైతన్యం' పేర, 'ఆనాటి పరిమితుల' పేర . చూపారో, చూపమన్నారో అటువంటి వ్యతిరేకతారహితమైన, ఉదారతా పూర్వకమైన అవగాహనతోనే వేమనను చూడాలిగదా ! చూస్తేనేనా యీ అభిప్రాయీ కరణం ? అందరినీ ఒకే త్రాసులో తుయ్యాలి గదా ? ఈ యుగపురుషుల పట్ల చూపిన అవగాహనా ప్రమాణాలతోనే వేమనను కొలిస్తే అతడొక ఎవరెస్టుగా ఎదిగిపోడా ?

అసలింతకూ వీరి యుగపురుషత్వ స్థాపనకు సంరక్షకు వేమన మీద దాడి చెయ్య వలసి వున్నదా ? దాడి చేస్తే యింత నిర్బాధ్యతగానా ?

ఇప్పటికైనా మించి పోయింది లేదు. వేమన మీద యీ విరసంవారి యీ తీర్పులు సూత్రీకరణలు పరిశోధనా పూర్వకాలే, ప్రత్యేక పరిశీలనా ఫలాలే, గాఢ చింతనా పర్యవసానాలే అయివున్నట్లయితే ఆ పరిశోధనను ఆకరాలనువాదననువెంటనే ప్రచురించి వేమనకు వెలకట్టడానికి ఒక National Debateగా నిర్వహించమని మనవి చేస్తున్నాను.

ఈ పుస్తకం కడముట్టా చదివి యీ విరసం మిత్రుల వేమన విమర్శకు ఇంకా సమాధానం కావలసి వుందని పాఠక మిత్రులు భావిస్తే అప్పుడింకా చెప్పుకో వచ్చునను కొంటాను.

వేమన బలం ఆయన సాంఘిక దృక్పథంలోను సామాజిక దృక్పథం మీదను నిలిచి వుందంటున్నారు గదా వీరు. అతని ఆర్థిక దృష్టి వీరికి తగల్లేదన్న మాటే గదా! అదే వేమన పరిశోధనలో అందరి Blind spot అన్నాను.

అసలింకో విషయం—వేమన మీద కొల్లా వారెంతో వ్రాశారని కాదు, చాలా కొంచెం వ్రాశారు—అది పేజీన్నర పాటి కాదు. కాని ఆ కొంచెంలోనే అతనిలో ఆర్థిక కోణాన్ని పసికట్టారు. 'నాటి దశలో కొత్త ధోరణిని బయట పెట్టి ధనికులకు అడుగులకు మడుగులొత్తే వారి గుట్టును రట్టు చేశాడు ' అంటూ ఉదాహరించారు, వివరించారు కొంచెం. ఈ విషయాన్నైనా విరసం సాహిత్య సారథులు కానలేదు— ఖండనకు తీసుకోలేదు.

వేమన వీరబ్రహ్మాల వంటి వ్యక్తుల ఉద్యమాలకు కుల మత భూస్వామ్య వ్యవస్థ చెక్కు చెదరలేదని వారిసాఫల్య వైఫల్యాల మాటకూడ విమర్శలోకితెస్తోంటే నవ్వొస్తోంది, కొంచెం ఆత్మవిమర్శా స్ఫురణతో వ్రాయాల్సిన భాగంగదా అనుకొని.

వేమనను, తిరువళ్ళువరును భక్తిలో పెట్టేస్తున్నా* (మాధ్వరామానుజుల్ని జ్ఞాన మార్గంలో అవతలవారు చెప్పినట్లే), నామ్‌దేవుకబీరు ఎప్పెట్రాలను వెయ్యి పన్నెండు వందలేండ్లు ముందెప్పుడో వున్న వళ్ళువరును వీరికికలుపుతున్న ప్పటికీ, ఈ భక్తి వుద్యమంలోని వాళ్ళెవరూ వేమన బుజాల దగ్గరకు గానని కానక పోయినా, సామాజికార్థిక వీక్ష, తత్సమస్యాప్రాధాన్యం వేమనను వారి నుండి మౌలికంగా విడదీసి విశిష్టుణి జేస్తుందని ఎరగక పోయినా, విప్లవవారసత్వాన్ని

* వినయకుమార్ సర్కారు అదే అన్నారు.

వేమన నుంచి చెప్పుకోవాలని గుర్తించి నందుకు కొల్లావారికి రెడ్ శాల్యూట్ చెయ్యాల్సిందే.

## ఒకతప్పు దిద్దుకుంటాను :

'వీరశైవముధ్వంసముజేసిన జైనమతము ప్రసక్తిపరోక్షముగా కూడ వేమన యందులేదు. అదే విచిత్రము' (పేజీ–10) అని వ్రాశాను. పరోక్షంగా — అంటే పేరుబెట్టి చెప్పకుండా జైనభిక్షువు వాలకంమీద వ్యాఖ్యానించినట్టు చెప్పు కోవాల్సి వచ్చింది. అయితే, అది జైనభిక్షువు కాదు– మౌనదీక్షలోవున్న శ్వేతాంబర జైన సన్యాసి వాలకం అది.

'తలను వ్రేలవేసి తాలిమించుకలేక మూయుదెరచు కన్నుమూగి యగును
జ్ఞానమదియుగాదు కష్టంపు వేషంబు.............(1016, పమ్మి ఎడిషన్ 1906)

కృష్ణదేవరాయలనాడు కూడ 1511 కించుకంత అవతల యివతలగా ఈ జైన సన్యాసుల తలలు తరుగబడి శ్రీశైల మల్లికార్జునస్వామికి సమారాధనగా అర్పింప బడుతూ వున్నై. శ్రీశైలం మీదగల భిక్షావృత్తి శైవ మఠంయొక్క ఆజ్ఞాధికారి అయిన శాంతయ్య కొడుకు లింగని ఘనకార్యం అది. మల్లికార్జునాలయం ముఖ మంటపం తూర్పు ద్వారం యిరువేపుల స్తంభాల మీద వాడి శిలాశాసనం వుంది. వాణ్ణి రాయల ఆజ్ఞప్రకారంపట్టి వధించవలసి వచ్చింది. వాని చేతిలో తలలు పోయినవారు శ్వేతాంబర జైనులు. పెనుగొండలో జైనము వేమననాడు కూడ సజీవమై వుంది. తురకల ఆదరం జైనమతానికున్నది. అల్లావుద్దీనే కాదు అవురంగ జేబు ఆదరణకూడ వుంది. అవి రాజకీయ కారణాలనొచ్చు. జైన బిరుదావళి అనే గ్రంథం కర్నాటాంధ్ర దేశాలలోవున్నదానిలో.

'చండాంశు కిరణ తేజోపమాన ప్రచండాశేష తురక రాజాధిరాజ అవరంగ బాదిషావ సురత్రాణమాన్య సంస్కృత ప్రాకృత అపభ్రంశ మాగధీ పైశాచికాది యంత్ర మంత్రతంత్రాధి షడ్భాషాజిన చక్రవర్తీనాం' అని వుంది. [Studies in South Indian Jainism by S. Ramaswamy Ayyangar. and B, Seshagiri Rao]

చార్వాక భౌతికవాదంకన్న ఎంతో వ్యాప్తి, ఎంతో రాజాదరణ, ఎంతో శిల్ప వైభవం ఇంకేమేమో కలిగి మన సంస్కృతిలో సజీవ భాగస్వామ్యం నెరపిన జైన

మతం గూర్చి యిదొొక్కటే వేమన పద్యం. మరి చార్వాక ఖండనకు అన్ని పద్యాలు—విచిత్రమే.

వేమన దిగంబరత్వం జైనుల్ని చూచి అవలంబించిందికాదు — అవధూత సంప్రదాయంలోకి, లకులీశశైవంలోకి, వీరశైవంలోకి ఏనాడో చేదుకోబడింది. ఈ శైవ సంప్రదాయంలోనే వేమనకు దిగంబర యోగం. '(అర్మితముల) ఆర్మతముల కన్న అధికమైన మతము లింగ మతము కన్న లేదు జగతి' అనే పద్యాన్ని 'అర్హాత మున కన్న' అని దిద్దేసి వేమనకు ఇదిగో అర్హాతమతమైన జైనం బాగా తెలుస నేందుకు దాఖలా అని చెప్పనక్కరలేదు.

## ఒకకొత్త ప్రతిపాదనగా చర్చించండి.

ఖండన చాల జరిగిందనిపించవచ్చు. కాని మండనం మరెంతో జరిగింది అడుగుబట్టినవారిని, అడుగుబట్టినవాటిని పైకి చేదటం జరిగింది. రాళ్ళపల్లివారిని విడుపు లేకుండ విమర్శించినట్లయింది అక్కడికీ సంగ్రహించి చెప్పాను. ఇంకా చెప్పొచ్చు. రాళ్ళపల్లిమీద దేశంలో అభిమానం గణ్యతా చాలవుంది. వేమన విషయములో వారి మాటేమాట— మరొకరి మాటలేమ అన్నంత స్థితి ఏర్పడింది. వారు పెద్ద పండితులై వేమనపైన నిన్నటివరకు పొడవైన రచన చేసింది వారే ఇత రుల్ని చదవక వారినే చదివితే అదే అభిప్రాయం మరి. అలాగా నేనూ విశ్వసించిన వాణ్ణే నిజంగా. కాని, ఏ చెయ్యను ? వేమనను చదివాను. విభేదించాను, విభేదించడం గాదు, వారి ధర్మభంగాన్ని కనుగొన్నాను. వారిని మరల మరల చదవగ, ఆయన ఇతరుల కృషిని తనదికాదని స్పష్టం చేయకుండ, సమ్మరైజు చేస్తూ, వారి నొక్కొక్క దగ్గర చురకబెట్టుతూ పైచేయి దీసుకొంటూ, కొందర్ని తొక్కేస్తూ ఇంకా వింతలు చేస్తూ రామలింగారెడ్డిగారి 'బ్లూప్రింటు' మేరకు ఉపన్యసించి ఆ మాట దాచి వేసి సొంతమని బాహాటించడం ఆయనలో ధర్మభంగం. సొంత పరిశ్రమ లేకుండా ఇతరుల శ్రమని మాటకారితనంతో కేవలం తనదనిపించుకోవటం నేరం అను కొన్నాను. మన పాత అంచనాలు,అభిమానాలుకాసేపు అవతలబెట్టి'నిర్మొగమోటం'గా నిజానిజాలకై చూడమని మనవి జేస్తున్నాను.

సాహితీ ప్రపంచంలో పెద్ద విగ్రహాలను బ్రద్దలుగొట్టడం క్రీడగాదు; నాలో అవినయం కాదు. పాండిత్యం ముందు, విచక్షణ ఎదుట, రసజ్ఞతమోల వినయ వినమితోత్తమాంగుణ్ణే.

ఎవరితోనూ ఏకీభావంలేని యీ కొత్త సిద్ధాంత ప్రతిపాదనను విజ్ఞ లోకం ముందుంచుతున్నాను చర్చించమని. విశ్వ సంస్కృతీ వేదికలమీద తెలుగువారి కానుకగా ఎన్ని చెప్పుకోదగిన ఏకైక పురుషుడు వేమన గావున అతని రూపురేఖలు వెలార్చటం గొప్ప బాధ్యతతోగూడిన పని. ఒక జాతీయ కర్తవ్యం. దీర్ఘ పరిశీలనా ఫలంగా, బహుముఖ విచార పర్యవసానంగా సిద్ధాంతీకరించాను. అయినా ఇదే ఆఖరి తీర్మానమని అహంకరించడం లేదు. చర్చను ఆహ్వానిస్తున్నాను. ఖండనను కూడ ఆహ్వానిస్తున్నాను. Clash of opinion is an opportunity for a new synthesis అనే A. N. Whitehead అభిప్రాయంతో ఆహ్వానిస్తున్నాను.

## వేమనలేని ఆకాశవాణి :

అతడు కళ, శాస్త్రంకలిసిన చోటు. సత్యం సౌందర్యంఅవినాభూతమైనమూర్తి; హేతువూ ఆధ్యాత్మికానుభూతీ చిరవైరం మాని సహజీవనం నెరపే పరమర్షి ప్రశాంత ఆశ్రమ వాటిక; ఆస్తిత్యానాస్తిత్యాలు పరస్పరం వేషాలు మార్చుకొని నర్తించే రంగ స్థలం; అతిసనాతనతా వినూతనతల స్వర మేళన.

తెలుగు నుంచి ప్రపంచానికి చూపించగల ఒకే ఒక కవి. అతని కవితా వస్తువు విశ్వతో ముఖుడైన మానవుడు. అతని వస్తువు, కవిత దేశకాలావధులను దాటి నట్టిది. అతని నీతి ఆదర్శస్పర్శ కోల్పోని ఆచరణను బోధించేది. అతని ఉక్తి లోకోక్తి. అతని భాష పండిత పామర రంజకం. సూక్తి ముక్తావళికి సూటిగా సరిపోయే కవిత, విషయం అసలు అతనిదే

ఇటువంటి తెలుగు విశ్వకవి వాణి ఆకాశవాణి సూక్తి ముక్తావాణి కాక పోతున్నది. తెలుగు దేశంలో వున్న ఆకాశవాణి నాలుగు కేంద్రాల నుండి ప్రసార మయ్యే సూక్తిముక్తావళిని కాస్త జాగ్రత్తగా వినండి. అందులో వేమన విని పించడు. ఇంకెవరైనా వినిపిస్తారుగాని.... కాని తెలుగు ఆకాశవాణి కేంద్రాలు అతనికి అందులో స్థానం యివ్వటంలేదు. ఒకప్పుడు విజయవాడ కేంద్రం అతన్ని వినిపించింది. డాక్టర్ జి. వి. కృష్ణరావు ప్రసంగ విభాగానికి అధినేతగా వుండగా వినిపించింది. కొత్త సత్యనారాయణచౌదరి వ్యాఖ్యానంతో, కంఠంతో వినిపించేది. కొన్ని సంవత్సరాలుగా అది మళ్ళీ లేకుండా పోయింది. కారణం తెలియదు.

'వానను తడియనివారును, పూనక వేమన్న బోధ బొరయని వారున్ నానా దిక్కుల వెదకిన కానంగా బడరన్న' మాటను అసత్యం చెయ్యగలుగుతున్నది ఆకాశ వాణి. ఏదేమైన్నప్పటికీ ఆకాశవాణి ఉదయవాణిగా సూక్తిముక్తావళిలో వేమనసూక్తిని తెలుగు జాతి వినసోచుకోవాలను కోవటం అతి సహజం, అత్యుచితం, అవశ్యం.

## ప్రభుత్వమన్ననలో వేమన :

యోగివేమన తెలుగు విజ్ఞాన కేంద్రంగా ఏర్పరపడం రాష్ట్ర ప్రభుత్వం చేసిన ఒక మంచిపని. అందులో రీసెర్చి ఆఫీసరుగా బంగోరెను నియమించింది. అదిమరింత లక్ష్య సాధకం. వేమన పద్యాల వ్రాతపతుల్ని, వేమనమీద ఎవరెవరు ఎప్పుడెప్పుడు ఏఏ భాషల్లో ఏ రచన చేసివున్నా, ఏదోవ్రాస్తూ మధ్యలో వేమనప్రస్తావన తెచ్చివున్నా, అటువంటి రచనలన్నింటినీ బంగోరె సేకరిస్తున్నాడు. వ్యక్తిగత పరిచయాన్ని, స్నేహాన్ని, మంచిని పురస్కరించుకొని అపారంగా సేకరిస్తున్నాడు. ఎవరైనా పరి శోధన చేస్తున్నట్టు తెలిస్తే మా కేంద్రం మీకు ఉపయోగపడవచ్చు. విషయ సేకర ణలో మీ అవసరాలు తెలుపగలరు అని వ్రాస్తాడు. కలుస్తాడు. పరిశోధకుల్ని కలుపు తాడు. కలుపజూస్తాడు. కలిసినా, కలిపినా ఉపయోగించుకోలేని దురదృష్టం పరిశోధకు లలో సంస్కృత చిత్తం కొరవ కావటమే.

ఈ కేంద్రాన్ని దేవాదాయశాఖ క్రిందపెట్టి, యీ ఏడాదికిచ్చిన గ్రాంటు అర లక్ష మాత్రమే. అది సగం ఖర్చు కాకుండానే, చెన్నారెడ్డి మంత్రివర్గం మారగానే, కొత్త ముఖ్యమంత్రికేదో నోటువ్రాసి, తదనుమతి రాకముందే రీసెర్చి ఆఫీసరుకు మాత్రంఉద్వాసన ఉత్తర్వు జారీచేశారు దేవాలయాలకమీషనర్. ఇదంతా దేవాదాయాల మంత్రిగారికిఅసలేమీ తెలుపకుండానే, ముఖ్యమంత్రి అనుమతి లేకుండానే అట! ఇది వేమనమీద కమీషనర్‌గారి పగ కాబోలు ? దేవాదాయం వేమన కుపయోగపడరాదని కాబోలు.

ఏది కానీ యీ అధికారి చర్యను రద్దుచెయ్యక కోర్టు పాలుగానిచ్చిన రాష్ట్ర ప్రభుత్వం జాతి సంస్కృతికి మహాపచారం చేసినట్లయింది. మంత్రులు:శాసనభ్యులు వేమనకు జరిగిన యీ అవమానాన్ని కొనసాగనిస్తారేమో తెలియదు.

ధార్వార్‌లో Vemana Educational League ఒకటి ఏర్పడి కర్నాటక విశ్వవిద్యాలయంలో మూడులక్షల నిధితో ఏర్పరచనున్న Vemana Chairకు

కర్నాటక ప్రభుత్వం ఒక లక్ష మంజూరు చేస్తోంటే, ఇక్కడ యిచ్చిన యాభై వేలు ఖర్చుకాకముందే దేవాదాయాల ఆఫీసుభవంతిలోని గదినుండి వేమనను ఖాళీచేయించాలని ప్రత్యేక కృషి జరుగుతున్నది.

యునెస్కో వేమన పద్యాలు పన్నెండువందలు ఏరి, కాలిఫోర్నియాలోని పిలాసఫీ ప్రొఫెసరొక తెలుగువార్నీ, అమెరికన్ కవినొకర్నీ కలిపి ఉమ్మడిగా ఇంగ్లీషు పద్యాల్లోకి తర్జుమా చేయించి, తదాధారంగా ప్రపంచ భాషలన్నింటిలోకీ వేమనను పరివర్తనం చేయించి, ప్రచురించే ప్రణాళికను బృహత్తర వ్యయంతో చేపట్టిన సమయంలో సిగ్గు పడకుండా, వెనకాడకుండా ప్రభుత్వ వేమన విజ్ఞాన కేంద్రాన్ని మూత వేయించే ఘనకార్యానికి ఉపక్రమణిక, ముఖ్యమంత్రి అనుమతి, దేవాదాయ శాఖామంత్రి అనుమతి లేకుండా, మంత్రి మండలికి తెలియకుండా, జరగటం, జరగ నివ్వటం జాతి సంస్కృతికి తలవంపులు గాదా?

వేమనవిషయం దేవాదాయాలశాఖక్రింద పెట్టడంమానేసి, విద్యాశాఖ క్రిందికో సాంస్కృతికశాఖ క్రిందికో బదలాయించి లక్షల నిధిని మంజూరుచేసి ప్రత్యేకంగా వేమన వ్రాత ప్రతులనే గాకుండా, ప్రపంచ భాషల్లో వేమన మీద రచనలు, ప్రస్తావనలు అన్నింటినీ సేకరించి భద్రపరచే పనిని శాశ్వతీకరించాలి.

వేమన పుట్టి, గిట్టిన స్థలాలను గూర్చిన దాఖలాల సేకరణ, విచారణ, పూర్తి కావటంగాయి, అసలు సరిగా మొదలు కాలేదు. (నా నిర్ణయాలుకూడ యీ లోపల ఊహాలే). దక్షిణ భారత మంతా అతని సంచార ప్రచారాలున్నై. ఆ ఆచూకీకి ఆరంభమే లేదింకా. గోదావరి—రామేశ్వరం—కొంకణాల మధ్య అతని జాడలకై వెదికే పథకం ఒకటి ప్రభుత్వం రూపొందించి మంజూరు చెయ్యాలి. వేమన తాత్త్విక భావ పరిణామానికి తమిళ కర్నాటక దేశాల్లోని మతాలు సంప్రదాయాలు తాత్త్వికోద్యమాల నేపథ్యాన్ని ప్రత్యేకించి అధ్యయనం చేయించాలి. ఉత్తర భారతంలో మధ్య యుగంలో లేచిన నాథమార్గం, బౌద్ధ శిథిలాల మీద లేచిన బెంగాలీ 'బాల్', ఒరియా 'ఒడెక్కో', శిథిల సహజయానం, సుందరదాసు సహజానంద సంప్రదాయం, కబీరు, దాదూ, దరిబేసి, ఆల్, రాయిదాసు, లాల్దాసు మొదలైన సంప్రదాయాల సమాచారం, సాహిత్యం, వేమన కేంద్రానికి కూర్చవలసి వుంటుంది.

ఇంగ్లాండు, ఫ్రెంచి దేశాల్లో లైబ్రరీలను గాలిస్తున్నాంకాని పోర్చుగీసువారి మీదికి మనదృష్టి పోలేదు. విజయనగరం కాలం సగం నుంచీ, 1700

వరకూ—వేమన కాలంలో కూడా—రెండు వందలేండ్లు దక్షిణదేశ మంతా కలియ దిరిగిన వాళ్ళు పోర్చుగీసు వాళ్ళే. వారి మత ప్రచారకులో, వాళ్ళ వర్తక కంపెనీ ఉద్యోగులో వేమనను వినటమే కాదు చూచేవుంటారు. ఆయా ప్రచారకుల కంపెనీ ఉద్యోగుల వ్రాతలను వేమునకై గాలించవలసి వుంటుంది. 'వినని వింతలెల్ల వినుము కొంకణమందు' అనటం గోవాలో వీరిని గూర్చి కూడ కావచ్చు

ప్రపంచ తెలుగు మహాసభలప్పటికి నాగార్జున వేమనలమీద అకాడెమీ ఏమీ వ్రాయించడంలేదని ముందుగా నాకందిన సమాచారం. అందువేతే వారిద్దరినిగూర్చి అప్పట్లో వెంటనే క్లుప్తంగా చెప్పి ముద్రించ (పేజీ—VII) దలపెట్టానని ఇంతకు ముందు వ్రాశాను. నాగార్జునుని మీద వ్రాయించలేదుగాని వేమనమీద వ్రాయించారని తెలియవచ్చింది. కళాప్రపూర్ణ మరుపూరు కోదండరామరెడ్డిగారిచేత వ్రాయించారు అప్పట్లో తొందరపడి సంక్షేపంగా చెప్పడానికి కారణంగా నావద్దనున్న సమాచారమది. అంతవరకే

ఈ రచన మాత్రం చేతనే తెలుగువారి విశ్వకవి — తాత్త్వికునకు ప్రపంచ తెలుగుసభల్లో యివ్వవలసిన స్థానం, తగినప్రాధాన్యం, యిచ్చినట్లు భావించలేక పోతున్నాను. ద్వారాలమీదగాని, చిత్రాల్లోగాని, ప్రసంగాల్లోగాని వేమన ఉన్నాడా? 'తెలుగువాణి' అని పేరుపెట్టి ప్రపంచ భాషగావున్న ఇంగ్లీషులోనూ, మన తెనుగులోనూ మున్నూరు పుటలకు మిగిలిన ఒక బృహద్గ్రంథాన్ని ప్రభుత్వం తెచ్చింది. అందులో వేమననుగూర్చి ఏమైనా వుందా?

అదంతా గతచరిత. మళ్ళీ యిప్పుడు కౌలాలంపూరులో ప్రపంచ సభలు చెయ్యబోతున్నది ప్రభుత్వం. ఈ పర్యాయమైనా మన విశ్వకవికి చెయ్యవలసినంతా చేసేట్టు చూడమని కోరుతున్నాను.

## మా వేమన వికాసకేంద్రం: ఆశయం, అభ్యర్థన

ఇది తొలి ప్రచురణ, చూస్తున్నారు దీనిని. ఇక మాతక్షణ ప్రణాళిక: వేమన పద్యాలను తత్త్వం, మతం, హేతువు, నీతి, ఆర్థికం, రాజకీయం, కవిత, లోకరీతి వంటి శీర్షికల క్రిందికి విడగొట్టి నూరు—ఇన్నూరుసంఖ్యలోపల మేలెన్నిన పద్యాలను వ్యాఖ్యా వివరణలతో మాలగా ప్రచురించడం.

వేమన జీవితం బుర్రకథ మొదలుకొని సినిమావరకుగల వివిధ కళారూపాల్లో ప్రతిష్ఠించడం.

ఈ ఆది దిగంబర కవి మాకొక సంకేతమే— నగ్నసత్యం చెప్పడానికి సంకేతం. అలా చెప్పిన పండితులు మహాపురుషులు మనకింకా వున్నారు. వేదం వెంకటాచలం, పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి, కవిరాజు త్రిపురనేని రామస్వామి ఇంక ఇతర హేతువాదులు. వారిమీద పరిశోధనలు, వారి రచనల ప్రచురణ — వారిమీద, వేమన మీద, మానవతాహేతు వాదాలమీద గోష్ఠులు చర్చలు మా ప్రణాళికలో భాగం.

సమకాలిక జీవితంలోని నగ్నసత్యాలను వెలివరచడానికి Investigative Journalismతో ఒక పత్రిక నెలకొల్పటం ధ్యేయం.

ఇందుకు నిధులు అవసరం. అమెరికాలోవున్నడాక్టరు దంపతులు మాలెంపాటి ఇందిరా ప్రియదర్శినీ శ్రీహరిగారలు పాతికవేల నిధిని యీ సంస్థపేర వేసి ఆరంభ నిధి సమకూర్చారు. ఈ పుస్తకంతో మరి మీ ముందుకొస్తున్నాం మీ విరాళంకొరకు.

## మన్నించండి, రెండు భాషలు.

పీఠికలో వాడుక, పుస్తకంలో వేడుక. ఆస్వాదించలేరా?

## ఇద్దరు వెంకటేశ్వరావులు

వెంకటేశ్వరరావు అనేపేరుతో మాలో ఇద్దరు రచయితలం వున్నాం. అది గందరగోళానికి దారితీసింది. త్రిపురనేని వెంకటేశ్వరరావు అంటే గుడివాడలో వైద్యులై కవిరాజ సాహిత్య విహారం నడిపే డాక్టర్ త్రిపురనేని వెంకటేశ్వరరావనే అనుకోవడం కద్దు. అనుకోవడమేమిటి? అలాగే వ్రాసేశారు — చరిత్రలో — కుల చరిత్రలో. నన్నూ, నారచనలనీ బాబాయి కావాల్సిన డాక్టర్ వెంకటేశ్వరరావుకు దఖలు దస్తావేజు వ్రాసి యిచ్చేశారు 'కమ్మవారి చరిత్ర'లో. అందులో వ్యావహారిక భాషా రచయితల జాబితాలో [పేజీ—341] తొలిపేరుగా వ్రాస్తూ,

"డాక్టర్ త్రిపురనేని వెంకటేశ్వరావు: గుడివాడ. భారత తత్త్వశాస్త్ర పరిశీలన—గొప్పవ్యాస కర్త" అని వ్రాశారు.

ఈ గందరగోళం చాల విచిత్రమైన సన్నివేశాలకు దారి తీసింది. ఇటీవలి ఘటన చెప్తాను.

గుంటూరుజిల్లా గూడవల్లిలో త్రిపురనేని రామస్వామి చౌదరి పారిశ్రామిక శిక్షణా సంస్థ ప్రారంభోత్సవంలోని మాట.

నన్ను ఆహ్వానించితే వెళ్ళాను నిరుడు. పంచె కట్టులో వెళ్ళాను. అంచేత డాక్టర్‌గా కనిపించలేదు అక్కడి హెడ్మాష్టరుగారికి.

మీరే డాక్టర్ వెంకటేశ్వర్రావుగారా ?

కాదు

భారత తత్త్వశాస్త్ర పరిశీలన డాక్టర్‌గారిది కదా !

కాదు

డాక్టర్ గారిది కాదంటారా ??? — — రెట్టించారు

నాదేనండీ అన్నాను నవ్వుతూ; నమ్మకం కుదరలేదు హెడ్మాస్టరుగారికి. తమ మునిస్వామినాయుడు హైస్కూలు లైబ్రరీ నుంచి ఆ పుస్తకంతెప్పించారు అప్పటి కప్పుడు. అట్టమీదా అట్ట లోపలా పేర్లు చూచారు అక్కడ డాక్టర్ డిగ్రీలేదు. పైగా లోపల 'కృతజ్ఞతల'లో మాతాతగారు లక్ష్మీపెరుమాళ్ళగారికి, మా బాబాయి డాక్టరు త్రిపురనేని వెంకటేశ్వరావుగారికి అని వుండటం చూచుకొన్నారు—బిగ్గరగా చదివారు. అప్పటికి గాని నన్ను ఆ పుస్తకం యొక్కరచయితగా ఒప్పుకోలేదు. ఆ కాపీ అట్టలు కోల్పోయి వుంటే నా పని ఏం గాను హెడ్మాష్టరుగారూ అన్నాను.

'మరి వైద్య గ్రంథాలు, నీవూ- నీ శరీరము; నీవూ- నీ మెదడు — — వారి వన్న మాట.'

'అవును. నీవూ—నీ మెదడులో 'మా అన్నగారబ్బాయి త్రిపురనేని వెంకటేశ్వ ర్రావు ఈ రచనకు ప్రేరణ అని వుంటుంది తెచ్చిచూడండి'—అన్నాను.

'ఇంకా చెకింగ్ ఎందుకులెండి. మరి సాహిత్య సామ్రాట్టు' అనే కావ్యం మీదా, వారిదా ?'

'నాదికాదు, పేరు వారిది. వారు నాటకాలు వగైరా రచనలు చాల చేస్తున్నారు.'

నా మొగంలోకి చూశారు - మొగం తిప్పుకొన్నాను.

ఇటువంటి ఇరకటాలు చాల కలిగేవి నా రేడియో ఉపన్యాసం విని,పత్రికల్లో నా వ్యాసాలు చదివి డాక్టరుగారివే ననుకొని వెళ్ళి....నప్పటి వింతలు గమ్మత్తులు వినవస్తుండేవి.

రాజకీయ జీవితవశాన చాలకాలం ఎక్కడో శ్రీకాకుళం జిల్లాలో దూరంగా వుండిపోయాను. అది మానేసి, వచ్చి వ్యాపార వ్యవహారాల్లో మునిగితేలాను. వ్రాసిన కావ్యాదులు అచ్చువేయక, లఘుపచనలేవో చేస్తే వ్యాసాలుగా ప్రసంగాలుగా

పత్రికల్లో సంచికల్లో రేడియోలో రావడంతో సరి- వాటిని పుస్తకాలుగా ప్రచురించు కోక, సాహిత్యపు సంతలు మేళాల పోంతపోక, సాహితీ స్వాములతో పరిచయాను బంధాలు పెట్టుకోక, పెంచుకోక, ఒక్కమాటలో సాహితీవీధిలో నివాసం కోసం శ్రద్ధ చేయకుండా వుండిపోయాను. డాక్టరుగారు కవిరాజ సాహిత్య విహారం పెట్టీ, సాహిత్య అకాడెమీ సభ్యత్వం కలిగీ, సాహిత్య సభల్లో వార్తల్లో వుండటాన నన్నూ వారి క్రిందే జమ వేసుకోవటం జరుగుతున్నది.

అందుకే యీ గందరగోళం నుంచి తప్పించాలని కాబోలు, బంగోరె యోగి వేమన తెలుగు విజ్ఞాన కేంద్రం తరపున 1939 నాటి బ్రౌన్ రెండో సంకలనం వేమన పద్యాలు ప్రచురిస్తూ పీఠికలో వేమనమీద వ్రాస్తున్నది.

త్రిపురనేని వెంకటేశ్వరరావు — గుడివాడ డాక్టర్ కాదు, బెజవాడ కాంట్రాక్టర్ అని స్పష్టపరచారు. డాక్టర్ గోపీ అలానే రిపీటు చేశారు.

కాంట్రాక్టు చేశాను. రాష్ట్ర సంఘాన్ని అధ్యక్షించాను. అయినా ఆ వృత్తీ ఆ పదవీ నా లెటర్ హెడ్ మీది కెన్నడూ తేలేదు మరి. అది లేకుండా గుర్తు పెట్టు కోలేరా ?

## వార్తాకవిత : దండి వార్తాభిధానము

వార్తా కవిత పుట్టు పూర్వాలకై గాలించుతూ ఆచార్య దండి వార్తాభిధాన మొకదానిని కాంతిగుణ నిర్వచనంలో పేర్కొన్నట్లు యీ పుస్తకంలో జ్ఞాపకం చొప్పున చెప్పి వూరుకొన్నాను. దండి కావ్యాదర్శమే లభించింది గావున — కాంతి గుణం నిర్వచించిన శ్లోకం వివరణ పాఠం యిస్తున్నాను.

కాన్తమ్ సర్వజగత్కాన్తమ్ లౌకికార్థ అనతిక్రమాత్
తత్ చ వార్తాభిధానేషు వర్ణనాసు అపిదృశ్యతే — (1-85)

కాన్తిగుణమ్ నిరూపయతి - కాన్తామితి॥ లౌకికస్య లోకసిద్ధస్య అర్థస్య అనతిక్రమాత్ తన్మాత్రస్యైవ వర్ణనాత్ ఇత్యర్థః సర్వజగతామ్ కాన్తమ్ సాధారణ మనోరమమ్ ఇత్యర్థః।

పద్యమ్ కాన్తమ్ కావ్యగుణ విశిష్టమ్ తథాచ సహృదయ మనోరంజక లోక సిద్ధకస్తు వర్ణనమేవ కాంతిగుణ ఇతి।

ఉక్తమ్చ క్రమదీశ్వరేణ యథా, వర్ణనా అత్యుక్తిశూన్యాయాసా కాంతి రభిధీయతే ఇతి। ఇయమ్ అర్థగా వినా అర్థానుసంధానమ్ అస్యాః ప్రతీతి విరహాత్।

తత్ చ కాన్తిమత్ వాక్యమ్ అనామయప్రియాలాపః 'అనామయ ప్రియాలాపో వర్తిః వార్తా చకథ్యతే ఇతివచనాత్ తస్య అభిధానేషు కథనేషు తథావర్ణనాసు వస్తు స్వరూప మాత్ర నిరూపణేషు దృశ్యతే అనామయ ప్రియాలాపేషు వర్ణనాసు చ యథావత్ సత్యనిరూపణస్య ఏవ ఔచిత్యాత్ అయథావర్ణనే లౌకిక వ్యవహార విసంవాదః స్యాత్ ఇతి భావః॥

లోకసిద్ధమైన అర్థమును అతిక్రమించకుండ వర్ణించడం వలన సర్వ జగద్రంజకంగా వుంటుంది. అంటే లోకసిద్ధమైన వస్తువర్ణనమే కాంతి అనే కావ్య గుణం. క్రమదీశ్వరుడు అనేవాడు అత్యుక్తి శూన్యమైన వర్ణనే కాంతి అన్నాడు. వస్తువులోకసిద్ధమయింది కావాలని కవితాకథనరీతి అతిశయోక్తి శూన్యంగా వుండా లని—లోకవృత్తం యొక్క యథాతథ వర్ణన కాంతి—అంటే Realism.

ఇది అనామయ ప్రియాలాపం గావాలి. అనామయ ప్రియాలాపమేవర్తి—వర్తి అంటే వార్త—అనామయమైన ప్రియమైన ఆలాప, వర్ణనలో సత్యనిరూపణే ఉచితం. అయథార్థవర్ణన లోకవ్యవహారంతో పొసగదు—అపిలోక వ్యవహారవంచనం అవుతుంది.

అనామయ ప్రియాలాపం అంటే ఆరోగ్యప్రదమైన ప్రియమైన మాట. అది వర్తి, వార్త అట. ఎలాగంటే, వర్తి అంటే మందు చెయ్యటం అని అర్థం ఒకటుంది. వార్త అంటే ఆరోగ్యం అనికూడా అర్థం వుంది. వంకాయకు వార్తాకం అంటాము. ఎందుకని అంటే, వార్త అంటే ఆరోగ్యం, దానిని చెడగొట్టేది గాబట్టి వార్తాకం అయింది. కావున వార్త అంటే ఆరోగ్యకరమైన పథ్యమైన హితమైన —అనగా, నీతి బోధకమైన ప్రియవచనం అనిఅర్థం. అంటే నీతి బోధ, హితబోధ, పథ్యబోధ అది వార్త అవుతున్నది

కావ్యాదర్శం ప్రకారం లోకవృత్తము (ఇతిహాసము), నీతి (అనామయ ప్రియాలాపము) అన్నవి వార్త అనిపించుకొన్నాయి గాని వార్త అంటే లోకోక్తి అనిస్పష్టంగాఅర్థాన్ని సంస్కృతంలో సంతరించుకోలేదు అని చెప్పుకోవచ్చు. కానిఅదే ఆధారభూమి, సూతికాగృహమూ అనొచ్చు. ఆ అర్థం తెలుగులోనిప్రత్యేకత అనొచ్చు. కాకపోతే కన్నడ 'కవిరాజ మార్గం'లోనే అలాంటి అర్థం పర్యవసితం అయిందేమో తెలియదు. కవిరాజ మార్గం దండి కావ్యాదర్శానికి అనువాదం, వివరణ, కన్నడ సాహిత్యరంగ స్థలానికి స్వతంత్రంగా చేసిన అన్వర్తనంగదా. అందులోగాని లోకోక్తి

ప్రాయమైన లోకవృత్త, లోకనీతి రచనమని సంపూర్ణంగా లేకపోతే, వార్తాకవిత్వం తెలుగు ప్రత్యేకతకు ప్రత్యేకత అనాలి.

## ఇదిగో, ఆబ్దిక మంత్రంలో తల్లి....

తల్లి రంకు దెలుపు తద్దినములను గూర్చి యిందాక ప్రస్తావించి నప్పటికి ఆ తద్దినాల మంత్ర పాఠం దొరకలేదు. ఆ మంత్రం యొక్క తాత్పర్యం సరిగా గుర్తులేక తప్పుగా కూడా ఇచ్చాను. అందుకు మన్నించాలి. ఇప్పటికి దొరికింది. ఇదిగో, యిస్తున్నాను.

1. మంత్రమ్॥ యన్మే మాతా ప్రలులోభ చరతి అననువ్రతా,

తన్మే రేతః పితావృంక్తాం మాభురన్యో వపద్యతామ్

(.... ... శర్మణే స్వాహా.... శర్మణే అస్మత్ పిత్రా) ఇదమ్ నమమ్.

పదమ్ :

యన్మే మాతా ప్రలులోభ చరతీ అననువ్రతా

తన్మే రేతః పితా-వృంక్తాం మా ఆభుః

అన్యః అవపద్యతాం।

యన్మే మాతా ఇతి ॥ యత్ రేతోఽన్యదీయమ్ మేమమ మాతా భర్తుః అననువ్రతా అనను కూలాచరతీ చరన్తీ ప్రలులోభ ప్రకర్షేణ ఇయేష। (సాధ్వీ నామపి మానస వ్యభిచార సంభవాదేవ ముచ్యతే) తత్ రేతః మేపితా వృంక్తాం ఆచ్ఛిద్య స్వీకరోతు. (మానస వ్యభిచార నిమిత్తమ్ రేతసి సాంకర్యే మాభూత్) ఆ భవతీతి ఆభుః ఏతావతా నిమిత్తేన మా మాంప్రతి పితృత్వేన అభవన్ అన్యః అవపద్యతామ్ మోఘాశోభవతు యన్మయా దీయమానమ్ హవిః తన్నలభతామ్.

2. మంత్రమ్॥ యాఃతిష్ఠన్తి యా ధావన్తి యా ఆర్ద్రోఘ్నీఃస్థుషీః

అద్భిర్విశ్వస్య భర్త్రీభిరన్తస్త్యమ్ పితుర్దధే ॥

పితురన్యమ్ అస్మిన్ కర్మణి భాగిత్వేన ఆగచ్ఛన్తమ్ అన్తర్దధే వ్యవహితమ్ కరోమి ॥

— 'The Sanatana Dharma of Hindu Marriage' (The Mysore University Magazine, March, 1926) by Vedam Venkatachallam Ayyer —

ఈ మంత్రాలు ఏకాగ్ని కాండలోనివి — వ్యాఖ్య హరదత్తాచార్యునిది— ఆంగ్లానువాదం వెంకటాచలంగారిది. (వేదం వెంకట్రాయ శాస్త్రిగారి సహోదరులు).

నా తల్లి నా తండ్రి యందు అనుకూల, అనువ్రత కాకుండా మోహాతిశయం చేత అన్యపురుషుని రేతస్సును నా తల్లి భర్త అయిన నా తండ్రి తన రేతస్సుగా అంగీకరించు గాక! నేనిచ్చే తర్పణలను తనవిగా గైకొనవచ్చే ఆ అన్యపురుషునికి చెందకుండుగాక! అతని ఆశవ్యర్థమై అతడు తొలగిపోవుగాక!

నిలుకడ కలిగి లేక పర్వునట్టివై తడిసిన తేమగిల్లిన ఎల్ల వానిని నశింప జేయునట్టివి, విశ్వసంభరణములైనట్టివి అయిన యీ (తర్పణ) జలంచేత నా తల్లి భర్త అయిన నాతండ్రి కంటె అన్యుడైన వానిని అడ్డగించి అవలకు బుచ్చును గాక!

ఈ మంత్రాలు మహాదారుణాలు గదా! తల్లి రంకుటాలనీ, తన తండ్రికి తాను పుట్టలేదని, ఇంకొకడికి పుట్టినానని స్పష్టంగా తెలిసి, తెలిపి, తన లీగల్ తండ్రికే తర్పణలిప్పిస్తున్న మంత్రాలు ఇవి. తల్లినేగాదు, ఆ మంత్రాలతోనే నాయనమ్మని, మునినాయనమ్మని రంకుటాళ్ళుగా తేల్చి తాతకు, ముత్తాతకు తర్పణ లిప్పించే మంత్రాలివి. పెండ్లి అంటూ జరిగినప్పటికీ పై తిరుగుళ్ళకు యిల్లాండ్ర కింకా అనుమతులున్న పరిణామ దశ ఒకటి మన ఆర్యసమాజంలో గడచిందని, శ్వేతకేతూపాఖ్యానం, వివాహ సాక్షి అయిన అగ్నిదేవుడు నర్మదాతీరస్థ మాహిష్మతీ నగరంలో స్వేచ్ఛాచారియైన గాథ, అవంతీ మగధా సౌరాష్ట్రి దక్షిణాపథ సింధు తదితర దేశాల్లో వివాహ జీవితంలో స్వేచ్ఛాచారంవుందని బోధాయన ధర్మ సూత్రాల్లో చెప్పుకొన్నారని అందుకు దాఖలాలిచ్చి, అటువంటి పరిణామదశలో యీ శ్రాద్ధ మంత్రాలేర్పడినవంటూ సనాతన ధర్మం అనేదానిలో హిందూ వివాహం ఇటువంటి స్వైరవర్తనా పురస్కృతమని వెంకటాచలంగారు ఆ వ్యాసంలో వివరించారు.

ఇప్పుడీ మంత్రాలు ఆంధ్రదేశంలో అచ్చయ్యే ఆబ్దిక మంత్రాల్లో దొరకడం లేదు. వీటి దారుణాన్ని ఎరిగి తీసేశారు. పురోహితుల్లో చాలామందికి ఇటువంటి మంత్రాలున్నవన్న స్ఫురణే ఇప్పుడులేదు. తెలిసినవాళ్ళు వుండేవని అయినా చెప్పేట్టు లేరు. నన్నెరిగిన నా మిత్రులే నా సంగతి తెలిసి ఎలా తప్పుదారిన పెట్టారో XXXVI పేజీలో చదివే వున్నారు. ఇప్పటికి ఇంతగా పెల్లగించితేగాని తెలియని మంత్రాలు ఆనాడు వేమన చెవికిసోకి, కళ్ళకి తగిలి వుండకపోతే 'తల్లిరంకు దెలుపు

తద్దినములు' అని అనగలుగుతాడా ? ఇక ఇప్పుడాలోచించండి, అతడెంత చదివిన పండితుడో, ఎంత పరిశీలించినవాడో మరి. కాని తెరువున కల్పితమైన కర్మకాండ కెంత క్షోభించాడో !

పాపం, హరదత్తాచార్యుడు యీ దారుణమైన మంత్రానికి నేటి వివాహ జీవితపు మంచి స్థితిలో ఒక గతి కల్పించడానికి అక్కడ మానసిక వ్యభిచారాన్ని ప్రతిపాదించాడు. అయితే పొసగడంలేదు. మనకామంత్రమూవద్దు -ఆవ్యాఖ్యావద్దు.

## కృతజ్ఞతా వాచకం

వేమనమీద దేశంలో వివిధ గ్రూపుల్లో జరుగుతున్న చర్చల్లో రూపుదిద్దుతున్న ప్రశ్నల్ని ఎప్పటికప్పుడు నాకువ్రాసి, దీనికి మీ సమాధానమేమిటో మీ అభిప్రాయ మేమిటో చెప్పండి అంటూ పీఠిక యింత దీర్ఘ దీర్ఘం కావడానికి కారణభూతులైన వారు శ్రీ బంగోరె (బండి గోపాలరెడ్డి)గారు. అడిగిన సమాచారాన్ని, అడగని సమాచారాన్నీ ఎంతో పంపించితోడ్పడిన బంగోరెకు ఎలా చెప్పకుండగలను నా కృతజ్ఞత ?

ఇందులో కొందరి అభిప్రాయాల మీద వ్రాయడానికి కొన్ని కారణాలవల్ల వెనకాడితే, ఆ కారణాలను కాదని నిలదీసి ముందుకుతోసిన కృష్ణాబాయిగారినీ, అడిగిన పుస్తకాలు ఎక్కడ్ణుంచో ఎవరెవరి నుంచో సంపాదించి పంపి కొన్ని ఉల్లేఖనాలకు అవకాశం కలిగించిన మా ప్రసాదు (చలసాని)నీ పేర్కొనకుండలేను.

నామ సూచిక తయారు చెయ్యడం ప్రయాసతో కూడిన పని. ఆ చాకిరీ ఎంతో చేసిపెట్టిన మా హయగ్రీవరావు టి. B. A. (Hons) (విశాలాంధ్ర ఉప సంపాదకుడు ప్రస్తుతం)ని ఎలా మరచిపోగలను ? ముఖచిత్రం వేసినందుకని గాదు గాని, మరొకటీ మరొకటీ చేసిపెట్టి నాతో అంటుకుపోతున్న మోహన్ మాట చెప్ప కుండలేను.

స్క్రిప్టు పూర్తిగాని రచనను అంగీకరించి, అచ్చు నిలబెట్టేసి అప్పటికప్పుడు వ్రాసి యిచ్చే వ్రాతను, మెషీన్‌ప్రూఫ్‌లో కూడ చేర్పులు మార్పులు చేసినా తట్టు కొని యీ పుస్తకాన్ని అచ్చువేసిన విద్యోదయ ప్రింటర్సు, శ్రీ అన్నపూర్ణ ప్రింటింగ్ ప్రెస్సు, యస్వీ ప్రెస్సు యాజమాన్యాలకు, సిబ్బందికి మరీ మరీ కృతజ్ఞతలు.

సున్నమనగ మహిని సూక్ష్మమై యుండును, సున్నమనగ నిహముఃజూపుచుండు
సున్నమే పరంబు జూపుచు నుండురా .......... ॥విశ్వ॥

సంసారస్య న నిర్వాణాత్కించిదస్తి విశేషణమ్
నిర్వాణస్య న సంసారాత్ కించిదస్తి విశేషణమ్—(24-19) మాధ్యమికకారికాః
ద్వయోరప్యాగతిగతీ ప్రస్థితిశ్చ న తత్త్వః
లోక నిర్వాణయోః తస్మాత్ విశేషః క ఇవార్థతః – (1-64) (రత్నావళీ)

*        *        *        *

భావాభావము లంటక సేవించెడు బట్టబయలు స్థిరమతి లోనన్
కేవల శివపరధ్యానము తావలమును గన్నవాడె ధన్యుడువేమా ॥

నచ అభావోఽపి నిర్వాణమ్ కుతఏవ అస్యభావతా
భావాభావ పరామర్శక్షయో నిర్వాణముచ్యతే – (1-42) (రత్నావళీ)

*        *        *        *

మర్మ మెరుగలేక మతముల గల్పించి యుర్విదుఃఖులగుదు రౌకరికొకరు
గాజుటింట కుక్క కళవళ పడురీతి .......... ॥విశ్వ॥
మతములోననున్న మతములన్నియు గోసి ఘటములోననున్న ఘనునిదెలిసి....
(మతము మమతజిక్కి మరి దేహమున్నది)(సర్వమతములందు సన్యసించు)

సర్వదృష్టి ప్రహాణాయ యస్మద్ధర్మమదేశయత్
అనుకంపా ముపాదాయ తన్నమస్యామి గౌతమమ్——
(27–30)మాధ్యమిక కారికాః



శ్రీ వేమన యోగీంద్రుఁడు.

"తల్లి గర్భమందుఁ దాఁ బుట్టి నప్పుడు
మొలను బట్టలేదు ముడుపు లేదు
వడువు బట్టఁ గట్ట వచ్చుఁ బాటు కాదొకో వి॥"

(తంజావూరి రాచనగరునందలి చిత్రపటమునుండి తీసినది)

By the Courtesy of Rao Sahib R. KRISTNARAO Bhonsle M. R. A S.

ఈ కృష్ణరావు భోస్లే తంజావూరేలిన ఛత్రపతి శివాజీ తమ్ముడు ఏకోజీ సంతతిలోనివాడు. తంజావూరి జమీందారు.

(కీ. శే. వంగూరి సుబ్బారావుగారి సేకరణ (1922)



1-వ పటము.

వేమన యోగి.

[ ఇది వావిళ్ళవారు 1914 సంవత్సరమున సంపాదించి 1917 లో ప్రకటించినదానికి నకలు. వారి మాతృక పెరంబూరు పెన్షన్ సుబేదారుగారికడం దీసికొనినదని చెప్పినారు. 2-వ పటములోం గొంచెము పోలికయున్నది. ఇట్టిప్రతిమలు కూడ వేమన్నవని వాడుక యుండెనో యిది కల్పితమో నిర్ణయింపలేము. మొత్తముమీఁద రెండురకములు బొమ్మలు కనఁబడుచున్నవి. ఒకటి దిగంబరికాక పూర్వపుది, రెండవది తరువాతదియని చెప్పవచ్చునేమో ? ]





3-వ పటము.

వేమన యోగి.

[ ఇది 1807 లో పమ్మి త్యాగరాయశెట్టి కంపెనీవారు వేమనపద్యములపీఠిక 14-వ పుటలో ప్రకటించిన దానికి నకలు. ఇది మన ప్రస్తుతచిత్రపటము. తంజావూరి ప్రతికి దగ్గఱగానున్నది. కాలుమాత్రము మారియున్నది. ముందున్నట్లే తంజావూరి పటమునందును పండ్లున్నవి. (ముద్రితప్రతియందున్న ఫొటోలో రాలేదు.) ఇది వదరు కంపెనీవారొక సిపాయియింట చూచిన రంగులప్రతిమకు నకలుగాఁ దీసితిమని చెప్పిరి. వీరే పీఠిక 2-వ పుటలో ప్రకటించిన వేమనయోగీంద్రులను పట మఱవస్వామి పటమునకు నకలనిరి. ]

1807 కాదు — 1897 లో





2-వ పటము.

వేమన యోగి.

[ ఇది రాయవరపు పూర్ణయాచారిగారు 1913 సంవత్సరం బందరు ప్రతిలో ప్రకటించినదానికి నకలు. దీనికి మాతృక యెచ్చటిదో తెలియదు; వేమన్న దిగంబరి కాక పూర్వస్థితిలో నుండెనేమో? 1-వ పటమునకు పోలిక యున్నది. ఈ బందరు ప్రతిలో వేమానందస్వాములవారని గడ్డము, జడలు గల వేరొకపటము విచిత్రముగనున్నది. అం దీమాత్రమైన కలేదు. ]

నమ్మరాని బొమ్మ

పై. మూడుబొమ్మలూ తమిళదేశంలోనే దొరకడం విశేషం.

ఈ తెలుగుదేశపు బొమ్మ తాలింఖానా పహిల్వాన్.

పమ్మివారి బొమ్మ (1897), వావిళ్ళవారి బొమ్మ (1914) ఒక్క దగ్గరవే.

పెన్షన్ సిపాయి, పెరంబూరు పెన్షన్ సుబేదారూ ఒక్కరే. సిపాయికి వేమనలో శ్రద్ధ విచిత్రమే.

కాని ఆ సిపాయి వేదాంతి. కవి, శతకకర్త. 'మనోన్మనీ' శతకకర్త.

పేరు . రామమూర్తి యోగి. బుద్ధవరపు కొండలరాయ చిదానంద యోగికి శిష్యుడు.

ఆ గురువు అచలమత గ్రంథమైన బృహద్వాశిష్ఠ సిద్ధాంత నిర్ధారణులు.

అందుకే అతని ఇంట్లో వేమన యోగి బొమ్మలు.

అతనివే గోచి సూచనలేని బొమ్మా, గోచితో పద్మాసనంలో వున్న బొమ్మ కూడ.

తంజావూరి బొమ్మలో మొలత్రాడు గోచిని వూహించుకోనిస్తున్నదే కాని దిగంబర భ్రాంతినే కలిగిస్తున్నది.

పమ్మివారి బొమ్మ శుద్ధ దిగంబరిని చూపిస్తున్నది.

బొమ్మలన్నీ నడివయసు వేమననే చూపుతున్నవి ముడుతలులేనిదేహంతో.

సముదయంబునందు సర్వమొక్కటియైన
వైరమొదవదేమి వారలైన
ఎచ్చుతగ్గులందు నేర్పడనే హాని,..... ॥విశ్వ॥

*   *   *

ధనములేమి యనెడు దావానలంబది
తన్నుజెఱచు — మీఱి దాపుజెఱచు

*   *   *

కానలేరుగాని కలియుగంబున నున్న
మానవులకునెల్ల మానమొకటె.
...................... .......॥విశ్వ॥

తంజావూరి బొమ్మా పమ్మివారి బొమ్మా కూర్చున్న తీరు యోగ సాధారణ మైనది కాదు.

సహజంగా సులభంగా సాదాగా సాధనారహితంగా కూర్చున్నట్లుంది.

కానిమీరలాకూర్చొని చూడండి: మీరుపద్మాసనం వేయగలుగుతారేమో గాని ఇలా మాత్రం కూర్చోలేరు. కావాలంటే ప్రయత్నించి చూడండి.

అతని సులువైన భాషలో అగాధమైన భావాలు నిక్షిప్తమై పంక్తులకు అంతు బట్టనట్టే

యోగాసనంగాని అతని ఆసీనత కూడా అంతే. అనితరసాధ్యం.

ఈ అసాధారణమైన ఆసీనత వేమననుగూర్చిన ఒక యథార్థంగావచ్చు.

చూచి గీసించే అందామా అసలు!

(ఈ బొమ్మలన్నీ పంగూరి సుబ్బారావుగారి 'వేమన' నుండి)

# విశ్వదాభిరామ వినురవేమ

వానను దడియనివారును, పూనక వేమన్న బోధ బొరయనివారున్
నానాదిక్కులవెదకిన, కానముర యెంతవాని కవి చౌడప్పా ॥

వేమన విజయ ప్రశస్తి ఇట్లతనినాడే మార్మ్రోగ సాగినది. అతడింట గెలుచుట మాటగాదు, అతనివలె రచ్చగెలిచిన వాడింకొకడు తెలుగు కవులందులేడు. భారతీయ, భారతీయేతర భాషలలోనికి వారిచే వేమన అనూదితుడైనంతగా మరొక తెనుగుకవి కాలేదు. అప్పటిప్పటికిని అతని స్థానమంతే.

వేమనను దక్షిణభారత మహాకవిగా చెప్పుటిప్పటికి సామాన్యమైన మాటగాని, అతనిని తెనుగు సాహిత్య లోకమందుద్ధరించిన ఇంగ్లీషు పండితోద్యోగి సి.పి.బ్రౌను ఫ్రెంచి రచనలో నతని గూర్చి చదివి, తెనుగునాట నాతనికై గాలించు నాటికే తమిళ కన్నడ మళయాళ భాషలు మూడింటను వేమనవెలసియున్నాడట. తాటాకులలో నుండగానే వేమన యీ భాషల కెక్కినాడు. అతని తొలుత గమనించిన ఫ్రెంచివాడు సోనారెతు గానిండు, అబేదుబాయి గానిండు, అతనిని తమిళాను వాదము నందేకనుగొన్నాడు తిరువళ్ళువరు నప్పటికి తెనిగించుకోలేదు—తమిళులు మాత్రము వేమననుగైకొన్నారు. కన్నడ సర్వజ్ఞుని తెనుగు వారిప్పటికిని అనువదించు కోలేదు. వేమనకన్నడమున నెన్నడోయున్నాడు. మలయాళానువాద మిప్పటికిని మనకు దొరకలేదు. అబేదుబాయికే వేమన దక్షిణభారత ఖ్యాతిగల బ్రాహ్మణేతర కవి ఇపుడువళ్ళువరు సర్వజ్ఞులను వేమనతో ఉపమించు టొకపరిశోధనాపరిశ్రమ.

అతడింతలో అఖిలభారతభాషల కెదుగ జొచ్చినాడు. అతనికి సంస్కృతాను వాదములెన్నో ఏర్పడినవి. హిందీ, ఉర్దూ భాషాంతరీకరణములు కలిగినవి.

హిందీ భాషలో పరిశోధనకు విషయమైనాడు. కబీరుతో పోల్చుట సర్వ సామాన్యమై పోయినది.

కాని వేమన నిజమునకు విశ్వకవి వేమన కవితావస్తువు విశ్వతో ముఖుడైన మానవుడు, అతని పురుషార్థములును—అతనివస్తువు, కవిత దేశ కాలావధులకు విధేయములుగావు. అందుచేతనే పాశ్చాత్యులను విశేషముగా ఆకర్షించినాడు, ఆకర్షించుచున్నాడు. ప్రపంచభాష లన్నింటిలోనికి అనువదింపబడు ప్రణాళిక కెన్నికైనాడు. ఆంగ్ల భాషాంతరీకృతుడై అచ్చుకెక్కిన యీ తొలి తెలుగుకవి విశ్వకవిగా ఆవిష్కృతుడగుచున్న విశేష దశకు మనమిప్పుడు సాక్షిభూతులము.

రచ్చలో ఇంతకలిగినను కలుగుచున్నను — ఇంట నాతని చప్పరించుట వెనుకబట్టి అతని కవితను కళ్ళ కద్దుకొను పండితలోకము రూపుగొన్నను, తెలుగు నందాతడారంభించిన హాసోపహాసము(Wit and Satire)లకుగుర్తింపు లభించినను, అట్లు మన్నించినవారే అతనినొక స్వతంత్ర విచారకుశలుని (Thinker) గా దార్శనికునిగా (Philosopher) గా గ్రహింప జాలమనుచున్నారు. అతని బొమ్మ మెడలో గట్టుకొని, జెండాపై ముద్రించుకొని సాహిత్యమున సంఘమున ఉద్యమించవలసిన వారి కతనిది సంస్కరణమో విప్లవమో, అతడు ప్రజాకవియగునో కాడో యన్న సంశయములు వీడలేదు.

అసలతని తత్త్వము మతము యోగము నిశ్చితార్థము గాలేదు. అంతే కాదు, అతని సంస్కారకతకూడ అంతుబట్టలేదన్నచో ఆశ్చర్యమక్కరలేదు. అతడొక ఆర్థిక వ్యవస్థా దష్ట యను భావ స్ఫురణము ఆర్థికపునర్వ్యవస్థీకరణము అవశ్యము అనువారిలోనే కలుగలేదు. విశ్వకవిగా ప్రపంచ వేదికలమీద ఎదుగుచున్న వేమన తత్త్వముచేతను, యోచనాపరత్వము చేతను, ఆర్థికాది సముూల సంస్కారకత్వము చేతను, అతివిలక్షణకవితామార్గదర్శిత్వము చేతను కూడ విశ్వ ప్రాధాన్యము గల తెలుగు ప్రజ్ఞగా ధ్రువీకరించ వలసియున్నది.

అతనిపై నింతవరకు జరిగినది ప్రాథమిక పరిశీలనము. నిజమైన పరిశోధనమిక జరుగ వలసియున్నది. అది లేకనే 'వేమననొక గొప్ప సంస్కర్తకుని గానో, బోధకునిగానో, మనము గమనింపము. ఏ బైరాగి యుపదేశము చేతనో యోగ సిద్ధాంత రహస్యముల గొన్నింటి ననుభవ పూర్వకముగా గ్రహించి, యదియేశాశ్వత సిద్ధాంతముగా నమ్మి, ప్రపంచ వ్యవహారమును దిగవిడిచి' 'పామరుల పాలికొక

ప్రవక్త'గా, భాసించినాడను తీర్పు అతనికవితనుముద్దుజేసిన విద్వన్మణులందే మొలిచినది. దర్శన మెరిగిన వారమను నమ్మకము నిండుగాతమయందున్న పండితు లెల్లరకు నిదేయభిప్రాయము.

అతనిది అద్వైతమని బాహాటించినవారు కులముకాలబెట్టు మను నతని బోధ అద్వైతేతర దర్శనగతములైన మతములందే గాని, దానియందప్పటికి లేదని, చండాల దర్శన స్పర్శనాదులకు ఉలికిన తన్మతకర్తకు శివుని చీవాట్లు తగిలినవని, అయినను ఆ పిమ్మటగూడ అతని మతము చాతుర్వార్ణ్యాది సాంఘికనీతిలో, కర్మ కాండలో స్మృతి ప్రమాణమును జెప్పినదనగా, వేమన జెప్పిన అవైదిక, స్మృతీతర ధర్మాదికము అతని నద్వైత సంప్రదాయమున బెట్టుటకు బాధకమేమో యన్నమాటే తలపున బెట్టలేక పోయిన వారైరి. అంతకు మిగిలి, బ్రౌన్ 'With the mystic tenets of Plato, those of Vemana closely correspond while his moral doctrines as closely answer to those of Democritus అని వ్రాసిన ఇంగ్లీషు వాక్యమున వేమనతత్త్వము నకును నీతికిని విరోధమున్నదని, ప్లేటోడిమోక్రిటస్‌లకు పొసగదని అట్లు విరోధ మున్నదనగాదానియర్థము నెరిగినవాడుగాని, అవిరోధ పరిహరణము సాధ్యము కాదా యని గాని, పరస్పర విరుద్ధముగా నిసలతడు చెప్పునా యనిగాని, వానిని అవిరోధము సంగతము చేయుదర్శన మతనియందున్నదాయనిగాని విచారించినవారు దేశములో లేకపోయెను.

తత్త్వార్థమెరిగి ఆదిశంకరులఅద్వైతగతములైన శైవవైష్ణవ కాపాలిక శాక్తేయ' సౌరగాణాపత్యములందు మెలగుచు వర్ణాశ్రమాచార భేదమును వదలని వారధములని తెగవైచి పలికినాడు. ఆరుదర్శనములను వేదమే ప్రమాణమని ఆస్తిక దర్శనములై వర్ణభేదమునుపాటించినవి. ఆత్మలనేకములని, అవి ఈశ్వరునకు భిన్నములని చెప్పుకొన్న ఐదు దర్శనములందు వర్ణభేదము పాటించుటకు తత్త్వముచే నభ్యంతరములేదు. ఆత్మలనేకములు కావు. (జీవ) ఆత్మలు పరమాత్మయు నొక్కటే, అంతయు అసలొకేఆత్మయని చెప్పిన అద్వైత వేదాంతమున దర్శనముచే కులభేదము నంగీకరింపరాదు, కాని వ్యవహార ప్రపంచమున వేదములే, స్మృతులే ప్రమాణమని ఒప్పుకొని ఆస్తిక దర్శనమైనందున అది కులభేదములకు అంటిపెట్టుకొన్నది. అద్వైతమవైదిక దర్శనమనిపించుకొనుటకు గాను చెల్లించిన మూల్యామే యీ అసంగతత్వము. ఆరివదర్శనమైన వేదాంతశాఖలో అవాంతర భేదములైన ద్వైత, విశిష్టాద్వైత సిద్ధాంతములుగాని, వేదాంతమునకు చెందని న్యాయ వైశేషిక సాంఖ్యయోగ మీమాంసా దర్శనములు గాని ఆత్మలనేకములు భిన్నములు అనుటచే కులభేదము నెరపుట కాక్షేపణములేదు. అట్లే చెప్పుకొన్నవి. ఆ 'సౌకర్యము' శంకరాద్వైతమునకేలేదు. సాంఖ్యయోగ వైశేషికములవలంబించిన కాలాముఖ పాశుపత

శైవములు వీరశైవమునకు భిన్నముగా కులవ్యవస్థకై పెనగినవి. కాని విష్ణుశివ సూర్య భైరవ గణపతి పార్వతులను పరమాత్మ స్వరూపులన్నదేగాని మానవులెల్లరు నట్లే సమానులు, పరమాత్మ స్వరూపులును అని అద్వైతము అనలేకపోయినది. భేదాభేదవాదమును గైకొనికూడ వీరశైవము కులమును కాల్చినది. అందుకే,

దర్శనంబులందు ధరషణ్మతములందు వర్ణకాశ్రమముల వదలకెవుడు
తిరుగుచున్నవాడు ధరలోన నధముండు ........ అని యన్నాడు.

అద్వైత సంప్రదాయమునకు బొత్తిగా సరిపడని బ్రాహ్మణ నిరసనము వేమనయందు వీరశైవములోవలె మెండు.

జాతివారలెల్ల జాతి విద్యలు నేర్చి జాణలైరి, మీరిజగతిలోన —— కాని
బ్రాహ్మణులను వారు బ్రహ్మంబు నెరుగరో .... .. యని ఎత్తిపొడుపు జేసినాడు. ఇక

ఉర్వివారికెల్ల నొక్కకంచముబెట్టి, పొత్తుగుడిపి కులము పొలియజేసి
తలను చేయ్యిబెట్టి తగనమ్మ జెప్పరా .. యని వేమన తన కులనిర్మూలనా విధివిధాన నిర్దేశము జేసినాడు. కులముగాల్చుటకు సహపంక్తి భుక్తులుసంస్కర్తలెల్లరు నవలంబించినవి. పల్నాటి బ్రహ్మన్న వీరవైష్ణవ దీక్షనొంది, రామానుజుని శ్రీవైష్ణవము పెట్టలేని చాపకూడు పెట్టినాడు. వీరశైవమున బసవన్న కన్నడమును సహపంక్తి దినిపించినాడు.

మలిదేవునిమామ బసవని కల్యాణకటకమేలిన కాలచురిబిజ్జలుని మనుమడు కొమ్మరాజు—ముమ్మనుమడు అలరాజు లింగధారులు; మలిదేవ బ్రహ్మన్నల పక్షమున పల్నాటియుద్ధములో పాల్గొన్నారు. మలిదేవుని పెండ్లికి కల్యాణమునకేగి బసవని వీరశైవమునరసిన బ్రహ్మన్న శ్రీవైష్ణవమును వీరవైష్ణవముజేసి కులముగాల్చినాడు

వేమన్న వీరికన్న విశేషవిధి నిబంధించినాడు. ఒక్క కంచపు పొత్తుకూడు దినిపించి తలపై చేయిడి తగనమ్మజెప్పు విధియది తలమీదకుడి చేయిడి దీక్షయిచ్చుట వీరశైవ దీక్షావిధానము. హస్తమస్తక సంయోగమున దీక్షనిప్పించు పద్ధతి. ఈ వీరశైవ మత దీక్షావిధానమును కులము విడుపు దీక్షనిచ్చుట కుపయోగించినాడు. పూర్వసంస్కారకుల సహపంక్తి భుక్తిలో ఎంగిలి ప్రసక్తింపనేలేదు. వేమన ఒక్క కంచపు పొత్తుగుడుపుమాత్రము ఎంగిలికుడుపనిపించుకొన్నది. వీరశైవ విశేషాచారములో ఒక్కకంచపు గుడుపున్నదో, లేక ఇది వేమన స్వోపజ్ఞకమో యిప్పటికి నిశ్చయములేదు.

ఇది 'అద్వైత సంప్రదాయమునకు' విరుద్ధము, వీరశైవ మతానుగతము. ఈఏక పాత్ర భుక్తి వేమన అతివాదము. అందాతని వాద విశేషము లొక కొన్ని ఇపుడే గమనింపవచ్చును.

వేమన జీవకారుణ్యము ఇంతింతనరానిది. హింసకు పరమవిముఖుడు. మాంసాహారము ముట్టనివాడు. మాలమాదిగలను తక్కువజేసి అంటరానితనము పాటించుటకు జెప్పు కారణములలో అసంగతములను జూపునపుడు పశువులను జంపితిను మాలలే ఆహారమున శుద్ధిగలవారన్నాడు. కసవుపసరికలమేత రోతగాదు గాని కోళ్ళ పందులుదిను మేత గొప్పరోత. రోతతిండి వాని దిను శూద్ర జాతులు మాలలకన్న తిండిలో అపరిశుద్ధులు గదా, మరి వారి ఎక్కువేమిటన్నాడు. సహజముగా చచ్చిన పశువును దినుట జీవహింస కాదు. కావున చావు పశువును దిను మాదిగెలు నలువర్ణాల వారికన్న నాణ్యమైన వారన్నాడు.

"హింసజేయకుంట ఇల ముఖ్య ధర్మంబు అనకహింసజేతు రవనిజనులు
చావుపశువు దినెడి చండాలుదేమేలు ........ "

చచ్చిన జంతువుల దినుట హింసగాదని అనుమతించినది బౌద్ధము. వీరశైవమను మతించినదో లేదో తెలియదు. పూలుకోసి పూజచేయుట పాపమని, రాలినపూలతోనే శివపూజ చేసిన దసరయ్య వీరవ్రతము వీరశైవములో ప్రసిద్ధము. దానికిని ఇది విరుద్ధముగాదు. మరి, ఏవగింపు ఒకటి దప్ప. ఈ పద్యముచేత వేమన బౌద్ధుల ఆహార నియమమును జ్ఞప్తికి దెప్పించి, ఇటీవల అంబేద్కరు మాదిగ మహారు చమారుల అంటరాని తనమునకును బౌద్ధమునకును గల కొంత సంబంధము జూపుటను తలపున బెట్టుచున్నది.

"సకల జాతి పురుష సంఖ్యలకెల్లను సతులనీయ దాము సమ్మతింప
కొప్పివుచ్చుకొందు రోగులబాపలు ...... "

అని విలోమవివాహములు నిషేధించి సకలజాతుల కన్యలను చేపట్టుచు తమకన్యల నన్యజాతిపురుషుల కీయనందుకీ బ్రాహ్మణ విమర్శ.

"బ్రాహ్మణులకు సకలభాగ్యంబులీవచ్చు గౌరవింపవచ్చు — కోరివారు
జ్ఞానమొసఁగి జనులఁ గడతేర్పగలిగిన ..... ..."

అట్టి ఏ విశేషములేక, ఎల్లవారివలె కాలకృత్యములు తీర్చుకొనుపాటికంటె ప్రత్యేకత లేని బ్రాహ్మణజన్మలకు, ఎంగిలిచేతకూడ కాకిని విదిలింపని కటికిలోభులు బ్రాహ్మణులకు బెట్టిన పుణ్యమను నమ్మకముతో దానముజేయ సమకట్టినవారికి వేమన శాపనార్థము లున్నవి.

"మలము మూత్రమువిడు మహిలోనిద్విజులకు, బిచ్చమిడెడుకటికిపీన్గులెల్ల
పరగనేడ్చు చట్టెపాములై పుట్టురా.........."

"మాలవానినేల మహిమీద నిందింప, నొడల మాంసర క్తమొకటిగాదె
వానిలోన మెలఁగు వాని కులంబేది ........."

అని అందరకలవాటయిన వాదముతో సరిపుచ్చుకోక ఆహారవిహారాదులలోని అలవాట్ల మీదుగా వాదము నెరపుట వేమన్నలో విశేషము.

ఇట్లు వాదించి బ్రాహ్మణులను 'త్రాటి మాలలను', 'కర్మచండాలురను' జేసి నిందించి పంచారించిన వీరశైవ మహాచార్యులను మరపించునంతగా,

"బ్రహ్మవంశభవులు ప్రబలురై యుండగా
నితరజాతులకును గతులు గలవె ?........."

అని అన్నాడు.

ఇన్నిమాటలెందుకు ? మన్మథాపేశముమందు కులముకట్టుళ్ళు, అంటు నియమములు బదాబదలు కావలసియున్నవే. అప్పటిప్పటికిని చాటుననైన కులము గూల్చువాడు మన్మథుడేగదా! ఇక అటువంటప్పుడు ఎవనిదేమి కులమొ గుర్తేమి గలదన్నాడు వేమన.. కులములోనున్నజనులను కాముకుడు గేలిజేయుచున్నాడట.

"పచ్చవిల్తుచేతఁ గ్రచ్చరజనులెల్ల తచ్చనాడబడిరి ధరణిలోన
కులజుడెవ్వడిందు కులహీనుడెవ్వడు........."

అనుచున్నాడు.

రక్తసాంకర్యములేని కులములు జాతులు కల్ల — కులశుద్ధి వొల్లు.

## మతసమత్వమే గాదు, మతరాహిత్యము

అవైదికము, వీరశైవీయమునైన సాంఘికనీతి యట్లుండగా, ఆ వీరశైవ చిత్తవృత్తికి కూడ బొత్తిగా గిట్టనిదృష్టి వేమన్న యందొకటున్నది: మతములపట్ల అతని దృష్టి. అదే అతనిలోని గొప్పవిశిష్టత. అదే వేమనను నేటి కాలమునకు సంఘమునకు అవశ్యము కావలసినవానిని జేయుచున్నది.

"మొదలితనమతము వదలక, తుదనెవ్వరిమతమునైన దూషింపకయున్
పదిలుడయికోర్కిగోరక, ముదమున జరియించువాడె ముఖ్యుడు వేమా!!"

అన్నదొక పద్యమాతనిదున్నది.

"శైవవైష్ణవాది షణ్మతంబులకెల్ల, దేవుడొక్కడగుట తెలియలేరు
తమకు భేదమైన దత్వంబు భేదమా........."

అని మరొక్క పద్యమున్నది. పండితులింతవరకు యీ రెండింటినే గమనించి, గ్రహించి వేమన పరమతసహనమును బోధించినాడని యొక్కరును, సకలమత సమత్వమును స్థాపించినాడని మరొక్కరును చూపించి అంతవరకేగొప్పయని చాటినారు.

మొదలితనమతమనగా వీరశైవమని, దానినామరణము వేమన విడువ లేదని, అదే అన్నిమతములకన్న మిన్నయను భావముతోనే యుండిపోయినాడని, వీరశైవ విషయమున అతడేమైన విమర్శ చేసియున్నచో – చేసినాడు – అది మతముపైగాక, అందుచేరి తప్పునడవళ్ళకు గురియైన భ్రష్టులను, భ్రష్టత్వమును మాత్రమేనని, 'పరబ్రహ్మపరముగ నాతడు శివశబ్దమునే తఱచుగ నుపయోగించు'చు, పంచాక్షరీమంత్ర మహిమము నుగ్గడించుచు,

"వీరవరమహేశవిభవంబుచేపట్టి, బాహ్యవిద్యచేతఁబరగుటెల్ల
వూరికి మృగరాజు పోయిన చందంబు . ... ... "

అని యితర మతముల న్యూనతను స్పష్టపరచియు,

'ఆఱు మతములపయి నధికమైనమతము లింగమతముకంటె లేదుజగతి' ననుచు గొంతెత్తి చాటుచునే ఎవ్వరి మతమునైన దూషింపక చరింపవలెనని నుడువుటే అతని దృష్టివైశాల్యమన్నవారొకరు.

మరొక్కరు, మరొక్కరేమి, అధిక సంఖ్యాకులు తత్వమొక్కటియైనను, షణ్మతస్థాపనాచార్యకత్వమున చెల్లిన అద్వైతదృష్టిలో వేమన కుదిరి సర్వమత సమత్వమును చెప్పినాడని స్థిరపరచినారు. "వీరశైవమతమందుఁ బుట్టి సంసార సుఖదుఃఖములన్నియు ననుభవించి, రసవాద సంబంధమున శివయోగుల సహ వాసమునబడి విరక్తుడై హఠయోగమును సాధించి, యా పిమ్మట రాజయోగియై, హరిహరాదిసగుణోపాసనమీఱి, బ్రహ్మసాయుజ్యరూపమగు అద్వైతానంద మనుభ వించి"నాడని అతని పరిణామక్రమము జెప్పి, అతని కుదిరిక అద్వైతమన్నారు. తెలుగుదేశములో టిక్కనపేర ప్రబలముగా చెప్పబడిన హరిహరాభేద పరిహరణ మన్న వైదికమతసంస్కరణమునే వేమన్న ధ్రువపరచుట చాలన్నారు.

"శివునిభక్తులెల్ల భువిమంటిపాలైరి, వాదమేల దైవభేదమేల
విష్ణుభక్తులెల్ల వెలిబూదిపాలైరి ...... ...."

అని ఉదాహరించుకొనుటతో ముగిసినారు.

వేమన ఆజన్మాంతము వీరశైవుడేయని, సామాన్యవీరశైవధర్మముల నంతగా పాటింపక విశేషవీరశైవము (అదేమో వివరింపకుండ) నాశ్రయించి యుండెనని, పరమతసహనమును బోధించెనని ఒకపక్షము — వేమనలో పరిణామ మున్నదని, వీరశైవము నుండి అద్వైతమునకు చేరుకొనెనని, సర్వమత సమత్వ దృష్టి చెప్పినాడని ఒకపక్షము సిద్ధాంతించి, కూర్చుండినవి. కాని వేమన్న పరిణామము అద్వైతముతో నాగక, సర్వమత సమానత్వములో రెడ్డిగము వేసికూర్చుండక "మతములోనున్న మతములన్నిటిఁగోయు"ము, మతమునే విడువుము అన్నంత వరకు సాగినదని యీ సాంప్రదాయిక పండితులుగాని, నవీనదృక్కులు, సంప్ర దాయాతిక్రమణులు, సంస్కరణాభిలాషులు, నవీన సాంఘిక రాజకీయ శాస్త్రతత్వ మెరిగినవారు గాని వ్యవస్థాగతమైన మతము మొత్తమును (Organised religion) తిరస్కరింపుమని వేమన్న భేరి వేసినాడని గమనింపకున్నారు.

"మర్మమెఱుఁగలేక మతములఁగల్పించి, యుర్విదుఃఖులగుదురొకరికొకరు
గాజుటింటఁగుక్క కళవళపడురీతి . .. . " (890 బ్రౌను)

"మతములెన్నియైన సతములుగానుండవు, సతముగానునుండు జగతినొకటి
అంతమతము విడచి ఆబ్రహ్మమరయరో . " (686 బ్రౌను)

"మతములెన్నియైన సతముగా నుండవు, సతముగానునుండు జగతినొకటి
అన్నిమతములందు నరయ నొక్కడులేడు* .. "

(1590, గోపాల్ అండ్ కో వారి ప్రతి) (3634, నేదునూరి ప్రతి)

"ఏడు మతములందు నెనసిచూడగబోవ, లింగమతముకన్న లేదుమతము
మతము మూలమెఱుఁగ మర్మంబులేదయా ...... "

(905 నేదునూరి, బండారు తమ్మయ్యగారు ఎన్నడో ఉదహరించిరి)

"మూలమూల బందుముక్తంబు సేయక, అష్టమతములెల్ల హతముగాక
వేత్తయనఁగనేల వెర్రిపద్ధతిగాక ......... " (216, బ్రౌను)

"అష్టమతములందు హతముజాయగలేక, వీరశక్తియెల్లవీటిబోవు . "
(1029, బ్రౌను)

"మతము మమతఁజిక్కి మరిదేహమున్నది . .. " (3633, నేదునూరి)

---

* మతములెన్నియైన సతములుగావని, సతము కర్మమగును జగతియందు
నన్నిమతములందు నరయనొక్కటిలేదు .... ....
(441, వావిళ్ళవారి వేమన)

"మతములోనున్న మతములన్నియుఁగోసి, ఘటములోనున్న ఘనునిదెలిసి
ఘనత నిల్పుచుండు ఘనతత్వయోగిరా ... ... ...." (161, వావిళ్ళప్రతి)
"జాతి మతము విడచి చని యోగికావలె ... ...." (1912, నేదునూరి)
"సర్వమతములయందును సన్యసించి ... ...." (4811 నేదునూరిప్రతి)

ఇట్లు మతములకు వ్యతిరేకముగా పలుచోట్ల బహుళముగా ప్రస్తావించి యున్నాడు. మతములు మానవకల్పితములన్నాడు. గాజుటింటనో, అద్దములోనో తన ప్రతిబింబమును జూచుకొన్న కుక్క అదింకొకకుక్కయని కలవరపడినట్లు మతము మానుషమానస ప్రతిబింబమనియు, అది తెలియక కళవళించుచున్నామనియు, మతము మూలముదెలిసిన మర్మము లేదనియు, మతము లశాశ్వతములనియు, మతము విడచి ఆత్మబ్రహ్మమరయుమనియు, మరికొంత కాలమునకు మరింత పరిణతుడై అన్ని మతములందు ఆయొక్కడును, ఆయొక్కటియులేదని చెప్పివైచినాడు. ఇంక ఆఱుమతములైననేమి, ఏడైననేమి, అష్టమతములైననేమి, అందు అధికమైనది లింగమతమైననేమి ? ఉండి ఉండి వేమన్న కడపటికి అన్ని మతముల త్రాళ్ళు బండిరేవున ద్రెంపినాడు. మతమునకు మంటబెట్టిన వేమన నాస్తికుడయ్యెనందుమా ? చార్వాకము చెప్పినాడనగలమా ? కాదు — వేమన్న అధ్యాత్మికుడుగనే మిగిలిపోయినాడు. రాజయోగిగా మిగిలినాడు, స్థిరపడినాడు.

మతమును గాదన్న ఆధ్యాత్మిక మహాపురుషుడు భారతదేశమందితడొక్కడే. మతములోని మతముతో ప్రసక్తిలేని ఆధ్యాత్మికతను భావించి చెప్పినాడు. మతము వాదమైనది; బాహ్యాచారమైనది. వాదము సత్యసాధకముగాదు; కావలసినది అనుభవము అన్న భావములోవాడు వేమన్న. 'బహుధా విప్రతిపత్తి ధీవిషయముల్ పాడైన శాస్త్రార్థముల్' అన్న శ్రీనాధుని వాక్యమునకు లక్ష్యమైన దృష్టి వేమన్నది. అదేమైన గానిండు, పరమత సహనము, సర్వమత సమత్వము అని మనము అలవాటు బడ్డ ప్రాతసూత్రములనుదాటి మతప్రసక్తిరాహిత్యమునకు వేమన చేరుకొన్నాడు. అధ్యాత్మానుభవమునకుగాను మతప్రసక్తిరాహిత్యము చెప్పినవాడు, దానితో బాహ్యాచారనిరాకరణము చేసినవాడు, మతప్రసక్తిరహిత సమాజ, రాజ్యతత్వమునకు (Secular Society and Secular State) సరిపొందు దృష్టిని నిరూపించినాడని చెప్పుకొనవచ్చును. మతప్రసక్తిరహితరాజ్యతత్వము అతని సిద్ధాంతమునుండి ఉపపన్నము చేయవచ్చును గాని, అతడు మతరహిత సమాజ తత్వమును స్పష్టముగా దర్శించినవాడు అని నిరాక్షేపముగా వక్కాణింపవచ్చును. మతరహిత సమాజ తత్వముయొక్క తార్కికపర్యవసానమే మతప్రసక్తిరహిత రాజ్యతత్వము.

వేమన్నదృష్టినిట్లు తెమల్చుకొన్నతర్వాత, ఆధునిక భారత సమాజమునకు, సంస్కృతికి తెలుగునాటి సంస్కృతినుండి సంప్రదాయమునుండి వ్రేలెత్తి సగర్వముగా ఎన్నిచెప్పగలకాన్క, చేర్పు, సందేశము ఏమైన కలదాయని ప్రశ్నించుచో వేమన్ననే చూపింపవలసియున్నాపుని, వేమన్న మతప్రసక్తిరాహిత్యమే భారత రాజ్యాంగతత్వములోని Secularism అన్నదానికి అర్థము కావలెనని, భారత రాజ్యాంగ సూత్రమున కాయర్థభాజనత కూర్చుట పాశ్చాత్య భావమోహము కాదని, భారతీయ విచారధారానుషక్తమని నొక్కిచెప్పవలసియున్నది.

మతరాహిత్యమైన వేమన యీ దృష్టి ఆయామతముల నంగీకరించు నద్వైతమునకుగాని, శివుడని శివమెత్తు వీరశైవమునకుగాని సంగతమే కాదు. కాని 'దృష్టిరాహిత్యమును' జెప్పు నాగార్జునుల శూన్యవాద బౌద్ధమునుండి దీనిని సాధింపవచ్చును. దానితో యిది పొందిపొసఁగునట్టిది.

అంతేగాక, వేమన బహుమతములు, సాధనలు ఎరిగినవాడు. శంకరుడు సంస్కరించి దానంగీకరించి అపన్నియు సమానములన్న ఆరుమతములే మతములు గావు. ఇంకను వేమన ఎరుగును. అతడిచ్చిన సంఖ్య ఎనిమిది. అష్ట* మతములన్న వేమనమాట ప్రాచీనప్రతిలోనేయున్నది. శాక్తకాపాలిక బౌద్ధములను పేరుపెట్టి విమర్శించినవాడు. పేరున పిలువకపోయినను నాథసిద్ధులమతము ప్రత్యేకముగా దెలిసినవాడు. హేమకార విద్యచేత రసేశ్వరమతము నెరిగినవాడు. మహమ్మదీయ మతమెరుగును. వీరశైవము ధ్వంసము జేసిన జైనమతప్రసక్తి పరోక్షముగాకూడ వేమనయందులేదు; అదే విచిత్రము. పరమ అసహ్యమైన తంత్రసాధనలన్ని ఎరుగును. ఎల్ల యోగసాధనలను అవలంబించినవాడే. శైవముగా నుండవలసిన

---

* రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు తమ్మయ్యగారి 'వేమన చరిత్ర' ఉపోద్ఘాతములో

"ఏడు మతములందు నెనసి చూడగబోవ, లింగమతముకన్న లేదు మతము

మతము మూలమెఱుఁగ మర్మంబులేదయా ....... "

అను పద్యమున ఏడుమతములమాట యున్నది గావున అది వేమనది కాదన్న శంక న్యాయముకాదు. 'మతము మూలమెఱుఁగ మర్మంబు లేదయా' అన్న పంక్తి వేమన మతరాహిత్యము విన్నతర్వాత అస్పష్టముగా మిగులదనుకొందును. వీరశైవము శంకరుని ఆరుమతముల జాబితాలోకన్న అధికముగా ప్రత్యేకముగా పరిగణనము కోరదనుకొనుట సమంజసముగాదు. వీరశైవములో దర్శనముకూడ అద్వైతముకన్న వేరుగదా!

కాపాలిక మతము శివనిందకముగా పరిణమించు టాయనను నిర్వేరగొలిపినది. అది లోకాయతసమమై కామపురుషార్థ సాధనైకముగా నుండుట గమనించినాడు. లోకాయత మతభేదముగా కాపాలికము పరిణమించినవైనము తత్వవేత్త లితరులు వర్ణించియున్నారు. వేమనకు తెలుగునాట గాన్పించిన కాపాలికమున జగత్తు నిత్యము — దానికి ఆద్యంతములు లేవు.

"కాపల మతమందు గలిసియనాచారి, యాదియంతమనక యల్పబుద్ధి
శివుని నిందజేసి చెడిపోవునయ్యాయో.... ..... ...."

యని వాపోయినాడు.

శంకరులు చెప్పిన ఆరుమతములనే కాదు; ఆరు దర్శనములను, ఇంకితర దర్శనములను, ఇట్టి విపరిణామములను నెరుగును. వాని యుక్తివాదములతో తర్కములతో సిద్ధాంతములతో తేలినది లేకకూడ స్వానుభవముచే మతరాహిత్యమును ప్రపంచించినాడు.

## విగ్రహము౦ విసరివేయుము

అద్వైతవీరశైవముల పరిధిలో నిముడని విశేషమింకొకటి — విశేష ప్రాధాన్యము కలదొక్కటి — వేమనయందున్నది. అది విగ్రహారాధనా నిరసనము — సగుణోపాసనామార్గమును మూయుట. ఈ విషయమున ఇతడు దక్షిణ భారతమునకు ప్రథముడు. శంకరుని యద్వైతము నిర్గుణగానముకూడ చేయగలదేగాని, సగుణగానమును నిషేధింపజాలినదికాదు. సాకారముఖమున నిరాకారమును బడయుట అద్వైతము అనుమతించిన, కాదు, విధించిన త్రోవే. ఇక వీరశైవమందుమా, లింగార్చనకు భంగము కల్గించుటకు మొదలే యొప్పదు. కాని, వేమన్న యిందుకు విరుద్ధముగా నున్నాడు.

మతముతోడిదే బాహ్యాచారము, విగ్రహపూజయును. మతము సగుణ తత్త్వముతోనది. మతమునే కాదన్న వేమన్న యిక బాహ్యాచారమును మన్నించు టెట్లు? ఆ సర్వమునకు అతడొక సున్నచుట్టి కూర్చున్నాడు. గమనింపవచ్చును.

వేమన్న మూర్తిమంతమైన దైవమును, పేరున్న దైవమును కాదన్న వాడు. శుద్ధ నిర్గుణవాది.

"బ్రహ్మజంపి విష్ణుభాగంబులోగల్పి, విష్ణుజంపి శివుని వెలయగలిపి
శివునిజంపి తాను శివయోగికావలె.... ..... ...."

నన్నాడు శివుని జంపుటకే సిద్ధపడిన వేమన,

"మునుపుదేవులంత మునువెళ్ళగొట్టగా, వెనుకదేవులంతవెళ్ళగొట్టి
చిన్నిదైవములను చెప్పునగొట్టరా .. ........"

యని రేగినాడు. సగుణోపాసనము తోడనేగాక, నిర్గుణమార్గమునగల బాహ్యాచారమునుకూడ నిరసించినాడు. కావులు కచ్చలు ఆసనములు తపములు ధ్యానములు కూడ అతని నిందకు గురియైనవే. ఉపవాసములు, వ్రతములు, యజ్ఞములు, తీర్థములు, పాదతీర్థములు, జపములు, మంత్రతంత్రములు, యంత్రములు, నామగానములు అన్నింటినిదీసి తుంగలో ద్రొక్కుమన్నాడు. కడకు సారముదేల్చి,

"శిలలు దేవతలని చెలరేగి చెలరేగి, మొనసిపూజసేయు మూర్ఖులార!
జీవులందెగాక శిలలందునేముండు ... ... ... "

నని రాళ్ళపూజించు జాతికి మనుజుల జూపించి, మనుజుల పోషింపుమని, మానవత్వమును కొలువుమని మప్పినాడు. మానవుని చరలింగమన్న వీరశైవము మెడలోగట్టిన ఆ లింగమునుగూడ మానవుని మరుగుపరచునని దానినిదీసి దూరముగా బారవేయించినాడు.

"తల్లిగర్భమందు తాబుట్టినప్పుడు అరుతలింగముండదరసిచూడ
నడుమలింగమూన నగుబాటు కాదొకో .. ........"

అని అద్వైతయుక్తిజేసి చమత్కారముగా చెప్పినాడు. వీరశైవము చేబట్టికూడ బాహ్యాచారమునకు పాల్పడుట సింహము పూరిమేయబోయిన చందమన్నాడు.

"వీరవరమహేశ*విభవంబుచేబూని బాహ్యవిద్యచేతబరఁగుటెల్ల
పూరికిమృగరాజు పోయినచందంబు... ...... "

వీరశైవము బాహ్యవిద్యను, సగుణభావమును అంగీకరించనిదనుటకు యిందుకొంత ఎడమున్నది.

"జంగమాఖ్యభక్తి సంధివేఱుగలేదు, సగుణభావమదియు, శాస్త్రవిధియు
నిర్గుణంబువీడు — నెఱవేది ఎఱుగడు . ..... " (1011—నేదునూరి)

విగ్రహారాధనము వద్దనుటలో యావద్భారతము నుపలక్షించినచో వేమన్న ప్రథముడు కాకపోవచ్చును. కాని, ఆయుద్యమములో నతడు శిఖరప్రాయుడనవలసియున్నది. విగ్రహాలను వెనుకబెట్టించుటలో కబీరును చెప్పుట ఆచార

---

* 'వీరశైవమనెడి విభవంబు చేబట్టి బాహ్యవిద్యచేత బరగుటెల్ల' అని పాఠాంతరము.

మైనది గాని ఆ యుద్యమమున అతడంత ఖండితముగా నున్నాడనుకొనవీలులేదు. అట్లనుకొన్నను రామనామ జపమును మాత్రము దండిగా మననోటికి విధించినవాడే గదా! ఏదైనగాని, వేమన్న మననోటికి ఆపనికూడ తప్పించినాడు. కబీరు నిర్గుణ పంథీ కావచ్చును — కాని నిర్గుణభక్తిమార్గస్థుడై నామకీర్తనము చేయించుచున్నాడు.

వేమన యోగమార్గావలంబి. పేరే వేమనయోగియని స్థిరపడినదికదా! కాని ఇతడు యోగతపస్సులను అపహసింపకవిడువలేదు. విడువకపోవుటకాదు. అతివేలముగా పరిహసించినాడు. ఎన్ని పద్యములైన ఉదాహరింపవచ్చును.

"ఒడలు బడలజేసి యోగులమనువారు, మనసుకల్మషంబు మాన్పలేరు;
పుట్టమీదగొట్ట భుజగంబు జచ్చునా.........."

ఆహారము వర్జించి శరీరము శుష్కింప జేసినంతలో చిత్తవృత్తి చిక్కబట్టలేమని అది పామును జంపుటకుగాను పుట్టమీద గొట్టిన చందము అని పరిహాసమాడినాడు.

"ఆసనంబుబన్ని అంగంబు బిగియించి, యొదలు విరచుకొనెడు యోగమెల్ల
జెట్టిసాము కన్న చింతాకు తక్కువ ... .. ..."

భౌతిక శరీరమును కృశింపజేయు నీ ప్రణాళిక, శరీరము బిగువు బొంకములు పెంచుటకుజేయు వ్యాయామము రాశిలోనిదే యనుచున్నాడు. ఆసనాదులు, ఆహార వర్జనములు మున్నైనవి లేని యోగమొకటున్నదా? లేనిచో యోగమునే మొదలు తిరస్కరించుచున్నాడా, వేమన? కాని అవన్నియు తొలుత నతనికున్నవే గదా? నొసట చూపునిలుపుటలు, ఖేచరీముద్రలు, కుండలినీయోగములు, మంత్రయోగము, లయ యోగము, హఠయోగమును నిష్ఠలో నిల్చి సాధన జేసినవాడే. వాని వాని గొప్పలను, మెప్పులను పద్యములలో పెట్టినవాడే. కాయసిద్ధిజేసి మృత్యుంజయత్వము బొందుటకు పరిశ్రమించినవాడే. అవన్నియు చూడగా అతనికి ప్రయోగప్రాయము లైనవి. వాని నిష్ఫలత నెఱిగి అన్నింటిని వదలుకొన్నాడు. అనగా, మొత్తము యోగమునే వదలుకొన్నాడనగలమా? అట్లనుటకు అతడు ఒప్పుకోకున్నాడు.

తాను రాజయోగినని పిల్చుకొన జొచ్చినాడు. అతని నిలుకడ కడపట రాజయోగమునందే యున్నది. 'విమలగుణరాజయోగీంద్రవేమనార్య' అన్న మకుటములో తేటగీతిలో ఒక శతకమునకు సరిపడు పద్యములున్నవి. అవి వేమన్నవో కావోగాని, అవి బ్రౌనుకు దొరకలేదు. ఆతర్వాత సంకలితములైనవి. కాని, వేమన కుదిరిక రాజయోగమందనుటకు బ్రౌను ముద్రించిన పద్యములే

చాలును, దైవములను, విగ్రహములను — అదేమి, తన తనువందులేని ఏయితర మును — కొలువరాదను తత్వమును చెప్పుటకే ఇట్లు అన్నాడు :

"రాజయోగమహిమ రాజయోగికిగాక, ఇతర జనులకెల్ల నేలదెలియు
తాను దేవుడైన దైవమ్ము గొలుచునా ...... " (769, బ్రౌను)

"అంగయోగములను ఆరుమతంబుల మూడుయోగములను మొనయరాదు.
కడమ యోగమునను కల్గురామోక్షంబు ..... " (453, బ్రౌను)

మూడుయోగములనగా, మంత్రలయ హఠయోగములు. అవి పనికిరానివని, కడమ యోగమనగా రాజయోగము; దానివల్లనే మోక్షమని ఇక్కడన్నాడు. అతనిది హఠయోగమూలమైన రాజయోగమ*ని విశేషణముతో చెప్పుట కూడదు. ఆసనములు శరీరతాపనములు, ఉచ్ఛ్వాస నిశ్వాసల నియామకము లేకుండ కూడ ఒకయోగ మున్నది. అది రాజయోగము. వేమన జెప్పిన రాజయోగమన్నది.

"ఆసనాది విధుల నధమయోగంబురా, మానసంబుకలిమి మధ్యమంబు
ఊరకుంట దెలియ నుత్తమ యోగంబు .. "

నిర్వాణమ్ శాంతమ్ అన్నట్లుగా నున్నది. 'శాంతబుద్ధినుండ సమకూరును సుఖంబు'— 'మనసువాక్కుకర్మ పరియేమిలేకను రాకపోకలేని రాజవీధి'గా బుద్ధిని పడయుట యివన్నియు లేకుండగనే సాధ్యమన్నది రాజయోగము. అది హఠమూలము గానక్కరలేదు. ఉపవాస మక్కరలేదు; ఆసనాది వ్యాయామమక్కరలేదు. జెట్టిసాము గాని సహజ శాంత యోగమును వేమన కడకు పాటించినాడు.

అతని యోగము సహజశాంతయోగముగా పరిణతినందినది. తానె దేవుడైన దైవంబుకొలుచునాయని విగ్రహారాధనాదికమును నిషేధించినదైనది. అద్వైత వీరశైవము లిందుకు భిన్నము. ఈ విధానమునకు మూలమెక్కడిదన్నది ప్రశ్న. జైనబౌద్ధములున్నవి. అవి విగ్రహారాధనము వదలుకొన్నవా? జైనము విగ్రహపూజ వీడినదికాదు. బౌద్ధమున చెక్కిపోసినన్నిరాళ్ళు, సృష్టించినన్ని దేవుళ్ళను మరొక మతమున కానరారు. మహాయాన బౌద్ధము సృజించిన దేవుళ్ళు అయిదారు వందలకు పైగానున్నారు. విగ్రహారాధనపై కల్గిన వైముఖ్యమునకు కబీరు వేమన్నలే మున్మొదటివారా?

చూచిన శిలకెల్ల ఒకరూపుచెక్కి, ఒకపేరుబెట్టి, ఒకపూజనెలకొల్పి, నెలకొల్పి విసువుకొని వేసటవచ్చి, వానినావలబెట్టు నుద్యమమొక్కటి బౌద్ధము

---

* రాళ్ళపల్లి వారి నిర్ణయము. వేమన 89 వ పేజీ

చరమదశయందు ప్రవర్తిల్లినది. పారమితానయమని, మంత్రనయమని మహాయానము రెండు తెఱఁగులుగా నున్నది. ప్రజ్ఞాపారమితలన్నమాట వినికిడిలో నున్నదిగావచ్చును. నాగార్జునుడు జెప్పిన శూన్యవాదమునకు మూలసారస్వతమది. తత్సంబంధమయిన జ్ఞానమార్గమొకటి పారమితానయము. ఆ పారమితలు చెప్పే శూన్యత, సర్వమును స్వభావశూన్యము, నిర్విశేషము అమజ్ఞానము అవగతిలో నుండుటకుగాను అర్థరహితమైన శబ్దముల నిత్యోచ్చారణ జేయుటొకవిధము. అది మంత్రనయము, ఇటిమిటికిటి భిక్షంతిపదానిస్వాహా, వంవంవంవం, హ్రీంహ్రీం మొదలైన శబ్దాలను మంత్రాలని, అవి అర్థవిరహితాలు, అర్థప్రతిషేధకాలు కావున సర్వార్థప్రతిషేధకమయిన శూన్యత యీ మంత్రోచ్చారణము వలన అనుభవమునకు వచ్చునను అభిప్రాయముతో వెలువడినది మంత్రనయము. హ్రీంహ్రీం మొదలైన మంత్రాలిప్పటికిని తంత్రాదులలో ఉన్నవి. వానినిప్పుడు బీజాక్షరాలని, యింకేవో మహత్వపూర్ణాలని చెప్పుకొందురుగాని, వాని పుట్టుక అర్థ రాహిత్య బోధనకు అర్థరహితములై నవిగానని తెలియుచున్నది.

ఈ మంత్రనయమే వజ్రయానమై కూర్చుండినది. వజ్రయానము తాంత్రిక బౌద్ధమున ఆద్యరూపమని వినికిడిలో నుండి యుండును. మద్యమాంస మైథునాచారాలు ప్రవేశింపని తాంత్రికదశ ప్రథమములో నున్నది. 'ఆర్యమంజు శ్రీమూలకల్పము' ఆదశను మూదలించును. మంత్ర, ముద్ర, మండల, అభిషేకములే ఆదశలోనున్నవి. ఆ వజ్రాయుధము నాల్గు విధములైన తంత్రము. క్రియాతంత్రము, చర్యాతంత్రము — యోగతంత్రము, అనుత్తరతంత్రము. దేవతారాధనమున్నది, విగ్రహపూజలున్నవి, క్రియా చర్యాతంత్రములందేగాని యోగ అనుత్తరతంత్రములందు పరమ నిషిద్ధములు. అవి విగ్రహారాధనా నిరసనమునకు యీ తంత్రములు పట్టుగొమ్మలు. ఇవి క్రమముగా పరిణామము చెంది సహజయానమై యోగముతో సహా సర్వబాహ్యాచారమునకు సున్నచుట్టినవి. అందు సారహపాదాదులు ముఖ్యులు. సహజయానాచార్యుల బాహ్యాచార నిరాసము, ఆ ఉపమానములతో, ఆ యుక్తులతో, ఆ తర్కముతోడనే కబీరు వేమన్నలకు, వారిని దాటి మరికొందరికిని ముట్టినది. శూన్యము సహజశూన్య మనిపించుకో జొచ్చినది. యోగము సహజ యోగమైనది. సమాధి సహజ సమాధి యయినది. సహజానందులు వెలువడినారు. శూన్యతా సిద్ధాంతము, విగ్రహారాధనా ఖండనము, ఉపవాసాది యితర బాహ్యాచార నిరసనము, వర్ణవ్యత్యాస వ్యతిరేకత, హఠాది కాఠిన్యకార్శ్యములు లేనియోగము అన్నియు సహజయానములో నున్నవి. ఈ యానము తక్కిన బౌద్ధతంత్ర శాఖలతో

పాటు మత్స్యమాంస మద్యమైథున ముద్రామయముగా మారినపుడు యిది కూడ దెబ్బతిన్నది.

కాని, అది ఉత్తరభారతమున మధ్యయుగమున తలయెత్తిన ప్రతి చిల్లర మతశాఖలోను తన ముద్రవేసినది; ప్రవేశించినది. శైవవైష్ణవాది శాఖలన్నింటను ఏదోయొక మోతాదులో చొరబడినది. సిద్ధమహిమములకెల్ల నిలయమైన నాథమత మొకటున్నది. తాంత్రిక బౌద్ధశిథిలముల నుండి వెలువడి పదిపదకొండు పన్నెండు శతాబ్దులలో తూర్పుబెంగాలు, పంజాబు, శ్రీశైలములమధ్య తెగయల్లుకొన్నది. తెనుగున నవనాథచరిత్రము (గౌరనకృతము) యీ మతమునకు చెందినది. కాని అందులో ఆమతము సిద్ధాంతవిశేషములు పూజ్యము. ప్రాణములేని కెట్టెగా నాథ మతము ఆ రచనలో దొరకుచున్నది. అంతే. ఆ మతములో యీ సహజశూన్యత ఎక్కినది. కబీరులోనున్నది — శూనీసహజగావర్ణితమయినది; రాముదెవ్వడని కబీరును గట్టిగా నిలబెట్టగా శూనీసహజ — సహజశూన్యత అని ఊరుకొన్నాడు. సుందరదాసు, సహజానంద, దాదూలకు, కడకు నానక్ వరకు యీ సహజ యానీయ మైన భావశ్రేణియే సంక్రమించినది. తార్కికజ్ఞానముచేత సత్యముపట్టుబడదన్న భావము, పరమార్థము తర్కాతీతము అన్నభావమునే నాగార్జునుడు ప్రబలముగా నిరూపించినప్పటికిని, ఎల్లవాదములు — తన శూన్యతావాదముతోసహా — వ్యావ హారికములే యగుటచేత, గాఢదృష్టి (Dogmatic view) వహింపరాదని దృష్టి రాహిత్యమును చెప్పినప్పటికిని, తత్త్వవిచారమును నిరసించి, అనుభవమే అను భవముగాని వాదమంతయువ్యర్థమను దృష్టిపూనలేదు. సహజయానపరిణామముతో అనుభవమేగాని తర్కమువాదము వ్యర్థము, అనుభవము గురువువల్లనే సాధ్యము అన్న భావములు పైకివచ్చినవి. 'చాలుంజాలు విచారముల్ సలుపుచో సత్యంబు సాధింతురా' అన్నట్లైనది. సారహపాదుడు, కృష్ణపాదుడు, భూసుఖపాదుడు మొదలైన సహజయానాచార్యులు శాస్త్రపాండిత్యము, సిద్ధాంతపారంగతత్వమును, ఎగతాళిబట్టుదురు. కబీరులోను అదేధోరణి అధికము. వేమన్నయందు చెప్పవలసిన దేమున్నది.

"ఆరుశాస్త్రములను అఖిలవేదములను చదువనేర్తురిలను చచ్చువరకు
వ్యర్థవిద్యచదివి వడిచెడిపోదురో.................." (356, నేదునూరి)
"చదువరిమతికన్న సాధకుమతిమేలు, వేదములనులేదు, వాదములను"
(1837, నేదునూరి)
"చదువువానికన్న చాకలి తామేలు.................." (1852, నేదునూరి)

అన్న సామెతను గట్టిమాట జేసివైచినాడు. ఈ స్థితిని "విద్యాద్వేషముగా"* పరిగ ణించిన విచారింపవలసినదే.

వేమనలో మతరాహిత్యమొకటిదక్క యిప్పటివరకు గమనించిన సర్వ విషయములును సహజయానాంతర్గతములు. కాని అట్లని వేమనకు తెలియదు. వేమనలో శూన్యతాశబ్దలబ్ధి యున్నదికాని, దానికి సహజశబ్దము విశేషణముగాగాని, మరింకొకచోగాని కానరాదు. బౌద్ధమును తాను అనుగమించుచున్నానన్న స్ఫురణ అతనిలోలేదు. ఇన్ని విషయములతోపాటు, వేమన్నకు బౌద్ధుల శూన్యవాదముకూడ ముట్టినది.

వేమనకు నాథసిద్ధులతో సంబంధమున్నది. కాయసిద్ధి సాధనయంతయు వారి పొత్తున బడుటవల్లనే చేసినాడు.

"కాముడైన నరుడు కాయసిద్ధి వహించె, కాముడైన బ్రహ్మ కాముడయ్యె
కాముడగుచు బ్రహ్మకల్పంబులుండును ......... "

అన్నాడొకప్పుడు.

"బ్రహ్మగుడ్డుమేను ప్రాణమనగగాలి కనులు సూర్యచంద్రకళలు చూడ
నింతకంటె బ్రహ్మమెక్కడనున్నది .........."

అన్న పద్యమా మతసిద్ధాంతమే. వీరశైవపంచాచార్యులలో ఒకరైనరేవణుడు నాథ సిద్ధులలోకూడ లెక్కింపబడినాడు. ఇది శైవశాఖ. కన్నడవీరశైవమునకు దీనితో నెంత సంబంధమున్నది తెలియదు గాని నాథసిద్ధులలో ముఖ్యుడైన గోరక్షునితో ప్రభుదేవర శ్రీశైలముమీద కలిసి అతని కాయసిద్ధినికాదని శూన్యతత్వమును బోధించినట్లు ప్రభులింగలీలకథనమున్నది. నాథ, వీరశైవమార్గములబడి యీ సహజయానవిషయములు వేమన నాకర్షించినవి.

## శూన్యము : సున్నము

"తలచినను శూన్యతత్వము తలపకయుండినను
శూన్యతత్వంబదియొ ........ "

యని వేమన్న పద్యమే యున్నది. బ్రౌను సేకరణలోనే యున్నది. భావింపదగ్గ లోకముగాని, భావింపరాని పరముగాని, యెఱుకగాని, యెఱుకలేమిగాని శూన్య తత్త్వమని నాగార్జునుల సిద్ధాంతము సంసార నిర్వాణములొక్కటేయన్నది, వ్యవహార

* వావిళ్ళవారి వేమన పద్యముల ప్రతికి వ్రాసిన పీఠికలో రాళ్ళపల్లివారు.

పరమార్థములొక్కటేయన్నది శూన్యవాదములో రోకఁటిపాట. 'యః సంసారః తన్నిర్వాణమ్' – అవిద్యాచ బోధిశ్చ ఏకమ్' – ఇహపరములు, విద్యావిద్యలు నొక్కటే శూన్యతత్త్వము. శూన్యమును సున్నగా గాకుండ సున్నముగా దెనిగించి శూన్యమే యిహపరములని వేమన్న బాహాటించినాడు.

"సున్నమనఁగ మహిని సూక్ష్మమైయుండును
సున్నమనఁగ నిహముఁజూపు జగతి
సున్నమేపరంబు జూపుచునుండురా......."

అని వేమన్న ఇచట సున్నమును శూన్యమునకు తద్భవముగాగాక, కేవలమాచ్ఛికముగా గ్రహించినట్లయిన నీపద్యముయొక్క యర్థము నడవిలో దిగవిడువవలసినదే. శూన్యశబ్దవాచిగా దీసికొన్నచో యీ పద్యము నాగార్జున కారికకు కేవల మనువాద ప్రాయముగా దోచును. ఈ విధముగా సున్నముతో శూన్యతత్త్వమును జెప్పు పద్యములెన్నో యున్నవి.

"సిద్ధులెల్లఁగూడి చిన్మయమొనరించి శుద్ధిజేసిరుక్కుసున్నమునను
శుద్ధికిఁబ్రథమంబు సున్నమేకాదొకో . .. .."

"సున్నంబు దిన్నవానికి సున్నంబగునుగాక భ్రాంతి చొప్పడకున్నే
సున్నము హరిహరవిధులకు నెన్నంగా వశముగాదు యిదుగో వేమా !"

సిద్ధులు జ్ఞానమునుపొంది ఉనికికి (అస్తిత్వమునకు) శుద్ధి శూన్యమునందని తెలిసి, తన యునికిని, లోకము ఉనికిని శూన్యతత్వముచేత శుద్ధిపరచుకొన్నారనియు – ఆ శూన్యతత్వము బ్రహ్మవిష్ణుమహేశ్వరులకును గూడ అతీతమై, అనభిలాప్యమైనది అని వేమన్నమాట.

"హయము సున్నముదిన నతిశయంబై యుండు, కల్పమేలగల్గు కారణమున
హయము సున్నముదిన నంధకారంబుగ్గు ......"

అని మరొక పద్యము. హయమనగా యిక్కడ గుఱ్ఱముగాదు. గురువని, అఖిలము నని వేమన్న భావము.

"హయముగురువుగాద అఖిలంబు తాగాద ......" (477, బ్రౌను)

"హయమనఁగ పవిత్ర వస్తువవనిని వేమా (479, బ్రౌను)

అని వేమన్న మరికొన్ని పద్యములలో చెప్పినాడు. ఆ వివరణముతో అర్థమేమో గ్రహింపవలసియున్నది. గురువు శూన్యవాదమును జీర్ణించుకొన్నచో ఘనతకెక్కును. అజ్ఞానముడుగును. శూన్యభావము కార్యకారణత్వమును దాటినది. అట్టి శూన్య

తత్వము ఒంటబట్టిన గురువు కారణప్రపంచమునకు చిక్కి- ఇంద్రియకల్పనమునకు వశంవదుడు గాడు అని చెప్పుచున్నాడు. ఇట్లే మరికొన్ని పద్యములు సున్నముచే శూన్యవాదము చెప్పువానిని అన్వయించుకోవచ్చును. శూన్యమును, నిర్వాణమును మాధ్యమకము శివమని, శుద్ధమని, అమలమని వ్యవహారముచేత చెప్పును. శూన్య తత్వము శుద్ధము, అమలముగా చెప్పుటకు సున్నము అను శబ్దము ఉపయోగించును. సున్నముచే ఇల్లువెల్లవేసుకొని శుద్ధమొనర్చు కొందుముగదా! సున్నమును తెనుగులో వేమన్న శ్లేషించుచున్నాడు. వేమన్నకు తెలుగులో శబ్దాలంకారముపై మోజు కావలసినంతయున్నది. అలంతులైన తెలుగు శబ్దములతో తత్వార్థమున యమక క్రీడకు అతడు పాల్పడగలడు.

శూన్యవాదము అతివసూక్ష్మము. అపార్థమునకు తావు. దుర్జ్ఞాతము అని దర్శనకర్తలే చెప్పినారు. కోరలునాటుకోకుండ, జారిక్రిందబడిపోకుండ నోట గఱచికొని పురిటిలో పిల్లలను నిరపాయస్థానమునకు చేరవేయు పులిబాలెంతరాలుకు వలసిన జాగ్రత్త యీదర్శనావగతికి కావలెనందురు. ఈదవగాహనకు అంతగాగల ప్రమాదమును సున్నముదినుటగా జెప్పి ధ్వనింపజేయును. శూన్యతానుభవము గలవానిని సున్నంబుదిన్నవాడనును.

"సున్నంబుడన్నవానికి, సున్నతముగ పరుసవేది యుండును జూడన్
వన్నెకు మించిన సున్నము, వెన్నగు బ్రహ్మాదులకును వెలయఁగవేమా!"

సువర్ణమును మించినది శూన్యతత్వము. శూన్యతత్వవేదికి పరుసవేది యున్నట్లే. ఆ దృష్టితో నడచిన నడక బంగారము. ఆ దృష్టి ముట్టిన జీవితము బంగారము. కాని బంగారును మించిన శూన్యతత్వముండగా బంగారునేల కోరవలెను. బ్రహ్మ హిరణ్యగర్భుడు. ఆ బంగారు కడుపు వానివంటిదేవతలందరకును, అతని సృష్టి కంతకును శూన్యతయే వెన్ను, వెన్నెముక. బంగారుకడుపువానికే మూలమైన అది పరుసవేది.

"మనసులేనితావు మరిగినశూన్యంబు శూన్యమనగరాదు సూటిగాను
బయలులోనరవము ప్రకటము గాలేదు . . ."

శూన్యము మనస్సునకతీతము. మనస్సును లయించిననే శూన్యతానుభవము. దానిని శూన్యమని పరమముగా (Absolute) చెప్పను వీలుకానిది. శూన్యము శబ్దమున కందనిది. బయలనగా శూన్యమే.

ఇహపరములొక్కటే గావున, ఇహమున్ననే పరముండును గావున అవి అన్యోన్యాపేక్షకములు. కావుననే

"ఇహము విడువ ఫలము లింపుగా గలవని
మహిని బలుకువారి మతముకల్ల ......."

యని నిష్కర్షింప గలిగినాడు. ఈ మాట అద్వైతమునకు ఉలికిపాటు కల్గించును గదా! ఇంకను అందిముడని వాక్యములు ఇహపరములను గూర్చి, మాయనుగూర్చి వేమన చెప్పినవున్నవి.

"ఇహమునందుసుఖము ఇంపారలేదట, పరమునందుసుఖముబడయుటెట్లు
మొదటలేని చేవ తుదనెట్లు కల్గురా ........."

"మంటిలోనబుట్టి మంటిలోన బెఱిగి, మంటి మింటి సందు మఱుగుదెలిసి
మంటిలోని సుఖము మంటిలో గనవలె (మహిమీదగనవలె) .........."

"ఇహమునందునేమి యిడుమలబడినను, పరముసాధనార్థ పదవిగాదు
వరలబోవదెట్టి వెరపునఁజూచిన .........."

"మాయజగమటంచు మరిబల్కుచుందురు, మాయగాదు బ్రహ్మమయముగాని
మాయయైన పరము మరియేడనున్నది.........."

"బ్రతుకులెల్లమాయ భవబంధములుమాయ, తెలివిమాయ తన్నుదెలియమాయ
మాయదెలియువాడు మర్మజ్ఞుడగుయోగి.........."

ఇహము కేవలము పరమునకు సాధనమని తలంపరాదని, ఇహము కష్టము నికృష్టము హీనము న్యూనమునైన పరమువెంటబడి సాధింప నాయాసమక్కరలేదు. చెట్టుమొదట లేనిచేవ చెట్టుచివరకల్గునా? తెలివిమాయ,* తన్నుదెలియమాయ మొదలైన యీ భావరాశి అద్వైత సిద్ధాంతమునకు సరిపొందునని ఎవరైన భావించుట కవకాశమేలేదు. వ్యవహారపరమార్థముల తాదాత్మ్యభావము శూన్యవాదమునకు రాజముద్రిక. ఆ భావము లేకుండ యీ అభిప్రాయములు వెలువడనేరవు. తెలివి బ్రహ్మము; అవిద్యమాయ అన్నది అద్వైతము — తెలివి, తెలిమిలేములు రెండును శూన్యములు, వ్యవహారవిషయము అన్నది శూన్యవాదము.

---

* అందుకే, "ఈ 'మాయ' శబ్దమునకితని నిజమైన యర్థమేమో తెలిసికొను మార్గములేదు" అన్నారు రాళ్ళపల్లివారు — వేమన 82 పేజీ.

## తత్త్వము : అద్వయము

భేదాభేదములు, విద్యావిద్యలు, సాకారనిరాకారములు, భావాభావములు (అనఁగా సదసత్తులు) పరస్పరము విరోధించునట్టివి; ప్రతియోగులు, ద్వయములు. శూన్యతత్త్వమున పరమార్థము నిష్ప్రతియోగి; ద్వయాతీతము. అదే అద్వయ వాదము, (అద్వైతము గాదు.) అదే వేమన్న తత్త్వపారమ్యము.

"భేదాభేదములడఁచును, వేదాంతరహస్యమెల్ల వేమన నేర్చున్ ॥"

[వీరశైవము భేదాభేదమైనచో, అది వేమన్న తత్త్వమే గాదన్నమాట]

"తలఁచుట తలఁపమి రెండును
దలఁపక తానుండెనేని తత్త్వము వేమా ॥ ......... "

"ఆకృతి నరయగ నిరాకృతియుఁదగు, నిరాకృతి నొగి దగును యాకృతిట్లు
నవియు రెండులేక యపురూపమై యుండు ॥ . .. ...."

"భావాభావములంటక
సేవించెడు బట్టబయలు స్థిరమతి .. . "

అనుటతో 'భావాభావ పరామర్శక్షయో నిర్వాణముచ్యతే' అన్న నాగార్జున వాక్యము తటాలున మనసులో మెఱయవలసినదే.

## శూన్యము : బయలు

భావాభావములంటని స్థితితోపాటు బట్టబయలన్నమాటకూడ ఇక్కడ ప్రసక్తమైయున్నదిగదా ॥ వేమన్నలో నీ బయలన్న శబ్దమునకు బహుళప్రసక్తి. మోక్షమునకు, పరమార్థమునకు, సంసారప్రపంచములకు బయలుపర్యాయపదముగా వేమన ప్రయోగించియున్నాడు. బయలనఁగా ఆకాశము, శూన్యమునని రెండర్థము లున్నవి. ఏ యర్థమైనను అది బౌద్ధార్థమే. మోక్షపరమార్థములు, సంసారవ్యావహారికములు బౌద్ధమున శూన్యతత్వములు. బుద్ధుడుగాని, సంసారనిర్వాణములుగాని, వ్యవహారపరమార్థములుగాని ఆకాశప్రతికాశములనికూడ బౌద్ధమునకంతోక్తి. గగనోపమానము ఆ మతమునందెల్లనున్నది.

"చెవిని నిల్లుగట్టి చెప్పెనువేమన్న బట్టబయలనుండు బ్రహ్మమనుచు
బుద్ధిగలిగి యందుఁబొంది సుఖింపుడీ . . . "

అన్నపద్యమే బయలునుగూర్చి వేమన్న ఎంతప్రబలముగా, ఎంతప్రత్యయముతో చెప్పెనో తెలుపుచున్నది. బయలు శబ్దమున్న పద్యములసంఖ్య వేమన్నలో వందల

కొలఁదిగా నున్నవి. లెక్కించలేదుగాని బ్రహ్మశబ్దము మొదలు మరేశబ్దముకన్న అతివిస్తారముగా వేమన వాడుకచేసిన శబ్దము బయలని చెప్పుటకు సంశయింపఁబనిలేదు. అందుచేత ఆ పద్యరాశిని పనిగట్టుకొని పట్టికగా నీయనక్కరలేదు.

"బయలులోనపెనఁగి బయలులోమునిఁగియు, బయలుదెలియలేడుబంధితుండు
బయలు బ్రహ్మమనుచు భావించి చూడరా ..."

జనుడు మునిగిపెనగు బయలనగా సంసారము, జగమునని — అవి శూన్యతత్త్వములు గావున అవి బయలనబడినవి. సాంసారబంధితుడయిన ప్రాణి పరమార్థమయిన బయలును, శూన్యతత్త్వమును తెలియలేడు. జగన్మూలమును బ్రహ్మమను పేరుతో పిలుచుచున్నావు, ఆ జగన్మూలము శూన్యతత్త్వమైన బయలేయని భావింపుము.

"బయలు బ్రహ్మమనుచు భాషింపుచుందురు, బయలదేల తాను బ్రహ్మమగును
బ్రహ్మమైన బయలు పరికింపతత్త్వంబు . "

"బయలే చూడగ సర్వము బయలనిలేసమగుజూడ బ్రహ్మాండంబుల్
బయలని తోచెడిమదిలో బయలందిన ముక్తిబట్టబయలగు వేమా! ..."

"బయలున బంధముకప్పును, బయలునపరమాత్మనకునుబంధముతొలఁగున్"

వేదాంతుల బ్రహ్మమునకుంటె బయలును పైనుంచి వేమన మాట్లాడుచున్నాడు. వేదాంతుల పరమాత్ముడుకూడ వేమన సిద్ధాంతము ప్రకారము బంధగతుడు — బయలునుండి కల్గినవాడు; బయలందు కలియవలసినవాడు; పరమేశ్వరునికి కూడ ముక్తి బయలందే, శూన్యతత్త్వమందేయని వేమన వక్కాణింపు. మరింకేమి కావలెను? కావలెనన్న కావలసినంతయున్నది. ఎఱుకను (జ్ఞానము) బ్రహ్మమన్నదేగాని, ఎఱుకకు మీరినది బ్రహ్మమనుతత్త్వము అద్వైతము కాదుగదా! బయలు ఎఱుకను మీరినది.

"వంచనజేసెడి యెఱుకను, మించినపరతత్త్వమమరు, మేలిమిగా నా
సంచును గగ్గొనియుండిన, సంచారములేనిబయలు సతమగువేమా!"

బయలన్నమాట చెవినిసోకగానే వీరశైవమునకు ప్రాణములు లేచిరావచ్చును. అది నామాట, నాపాట, నాబాట, నాతత్త్వము అని యుపన్యసింప మొదలిడును. బయలుశబ్దము తత్త్వసారస్వతమున కెక్కించినది వీరశైవమన్నమాట యథార్థము. విశిష్టాద్వైతము తనది; భేదాభేదవాదము తనది; విశేషించి యిప్పుడిక శూన్యవాదము కూడ తనదే యని చెప్పుచున్నది. ఆ శూన్యవాదము ననవలంబించు సోమసిద్ధాంతము తనదే. అల్లమప్రభుదేవరలవారి శూన్యసింహాసనారోహణము అందుకు తార్కాణము.

"ఆరుదర్శనముల నరసినవారు, మీరినవేదాంతమితిగన్నవారు,
చేర రావెరతురా సింహాసనంబు .. ... "

అని ప్రభులింగలీలలో చదువలేదా ? అల్లయన్న కన్నడశబ్దమునకర్థము శూన్యము. అనగా అల్లమప్రభునిపేరులోనే శూన్యసిద్ధాంతమును నిక్షేపించినాము. ఒక్క అల్లమప్రభుని పేరులోనేగాదు కల్యాణమునేలిన బిజ్జలరాజుపై బసవేశ్వరుడు తిరుగుబాటుజేసి అతనిని జంపించుటకు కారణమైన గాథలో మొదట బిజ్జలునిచేత పొడిపించబడిన మాలడు అల్లయ్యాపేరి వాడని వినలేదా ? ఆ పేరుకర్థము శూన్యమయ్యాఅని. శూన్యము పేరి పేరులు ఆనాడు వీరశైవులలో తరచుగా నున్నవి. చనిపోయినవారిని వైదికమతమున స్వర్గస్థులైనారన్నట్లుగా మరణించుటను వీరశైవమున బయలయ్యెనని యందుముగదా ! తెలుగుకన్నడములలో బయలుగానము వీరశైవవీణమీద మ్రోగిన మాట నెవ్వరు కాదనరు. కాని తానది బౌద్ధమునుండి పొంది తనకు హక్కుభుక్తము గావించుకొన్నది. అదితనదొడ్డి బుట్టినకోడెగాదు. పెంపకము దెచ్చుకొన్నది. అందుచేతనే భేదాభేద, విశిష్టాద్వైతములు వీరశైవతత్వసిద్ధాంతములుగా తెలిసినంతగా, చెల్లినంతగా శూన్యవాదము వీరశైవ సిద్ధాంతముగా నర్వులకు దెలియలేదు. పండితులనుకొన్నవారికే తెలియలేదు. తెనుఁగుదేశమున వీరశైవ సాహిత్య పరిశోధక శిరోమణులైనవారికే అజ్ఞాతమైనది. శ్రీనాథునకు మాత్రమావిషయము తెలియును. హరవిలాసములో నతడు దారుకావనములో శివుడు మిండడై నగ్నరూపుడై ఋషులను లింగముపెంచి తాడించగా వారుచేసిన శివస్తోత్రములో

"శూన్యస్వరూపాభిధాలింగ ఖట్వాంగలింగాహిలింగాభ్రగంగానరిల్లింగ ."

అనుచు శివుని శూన్యస్వరూపమును దెలిసి సంబోధన కూర్చినాడు. శ్రీనాథుని వీరశైవమును పండితులే పోల్చుకొన్నది తక్కువ. వీరశైవులకు తెలుఁగున తలకట్టు పాల్కురికి సోమన్న, వీరశైవమున శూన్యవాదమున్నదని అతనికి తెలియనే తెలియదు. అల్లమప్రభునిగూర్చి చెప్పినప్పుడైన "ద్వైతయోగక్రియాద్వైతయోగక్రియాతీతయోగక్రియాన్వితుడ"ని యన్నాడేగాని — అక్కడాతడు ద్వైతాద్వైతయోగముల కతీతమైన యోగమనగా విశిష్టాద్వైతయోగమనికూడ భ్రమపడియుండవచ్చును — అతడు శూన్యవాదియని యయిన వ్రాయలేకపోయినాడు. ఇంక తెలుగుదేశమున వీరశైవమున శూన్యవాదమున్నదని చెప్పుట గాఢపరిశోధనముమీద చెప్పవలసినదగుచున్నదేగాని, కన్నడములోవలె పరిశోధన నపేక్షింపని వెల్లడి విషయము కాకపోయెను.

ఉత్తర దేశమున కూడ శైవాచార్య గణములు కొన్ని యీ యద్వయ తత్వమును అవలంబించియున్నవి. అదంతయు బౌద్ధమునకు అర్వాచీనకథయే. వేదాంతమైన యుపనిషత్తులందు యీ అద్వయతత్వము నిశ్చ్రుతియోగిక బ్రహ్మము వర్ణితము కాలేదని వారు గ్రహించి చెప్పుకొన్నారనుచున్నారు. అద్వయమైన పరమ శివావస్థకు వేదాంత బ్రహ్మము అపరదశావస్థయని* క్రిందుచేసి సమన్వయించు కొన్నారు. నైషధ కావ్యకర్తయున్నాడు; హర్షుడు. అతడు శైవుడు. అతనిలో శూన్యవాదమున్నది. అతడు వర్ణించిన సరస్వతి శైవసరస్వతి. ఆమె ముఖము సోమ సిద్ధాంతము; నడుము శూన్యసిద్ధాంతము — రెండును శూన్యవాదములే. ఇదంతయు నాగార్జున విజయము. అద్వయవాది యనగా బుద్ధుడొక్కడేగాడు. శివుడు గూడ కడకు అద్వయవాదియేయైనాడు. 'శివునిజంపి తాను శివయోగికావలె'నని 'శివుడు విష్ణు వరయ శివరూపధరులయా' [951 బ్రౌను] యని వేమన్న యనుటకు మూలమిది.

## జైన శైవములు : దిసమొలలు

బౌద్ధమును కాలరాచి శూన్యసిద్ధాంతమును తలకెక్కించుకొన్నట్లే, వీర శైవము మరొక్క విషయమును జైనమునణంచి జైనము నుండి సంగ్రహించిన దున్నది. అది నగ్నత్వము — దిసమొలతో దిరుగాడుట. జైనులందు దిగంబరజైన శాఖ ఉండనేయున్నది. జైనులనణఁగద్రొక్కిన వారిలో ప్రసిద్ధుడు రేవణాచార్యుడను నతడు. వీరశైవ పంచాచార్యులలో అతడొకడు. తెలుఁగాణెములోని కొలనుపాకకు చెందినవాడు. కన్నడమున కడుతిరిగినవాడు. జైనవిరోధియయి వారిని చంపించి మహిమములు ప్రదర్శించి జైనులవలె దిసమొల జేసికొని దేశసంచారము గావించిన వాడు. ఈ బిత్తలితనము వీరశైవములో మగవారిలోనేకాదు; ఆడువారికి కూడ ఆతరువాత పట్టుబడినది. కన్నడ వీరశైవులలో పేరుకెక్కిన అక్కమహాదేవి యున్నది. ఆమె వచనములు ప్రసిద్ధములు. ఆతల్లి చీరవిప్పివైచి నేలనాల్గు చెఱగులు చుట్టి తిరిగినది. అల్లమ ప్రభువునకు సమకాలికురాలేమొ.

---

* గోపీనాధ కవిరాజుగారి ఆదిశంకరులు అన్న గ్రంథము :

శైవేష్వన్ అద్వయనయే పరమశివం వ్యాఖ్యాతస్వరూపమ్ నగచ్ఛంతి నతన్మయీ భవంతి సాంఖ్యయోగ వేదాంత వాదాద్వయస్తు అపరదశా వస్థాఏవ, ఇతికేనతేషాం ఇయత్పదప్రాప్తి సంభవానపి—
సంచ్ఛందతంత్రముపై క్షేమరాజు ఉద్యోతటీకయని కవిరాజు ఉద్ధరించి నారు. ఇంకను ఈ విషయమై విశేషములందున్నవి. చూడనగును.

వీరశైవములోని దిగంబరత్వము జైనము నుండి దిగుమతియననేల? అది శైవములో రేవణాదులకు ముందు లేకపోయినదా అనుటకు ఆస్కారము లేకపోలేదు. లకులీశశైవమున ఈశ్వరుడే నగ్నమూర్తికదా! దారుకా వనములో శివుడు నగ్నమూర్తియై సంచరించి ఋషిపత్నులకు మరులెత్తించి మానము దీసినాడని వీరశైవ గాథలున్నవిగదా! నిజమునకు అవన్నియు జైనమతమున కివతల పుట్టినవి. ఆ గాథలలో శివునికి నగ్నత్వమే ఏమికర్మ, మహాశేఫత్వము, శేఫతాండవము కూడ నున్నది. ఇంద్రియములను రెచ్చగొట్టిన క్రీడ అక్కడ. ఇక్కడ ఇంద్రియ జయమును చాటుటకు కనులు నేలచూడగా నగ్నత్వమవలంబించుట జైనమతస్థము. అక్కమహాదేవి రేవణాదులు ఆ సంప్రదాయమందుకొన్న చారిత్రకవ్యక్తులుగా వేమన్న నుందున్నారు. వేశ్యాభోగవైముఖ్యమబ్బినమీద యింద్రియజేతయై రేవణ సంప్రదాయమనుగమించినవాడు వేమన్న.

బట్టవిడచితిరుగు సంప్రదాయము వేమన్ననాడు అపురూపుగాదు. మీదు మిక్కిలి ఆడువారిలోకూడ ఎక్కుడుగా నున్నది. ఆ విషయము వేమన్నే చెప్పినాడు. అక్కమహాదేవికి వారు అనుకరణములు కాబోలును. కానివారికి చిత్తశుద్ధి మాత్రము కొదువయైనది. పగలు పదుగురలో మాత్రము బట్టవిడిచితిరిగి సిద్ధురాంద్రనిపించు కొని గౌరవగణ్యతలో, కాన్క కట్నములొపొంది చీకటికి చీరగట్టి సిగ్గునెరపుట తరచై యున్నది :

"చీరగట్టిరాత్రి సిగ్గుతోనెటినుండు, పగలుచీరవిడచు ప్రజలయెదల
చేదెగాదుర యిది చేవాడికత్తిరా .. ....... "

"కల్లునీళ్ళుద్రావి కడుపెద్దవారిలో చీరవిడచి తిరుగు సిద్ధురాలు
పనులు దీరువెనుక పాతలుగట్టురా.... ....... "

స్త్రీలుకూడ చీరవిడచి తిరుగ నిర్దేశించిన "వ్యవస్థ" యొకటి వేమననాటికున్నదన్న మాట. అది బాహ్యాచారముగా మాత్రమే పాటింపబడుచున్నదని పాపము వేమన్న బాధ.

ఒక్క వేమన్నమాటేమి? వీరశైవములో "శివయోగుల"నిపించుకొను వారి నడకలే అట్లైనవి. పండితారాధ్యచరిత్ర చెప్పనేచెప్పుచున్నది. "ప్రతి నఖండిత దిగంబరధరులగుచు — అయాచిత, అకామకృతాహారులగుచు — నరిముక్తకేశమస్తక

ధరులగుచు" శ్రీగిరికి శివయోగులు* నడచినారని వర్ణించినది. "కామితపరదేశి కత్వంబులుడుగ"గా ఆ శివయోగులు, వేమన శివయోగి పరదేశికత్వమును నెరపినాడు. శ్వేతాంబర జైనమును వైష్ణవము ఇమిడించుకొనగా, దిగంబర జైనమును శైవము నిక్షేపించుకొన్నది. ఆ సంప్రదాయము ననుగమించిన వేమన్న దానికొక అద్వైత యుక్తికూడ చమత్కారముగా కూర్చినాడు.

"తల్లిగర్భమందు తాబుట్టినప్పుడు మొదలబట్టలేదు తుదనులేదు
నడుమబట్టగట్ట నగుబాటు గాదొకో ....... ..." అని.

ప్రత్యర్థుల ఆచారసిద్ధాంతముల తామంకించుకొని, వారి మతమును నామ రూపములు లేకుండ గావించుటచేత తానవలంబించిన శూన్యతత్వము జన్మతః బౌద్ధమని గుట్టుదెలియక బౌద్ధమును విమర్శించినవాడుగానే యున్నాడు వేమన.

"బౌద్ధమతమువారు బుద్ధిదైవంబని హెచ్చుతగ్గులంచు హీనమతిని
రెంటివిడచిరేల రిత్తదూషవిధంబు .. ..... "

బౌద్ధమతములో విజ్ఞానవాదులను వారు "సర్వంబుద్ధిమయమ్ జగత్" అనువారున్నారు. వారు బుద్ధినే దైవమనిచెప్పి, పరమార్థసత్యమని సత్యమున హెచ్చుతగ్గులు చెప్పి ఆ రెండింటినికూడ కడకు విడిచిపెట్టినారని వేమన్న విమర్శ. ఇహపరములు రెండింటిని విడనాడినారనిగాని, బుద్ధి దైవములు రెండింటిని విడిచినారనిగాని యర్థము.

ఆ విమర్శ యట్లుండగా, బౌద్ధుల విజ్ఞానవాదమువారు** చెప్పదగిన పద్యములుకూడ వేమన రెండుమూడు చెప్పినాడు :

"నీళ్ళమీదివ్రాత నిలువకయున్నట్లు పాటిజగతిలేదు పరములేదు
మాటమాటకెల్ల మనసు మారుచునుండు.........."
"నీలోని యెఱుక చాలగ నీలోననె పెరిగి పెరిగి నీలోనఁగున్
నీలోని చిత్రమడఁచిన ఆ లోనన బ్రహ్మబయలు ననువగు వేమా !"
"నీవునెఱఁగను లోకంబు నీకుదోచు, నీవు మఱిగిన తోడన నెందుదోచు,
ననెడి యెఱుకను విడనాడయ్య యోగి.........."

---

* కుంభమేళాలో త్రిశూలధారులయిన నగ్నసాధుయూథము త్రివేణీసంగమమునకు నేటికిని నడచుచున్నది.

** విజ్ఞానవాదమునకూడ శూన్యతాభావముండనేయున్నది.

ఆంధ్రమహాకవులలో శూన్యవాదము బౌద్ధదర్శనమని ఎరిగినవాడు తెనాలిరామలింగడు. ఆ రామలింగడు రామకృష్ణుడై వైష్ణవమహత్త్వము చెప్పుకొనువాడై బుద్ధావతార వర్ణనము చేయుచు మతిమాలి బౌద్ధములో జైనముజెప్పి భ్రాంతుడై పప్పులో కాలు వేసినాడు. కమ్మని పద్యమేగాని మతసాంకర్యము నెరపి భ్రష్టమైనది.

ప్రతిదినకేశలుంచనపురాయిడినెట్టనఁబట్టగట్టిఁపై
పుతపుతమంచునున్నకుఱుబోడతలన్ధరియింపనోడియున్
సతమగుసొమ్ముగాన విడజాలవుగాశిఖిపించవల్లి ! సౌ
గతమతధుర్య ! దానికటిజుట్టుముపుట్టము — మిన్నకేటికిన్ ॥

తెనుగుదప్ప గీర్వాణమెరుగని వేమన్న దర్శనార్థమునెంత సులభముగ, సూక్ష్మముగ, సూటిగ చెప్పగలిగినాడు ! గీర్వాణముగన్న పండితులు తలలువంచవలసినవారేగదా !

## అచలము : వేమన్న

ఈ కథ యిట్లుండగా, అచలమను మతమొకటి ఆంధ్రదేశమందున్నది. ఆ మతప్రవర్తకుడు రామడుగు శివరామదీక్షితులు. అతడిప్పటికి రెండు రెండున్నర వందలేండ్ల క్రిందటివాడు. క్రీస్తుశకము పదునెనిమిదవ శతాబ్దము మధ్యకాలమందున్నవాడు. అతడు శ్రీధరుని శిష్యుడందురు. అతడే శ్రీధరుడో తెలియదు. శివరామదీక్షితుని నివాసము నల్లగొండ ప్రాంతమునగల నారాయణపురము. ఇతని మతము తెలుఁగునేల నలుమొగాలను విస్తరించి మతముల నెలకొల్పుకొనియున్నది. విశాఖ—శ్రీకాకుళమండలములోను, గోదావరిసీమలోను, తాబుట్టిన తెలంగాణమందును వ్యాప్తిగన్నది. దీనివ్యాప్తి బ్రాహ్మణేతరులందేనన్నది స్పష్టము; గమనార్హము.

తెలుఁగునాఁట బయలుగానము చేసిన దర్శనమే అచలము. నిజముగా నది గానమే. వాడుకతెనుగుఁలో గూర్చిన కందార్థ* దరువులలోను, ద్విపదార్థ** దరువులలోను సాగిన గానమది. దాదాపు, బ్రౌను వేమన్నను సంపాదించి, ముద్రణము గావించిన అనతికాలములో ఈ బయలుదరువులు బయలుదేరసాగినవి. శివరామదీక్షితులుకూడ తెలుగులోకూడ వ్రాసినాడందురు. వేమన్నకన్న వీరి తెనుఁగు మిగులవాఁడుకభాష. ఈ సాహిత్యము వేమన్నను యీ తత్త్వమెఱిఁగిన చారిత్రక పురుషునిఁగా పేర్కొనుటకూడ కలదు. కన్నడమున ప్రసిద్ధుడైన అల్లమ

---

* శుద్ధనిర్గుణతత్త్వకందార్థదరువులు : భాగవతుల కృష్ణదేశికుడు.

** శుద్ధనిర్గుణతత్త్వద్విపార్థదరువులు : బాలారామపండితులు.

ప్రభుని ముచ్చటగూడ యిందున్నది. ప్రభులింగలీలావాక్యములు, వేమన్న ఆట వెలఁదులు దీనిలో భాష్యప్రవచనములకెక్కి-యున్నవి. వేమన్న బయలును గూర్చిన పద్యములు ఆ మతస్థులకు కంఠస్థము.

దీనికి సిద్ధాంతశిరోమణి* ప్రామాణికగ్రంథము. ఈ మతప్రతిపాది తాంశము పరిపూర్ణబ్రహ్మమని, బయలు (బట్టబయలు, ఉత్తబయలు) అని, అచల తత్వమని, గురుగుహ్యమని, పరమపదమని చెప్పబడును. అద్వైతబ్రహ్మము అపరిపూర్ణబ్రహ్మమని తమది పరిపూర్ణబ్రహ్మమని చెప్పుదురు. అద్వైతబ్రహ్మ భావము సాపేక్షికమైనది, కాలదేశావచ్ఛిన్నమయినదని, మానుషమనోవికల్పమేనని సవిమర్శముగా స్థాపించి తమది నిరపేక్షకము (Non-relative) పరమము (Absolute) నని తమ అచలపరిపూర్ణమును సర్వమైన మానవమనోవికల్పములకు సదసదాది సర్వద్వయములకు అతీతమైన పరిపూర్ణతత్వముగా బయలును సూచిం చినది. అద్వయతత్వమని పిల్చుకొన్నది. అది ఏ విధముగను వర్ణింపబడుట సమ్మతముగాదు. అనిర్వచనీయతత్వమనిర్వాచ్యమేగాని అద్వైతులవలె దానిని ఆనందమనిగాని చిత్, సత్ అనిగాని, మరింకొకటనిగాని చెప్పరాదనును. బయ లనఁగా శూన్యతత్వమని ముందే తెలిసియున్నదిగదా। వీరి సిద్ధాంత శిరోమణి

అంతశ్శూన్యం బహిశ్శూన్యం సర్వశూన్యం సదాశివం
శూన్యాశూన్యవిరాహిత్యం తల్లింగం అచలంప్రభో ॥

అన్నదని వీరిగ్రంథములు ఉదాహరించుచున్నవి.

"నశూన్యం నాపిశూన్యం నచోభయం మతమ్" అని నాగార్జునులు (శూన్యాశూన్యాతీతస్తవములో) చెప్పినంతదాక అచలమతము చెప్పినది. కన్నడమున కూడ బయలు శూన్యతాపర్యాయమే. కాని నేటి అచల మతస్థులు బయలనగా శూన్యముగాదని, శూన్యమనఁగా సర్వసామాన్యార్థమున ఏమియు లేకపోవుట, అసత్తు అను నర్థముగైకొని బయలుతత్వము శూన్యతాతత్వము కానేకాదని ఇటీవల వ్రాయ

---

* పరిపూర్ణబోధసిద్ధాంత శిరోమణి : శివరామదీక్షితులు. అనుష్టుప్పులలో నడచిన శిరోమణినుండి ఉదాహృతములగుచున్న శ్లోకములలో 'తల్లింగం అచలం ప్రభుః' 'తల్లింగం పరమం ప్రభుః' వంటి చరమపాదాంతమున గల ప్రభువు అల్లమప్రభువనుటయును పొసఁగుమ. అతనికి ప్రభువనుట ప్రచురమే. పరమ శివుడును కావచ్చును.

సాగినారు. అంతేగాక వేద, వేదాంతములకితరమైనదిగా ఒకవైపు వాకొనబడుచున్న యీ తత్వమును ఔపనిషదముగా సాధించి వైదికమతముగా చెల్లించు ప్రయత్నము ప్రబలముగా చేయుచున్నారు.

ఈ మతమందు ద్వాదశాక్షరీ మంత్రమొకటున్నది. ఈ ఉత్త బట్ట బయలు ఏమిలేదు — దీనిని సంస్కృతమున "అయంవ్యర్థః, బాహ్యోఽపి, నభవతి" అనుచున్నారు. బయలును వీరిక్కడ బాహ్యముగా సంస్కృతీకరించినారు. తెలుగు కన్నడములందు శూన్యమనుటకు ప్రచురమైన శబ్దము బయలు. కాని బయలు బాహ్యముగా అనూదితమై శూన్యతార్థమునుండి దూరము గావింపబడుచున్నది. బాహ్యము శూన్యతాపర్యాయముగాదు. ఈ విధముగా శూన్యతాస్పర్శలేని వాదముగా దాని పుట్టుమచ్చలు చెరిపి వేరైనదానిగా బయలువాదమును చూపించు యత్నము అచలములో నున్నది. ప్రభుదేవర "శూన్యసంపాదనము" నుండి వెలువడిన బయలు వాదమును వేదాంత సంగతముగా చెప్పు ప్రయత్నము దండిగా కానవచ్చుచున్నది. అచల పరిపూర్ణబోధను శూన్యబోధ అనుచున్నారుగాని అది నిజముగాదని చెప్పుకొన ప్రయాసపడుచున్నారు. పరిపూర్ణబ్రహ్మము అద్వయతత్వముగా పారిమార్థికతను సూచింపవలసినచోట దాదాపు నిర్వచనము చేయుచున్నారనవచ్చును.

ఇది అద్వయవాదము, బయలువాదము మాత్రమేగాక నాగార్జునుల సిద్ధాంతమువలె అజాతవాదమునై యున్నది. న భవతి అనుటలోనే అది యున్నది. పితాపుత్రసమాగముపేర మాధ్యమకము చెప్పినట్టి సాపేక్షకతగాని, మైత్రి, కరుణ, ముదిత, ఉపేక్షలను చతుర్బ్రహ్మ* విహారములను పారిభాషికపదము తప్పించి

---

* అచలమును వైదిక సంప్రదాయములో బెట్టిచెప్పువారు 'అచలోఽయం సనాతనః' అన్నగీతావాక్యమును తెచ్చిచూపుచున్నారు. కాని, మహాయాన బౌద్ధములో యోగసాధనలో దశభూమికలున్నవి. అందులో ఎనిమిదవ భూమిక పేరు అచలభూమిక. ఇక్కడితోనే కర్మలు అంటనిస్థితి ఏర్పడును. నిర్వాణములో ప్రవేశింపకుండ బోధిసత్వునిగా సమస్తజీవకోటి లాభమునకై సంసారమందే వర్తించునట్లు యోగ్యత, ద్రఢిమ ఇక్కడనే ఏర్పడును. నిర్వాణాకర్షితుడు కాకుండ లోకకల్యాణము కొరకు చరించు బోధిసత్వదశలో కర్మములు ముట్టనిస్థితి యీ అచలభూమికతోనే ఆరంభము. పైగా, దశభూమికలు పూర్తికాగా పొందు బుద్ధత్వమును పూర్ణత్వము, పరిపూర్ణత్వము కూడ నందురు. ఈ విధముగా అచల పరిపూర్ణత్వములు మహాయాన బౌద్ధమునగలవు. తాంత్రికదశయందు అచలేశ్వరుడను దైవతముకూడ బౌద్ధమున ప్రత్యక్షమైనాడు. అతనినే చండరోశనుడనికూడ పిల్చెదరు. బసవేశ్వరునినాడు సమాజములో అచలయ్యలు, అచలదేవమ్మలు కర్నాటకమున పేర్లుగానున్నవి.

చెప్పుట కుదురునట్టి విషయములచేతగాని ఎంత మార్చుకొన్నను అచలము పుట్టిల్లు శూన్యవాద బౌద్ధముగా పోల్చుకోవచ్చును.

బౌద్ధములోవలె ఇందులో జ్ఞానము కూడ మాయ. ఎఱుక (జ్ఞానము) ఉపాధిరహితము. పరిపూర్ణము దీనికి కారణముగాదు. అధిష్ఠానముగాదు. 'ఎఱుక కంటె మాయ ఏ లోకమునలేదు' — అనగా ఎఱుకే బ్రహ్మమన్న శంకరాద్వైతము, శబ్దబ్రహ్మమును మాయాకోటిలోనివి. వ్యావహారికము, ప్రపంచము, వస్తువులు. భ్రమ, ప్రమసర్వము మాయయైన ఎఱుక. అందుకే వేమన

"తెలివి మాయ, తన్నుదెలియమాయ" (72, బ్రౌను)

"ఎఱుక మఱచుచోటు నెఱుగుట బ్రహ్మంబు" (27, బ్రౌను)

అన్నాడు.

"ఎఱుక బ్రహ్మమనియె యిలశంకరాచ్యుడు, తెలివిబ్రహ్మమనుచుఁదెలిపెవ్యాసు
లెఱుక తెలివి రెండు నెఱుఁగడువేమన ..... ...."

అని యీ మతస్థులు వేమన మాటగా నుదాహరించుచున్నారు. మానవుని భావనా వ్యాపారమంతయు సాపేక్షకము, కావున శూన్యమని బౌద్ధము చెప్పుకొన్నది. వీరో శూన్యమనగా లేనిదిగా అర్థముచేసి ఎఱుకను 'లేని ఎఱుక'గా చెప్పినవారు. వేమన ఎఱుకను మాయ అన్నాడేగాని (బౌద్ధులవలె), లేనిదానిగా మాత్రము చెప్పలేదు.

వేమన చెప్పిన మతరాహిత్యమునే అచలము చెప్పినది. బుద్ధిగమ్యమైన దెల్ల వైరుధ్యదూషితము — ప్రతిపక్షమునకు ఆకరము. అచలము మనోనాశమును నిబంధించును. ఎఱుకచేసిన యింద్రజాలమే మతములు—దర్శనములు. నాగార్జున శూన్యవాదము చెప్పిన దృష్టి రాహిత్యమే యిది. వేమన్న యింతకుకూడ మిగిలి సాధారణమైన మతతత్వమునే తెగడినాడు. అచలతత్వములోని కందార్థదరువొకటి చూడవచ్చును.

"మతములవారలు తమ సమ్మతమైనటువంటి శాస్త్రమర్యాదలచే
మితమేరుపరచుకొని బహుగతులను కలహింతు రట్టిగతినీకేమిటికీ
చపలతజెందేస్థితి నీకేమిటికీ ప్రతిలేని యీ బట్టబయలుండజూచి
సంతతములేనెఱుక లేనిదనినమ్మిక వారిగతి నీకేమిటికీ
చపలతజెంద నీకేమిటికీ" (118 – శుద్ధనిర్గుణతత్వ కందార్థదరువులు)

అంతేగాదు. మంత్రము, యోగము, మననిదిధ్యాసనలు మున్నైన వేమియులేని యోగముగా రాజయోగము పేర వేమన్న యొకటి చెప్పినారని కనుగొన్నాము. ఈ అచలముకూడ అంతే చెప్పుచున్నది.

సాధనలు జెప్పి శిష్యుల బాధలపెట్టేటి గురునిబాట, వదలియే
బాధలు లేనిబోధను సాధుల సేవించి వినుము సద్గుణశాలీ ॥
(క్షరాక్షరోపాధిద్వయ దోషరహిత పరమతత్వ కందములు)

"ఏయుక్తి, యేమాట, యేయోగము, యేజపము, యేయనుష్ఠానము, యేభక్తి, యేమతము యేవేదశాస్త్రములు యేభాష్యములు యేవీపనికిరావు"
(సిద్ధాంత శిరోమణి, తెనుఁగు, అన్యవాద నిరసన)

"నాలుగు యోగములు పనికిరావు, నాలుగు మహావాక్యములు బొందవు. దీనికి యేలక్షణములులేవు లక్ష్యముద్రాభ్యాసములన్నీ భ్రమలే" [పరమాకాశోపస్థితి, సిద్ధాంత శిరోమణి, తెనుగు] నాలుగవయోగమనగా రాజయోగమనుకొన్నాము. అదికూడ వీరు కాదన్నారు. కాని యీ మతము వారికి మరొకపేరే రాజయోగులని. ముఖ్యముగా శ్రీకాకుళమండలములో వీరికి రాజయోగులనియే వ్యవహారము. ఎక్కడగాని యీ మఠాధిపతులకు రాజయోగులనిపేరే. వారు సంసారులు; రాగులు. లోకముతీరునే వేషము, వృత్తికలవారు. వేమన దిగంబరత్వము వైరాగ్యము దిగనాడి బట్టకట్టి ప్రపంచాధీనుడై పరిణమించుటకీ మతమనుమతించగలగినట్టిది.

గురుగౌరవమునెంతో విశేషముగా చెప్పుచున్న యీ మతము గురు శిష్యోభయరాహిత్యమును వేమన వలెనే చెప్పుచున్నది :

"గురుతుజూపునట్టి గురువెవ్వడునులేడు, గురుతుగన్న శిష్యవరుడులేడు
గురుడు శిష్యవరుడు కుందేటి కొమ్మయా . ... " (1164, బ్రౌను)

ఇంతగా చెప్పిన అచలము పరమశివతత్వమనుట మానదు. వేమన్నయు అంతేకదా! పరమ శివావస్థ శూన్యస్వరూపము. అందుకే ముగ్గురు మూర్తులలోని శివుని యీ మతస్థులుగాని వేమనగాని తిరస్కరించి మాటాడగలరు. "శివునిజంపి తాను శివయోగికావలె" నని, "మూడు కనులవాని మొనసిపెల్చినవాడు" (910 బ్రౌను) తానేనని, వృషభాంకునకు సొడ్డువేసితినని (271 బ్రౌను) పల్కనవకాశము వేమనకీ శూన్యతాతత్వముననే పరశివత్వమను తత్వము నాశ్రయించుటవల్లనే కల్గినది. "బ్రహ్మమడఁగకుండ బ్రహ్మంబు కనరాదు." (138, బ్రౌను) వంటి చరణములకు వీలును యీ తత్వమును బట్టియే కల్గినది. "శివోఽహమితిభ్రమో నివర్తనీయః"

అని, సాకారము ఇనుపసంకెళ్ళు; నిరాకారము, శివోఽహమనడము బంగారుసంకెళ్ళు. ఇవి వదలడము కష్టము (సిద్ధాంత శిరోమణి, తెనుగు) అని అచలము చెప్పుచున్నది.

వేమన ఎంతగానో చెప్పిన ఎంగిలిసైతము యీ మతస్థులలో అక్కడక్కడ నున్నదని తెలియవచ్చుచున్నది. ఇంకను చిన్న చిన్నవైన అనేక విషయములలో వేమన దృష్టికి ఇందలిస్థితికి సారూప్యము, ఏకీభావము ఎంతో యున్నది. వేమన భావరాశి అచలమును పొంది, ప్రవర్తిల్లుచున్నదనుట నిజము. వేమనగాని, అచలముగాని, అల్లమప్రభుని వీరశైవముగాని నాగార్జున శూన్యవాదమునకు ఋణపడియున్నవి. అది తీర్చలేని ఋణము.

కాని, వేమన అచలతత్వమును పేరుబెట్టిచెప్పినాడా లేదా యనుమాట కూడ చూడగలము.

"అచలతత్వమనఁగ అనుభవగమ్యంబు చూపి చెప్పరాదు సూక్ష్మమదియు
మదికిదోచుగాని మర్మమెన్నఁగరాదు విశ్వదాభి ... . "

అన్న పద్యము వావిళ్ళవారి ప్రతిలోనున్నది.

"కదలి (కదిరి) తూర్పునందు ఘనతశోభిల్లగా బరగువర కఠార్ల పల్లెవెలసి
యచలనిష్ఠగూడ నమరియుండెదరయా ... . . అని (887) వేమన

సూక్తిరత్నాకరము నుండి అనంతకృష్ణశర్మగారు ఉదాహరించుచు, అచ్చువేసినవారు సృష్టించినది కాదని, ఇది బందరు ప్రతికన్న ప్రాతదని, కదలి కాకుండ కదిరియని దిద్దుటకు విమర్శించిన పద్యమొకటున్నది. అయిదు వేల పద్యములతో సంకలితములైన వేమన పద్యప్రతులలో అచలప్రసక్తి అతివేలము. కాని బ్రౌను ప్రతిలో మాత్రము అచలశబ్దములేదు. కాని,

"నిరతం బెడదెగకుండన్, పరిపూర్ణ బ్రహ్మమాత్మ పదమున నుంచన్
నిరవద్యమైన పదవిని చరియించును జగమెఱుంగ సత్యము వేమా"

(53 బ్రౌను)

అన్న పద్యము బ్రౌనుదొర ఆదిలో అచ్చువేసిన చిన్న సంకలనములోనే యున్నది. పరిపూర్ణబ్రహ్మము అచలపరిపూర్ణమని యింతకు ముందే చూచిన విషయము. బ్రహ్మమునకు పరిపూర్ణమను విశేషణమును తగిలించగనే యిందలి విశేషమేమిటాయని యోచించుట పరిశోధకుని కనీస ధర్మము.

"శ్రీకర శివతత్వ శీలుడౌ వేమన ప్రాకటముగ వేయు పద్యములను
లోకమందు చదివి లోవెలిబాయరో .... ........"

శ్రీకరంబుగ వేమన జెప్పినట్టి "పద్యముల నెవ్వదేనియు పఠనసేయు
నట్టిపురుషుడు మనమున నిట్టిదనుచు జెప్పరానట్టివస్తువు జేరువేమ॥" అను

గ్రంథాది పద్యములలో లోపల వెలుపల (Immanence and Transcendence) అన్న వానికి అతీతము, మనసుచే నిట్టిదని చెప్పరానిది అయిన తత్వము అద్వైతము కన్న వేరైనదా యన్నప్రశ్నము కల్గించ వలసినది. ఇంతకునూ చెప్పవచ్చిన దేమనగా, పరిపూర్ణ బ్రహ్మతత్వమని పేరుబెట్టిన పద్యమును బట్టియైనను అచలతత్వము వేమన యందున్నదని, అది అద్వైతేతర మయినదని ఎన్నడో సిద్ధాంతము గావలసినది. అద్వైత మందయినను దత్తాత్రేయ సంప్రదాయమని, అసామాన్యబోధ అని సురేశ్వరుల వార్తికమును పురస్కరించుకొన్న శాఖ ఒకటున్నది. అదేమైన వేమన్న యందున్నదా యనియైన పరిశీలించినచో పరిస్థితి కొంత మెరుగయ్యేడిది. నిర్వాసనా మౌనముద్రానిష్ఠకు వేమన్న రాజయోగమునకు సంబంధము స్ఫురించినను నయమే. ఏదేమైనను, వేమనగాని అచలముగాని శివప్రసక్తి దెచ్చినను అది నాగార్జునులవారి 'ప్రపంచోపశమమ్ శివమ్' అన్నంత పాటిదేగాని బసవేశ్వరాదుల లింగాయతములోని సామాన్య శివతత్వము గాదు.

మహాయానమునకు, అందలి శూన్యతత్వమునకు ఆంధ్రదేశమే జన్మ స్థానమైనందుకు జనసామాన్యమున పాతుకుపోయిన వేమన్నలో మరలనదే శూన్యతాతత్వము వెల్లిగొనుట ఔచిత్య మహితముగా నున్నది.

## వేమన్న ఆర్థిక దృష్టి

కులపు హెచ్చులొచ్చులమీద, అంటుసొంటులమీద, పుట్టు గొప్పలమీద, బాహ్యాచార శుష్క నియమములమీద, నిష్ఠాకాఠిన్యములమీద బసవన్న వరకుగల పూర్వ మహాపురుషుల దాడి యున్నదిగాని, సమాజములోని ఆర్థిక వ్యత్యాసములమీద వారి కన్ను పారలేదు. 'సర్వేజనా స్సుఖినోభవంతు' — 'బహుజనహితాయ, బహుజన సుఖాయ' యనుటకన్న అధికమైన నిర్దేశము మున్నులేదు. కాని వేమన్న చురుకు చూపులు ఆర్థిక వ్యత్యాసములమీద కూడ పడినవి. నేటి సామ్యవాదము వంటి దానికాతడు కర్తకాలేదుగాని, పేదతికమును పెఱికివేయవలెనన్నవాడు, కలిమిలేములు రెండును రెండు చివరలు గాన మధ్యతరగతి మర్యాద సంసారితనము లక్షింపవలసిన దన్నవాడు. అదే గమనింపవలసినవారము.

"పేదరికమన్న దోషం, బేదో యీ జగతిలోన నీశ్వరుడెఱుఁగున్
పేదను పొడగనువారును, కాదని శవమనుచు జూచుగదరా వేమా!!"

అని యీశ్వరునంతటివాడు ఆదిభిక్షువై తిరిపెమెత్తుకొని తిరిగినందున సభా గౌరవమునకు నోచుకోక మామయయిన దక్షుని చులకనచూపులకు గురియైనగాథ గుర్తుపెట్టుకొనుచున్నాడు వేమన్న. లేమిడి వలన కలుగు కీడుపీడలను క్రోడీకరించి, తెల్పినాడు. దైహికముగా కలుగు బాధకన్న, మానసిక సామాజికములైన బాధలను బహుధా వర్ణించినాడు.

ధనములేమి శుచిని తగబుట్టనియ్యదు —
ధనములేమి ఘనతదప్పు వేమ —
ధనములేక యున్నధైర్యంబు చిక్కదు —
లేని కాలమునకు లేనిమవసునొందు
ఈనినపులి రీతి నెఱుగ కుండు —
ధనము లేమెవరికి తాళిక యుండదు —
పరగలేమి చేత బందుగుల్ పగవారు (పెఱవారు) —
పరగలేమిచేత పరపతిదప్పురా —

అని శుచి, ఘనత, ధైర్యము, వివేకము, తాలిమి, బాంధవ్యబుద్ధి, పరపతి లోపించు ననిచెప్పి, లేమిడి తాలిమినిజంపి బాంధవ్య బంధములు త్రెంపి సంఘమును చెఱుపునని. దారిద్ర్యము సంఘ విచ్ఛేదకశక్తియను పిండితార్థముజేసి చెప్పినాడు.

"ధనములేమి యనెడు దావానలంబది, తన్నుజెఱచు, మీఱిదాపుజెఱచు" నని హెచ్చరికజేసినాడు. అంతేకాదు కులముల ఎచ్చులొచ్చులకన్న కలిమిలేములన్న తారతమ్యములే సంఘమునకెక్కువ అపాయకరములని, నేటి పడికట్టు మాటలలో చెప్పవలెనన్న, వర్గభేదములే వర్ణభేదములకన్న సామాజిక జీవితమునకు హాని కల్గించునని స్పష్టముగా దర్శింప గలిగినాడు.

"సముదయంబునందు సర్వమొక్కటియైన వైరమొదవదేమివారలైన —
ఎచ్చుతగ్గులందు ఏర్పడనేహాని, విశ్వ ........"

అని తెగవైచి చెప్పినాడు. తొలుతనుండియు 'కులముకన్న మిగుల కలిమి ప్రధానంబు' ఇత్యాదిగా చెప్పుచునే యున్నాడుకదా! ఆర్థిక వ్యత్యాసముల వలన ఉపద్రవమే ఉపద్రవమని గ్రహించిన వేమన పేదల సంఘీభావమును కనుగొన కుండునా?

"కన్నుపోవువాడు కాళ్ళుపోయినవాడు ఉభయులరయ గూడియుండినట్లు
పేదపేదగూడి పెనగొనియుండును ........."

అని అననే యన్నాడు. వర్గవ్యత్యాసములకన్న పర్ణవ్యత్యాసములు తక్కువ ప్రమాదముగా చూచినను, వాని నివారణకు నిర్మూలనమునకు ఒక్క కంచపు పొత్తుగూడు ఏదో కొంత ఎంగిలి సంగతించునట్లు సిద్ధాంతముజేసి ఆచరణలో బెట్ట ప్రయత్నించిన వేమన, అధిక ప్రాధాన్యమిచ్చిన ఆర్థిక వ్యత్యాసముల విషయమున అంతకన్న అతితరమైన ప్రణాళిక యివ్వకుండునా ?

"పులియదెట్టిదన్న భూలోకమృగరాజు, కలియదెట్టిదన్న కానరాదు
పులియు కలియుకన్న భువినాకలియె హెచ్చు ........."

"ఆకటికిదొలంగు నాచార విధులెల్ల ......... " నని గమనించిన వాడాయెను. ఆచార విధులు అడుగంటిపోవుచో వేమన విచారపడువాడుకాడుగాని, ఆకటిబాధ అవశ్యనివారణీయము, ఆత్యయిక పరిస్థితిగా పరిగణించి పరిష్కరించ వలెనన్న దృష్టి వేమన్నది. కరువు కాలమున, ఆకలి చావులుమాత్రము నివారించుటకు మాత్రమే కాదు; సాధారణమైన దారిద్ర్యమును నిర్మూలించుటే అవశ్యకరణీయముగా భావించినాడు.

"ద్రోహబుద్ధినైన దొంగతికమునైన నటలనైన సాహసముననైన
సంపదధికు నుండి సాధించి ధనమును బడుగుకిచ్చెనేని బాగువేమ !!"

"ధైర్యయుతున కితరధనమైన నదురేమి, దానమిచ్చునపుడె తనకుదక్కె
ఎలమిమించుపనికి నెవరేమిసేయుదు, రడుగుదప్పు బిడుగు దప్పువేమ !!

"తండ్రిసొమ్మునైన దాయాదిసొమ్మైన పరులసొమ్మునైన ప్రాప్తధనము
దయనుదీనులకును దానమిచ్చినవాడె బహుళపుణ్యజనుడు పరగవేమ"

"తనదుసొమ్ముజూడ దానమీయగవచ్చు, నవనిదొడ్డగాదదెవరికైన
అదురుబెదురులేక యన్యులసొమ్ములు దానమిచ్చువాడు దాతవేమ"

యని పరధనమును పంచిపెట్టుటే విశేషదాతృత్వముగా సిద్ధాంతీకరించి, అన్నికట్టడల త్రెంచుకొని కలవారిసొమ్ములను కన్నపెట్టి, కొల్లపెట్టి, కొట్టితెచ్చి

"దోసకారియయిన దూసరికాడైన, పతితుడైన పేదబాహ్యుడైన
పట్టిలేని పేదవానికీదగునీవి ...... "

అని పేదలకిచ్చుటలో పాత్రదానము, అపాత్రదానము నన్న విచక్షణమే మానుమని బాహటించినాడు. పేదతికమే నిజమైన, అధికమైన పాత్రత. నటలనైన సాహసమునైన పరులసొమ్ములు పట్టితెచ్చి పంచిపెట్టు నుగ్రపంథబోధించిన ప్రవక్త

భారతదేశమందెవ్వరునులేరు. ఈ పరిధికు పృష్టపూర్వముతమైన కలవాయని విచారింపవలసియుండును. అదే వేమన నిశ్చితాభిప్రాయముగా నిలచిపోయినదా, లేదా యని విచారింపవలసియున్నది.

మతస్థుల మార్గములందే యిట్టివి కొన్ని సందర్భములున్నవి. తమిళ దేశమున వైష్ణవములో పేర్కొనబడు పన్నిద్దరాళ్వారులలో తిరుమం*గై యాళ్వారనువాడు దోపిడికాడు. వైష్ణవుల పోషణకు, విష్ణుసమారాధనమునకు నాతడు ఇళ్ళు ఊళ్ళు కొల్లగొట్టినవాడు. వేమన్న అమూలచూడమెఱింగిన వీరశైవ సంప్రదాయములో కన్నడ దేశమున కన్నద బ్రహ్మయ్య యనువాడొకడు అట్టి వాడుగానున్నాడు. చోరశాస్త్రమున అతడు దిట్ట. గడియకన్నము, గడపకన్నము, గోడకన్నము, నేలకన్నము మొదలైనవానిలో అందెవేసినచేయి. జంగాలపోషణకై, అట్టిఅతిథుల సత్కారమునకై శైవులగు వారి యిండ్లు మాత్రము విడిచిపెట్టి తక్కుంగల సంసారులయిండ్లు సొచ్చి, దొంగిలితెచ్చువాడు.

"ఇహపరంబులకు దూరమైనట్టి లబ్ధుల యిండ్లు సొచ్చి,
వారల చరితార్థవంతులజేయ జనియించినట్టి ప్రాక్తన పురుషుండు" గా
(బసవపురాణము)

బసవేశ్వరునిచేత ప్రకీర్తితుడై బిజ్జలరాజు కోశాగారమును చూరగొని శిక్షపడకుండ కాపాడబడిన గడిదొంగ. వీరి చోరత్వము స్వీయమతోన్నతికై, పూజాదిక నిర్వ హణముకై, జంగాలు యతులు మున్నైన మతపరివారపోషణకై ఉద్దిష్టమైనవి. కంచర్ల గోపన్న రైతులొద్ద పన్నులు పిండి వసూలుచేసి, రాజకోశమునకు కట్టుటకు మారుగా భద్రాద్రిలో గుళ్ళు గోపురములు కట్టించినాడు. అంతే.

---

* ఇతని వైష్ణవసమారాధనము పెండ్లివలన వచ్చినట్లున్నది. వైష్ణవ కన్యను యీ శూద్రుడు పెండ్లాడగోరగా నామె దినమునకొక వేయినెనిమిదిమంది విష్ణుభక్తులకు పృష్ఠోష్ఠపర్యంతము తృప్తాస్థగా విందువెట్టుటకు యీ అలినాటి యేలిక, చోళసేనాని అంగీకరించిననే వివాహమాడెదనని నియమము పెట్టినది. బహుశః ఆమెకై కొత్తగా వైష్ణవము గైకొని ఆమె అడిగినంతకన్న అధికముగా ఆ నియమము నెరవేర్చినాడు. కడకాతడు నాగపట్టణమునగల బంగారు బౌద్ధ విగ్రహమును తదితర బౌద్ధసంపదను కొల్లగొట్టి శ్రీరంగము కోవెలకు ప్రాకార మంటపాది నిర్మాణములు చేసినవాడు.

వేమన్న దృష్టికి యీ మతస్థులదృష్టికి ఎంతోభేదమున్నది. మతస్థులైన ఈ దొంగల దృష్టి పేదల నుద్ధరించు నుద్దేశముగలదికాదు. కాయకష్టముమాని సన్యాసముపూని సంఘమున నొక గణ్యత సంపాదించి అనాయాసముగా భుక్తి జరిపించుకొన వెడలినవారి పోషణకును, ఆయా మతముల ప్రాబల్యము కొరకును నీతితరము హింసాయుతమునైన యీ పనులు జరిగినవి. మతములకు లక్ష్యము మానవుడన్నది తలక్రిందై, మానవుడు మతమునకు సాధనము మాత్రముగా మారి కావించిన అకార్యకరణమిది. మతము సాధనముగానే యుండిపోక లక్ష్యభూతమైపోయి మానవుని దుష్పథమున కీడ్చిన సంగతి యిది. వేమన్న బోధయు అపమార్గమే యగునుగాక, అది మానవుని మరొకందుకు సాధనముగా మార్చక, లక్ష్యస్థానమందే యుంచి సంఘమున విలయతాండవము జేయుచున్న దారిద్ర్యమును ఉన్మూలించుటకై ఉద్దిష్టమైనది. దొంగతికమునగాని, ద్రోహమునగాని, సాహసమార్గ మింకితరమేదైన బూని,

"పరులకుపకరించి పరుసొమ్ము పరునకుఁ బరగనిచ్చెనేని పరముగల్గు... ...."

నని వేమన చాటిచెప్పినాడు. వేమన్నయే స్వయముగా నట్టి పనిజేసి ప్రజకు పంచిపెట్టి యుండుననుకోవచ్చునా? ఏమో? ఈ బోధ అతడెప్పుడు చేసియున్నదో. వైరాగ్యము వహించి సన్యాసులలో జేరిపోయిన పిదపనా? అంతకుముందు గ్రామవ్యవహారములు చూచి పరిష్కరించు నధికారము వహించి, చిల్లరరాజుల కొల్వులో జరుగునన్యాయములు చూచి కంటగించుకొని మానవతాబుద్ధిచే నుద్రేకించి సామాన్యమైన సాంసారికపు జీవితము నుండి కాలు అవతలబెట్టు నొకపరిణామ దశకు పట్టుబడి చెప్పినట్టిదా యిది? ఎటుతెమల్చి చెప్పుటకును తిరుగులేని సాక్ష్య మూ దగ్గరలేదు. అతడు ఉపదేశకుడైన పిమ్మటనే అయినచో, తదనుచరు లెవరైన కన్నములు వేసిగాకపోయినను ఋణపణములు చేసి వానిని ఎగబెట్టిగాని, తమతమస్వాధీనము నందున్న భూమి తదితరమైన యిస్తువును పేదలపరముగావించి యుండుటకు కారణమైయుండును. గ్రామాధిపత్య మందుండగానైనచో తానే అట్టిది కొంతజేసి అధికారము నుండి తొలఁగవచ్చును. ఒకానొక మతస్థులు ఒకానొక కులస్థులు, పతితులు పాషండులు వేదబాహ్యులు నన్నవిచక్షణ లేకుండ పేదతికమున క్రుంగిన ఎల్లవారికి పంచిపెట్టుట అతనిదృష్టి. మరి మతస్థులకు, వేమనకు పోలికయున్నదా!

వేమన్న మార్గమును పట్టినవాడే యిటీవలికాలమున ఉన్నవవారి-మాలపల్లి నవలలో 'ధర్మకన్నముల' సిద్ధాంతమును ప్రకటించి ప్రపంచించిన తక్కెళ్ళపాటి

జగ్గడు. ఈ కల్పితప్రాణికి అచ్చుకట్టులుగా ధార్మికులైన దొంగలు కొందఱు తెలుఁగు దేశపు చరిత్రలో నున్నట్టు ఉన్నవవారి ఎఱుకలో నున్నారేమో తెలియదు. తెలుఁగు దేశమందలి దొంగలలో అట్టి ధార్మికులున్నవారేని యీనేల ధన్యము. కృష్ణామండలమున పోరంకి గ్రామమునకు చెందిన తోటకూర ఘంటయ్య యనువాని చరిత్ర కొంత అట్టిదని నాయనుమానము. గత శతాబ్దాంతమున వానివృత్తమున్నది. అతడు శైవవైష్ణవ గాథలలోని వారివలె మతస్థుడుగాడు, భక్తుడుగాడు. కాని దొంగిలించిన సొమ్ముతో బ్రాహ్మణ సమారాధన చేసిన సందర్భముతోపాటు పేదలకు కూడ పంచిపెట్టిన వాఁడందురు. వేమన్న ఉగ్రగమార్గమున దారిద్ర్యోన్మూలన కార్యక్రమము ఆనుపానులు, పోలిక చాలికలను గూర్చి యిప్పటికింతే చాలును.

అంతకు దెగబడ్డ వేమనలో మరికొంత కాలమునకాయుద్రేకము చల్లారినది. ఉన్నవారి సొమ్ము నెట్లైనను లేనివారికి పంచిపెట్టు నుద్యమము విరమించుకొన్నాడు. లేనివారికి సొమ్ముదెచ్చియియ్యవలెనను బుద్ధిని మాత్రము విడువలేదు. రసవాద విద్యనపుడు చేపట్టినవాడు గావచ్చును. బంగారుజేసి యీయవలెనని తలంచినాడు. అదట్లుండగా తనయుగ్రపంథ వలన ఏయుపద్రవము అనర్థము వచ్చినదో స్పష్టముగా తెలియునాధారములు లభింపకున్నవిగాని అతడిట్లను చున్నాడు :

"ఇరుగుపొరుగువారి కెనయు సంపదజూచి తనకులేదటన్న ధర్మమేమి ?
ధర్మమన్నతొల్లి తన్నుక చచ్చిరి .. ..." [905 గోపాల్ అండ్ కో ప్రతి]

తొల్లియనఁగా నదెప్పటి మాటయో ? తనకు ముందెప్పుడో జరిగిపోయిన చరిత్రయో, తాను తొల్లి చేయించిన చర్యలమాటో మరితెలియదు.

"దోపిడిచ్చువాడు తులలేని నెఱదాత దోచుకొన్నవాడు ద్రోహియయ్యె"
[1167 గోపాల్ అండ్ కో ప్రతి]

నని విచారించినాడు, కాని, అట్టి అపమార్గము వలన సమాజమున శాంతిస్వాస్థ్యములు మరింత సన్నగిలుటేగాని అనుకొన్నట్లు ప్రయోజనకారి కాకపోయినది కావలెను. అది అతని స్వానుభవమయి యుండును. ఇక నాతడు చేయఁగలదొక్కటే. ఔదార్యబుద్ధిని మానవునిలో మేల్కొలుపు నుద్యమమొక్కటే. మానవకారుణ్యమును సిద్ధాంతముజేసి ప్రచారించినాడు. అంతే.

వీరశైవములో అన్నదానమునకున్న ప్రాధాన్యప్రాశస్త్యములు మరే మతశాఖ యందునులేవు. మొదలిబిచ్చగాని ముద్దుల పెండ్లామెగా అన్నపూర్ణాదేవిని

సృష్టించిన మతమిది. ఆయమ్మతో కాపురముకూడ అతని తిరిపెమును తప్పింపలేదు. ఈ దేశమున ఆకలి చల్లారలేదు. అదేమికాని, అన్నపూర్ణను సృష్టించిన శైవము మనుష్యుడాకలిగొనుటనగా శివుడే ఆకలిగొన్నట్లన్నది. అది యందొక సంప్రదాయము, విశ్వాసమునైనది. ఆకొన్నయతిథి శివుడని — (1174 బ్రౌను) వేమన్నవాక్కే యున్నది. ఆకలన్నవాని కన్నంబుబెట్టిన హరునకర్పితముగ నారగించు .... 'అన్నిదానములకు నన్నదానము హెచ్చు' — 'అన్నదానమునకు నధికదానములేదు' అని వేమన్న అన్నదానము నగ్గించినాడు. అదంతయు వీరశైవ సంగతమైన దృష్టియు భౌతికమైన యాథార్థ్యమును కూడ. అన్నమిడుట కన్నియులేవని, షడ్రసోపేతముగ పెట్టుటకు అనువగుటలేదని అసలు అన్నమే పెట్టుటవిరమింపక ఉన్నదానితోనే ఉదరబాధ సమయమునకు తీర్చవలెనన్నాడు :

"ఉప్పుతోడ తొమ్మిదొనరగూర్పగలేక, అతిథిడస్సి అన్నమడిగినపుడు
అతిథిడస్సియుంట నార్పనివాడేల ......... (625 బ్రౌను) అన్నాడు."

"అరయనాస్తియనక యడ్డుమాటాడక, తట్టువడక మదిని తన్నుకొనక
తనది కాదనుకొని తాఁబెట్టినదిపెట్టు.........."

[738 గోపాల్ అండ్ కో ప్రతి]

కాని కరువునైన యాచకునికేని ఎంగిలొక్కటి మాత్రము పెట్టరాదని గట్టినిబంధన చేసినాడు. సర్వభక్షకుడైన అగ్నివలె అన్నింటిని విమర్శించువాడుగా కన్పించు వేమన్న మెప్పుకు పాత్రులైన ప్రాణులిద్దరే యిద్దరు: గుంటుపల్లి ముత్తమంత్రి, కోటసింగరాజు నిల్లాలైన గంగమాంబ.* వారిద్దరు అన్నదాతలు. అందుకే వేమన మెచ్చుకొనుట వేమన అన్నదానమున కిచ్చిన ప్రాధాన్యమట్టిది.

## పెట్టిపుట్టితివి; పుట్టి పెట్టుము

ఉగ్రమార్గములను నిష్ఫలముగా తీర్మానించుకొని కడకు వేమన్న మానవ కారుణ్య బోధకుడుగా స్థిరపడినాడు అనుకున్నాము. వేమన యందీపరిణామము విస్ఫుటము. కాని, ఒక విషయము స్పష్టముగా గమనించవలసి యున్నది. వేమన తాను ఉగ్రమార్గము, అపమార్గము నుపదేశించినప్పుడుగాని, మరెప్పుడుగాని

---

*"ప్రాకటముగ నిట్టిలోకములో గుంటుపల్లి ముత్త డెన్న పరమగుణుఁడు
హరుని పూజచేసి అన్నదానముజేసి హరునిలోన గలిసె వేమ !!"
"కోట సింగరాజు మాటవాసియెగాని గంగమాంబచేత ఘనతకెక్కె...."

ధనవత్తత యంతయు పాపమనిగాని, ఆస్తియే చౌర్యమనిగాని, ఆర్జనము మొదలే కూడనిపనియనిగాని తలఁచినవాడు, చెప్పినవాడుకాడు. ధనము గడింపుమని గట్టిగా చెప్పగల అవకాశమాతని దృష్టియందున్నది. నిజమునకు అట్లు చెప్పినవాడు వేమన్న. ధనములేమివలని కలుగులోపములు అతడు చెప్పినవి మున్నే గమనించినారముగదా,

ధనమార్జింపంగవచ్చు ధర్మముగానే – [2626 నేదునూరి ప్రతి] అని అననేయన్నాడు. నీతి బాహ్యము, కరుణా శూన్యము, పరపీడాపరాయణముకాని చొప్పున సిరిసంపత్తులు గడింపవీలున్నదనియు వేమన భావన. "కలుషితార్జితంబు తలవంపులకు మూలము" – [573 బ్రౌను] అని చెప్పినవాడు. ఆగర్భశ్రీమంతుల యెడలగాని, కష్టించి యార్జించి ధనవంతులైన వారిపట్లగాని, కలిసివచ్చి కలిమిమేట వేసిన భాగ్యపురుషుల యందుగాని వేమనకు సద్భావమేగాని మరొకటిలేదు. "కలిమి తనదుపాలి కర్మానుకూలంబు – [534 బ్రౌను] అని ప్రకటించినవాడు.

సమాజమున గలుగు కలుషితార్జనా మార్గములను బాగుగా జూచినవాడు; కంటగించుకొన్నవాడు. మన పల్లెలను మనకు బాగుగా నెఱిగించినవాడు.

> దొడ్డవారమంచు త్రోవడొంకలు కట్టి, అడ్డమైన జనుల నంటగట్టి
> దోచుకొన్న యట్టి దోషమెక్కడబోవు.. . . [2597 నేదునూరి ప్రతి]"
>
> "వాగులడ్డుగట్టి వల్లకాఁడులు దున్ని మునునడచెడుత్రోవ ముండ్లుకొట్టి
> పై రుబెట్టునట్టి పాపులుగలరొకో..... ....[4301 నేదునూరి ప్రతి]"

మన పల్లెలలో మోతుబరువులు చేసెడు చెయిదములే యివి. పుంతలుగనుము కొనుటలు, బీళ్ళుబయళ్ళు గ్రామకంఠములు బలిమిని హక్కుభుక్తము గావించు కొనుటలు – ఇవినేటికిని కానవచ్చునవే గదా! ఇరుగుపొరుగుల తగాదాలు, దాయాదికలహములు, చిన్న పెద్ద నేరములు జరిగినప్పుడు కలిగించుకొని తగవరులై తప్పుచేసెనని విరుగదీసి కంబాలకు కట్టి దండుగలు విధించి సొమ్ము దండుకొనుటయు వేమన్ననాడు దండిగానున్నది. నేటికిని చావలేదు. "పెక్కుజనుల జంపి పేదల వధియించి ఊళ్ళు దొంగిలించు .... వారిని కంటగించుకొన్నాడు. ఉగ్రపంథ దిగనాడిన వేమన్న వీరిని 'దోచుకొన్న యట్టి దోషమెక్కడ బోవు' నని యమునినో, హీనమైన ఉత్తరజన్మభయమునో జూపుచున్నాడు; వారిని తెగడుచున్నాడు. సన్మార్గమున సంపాదించిన వారిని సైతము పిసినిగొట్టుతనము నెఱపుచున్నచో అసహ్యించుకొన్నాడు. పిసినిగొట్టును ఎగతాళిచేసినాడు. కలుషితార్జనమును కాదనుచు, లోభబుద్ధిని క్రించుపరచుచు ధనమున్నంతకు దానమేకర్తవ్యము, సార్థక్యమునని

పదే పదే చెప్పినాడు. స్త్రీ వ్యామోహ విజయము తర్వాత దానగుణమును కీర్తించి నంతగా మరొక్క గుణమును వేమన కీర్తించలేదు.

ధనికుని దానధర్మములు చేయుమని ప్రబోధింపని బోధకుడొకడున్నాడా ? దానికేమంత యోచనాపాటవము కావలెనా ? కాని ఇతరులందరివలెనే చెప్పెనా ? వారికన్న నెక్కువగా పదికి పదొకొండుసార్లు మాత్రమే చెప్పెనా? అంతే అయిన అందలి ప్రత్యేకత ఏమి ? అపమార్గములు వీడి యీ మార్గమున పడుటచే దీనికి కొంత ప్రత్యేకత కల్గినదా ? ఈ సుసామాన్యమైన నీతిబోధలో కూడ వేమన కొంత ప్రత్యేకత జూపినాడని చెప్పుటే ఇచటి ఉద్దేశము. దానధర్మములకు ధనవత్తతకు కార్యకారణ సూత్రమొకటి వేమన చూపినాడు. కర్మవాదపరముగా దాని కన్వయము కుదిరించినాడు. ఇదియు వేమన ఎన్నడు నెక్కడనులేని సరిక్రొత్త సృష్టి నొకదానిని చేసినాడనికాదు. దానధర్మములు చేయుమని తగిలి తగిలి యుప దేశించిన మహాశయులుగాని, ధర్మశాస్త్రములుగాని రోకటిపాట పాటిగా పాడినట్లు ఇతని వాదము ప్రాతవడినదిగా తోచదు. పూర్వజన్మమందలి కర్మములనుబట్టి ప్రస్తుత జన్మమందలిస్థితి కలిగినదని, పూర్వపుణ్యమును బట్టి యిపుడు శ్రీమంతుడైనాడని, ఆగర్భశ్రీమంతుని పెట్టిపుట్టిన వాడని యనుటయు భారతీయులకు అలవాటు క్రిందకు వచ్చినది. "ధనము వెంటరాదు ధర్మంబు చేయరో", ధర్మమే జీవినమనుసరించునని వేమనతోపాటు యీ దేశమున ఎల్లవారును పల్కగలవారే. కాని, కర్మవాదము, పునర్జన్మము, ధనవత్తతనుముడిపెట్టి, ధనలాభమున్నవానికి ఇతరులకు మున్ను తానిచ్చినధనమే తిరిగి యిప్పుడు సంక్రమించినది; మరల నట్లే పంచిపెట్టి ఉత్తర జన్మమున మరల ధనికునిగానే పుట్టుటకు పాటుపడుమని ఒక సుసంగతమైన సిద్ధాంతముగా బోధ గావించిన వారెందరున్నాడు ? తెలుఁగున నొక్కరును కాన రాలేదు. ధర్మశాస్త్ర శిఖరములమీదను తగులలేదు. కర్మ—పునర్జన్మమునని చెప్పు వైదిక సంప్రదాయమున యీ విధమైన ఉద్బోధ సర్వసాధారణముగా జరిగినదా ? పాఠక మహాశయులే ప్రమాణము.

"పూర్వజన్మమందు పుణ్యంబు సేయని పాపిధనము కాశపడుటయెల్ల
విత్త మఱచి, కోయ వెదకిన చందంబు విశ్వ . . "

(42 గోపాల్ అండ్ కో)

"తాము గడనసేయుధనము, తమదటంచు నమ్మియుంద్రు పెట్టినరులు భువిని
తాము నొకరికిచ్చు ధనమింతియేగాక కడమది తమకేల గలుగు వేమ!!"

(910 గోపాల్ అండ్ కో)

దీనినే మరొక తెఱఁగున తిరుగజెప్పినాడు :

"తాము గడన సేయు ధనమెల్ల తమదని నమ్మియుంద్రు వెఱ్ఱినరులు భువిని తామొరులకొసంగఁ తమకదియే కల్గు, విశ్వ ........."

(2370 నేదునూరి ప్రతి)

అందుచేత,

"పూర్వవాసనగల పుణ్యాత్ములెప్పుడు నూటచెలమరీతి నూరునెప్పు డెందఱకు నొసఁగిన ఎప్పటియట్లుండు విశ్వ.........."

(537 గోపాల్ అండ్ కో)

పైగా, తిరిగి కలుగుతీరు కూడ,

"తాము బలిమిబెట్ట తమకు బల్మినికల్గు, అడుగనిడిన తామునడుగగలుగు ఇందునీనివాని కెందును కలుగదు...... " (2374 నేదునూరి ప్రతి)

ఇచ్చినదే పొందుచున్నావు, పొందిన దానిని తిరిగి యిమ్ము; ఇచ్చిననే తిరిగి పొందగలవు. ఇడుట పడయుటకొఱకే. ఈవియు స్వార్థమే. ఆస్వార్థము పరార్థాశ్రితము. స్వార్థపరార్థములు అన్యోన్యాశ్రయములు : అన్యోన్యాపేక్షకములు. పునర్జన్మకర్మ వాదముల నమ్మికమీద ఆకృతినొందగల కడుపొందికగల భావకోటి యిది. ఇంత పొందికగల సూత్రముతో దానధర్మములు తగిలి చేయుమన్న ప్రబోధమెంత విన దగ్గదో గమనింపవలసియున్నది.

"దానధర్మములను తగరేపునేడని కాలలయముజేయు కష్టజనుడు తానునేమియగునొ తనబ్రతుకేమౌనొ మాయదెలియలేదు మహినిమేమ ::

(545 బ్రౌను)"

"కలిమినాడు నరుడు కానడోమదమున లేమినాడు మొదలెలేదుపెట్ట, కలిమిలేమిలేని కాలంబు కల్గునా. . .. . .. "(1219 నేదునూరి ప్రతి)

కావున వాయిదా వేసుకొనకుండ త్వరపడి ఎప్పటి కప్పుడే కలిగినంతలోనే దానము చేయవలెను.

"అరుదుగా నడిగిన నతడర్థికాబోడు, తఱచుగా నొసఁగక దాతగాడు దాతకర్థికింత తారతమ్యము సుమా... . ...."(996 గోపాల్ అండ్ కో)

"తిరిపెగాడయినను తిరిపెమెత్తిన యట్టి తిరిపెమందు తాను తిరిపెమిడిన తిరిపెము తిరిపెమున దిగబడిపోవురా ........"

(2403 నేదునూరి ప్రతి)

"ధనము చాలగూర్చి ఘనదానధర్మముల్ తగిలి చేయకిచ్చుతనయులకును
తేనెగూర్చి యీగ తెరువర్లకియదా .........."(1179గోపాల్ అండ్‌కో)

కూడ బెట్టిన ధనము కొడుకులకిచ్చుట యీగ కూర్చిన తేనె తెరువరులకు దక్కుట వలె తనకు నిష్ఫలమట. ధనము కొడుకుగుబ్బలకు సంక్రమింపనీయక దాన ధర్మములు చేయవలయునట.

"ఇచ్చినదే తిరిగివనచ్చిది. వచ్చిన దానిని తిరిగి యిచ్చి మరల పొందుము. తనయులకు ధనము మిగల్పకుము. నీవే దానము చేసివేయుము, త్వరపడుము; అలసత్వము కూడదు. మరణము పొంచియున్నది." అన్నభావ సరళి నాగార్జునుని రత్నావళిలో తగులుచున్నది.

"యాచకేభ్యః పురాదానాత్ ప్రాప్యార్థాంశ్చేత్ నదాస్యసి
అకృతజ్ఞత్వలోభాభ్యాం నఅర్థాన్ పునరవాప్యసి ..." (4-7 రత్నావళి)

"సర్వస్వం పూర్వనృపతేః నృపస్యవశమాగతమ్
కింపూర్వకస్య ధర్మాయ సుఖాయ యశసేఽపియా ..."(4-14 రత్నావళి)

"భుక్తాదర్థాదిహ సుఖం దత్తాత్పారత్రికం సుఖమ్
అభుక్తాదత్త నష్టత్వాత్ దుఃఖమేవ కుతఃసుఖమ్ ..." (4-15 రత్నావళి)

"వినశ్యన్ సచివైర్దాతు మస్వాతంత్ర్యాత్ నశక్యసి
ఆపతచ్ఛేదనైః స్నేహైర్నవరాజ ప్రియైషిభిః...." (4-16 రత్నావళి)

"తొల్లిటి దానములవలన బడసిన యర్థములను అకృతజ్ఞతా లోభములకు లోగి యాచకుల కొసంగవేని మరల న పదలందవు. పూర్వరాజుల సర్వస్వము తరువాతి రాజునకు దక్కుచున్నది. అది పూర్వునకు ధర్మమునకా? సుఖమునకా? లేక కీర్తికా? కుడిచిన యర్థము వలన ఇందు సుఖము. ఇచ్చిన దానివలన అందు సుఖము. కుడువక, పరులకీయక నశించిన యర్థమువలన దుఃఖమే తక్క సుఖమెట్లు కలుగును? సచివులు చనిపోవుచున్న రాజునందు చెలిమిమాలి క్రొత్తరాజునకు ప్రియముచేయు వారగుదురు. కావున మరణకాలమున అస్వతంత్రుడవై దానము చేయజాలవు" ప్రస్తుతపురాజు మరణకాలమును, కానున్న క్రొత్తరాజు నన్నచో కానున్నరాజు కొడుకై యుండగా కూడ, ధనమంతయు కొడుకునకు దక్కకుండ దానము చేయుమన్ని నాగార్జునుడు చెప్పినాడన్నమాట. గాఢమైన దర్శనార్థములందేగాక, సామాజిక విషయములందు కూడ భావసారూప్యము వీరిద్దరి మధ్య గోచరమగుచున్నది.

# నీభావికి నీవేకర్తవు

దానాదికము విషయమున కర్మవాదము ప్రసక్తింపనే ప్రసక్తించినది. వేమనకు కూడ కర్మవాదమందు విశ్వాసమే. ఈ కర్మభూమిలోగల మతము లన్నింటికి (ఒక్క చార్వాకమునకు దక్క) కర్మవాదమందు విశ్వాసమే. వేద కర్మ వాదము నిజమునకు మనమనుకొను కర్మవాదమునకన్న వేరైనది. ఆప్రసక్తి, వివరణము ఇక్కడ అక్కరలేదు. కాని జైన బౌద్ధములు చెప్పిన కర్మవాదము యధార్థమున క్రియా వాదము. అవి అక్రియా వాదములుగా సాంఖ్య ఆజీవిక మతములను విమర్శించినవి. కడకు వైదికమతమున నిల్చిపోయిన కర్మవాదము అక్రియావాదము, నియతివాదము (Fatalism or Doctrine of Predetermination) గా స్థిరపడినది. ఇప్పటి మానవ జీవితమున ఇచ్ఛాస్వాతంత్ర్యము, కర్మస్వాతంత్ర్యము లేదనునట్టిదిగా రూఢమై నిల్చినది. పౌరాణిక మతము ప్రజలలో ప్రాచుర్యము పొంది బ్రహ్మయనువాడొకడు మనుష్యుని నొసట వాని జీవిత విధమెల్ల వ్రాసిపెట్టునని, బ్రహ్మవ్రాసిన నొసటివ్రాలకు తిరుగులేదనియు నిత్యము భారతీయులాడుకొనుమాట. వేమన కూడ అట్లే ఒకప్పుడన్నవాడే. 'నొసట వ్రాయువ్రాత నుసిమినబోవునా' (601 బ్రౌను) అని అన్నవాడే. మరొక్క కాలమున కాతనిలో పరిణామము పొడచూపి, అందుకు విరుద్ధముగా బోధించినాడు. బ్రహ్మవ్రాతలో వైరుధ్యమును చూపినాడు.

"బ్రహ్మకర్త నుదుట వ్రాసెడు కొరకంచు, పరగతనదు శిరము భవుణిపాణి
నంట వ్రాసికొనెనె యాకమల భవుడు ....... " (845-బ్రౌను)

బ్రహ్మఐదవ శిరమును శివుడు తెగవైచి, ఆ కపాలమును భిక్షాపాత్రగా వాడుకోసాగినాడన్న గాథను పురస్కరించుకొని విమర్శించినాడు 'బ్రహ్మ వ్రాత కెదురు పల్కెడివాడుగా' (910 – బ్రౌను) కూడ తన్నుదాను చెప్పుకొన్నాడు. బ్రహ్మ – కర్మ – మనుష్యుడు-నన్న విషయమును విస్పష్టముగా ఇట్లు చెప్పినాడు:

"వ్రాతవెంట గాని వరమీడు దైవంబు – సేతకొలదిగాని వ్రాతగాదు
వ్రాతకజుడుకర్త — చేతకు తాఁగర్త. ....... " (4350 వేదునూరి)

నొసటి వ్రాతకు బ్రహ్మదేవుడే ఉద్యోగిగావచ్చును. అందతడు స్వతంత్రుడుగాడు. తన యిచ్ఛవచ్చినట్లు వ్రాయజాలడు. మనుష్యుల చేతలను బట్టి వ్రాయవలసినవాడే అతడు. జనుల చేతలకు లోబడిన వ్రాత యది. అట్లు బ్రహ్మవ్రాలను శాసించు చేతలకు మనుష్యుడు తానుకర్త.

"వ్రాతవెంటగాని వరమీఁడు దైవంబు, నీతికొలఁదిగాని వ్రాతగాదు
వ్రాత కజుఁడు కర్త నీతికి తాఁగర్త....... ... "

(1896 గోపాల్ అండ్ కో)

అన్నదొక పాఠాంతరమున్నది. చేతకు బదులు నీతిని చొప్పించినవే యిందలి మార్పు. కాని, యిది విషయమును చెప్పుట కుపకరించుచున్నది. చేతకు కర్తృత్వ మెవరిదన్నది చర్చించుటంతయు నీతిని చర్చించుటకే. నీతిని నెలకొల్పుటకే గదా!

మనుష్యునకా ఈ జీవితమున చేయుకర్మలకుగాను కర్మ స్వాతంత్ర్యము మాత్రము ఈ జీవితమున నున్నదనియే వేమన తలంపు.

"బ్రహ్మ మొదట తాను వ్రాసిన వ్రాతను, తప్పుజేయునిపుడు తానుకర్త
భ్రాంతజీవియొక్క పామరత్వము దెల్పి నిప్పుడెవరుకర్త యిలనువేమ॥
(992 బ్రౌను)

ఈ విధముగా వేమన "నీ భావికి నీవేకర్తవు. మేల్కొనుము. జాగ్రత్త వహింపుము. శీలవంతుడవై వర్తింపుము. ఈ జీవితమున నింకగల భావిని, ముందు జన్మమును ఇప్పుడే తీర్చిదిద్దుకొన యత్నింపుము" అని బోధించుచున్నాడు. ఈ జీవితమునందింత స్వాతంత్ర్యమును వైదిక దర్శనములు చెప్పలేదు. దర్శనముల మాటెందుకు గాని, వానికి ప్రతిధ్వనియై ప్రాతినిధ్యము వహించినవానిగా సర్వ హిందూ ప్రపంచము గొప్పజేసి తలమోయుచున్న భర్తృహరి వేమన దృష్టికి దగ్గఱ యనదగ్గ అవధూత, శైవ సంప్రదాయము ననుగమించు వాఁడయ్యును 'సుభాషితము' లలో నెక్కడను నీకర్మమునకు నీవుకర్తవు అని చెప్పలేకపోయినాడు. మానవునకు కర్మస్వాతంత్ర్యమిప్పుడు లేదన్న పక్షమున, ఆకర్మకూడ మానవుని ఇచ్ఛకు విధేయమనక అదేదోగాని బ్రహ్మదేవునకు పైనున్న ఎవరొక దేవతగా (నమః తత్కర్మభ్యో విధరపిన యేభ్యః ప్రభవతి - సత్రిక్రయాంభిగవతిం - భర్తృహరి) భావించినను మానవవర్తనమును శాసించుస్థానమున బ్రహ్మకు బదులు బ్రహ్మకన్న విశేషాధికారములతో శివుని స్థాపించి శివునియాజ్ఞలేక చీమైనకుట్టదను లోకోక్తిని బుట్టించిన దృష్టి నవలంబించినను మానుషశీలమును, ప్రవర్తనను దిద్దుటకుగాను సూక్తులు సుభాషితములు శతకములు జేసిజెప్పుట వ్యర్థప్రయాస. తననడవడిని బట్టి తన భవిష్యమగుటకు వీలున్నదను విశ్వాసమున్ననే నీతిబోధకు ఆస్కారము కలుగును * ప్రాక్కర్మముల ప్రభావమే ప్రభావము, ఇప్పటి నడవడి సర్వము నడే

---

* వీరశైవమున బసవేశ్వర సంప్రదాయము మానవునికింక పున ర్జన్మమునే లేదనును. వేమన్న పద్యములు కొన్ని పునర్జన్మమును విమర్శించినవి గలవనియు, కాని బ్రౌను వానిని ప్రచురింపలేదనియును దెలియుచున్నది. వేమన్న పేరజెల్లి అచ్చుకెక్కని పద్యములలో అవశ్యము దేవలసినవివ్వి.

నిర్ణయించి పెట్టినదిగా బౌద్ధుల కర్మవాదము ఎన్నడును ఎన్నికకు రాలేదు. అది క్రియావాదముగా నెన్నడును మరుగు పడలేదు. వైదిక దర్శన ధర్మములలోనే కర్మవాదము క్రియావాదముగాకుండ నియతివాదముగా అర్థమునో అపార్థమునో పొందినది. వేమన మాత్రము ఈ అర్థచ్ఛాయకు ఎడమీయలేదు.

"తనదు పూర్వకర్మ తలపోయనేటికి, తనదు బ్రతుకునాయె తలఁచిచూడ
ఇట్టి జన్మకర్మ ఇటముందు బలిమని తెలియని తెలివెట్టి తెలివివేమ . ."
(319 బ్రౌను)

పూర్వజన్మమున నీవు చేసిన పనులను గూర్చి యిపుడు చింతించుట దేనికి? అవే యిప్పటికి నీజన్మమయినవి. ఇటువంటి జన్మమున కర్మములే ఇక్కడికముందును నిర్ణయించునని తెలియని తెలివి వ్యర్థము. కావలెనని ఇక మంచిపనులుజేయ సమకట్టుము. ఇదీ వేమన బోధ.

ఇది నిష్కామ కర్మయోగముగాదు. ఆ గీతాపరిభాషగాని, ఆ అర్థముగల బోధగాని వేమనయందు లేదు. జ్ఞానమార్గమువాడేగాని, జ్ఞానము కర్మనుగాల్చు నన్నవాడేగాని, చేయుపనులందు తగులముండరాదని, ఫలములక్షించి పనిచేయకుమని, కర్మలందే నీ కధికారముగాని కర్మఫలమందు అధికారివిగావని గీతాపంథీయుడుగా నుపదేశింపలేదు. ఫలమందు అధికారము లేదన్నను కర్మలందధికారమున్నట్లు పుందుగా ఎడమిచ్చిన ఆగీతయు "ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి, భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా" (18-61) అని కడపటికి ప్రకటించి మనుష్యులను త్రిప్పుచున్నది, నియమించుచున్నది యీశ్వరుడే కావున కర్మ స్వాతంత్ర్యము, కర్మాధికారము కూడ లేదని, కర్మాధికారము లేకపోవుటచేతనే కర్మఫలమందధికారము లేదని ఆదిలో చెప్పుటకు కారణమన్నట్లుగా గీతాబోధ పర్యవసించినది. వీరశైవ సంప్రదాయమును బట్టుకొని యూగిన వేమన కూడ కొన్నాళ్ళు యీ బడిలోనే యుండి 'హరునియాజ్ఞలేనిదే ఆకు నల్లాడునా' వంటి వాక్యములు చెప్పినవాడే. చివరికీ మార్గముజ్జగించి 'చేతకుతాఁగర్త' మానవుడని, బ్రహ్మవ్రాత తప్పజేయనిప్పుడు తానుకర్త' యని చెప్పవచ్చినాడు. పరులకుపకరింప పాటుపడుమను Altruist creed పరార్థైకరసప్రియత్వము స్వార్థత్యాగము . కావచ్చునుగాని నిష్కామకర్మము గాదు. కర్మమాలిన్యము అంటని స్థితి బోధిసత్త్వునికి. గీతా నిర్దేశితుడైన నిష్కామ కర్మస్థితికి సమానమేగాని బోధిసత్త్వుడు సంసారాశ్రితుడు, నిర్వాణవిముఖుడు, మహా కరుణాగుణ ప్రేరితుడు.

## కలిమిలేములు రెండును రెండుకడలు

ఆర్థిక వ్యత్యాసములు సాంఘిక స్నిగ్ధతకు వ్యాఘాతకములని, న్యాయ

విరుద్ధములునని తీర్మానించి, ఉగ్రమైన ప్రణాళికలను ప్రతిపాదించి ఆచరణలో బెట్టియో, పెట్టించియో, విఫలమై వాని నుండి విరమించి, పునర్విచారణమునకు గురియై మానవ కారుణ్యమును మేల్కొలుప నుద్యోగించియో వేమన నెరపదలంచిన ఆర్థిక సంస్కరణము స్వభావమును, ఆసక్తిదాయకములైన అందలి విశేషములను, అతఁడుపలక్షించిన మానవుని స్థితిని నిశ్చయింపవలసి యున్నాము.

ఈ సందర్భమున నేటి సామ్యవాదముతో సామ్యమువచ్చు దృష్టి వేమన యందున్నట్లు, అతి నవీనములైన ఆర్థిక సిద్ధాంతములు, సూత్రములు, అభిప్రాయములు అతనిలో మెదలినట్లుగా చెప్పుకొను ధోరణికి లోనగుట సులభము.

భూమిలోన బుట్టు భూసారమెల్లను, తనువులోన బుట్టు తత్త్వమెల్ల
*శ్రమములోన బుట్టు సర్వంబు, తానౌను.........."

అన్న పంక్తుల కప్పుడే భౌతికవాదపరమైన అర్థము, పాంచభౌతికమైన ప్రపంచము నుండి చరాచరజీవకోటి పుట్టినదని, ఉనికినిబట్టి చైతన్యమని, శ్రమయే సంపదకు మూలమని, శ్రమ కొల్లగొట్టరాదని, సాంఘిక జీవితమును నిర్దేశించు ఆర్థిక శక్తుల స్వభావములోనే సర్వము ఇమిడి ఉన్నదని, ఆ ఆర్థిక శక్తుల ప్రభావములో జీవించు తనువులోనే జీవిత తత్త్వము మొలకెత్తునని వ్యాఖ్యానము ** పుట్టనే పుట్టినది.

'భూమి నాదటన్న భూమి ఫక్కున నవ్వు' —
'ధనమదెవరి సొమ్ము దాచుకొనఁగ' —
'గణికులొప్పియున్న గవ్వలు చెల్లవా' —

అనునటువంటి పంక్తులు పట్టుకొని భూమిలో వ్యక్తిగతమైన ఆస్తి కూడదని సంపత్తియు ఒక్కని ముల్లెకాదని అంతయు సమాజమునకు చెందినదని వేమన్న అభిప్రాయపరశియని నాణెములు కరెన్సీ చెలామణి సూత్రమును తెలిసిన వాడనియు చెప్పుటకు నేటి రాజకీయ, ఆర్థిక వాత్యాసంచలనమును బట్టి మనసు లౌల్యము చెంద వచ్చును. కాని పద్యము సమస్తమున కొత్త వివరణము సహజమైనది యియ్యవలెనన్నచో నివి కుదరవు; పొసఁగవు.***

---

* 'స్వయముగాను బుట్టు సర్వంబు తానౌను' అన్న పాఠాంతరమున్నది.

** ఆరుద్ర — 'వేమన్న వేదము' లో

*** "భూమి నాదటన్న భూమి ఫక్కున నవ్వు, దానహీను జూచి ధనము నవ్వు కదన భీతు జూచి కాలుండు నవ్వును........"

"తనువదెవరి సొమ్ము తనదని పోషింప, ధనమదెవరిసొమ్ము దాచుకొనఁగ ప్రాణమెవరి సొమ్ము పాయకుండఁగ నిల్ప.........."

"అధికుఁడైనరాజు అల్పునిచేపట్టు వానిమాటచెల్లు వసుధలోన గణికులొప్పియున్న గవ్వలు చెల్లవా ... " (160 గోపాల్ అండ్ కో ప్రతి)

ఇప్పటికి వలయు నార్థిక భావములకై వేమనను వెదకితిమేని, అందుకు గాను అసహజమైన ప్రయత్నమునకు దిగకుండగనే చూచితిమేని పూర్వకాలము నందును ఒక విధముగా గనవచ్చు నభిప్రాయ మొకటున్నది. ఇప్పటికప్పుడే ఉదాహృతమైన పద్యమే ఒకటున్నది :

'ధనము చాలగూర్చి ఘదదానధర్మముల్ తగిలి చేయకిచ్చు తనయులకును' — అది ఈగ తేనెను గూర్చిపెట్టి తెరువరులకు కోల్పోయిన చందమని విశ్వదాభిరాముని విశిష్టాభిప్రాయము. తాను కూర్చినది తానసుభవించుటో, పరులకు తానుగా దాన మిచ్చుటోగాని సంతానమునకే ఆస్తిపాస్తులుగా సంక్రమింప జేయుటను వ్యతిరేకించిన వాడుగా గోచరించుచున్నాడని సముచితముగా చెప్పుకోవచ్చును. ధనము చరాస్తినే సూచించినట్లుగాకూడ తగులుచున్నందున కనీసమాతడు నగదు బంగారములను సంతానమునకు ముట్టకుండ దానభోగములలో పూర్తిచేయుమన్న దాతని అభిప్రాయ ముగా గైకొనవచ్చును. "స్వార్జితం ఉత్తమం విత్తం, మధ్యమం పిత్రార్జితం, అధమం భాతృసంపాద్యం" అన్నది లోకోక్తి. దానిని దాటి, 'పిత్రార్జితం మధ్యమం'గా కూడ చూడక, అధమాధమముగా చూచినాడన్నమాట.

ఆర్థిక వ్యవహారమున సంఘమునగల కొన్ని అన్యాయములను స్పష్టముగా ఖండించియున్నాడు. అతడొకప్పుడు గ్రామాధికారమును నిర్వహించినవాడుగా కూడ కనిపించుచున్నాడు. అట్టియెడ తాను కళ్ళార గాంచిన కొన్ని దుస్సంప్రదాయములను నిరోధించినట్లున్నది. కృషికులు దుస్థితికి లోనై ఉన్న కొద్దిపాటి కొండ్రను హీన క్రయము నిచ్చివేసినచో అట్టి హీనక్రయములు చెల్లనేరవని; భోగబంధన ఆయకము యిడిన భూమిని అప్పు దీర్పలేదని తనదిగా జమకట్టుకొనుట రాజుకైనగాని తగని పనియట. అట్లు సాగుచేసుకొని ఫలసాయమనుభవించునట్లుగా తాకట్టు బెట్టించుకొను దున్ని పండించుకొనుచుండిన కాపుమాత్రము హక్కు గావించుకోదగునినియు — భూవిస్తీర్ణమును కొలుచుటకు వెదురుగడనుపయోగింపక కొలతలో మోసము జేయుట కనువుగా త్రాడు నుపయోగించువారు జలగలై పుట్టెదరని శాపనార్థము చదివి ఆ మోసము ననుమతింపరాదన్నాడు :

"ఎలమిచెడ్డవేళ హీనక్రయంబును ఇలను ఇచ్చువారలిచ్చినారు
పట్టువారిలెట్లు పట్టుదురోకాని పట్టినంత నడవబడదువేమ !! .. "
(322, బ్రౌను)

"ఆయకంబు భోగ్యమా ఫలక్రయంబును తొడరన్నృపతికైన దొడ్డకీడు
భూమికై తగంగ భోక్తకే పనిగాక ........ ...."(656 బ్రౌను)

"పట్టువస్త్రములను పరంగభూషణములు కుదువలిడుటలెల్ల కొదువపద్దు లనుభవింపగూడ దతండెంతవాడైన......... "

(1027 గోపాల్ అండ్ కో ప్రతి)

"ధర్మపరయ దక్కి- త్రాడున కుంభిని కొల్వుజేయునట్టి కూళలెల్ల జలగలుగను బుట్టు జన్మాంతరంబున........." (749 బ్రౌను)

ఇట్లు ఆర్థిక సమస్యా ఖండికలలో స్పష్టమైన దృష్టి కనబరచెనేగాని, సాకల్యమైన ఆర్థిక దృష్టి యొకటి – అది సామాజిక వాదమో (Socialism), సామ్యవాదమో (Equalitarianism) సర్వోదయమో కాక అటువంటి దృష్టి యే యింకొకటియో కాకపోయినను – సంఘము మొత్తమునకు వర్తించు ఆర్థిక వ్యవస్థ నొకదానిని దర్శించిన స్థితి వేమన యందున్నదా యన్నదిప్పుడు పరిశీలించ వలసిన ప్రశ్న. అతనిపై నింతవరకు జరిగిన పరిశోధనము ఆర్థిక వ్యవస్థను గూర్చి, స్వతంత్రమైనదియో సంప్రదాయానుసారియో, ఒక దృక్పథము గలవాడని అఱదీసుకొన్నదిగాదు. పేదలయెడ పక్షపాతము కలిగి, పేదను కరుణింపుమని కలవారి నుద్బోధించిన వానినిగాను, కొంతకు కొంత బసవేశ్వరుని వీరశైవ సంప్రదాయము చొప్పున శ్రమకు ఘనత గౌరవప్రతిపత్తిం (Dignity of labour) చెప్పిన వానిని గాను గమనించినది. కాని సంఘము ఆర్థికస్థితి విచారమును విశేషముగా జేసినట్లతనికి గుర్తింపు కలుగనే లేదని చెప్పక తప్పదు. కాని అతనినొక ఆర్థిక వ్యవస్థాద్రష్టగా కూడ గ్రహింపవలసి యున్నదని తప్పక చెప్పవలెను.

అతడు పేదఱికమును సమీక్షించినది ఎఱింగితిమి. ఆకలిబాధ కెంత ప్రాధాన్యము నిచ్చి అన్నదానమును కీర్తించినాడో తెలిసితిమి. కాని పేదఱికమనంగా కేవలము ఆకలిబాధయే కాదన్న వాడతడు. కఱవుల దు, ఇతర సమయములందు కడుపు చిచ్చార్చుకొనుటొక విశేషము గాదన్నాడు. అదెంత అవశ్యనివారణీయముగా చెప్పినాడో, అదంత గడ్డుసమస్యయు నాడు కాదన్నాడు. "కడుపుకేల కళవళ పడెదరు, కడుపుచల్లపడగ కలదుభుక్తి – కడుపు రాతిలోనికప్పకులేదొకో" – 'కడుపుకెట్టులైన కలుగును భుక్తిరా' ఇత్యాదిగా క్షుద్బాధ జయింపరాని విషమ సమస్యగాదని తెల్పిన వైన మెక్కువగనే యున్నది. కాని అతనికి పేదఱికము అంతకన్న విశాలమైన జటిలమైన సమస్య. అది నిత్యము – అది తీవరించి క్షుధార్తిగా పరిణమించుట సకృత్తు, కాలికము.

అతని పేదఱికము సమీక్షను పునశ్చరణ చేసికోవచ్చును. పేదఱికము సాంఘిక స్నిగ్ధతను, మానుష వ్యక్తిత్వము నెట్లు చెఱపునో చెప్పినదధికము,

సూక్ష్మము పేదఱికము ద్వేషము పగను పెంచును. బంధు ప్రేమలను ద్రెంచును. తాలిమినణంచును. వివేచనను చంపును. ధైర్యమును కుంచించును. సహకారమును చదుపును. శుచిత లేకుండ జేయును. గణుతి లోపింప జేయును. పేదఱికము ఆలుమగల మధ్య ప్రేమకు ముప్పు దెచ్చును. సంసార శాంతికి భంగము. ఇవన్నియు నతని పద్యములలో ప్రచురితమైన భావములు. ఒక్కమాటలో దారిద్ర్యము మానవ సంఘమును వ్యక్తిని విచ్ఛేదము చేయును. మానవత్వమును దిగద్రావును. వ్యక్తిత్వమును నశింవు జేయును. గణుతిలేని బ్రతుకు దెచ్చును. పేదఱికమున గలుగు నాకలి నకనకకన్న వేమన యీ దుష్ఫలితముల నెక్కువ ఎన్నిక జేసిన వాడు. అదే అతని ప్రత్యేకత; విచారకుశలత. తిండితోనే మానవ సమస్య సర్వము చక్కబడదని ఎఱిఁగినవాడు వేమన. కడుపు నిండినను ఆర్థిక వ్యత్యాసములు అతివేలముగా నెలకొన్నచో గూడ సంఘమునకు సమస్య యని గుర్తించినవాడు వేమన్న.

ఎంగిలి విషయమునే దీసుకోవచ్చును. వేమన ఎంగిలి దినుమని ఉప దేశించిన ప్రవక్త. కులభేదములను పాటించువారము కాదనుటకు ఒక్క కంచమున ఎంగిలి దినజెప్పినాడు. అట్టి ఎంగిలి సేవగించుకొని విమర్శించిన వైదికులను నోరు చేసుకొని చెలఁగినవాడు. 'హీనకులజుడైన ఏ జాతివాడైన, ఇలను లేమి పరిహ రింపలేడు, ఎలమిలేనివాడు ఎంగిలి రోయునా' అని ఉదరబాధకు ఎవడైనను ఎంగిలి తిండికేని వెనుకాడడని గమనించి యున్నవాడు. అట్టి అతడే, తినవలసి తినగలవాడు తినునేమోగాని, పెట్టువాడు మాత్రము ఎంగిలి పెట్టరాదని గట్టిగా కట్టడిజేసి జెప్పినాడు మరి.

"ఎంత కఱవునైన ఎంగిలి యన్నము, పరుల కిడెడు ధర్మపరులు జూడ
భూమిమీద నెంగ్లిపుల్లెలు నాకెడు, కుక్కలై కలుగును కూడివేమ"

అని కఱవులో నట్లు పెట్టినను, తాబెట్టిన శాపనార్థము భయంకరముగా నున్నది. ఈ బోధలు పరస్పర విరుద్ధములుగా కన్పించుచున్నవే మరి. అతనివి కావందుమా? అతడే అసంబద్ధములాడు వాడందుమా? కాని మానుష వ్యక్తిత్వమును మనసూ్స క్ష్మతలను దృష్టినిడుకొన్నచో నివి విరుద్ధములు, అసంబద్ధములు కావని సిద్ధించును.

అడుగుకొనుట, అందును ఎంగిలిదినఁ దలపడుట హైన్యము; అధ మత్వము. అడుగుకొనకుండ తన్నుతాఁ బోషించుకొనుట ఆత్మగౌరవము, అభి మానము, పురుషలక్షణము కాని అది వీలుగాకనో, ఆ బుద్ధి లోపించియో, అశక్తత చేతనో యాచనకు దిగువానిని కరుణించుట కలిమికి సార్థక్యము. మానవత్వమునకు

చరితార్థత. అడుగుకొనకుండుట — అడిగిన కరుణించుట రెండును మానుష ధర్మములే. కాని పెట్టినపెట్టు శుభ్రముగా శుచిగా నుండజూచుట దాతృత్వపు మర్యాద, ఉన్నతి. ఎంగిలి పెట్టుట అర్థిని న్యూనతపరచుటగదా! వ్యత్యాసము లుడుపుటకు ఎంగిలితిండి నేర్పఁబడినాఁడుగాని, ఆయాయిన్యూనతాధిక్యములు వ్యత్యాసములను సూచించి, నిరూపించు సందర్భమున సాధనమగుచున్న ఎంగిలిని వేమన ప్రవక్త ఎట్లు మన్నించగలడు? వ్యత్యాస నిషేధమునకును, ప్రేమ చిహ్నగను ఎంగిలిని చెప్పుటను మనము సమర్థింపలేక పోవచ్చును. అది వేఱు వృత్తాంతము. ఎంగిలిని చెప్పినప్పుడును, ఎంగిలి కూడదన్నప్పుడును వేమనదృష్టి ఒక్కటే — అదే గమనింప వలసినది — అది మానుషవ్యక్తిపట్ల మానవరూపముయెడల చూపవలసిన గౌరవ గణ్యతలు; ప్రేమాదరములు. ఇడునప్పుడు కొనువానికి విలువనీయవలెను. కడుపు నింపుటయే సర్వము గాదు. అప్పుడును ఆపైనింకొకటున్నదని విశ్వదాభిరాముని వివేకము.

నీతిని సానుభూతిని పెనుపొందించునని, మానవీయగుణసంపత్తిని చిత్త సంస్కారమును విస్తరించునని పేదఱికమునకు పెద్దఱికమిచ్చి వరణీయమని చెప్పు తత్వము వేమనకు మిక్కిలి దూరము. 'ఇపుడు దుఃఖితులు, ఇపుడు క్షుత్పీడితులు అయినవారికి దేవుని ఆశీర్వాదమున్నది. వారు స్వర్గమున పొందు ప్రతిఫలము గొప్పది. సూదిబెజ్జములో నుండి ఒంటె దూరిపోగలదుగాని సంపన్నునికి స్వర్గ ప్రవేశము సుతరామును లేదు*' అని ప్రకృతమున కార్యకారులుగాని సంశయాస్పద వాగ్దానములు వేమనలో లేవు. తాను సంసారమును రోసినందుకు బైరాగియైనందుకు గడనయే దుఃఖము అని చిలుకపలుకులు వల్లించువాడును గాడు.

"తల్లిబిడ్డలకును తగవులుబుట్టించు, ధనము సుఖము గూర్పదని వచింత్రు
కాని గడనలేక గడచుట ఎట్లురా... ........"

అని మెట్టవేదాంతులను ప్రశ్నించి జీవిత యాథార్థ్యమును ఆకళింపునకు గైకొని స్వబుద్ధి మేరకు ఆర్థిక వ్యవస్థా స్వరూప మిట్లుండవలెనని దర్శించినాడు.

పేదఱికము గుణాకరమని పేదలు మానవతాపూర్ణమతులని నుతిశతకము చదువకపోయిన పోవుగాక గాని దానమీయని పిసినిగొట్టును పరిపరివిధముల పరిహ సించిన వేమన, 'దాతలేని పేట దయ్యాల పెనువాడ' సుమీ యన్నవాడు దానమడుగ బట్టిన దీనులను పేదలను మాత్రము తప్పుబట్టక మిగిల్చినాడా? 'దానమడుగువాడు

---

* బైబిలు.

ధరలోన నధముండు'గా తీర్మానించి చెప్పినాడు. గడనలేనివాని నతడు అసహ్యించు కొన్నాడు. అడుగుకొనవలసిన దురదృష్టవంతునికిని ఒకనీతి, ఒకరీతి యుండవలె నన్నాడు.

"అడుగదగువారి నడుగుట, ఇడినయెడం గొసరకుంట, యీలేననఁగా
గడుసై వేడకయుండుట అడిగెడు వారలకు నీతి యగురా వేమా ।।"

యని అపురూపముగా పల్కినాడు. ఇంకేమి కావలెను? యాచనయందును ఒకానొక అభిమానరేఖ, ఆత్మగౌరవము, కడపటికి ఔదార్యమును కూడ ఉండవలెనని నిబంధించుచున్నాడన్నమాట. యాచకుడును మరల దాత కాఁజూడవలెనన్నవాడు. యాచనా హైన్యము నుండి ముక్తుడగుటకు అంతలోనే మరల కృషి చేయు మన్నాడు.

"తిరిపెగాడయినను తిరిపెమెత్తినయట్టి తిరిపెమందు తాను తిరిపెమిడిన
తిరిపెము తిరిపెమున దిగబడిపోవురా . . ...."

(2403 నేదునూరి ప్రతి)

ఏ విధముగా జూచినను వేమన పేదఱికమును, క్షుద్బాధను వ్యక్తిత్వ గౌరవ ప్రతిపత్తులకు దూరముచేసి చూడజాలనివాడగుచున్నాడు.

'గోచిపాతకన్న కొంచెంబు మరిలేదు' అన్నప్పుడు బట్టలేక పడు భౌతిక మైన బాధకన్న, మానము నిండుగా కప్పుకొనలేక పడు వేదనకన్న న్యూనతకు గురియగుచున్నానను మానసికవ్యధనే ప్రబలముగా జూపుచున్నాడు. "వెట్టిగొల్వరాదు విభుఁడెంత ఘనుఁడైన" అన్నచోటను గూడ ఆర్థికముగా కొల్లపోకుము అని కఱపుటకు మించి దొరగొప్పకు దొడ్డతనమునకు హోదాకును మెత్తబడి ఊరక పనులు జేసిపెట్ట సిద్ధపడుటలో ఆత్మ గౌరవము ఆత్మాభిమానమునకును హాని నల్పుకొనవలదనుటయు నున్నది. 'గొప్పలేని బుద్ధి కొంచెమై పోవురా' అన్న దాతని అమోఘమైన బోధ.

ఉదరబాధ తీర్చుకొనుటే ఏకైక సమస్యగాదని, మానవ వ్యక్తిత్వము స్వాతంత్ర్యము మానుషమైన ఇతర గుణ సంపత్తికి లోపము కలుగరాదన్నదియు దానితో అవిభాజ్యముగా ముడిపడియున్న సమస్యయని తలంచినవాడు వేమన్న. ఇందుకు అఖండమైన సిరులను కఠినమైన దారిద్ర్యమును రెండును ఆటంకములేయని వేమన అనుభవము. అతడు ధనవత్తతా దారిద్ర్యములు రెండును రెండు వైపరీత్యములనుగా చూచినాడు.

'పేదవాని బాధ పెనుభూతమైయుంటు'

—'కలుగువాని బాధ కనుల జూడగలేము'–(736 గోపాల్ అండ్ కో)

'ఎంత భాగ్యమున్న నంత కష్టపుజింత'–(757 వేదునూరి ప్రతి)

'ధనమెచ్చిన మదమెచ్చును'–(1181 గోపాల్ అండ్‌కో)

— 'లేని కాలమునకు లేని మనసునొందు'

'అన్నమధికమైన నది తన్ను జంపును'–(463 గోపాల్ అండ్ కో)

— 'అన్నమంటకున్న నాత్మ నొచ్చు'–(967 గోపాల్ అండ్ కో)

'పుత్తడిగలవాని పుష్ఠ్రింబు పుండైన
వసుధలోన మిగుల వార్తకెక్కు'

— పేదవాని యింట పెండ్లైన కానరో'–(768 గోపాల్ అండ్ కో)

'కనియుకానలేడు కదలింపడా నోరు
వినియు వినఁగలేడు విస్మయముగ
సందగలవాని సన్నిపాతకమది'–(1119 వేదునూరి ప్రతి)

— 'ధనములేకయున్న ధైర్యంబు చిక్కదు'

ఇత్యాదిగా కలిమిలేముల కాలుష్యమును కనుగొన్నాడు. మానవత్వము పరిపుష్టి పరిపాకముల నందుటకు కలిమిలేములకు మధ్యమ స్థితి మంచిది మేలైనదిగా మనీషి భావించినాడు. అతడు లక్షించిన మానవుని ఆర్థిక స్థితి మధ్యతరగతి మర్యాద సంసారితనమని నిష్కర్షించి చెప్పుకోవలసి యున్నది. 'అప్పులేనివాడతనికి అధికబలాఢ్యుడు' – 'దానమడుగని యతడతనికి దైవసముడు'

తిండిలోనికింత కూరయు, చేతిమీదికింత నేతిబొట్టును కొదువ గాకుండునది, పదులకిడునప్పుడింత పప్పుకూర్పు వీలైనది, వానికొరకై మాత్రము అప్పుజేయవలసి రాకుండి, పరపతి గలిగియు ఇచ్చిపుచ్చుకొను హితులు మనువులతో గడపగల సంసారము – అనగా ఆర్థికముగా మధ్యమ ప్రతిపత్తును విశ్వదాభిరాముడు మానవ సమాజమునకు వ్యక్తికి ఆరోగ్యకరమని లక్ష్యనిర్దేశము చేసినాడు.

## కలిమిలేముల నడుమనే వియ్యము

తెనుఁగు దేశమున నవీనకాలమున సాంఘిక సంస్కరణము వివాహ సంస్కరణముతో నారంభమైనదనవచ్చును. కందుకూరి వీరేశలింగముగారు వితంతూద్వాహము సమస్యను దీసుకొని పనిచేయఁగా, గురజాడ అప్పారావుగారు

కన్యాశుల్క సమస్యను రూపకము గావించి తమ సంస్కరణమును నెలకొల్పినారు. గురజాడవారు మరొక వివాహ సమస్యను గూడ తమ కవితకు ఇతివృత్తముగా గ్రహించి యున్నారు. వయోవృద్ధులకు కన్నెపిల్లల నిచ్చి పెండ్లిచేయు దురాచారమే యది. కన్యాక్రయ దురాచారము వలననిది మరింతగా ప్రబలిన విషయము.

వీరేశలింగముగారి వితంతుయువతిని గూర్చి వేమన జాలిపడినవాడు గాదు* గాని, గురజాడవారు నెరపిన వివాహ సంస్కరణము సర్వమును మున్నూరేండ్లు ముందుగానే వేమన నిర్వహించి యున్నాడు. కాని, కన్యాశుల్కమును వృద్ధయువతీ వివాహములను కాదని అతడు ఖండించినను, అదంతయు స్త్రీలపట్ల, కన్యకలపట్ల కనికరము కలిగి ఖండించినట్లగపడదు. క్రయధనమున కాశించి కన్యకల జీవితమును నిప్పులో బోయుచున్నామన్న ఆర్ద్రిత, కరుణ గురజాడ వారికున్నది. వేమనకున్న అభిమానము అభివ్యక్తమైనది పురుషులమీదనే. పేద యువకులకు పెండ్లిండ్లగుట కష్టమైపోయినదని, కన్యకలు కలిగినింటి యువకులకో వృద్ధులకో యిల్లాండ్రుగా దక్కుచున్నారన్న భావముముఖ్యముగా నెరపిన సంస్కరణము వేమన్నది. ముదివగ్గులు యువతులను పెండ్లాడి, ఆ యువతులు కోడెవిటులకు జిక్కు దుస్థితి గలుగ నవకాశమిచ్చినవారై, పరువు ప్రతిష్ఠలను కోల్పోవలసిన వారగు చున్నారని, పాతివ్రత్య ధర్మము భంగమై పురుషుని అభిమానము దెబ్బతినుచున్నదన్న బుద్ధి చొప్పున ప్రతిపాదించిన సంస్కరణము వేమన్నది. గురజాడ వేమనల దృష్టి యందీ భేదము మాత్రమున్నది.

---

* "బాపడెముక కూడు భక్షింపు చుండెను, పేరటమ్మబోవు విధవరాలు
కులము మానముడుగ కోర్కులు మెండాయె "

(1449–గోపాల్ అండ్ కో)

"ముండమోపికేల ముత్యాల పాపట, వన్నెలన్ని భాగ్యవతికిగాక"

(3855–నేదునూరి ప్రతి)

"విధవ పొందు గూడ విధికడ్డమైయుండు ....... "

(4391 నేదునూరి ప్రతి)

ఇట్లు పల్కిన విధవా వివాహములకు సౌముఖ్యము గలిగిన వాడనగలమా? అతడు కట్టు తిరుగుబోతై యున్నప్పుడును కోడెవిధవల పొందుటకేని విముఖుడే కాబోలు.

'కలిమిబలిమి జూచి కనకానకాశించి కన్యనీయ పుణ్యగతులడంగు' నని పరలోకములు పునర్జన్మములు నన్న విశ్వాసము గల తన సమాజమును, తల్లి దండ్రులను భయపెట్టినాడు.

> "పేదవాడెయైన పెంటినిచ్చెదనని పైడినడుగరాదు పరుసమునను
> పైడిగొనుట పెంటఁ బట్టిన యట్లయా ...... .."

అని పరుషముగా పలికినాడు. పిల్లనడుగవచ్చినవారిని ఎన్ని తులముల బంగార మిత్తురో చెప్పుమని నిగ్గదీసి, అడిగినంత ఆశించినంత యిచ్చిననే పిల్లనిచ్చుపరిపాటి శూద్రకులములందు సైతము దండిగా ఆనాడున్నది. అట్లు పిల్లనిచ్చి పైడి దీసు కొనుటను కూతురుతో పొందు సమ్మీయని కాకపోయినను అనుచున్నాడు. కన్యా శుల్కమునకు తెనుఁగుమాట – ఓలి. ఇప్పటికది కడవర్ణములందే కానవచ్చుచున్నది. ఆస్తిపాస్తులు లేని కులములు గావున అక్కడది అంత బాధకముగా నగుపింపదు. ఆస్తి ఇస్తువులున్న వర్ణములందిప్పుడున్నది వరశుల్కము. కన్యాశుల్కము ఇప్పటి వారికి గురజాడవారివల్ల విన్నవార్తగానే యుండును. అదికూడ ప్రత్యేకముగా బ్రాహ్మణ్యమునే పట్టిపీడించిన సమస్యగా దోచును. ఈ శతాబ్దారంభమున అది బ్రాహ్మణులందే వికటాకృతిదాల్చి నిల్చినది. మిగతవర్ణములందు వరదక్షిణ సమస్యగా పొడసూపజొచ్చినది. వేమననాడు సంఘము మొత్తము నావేశించిన సమస్య కన్యాక్రయము. అతనికి ముందునుండియే యీ కన్యావిక్రయవిపణి వెఱ్ఱిగా సాగుచున్నది. ఓలి సొమ్ములకులోఁగి, లోభపడి రక్తస్పర్శయనుమాటను దిగనాడి, మేనఱికమంత బలవత్తరమైన బంధమునుకూడ త్రెంచుకొని కలవాని కాసు కనకములకై కలవరించునాడు బిడ్డల తల్లిదండ్రులతో తెలుఁగునాడు నిండియున్నది. వేమనకు కించిత్పూర్వమే యీ దురాచారము నున్మూలింపవలసిన యావశ్యకత నెఱిఁగిన జాడలున్నవి. జీవిత యాథార్థ్యముల ఒత్తిడి యంత ప్రబలమో మరి అవి యంత విషమింపకమున్నే ఒకానొక ఆదర్శచేతన వెల్లివిరిసియోగాని ఇమ్మడిదేవ రాయలు (1613–1630) విజయనగరరాజుగా నుండగా యీ సమస్యను గూర్చి సంస్కరణము కలిగినది. కాగా, నది బ్రాహ్మణులందే కానవచ్చినది. కన్యాశుల్కము గాని వరశుల్కముగాని గైకొనకుండ వివాహములు గావించెదముగాక యని నాటి బ్రాహ్మణ్యము ప్రతిజ్ఞ గైకొన్నట్లు చరిత్ర చెప్పుచున్నది. వేమన పూర్వరంగ మిట్లున్నది. సంఘచేతన అఖండముగాగల వేమనదృష్టిగాని ప్రయత్నముగాని యీ సమస్యపై పడకుండునా ?

కలిగినవాడు ఆలుపై నాలును కొని కట్టుకొనుచున్నాడు. వయసు వాటారినను పచ్చజూపించి కన్నెపిల్లల మెడలో పుస్తె కట్టుచున్నాడు. అట్టి సందర్భమున గురజాడకు తగిలిన పూర్ణమ్మలు వేమనకును దగిలినారు. కాని ఆ పూర్ణమ్మలను కేలించు బాల్యస్నేహితులు నాడు కొదువ యనుకొందును. ఆ పూర్ణమ్మలును ఆత్మహత్యలకు తలపడువారును గాకున్నారు. ప్రకృతికై ప్రక్కపుంతలు త్రొక్కగలరేమోగాని వారు తల్లిదండ్రుల నెదిరింపగలవారును, చావగలవారును గారు. అందుచేతనుగూడ వేమన వయోభేదము అధికముగా గల వివాహములు పురుషునకి తలవంపులు దెచ్చునని మాత్రమే హెచ్చరించినాడు.

"..........ముద్దరాలికేల ముసలిమగడు,
మదివశముగాక విటుని వలను జిక్క" (3902, నేదునూరి ప్రతి)

"ఈడుగానిదాని తోడుకు పాల్పడి, జోడుగూడుపేమి సూటిగాదు
కూడదప్పనేని గుణములు కొంచెమౌ.. .... .."
(565, నేదునూరి ప్రతి)

వయోధిక పురుషులు కన్నెపిల్లలను పెండ్లాడి గౌరవహానికి గురికావలసి వచ్చునని స్పష్టముగా విడబరచి చెప్పి పురుషునభిమానమును హెచ్చరించినాడు. అంతేగాని కన్యల జీవితములు పాడగుచున్నవని, వక్రించుచున్నవని జాలిజెందు వేమన మనకు దొరకుటలేదు. అది అతని పరిమితి. అతడు పురుషపక్షపాతి. అందుకతనిని క్షమ్యునిజేయు కారణసామగ్రి యున్నది. అది మున్ముందు తెలిసికొనగలము.

అతనికి పూర్ణమ్మలేగాదు కానవచ్చినది. కొడుకుగుణ్ణను గామించి కోరి యింటికోడలగుట కుద్యమించిన కౌమరాంద్రను కొడుకునకు దప్పించి తామైకైవసము జేసుకొను ఘనులును వేమన ప్రత్యక్షానుభవములో నున్నారు.

"కొడుకును వరియింప గోరివచ్చినదాని తండ్రి పెండ్లియాడ ధర్మమగునె
తప్పనిదెలియకయు దాఁజేయుపాపంబు తప్పదెప్పుడుభువి దగులు వేమ !!
(2454 గోపాల్ అండ్ కో ప్రతి)

ఆలుమగల వయసులో వ్యత్యాసము అధికముండుట కూడదన్నాడు. ఒక తరమునకు తరము వయోభేదము దాంపత్యములో సుఖశాంతి విశ్వాసములకు భంగమని గ్రహింపుమన్నాడు. మన దేశమున యిట్టి వివాహములు అధికాధికముగా వృద్ధ పురుషులు యువతులను పెండ్లాడుటగా నుండగా, పశ్చిమమున ఇట్టివి విడాకుల మీద విడాకులు పొంది మగల సొమ్ములో పాలు పుచ్చుకొనుచు సంపన్నలైన

వయోధికస్త్రీలు యువకులను భర్తలుగా పెండ్లాడుటగా నున్నది. ఇక్కడను అక్కడను ఇట్టి వైపరీత్యములకు కారణము సంపదయే. అది వేమన బాగుగా నెఱిఁగినాడు.

పెండ్లి విషయమున ఆర్థికాంశమును గూర్చి వేమన ఆలోచించినంతగా ఆలోచించినవారు మరొకరు ఇప్పటికిని మనలో లేరని చెప్పుట సాహసము కానేరదు. కట్నములు తప్పని నిషేధింపవలెనని, స్త్రీని న్యూనతపరచుటగా లెక్కించి ఆందోళన చేయుదురేకాని, వివాహము అను సంస్థ సంఘములో వ్యక్తి సంపదను (ఆస్తి పాస్తులను) పంపిణీచేయు సాధనముగా గుర్తించి సంస్కరణ నడిగినవారెవ్వ రున్నారు? వివాహము ఆస్తిపాస్తులను పునర్వ్యవస్థీకరించుటకు ఉపకరణముగా గుర్తించినచో కన్యాశుల్కమా, వరశుల్కమా అన్న వ్యత్యాసమునకు ప్రాధాన్య మీయక ఆర్థిక వ్యత్యాసముల తగ్గింపుకు తోడ్పడినవారమగుదుము. వేమనకు ఆర్థిక విషయమున ఒక స్పష్టమైన సాకల్యమైన దృష్టిగలదవి కనుగొన్నాము. అది కలిమి లేములకు నడిమిస్థితి — మధ్యతరగతి సమాజసృష్టి అతని ధ్యేయము. వివాహ సంస్కరణమునుకూడ ఆ దృష్టికి లోపరచి ప్రతిపాదించినాడు. కలిమిలేముల వియ్యమును ప్రబలముగా ప్రతిపాదించినాడు.

"కలిమిజూచియీయ క్రయమిచ్చినట్లుండు,* సమునికీయమంచి సరసగుణము
పేదకీయమనువు పెనవేసినట్లుండు ... . .. " 1186 (బ్రౌను)

"సకల సంపదలను స్వారస్యములజూచి వలచియిచ్చుమనువు వాడిపోవు —
సమమురానిమనువు చాలగా ఫలియించు ... ... . " (1182 బ్రౌను)

అని శ్రీమంతుల నుద్దేశించి చెప్పినాడు. దిగువ పద్యము ఆడుపిల్లవారికేగాదు మగ పిల్లవారికిని చెప్పినట్టిదనఁజెల్లును. వధూవరులందు ఆర్థిక వ్యత్యాసము ఉండవలెనని అతని అభిప్రాయము. అది అతని ఆర్థిక దృష్టినిబట్టియేగాక, అట్టిచో మనువు

---

* 'కలిమిజూచియీయ కాయమిచ్చినయట్లు'నని మొదటి పంక్తికి పాఠాంతరము గూడ నున్నది. కలిమిమాత్రము జూచి కన్నెనిచ్చుట కాయమమ్ముకొన్నట్లే ననియును వేమన అనగలవాడే. మరొకసారికి మార్పుతో ఆ పద్యమే అతనినోట వెలువడియుండవచ్చును.

"పేదవాడయైన పెంటినిచ్చేదనని పైడినడుగరాదు పరుసమునను
పైడిగొనుట పెంటిబట్టిన యట్లయా.... ... ...."

యని కూతునే కొండినట్లని పల్కినవాడు.

తీవెలు పెనగొన్నట్లు అన్యోన్య దాంపత్యమగుననియు అతని అంచనా అయి యున్నది.

'కలుగువాడు లేమికానికిచ్చు మనువు కలిమిలేములటుల కలిసియుండు' —
(1189 బ్రౌను)

'పేదకిచ్చుమనువు ప్రబలువేమ' — (1187 బ్రౌను)

నాడు పేదమగపిల్లవానికి పెండ్లగుటయు కష్టముగానే యుండియుండవలెనని యీతని పద్యములబట్టి తెలియగలము. వారికై వేమన గుండె విశేషము కరగినది. కలిగిన వానికి కన్యనిచ్చుటను దేనితో ఉపమించి చెప్పినాదో అది వినుట కందముగా కూడ నున్నది.

"కలిమిగల్గువాన్కి కన్యకనిచ్చుట బావినీరు నదికి బారినట్లు"—(1187 బ్రౌను)

"కలిగియున్నవాని కనిపెట్టి యిచ్చినమనువు పొంగుపాలు మరిగినట్లు
లోననిగిరి కలిమిలొట్టపోకుండునా .. .... . " (1210 నేదునూరి ప్రతి)

ఈ ఉపమాన స్వారస్యము ననుభవించుటకు పల్లెలో రైతులిండ్ల పాలుమరగిపోయిన నేమగునో చూడవలసినదే. ఇది అతని ఉపమానమేగాని యదార్థముగా కలిమి లొట్టపోవునా ? అది అతడు అక్కసుకు జెప్పినమాట.

కన్యాశుల్క ప్రలోభమునకు జిక్కి బంధుత్వమునుకూడ దిగద్రావి పంచరించుటను గమనించి యిట్లని బోధచేయుచున్నాడు :

"తమకు బంధుజనుని తామె తోడ్కొనితెచ్చి కలిమిగనక వయసుకలిమిజూచి
దక్షిణనునొసంగి తరుణినిచ్చినవాడు పరమగురుడనంగబడును వేమ !"
(1185 బ్రౌను)

కన్యాశుల్కమునడుగ మానుకొమ్మనుటతో నాగక, ఎదురు వరదక్షిణనిచ్చి పేదవడిన చుట్టరికమును కలుపుకొనుమనుచున్నాడు. నాటికి 'వరకట్నములు' మచ్చుకేని లేవనవచ్చును. కనీసము బ్రాహ్మణేతరులలో వరదక్షిణలిచ్చి యీడైన పేదపెండ్లి కొడుకులను సంపాదించి, తమ ఆడుపిల్లల బ్రదుకులను సుఖవంతము జేయుమని శ్రీమంతులకు హితబోధ జేసినాడు.

"తల్లిదండ్రి హితులు తగిన చుట్టంబులు ఎల్లవారలెల్ల ఏరికోరి
బాలుని గనుజూచి పడచునిత్తురుగాని భాగ్యమీయలేరు పరగ వేమ" —
(1190 బ్రౌను)

ఓలినడుగ మానుకొన్న కలవారుకూడ వరదక్షిణ లీయకుండుటను — పేద పెండ్లి కొడుకులకే ననుడు — వేమన విమర్శించుచున్నాడు. వివాహ విషయమున వేమన యడిగిన సంస్కరణము కన్యాశుల్కము నరికట్టుటకే పరిమితముకాలేదు. సంపద యొక్క పునర్వ్యవస్థీకరణమని వరదక్షిణ ప్రతిపాదన నిరూపించుచున్నది. ఓలి గొని ఆడుపిల్లనిచ్చు నాచారము కాలక్రమమున సన్నగిల్లినది. ఒకప్పుడు వేమన సిఫారసు నపేక్షించిన వరదక్షిణ వరశుల్కమై నేడు వరవిక్రాయక విపణిని స్థాపించి నది. కన్యాదానము కన్యాక్రయమైనందుకు తప్పుపట్టిన వేమన యీ వరవిక్రయమును జూచి మ్రాన్పడి మిడిగ్రుడ్లు వేయవలసియుండును. అతడే ఇప్పటికి దిగివచ్చి చూచినచో పేదయింటి ఆడుపడుచుల పక్షమై యీ వరవిక్రయము వికృతరూపము నెదిరించియుండువాడు. పెండ్లివలని ఆర్థికదృష్టి వేమననిట్లు కన్యాశుల్కముపై కత్తి గట్టింపగా, పెండ్లికి ప్రథమావశ్యకతను ఏమారినవాడు కాడు. పేదకిచ్చుటకు సిద్ధ పడినను కూడ,

> "ఒప్పులేనిపెండ్లి నొనర సేయఁగరాదు ……… "
>
> (1000 నేదునూరి ప్రతి)

పెండ్లి వధూవరుల యిష్టపూర్వము, ప్రేమ సురభిళము కావలెనని వక్కాణించినాడు. అనగా, పిన్నతనములో పెండ్లిండ్లనుండి కాదన్నాదనవలయుననే చెప్పుకోవలెను. అంతేకాదు, పేదలు పెండ్లివ్యయము కూర్చలేక పెండ్లిచేయుటమాని బిడ్డపాపఁను పడుపువృత్తిలో ప్రవేశపెట్టవలసిన దుస్థితిని సైతము కళ్ళారగాంచినాడు. యాచించి కడివెడన్నమువండి నలువురకేబెట్టి పెండ్లిముగించి యిల్లాలితనమున పెట్టుమన్నాడు. పడుపువారి తప్పింపుమన్నాడు.

> "ఉభయులు గతిలేక యున్నవారైనను యాచకమున తమకు తోచినట్లు
> కడివెడన్నమొండి కన్యనీవలెగాక పడుపుగూడు కుడువవలదు వేమ!"
>
> (724 బ్రౌను)

పెండ్లి క్రయవిక్రయ విషయముగా మారరాదని, అన్యోన్యము ఇష్టము ప్రేమము మీదనే పెండ్లిండ్లు జరిగించవలెనని, పెండ్లియందు ఈడుజోడు తప్పక చూడవలెనని, మనువులు కలిమిలేముల వియ్యముగా కుదిరి, వివాహములు సమాజములోని ఆర్థిక వ్యత్యాసములు తగ్గించు సాధనములుగా పర్యవసించవలెనని వివాహ సంస్క రణము చెప్పిన వేమన్న వివాహ ముహూర్త నిర్ణయములోని హేతువిరుద్ధ విశ్వా సమును గూర్చి కూడ చెప్పవలసినది చెప్పినాడు:

విప్రులెల్లగూడి వెట్టికూతలు గూసి సతిపతులను జేసి సమ్మతమున
మును ముహూర్తముంచ ముండెట్లు మోసెరా ...... ...."

(4420 నేదునూరి ప్రతి)

యను ప్రశ్నతో చెప్పినాడు. వైదిక వివాహ మంత్రములలో వెట్టికూతలున్న వన్నాడు. మంత్రబలము, ముహూర్తబలమన్నవి హుళి, హుళక్కియని దీన ప్రకటించినాడు. సీతారాముల పెండ్లికి వశిష్ఠ విశ్వామిత్రులంతటి మహర్షులు నిర్ణయించిన ముహూర్తబలముండగా వారి దాంపత్య జీవితము దుఃఖపూర్ణ పరిణామమునొంది, విషాదాంతమైనదని దృష్టాంతము జూపి, ముహూర్తబలమను వ్యర్థ విశ్వాసమును వీడుమని, నలువురు వేడుకగా కలియుటకు తగినట్లు పెండ్లి కాలమును నిశ్చయించుకొనుమని యిటీవల చెప్పి, చేసి, చేయించిన త్రిపురనేని రామస్వామి కవిరాజుకు మున్నే నేనున్నానని పించు కొనుచున్నాడు వేమన్న.

## యోగి హేతువును జెప్పెను

ఇట్లు వివాహ విషయమున గల ముహూర్తబలమను మూఢ విశ్వాసము నొక్కదానినేగాదు, తననాడు తెనుఁగు దేశమును — ఆమాటకు, సర్వభారతమును పట్టి పీడించుచున్న పనికిమాలిన విశ్వాసము లెన్నింటినో పేరుపేరున ఖండించి దైనిక జీవితమును హేతు సమ్మతముగా దిద్దుకొని అర్థవంతముగా స్వతంత్రముగా చరింపుమని బోధించిన బోద్ధ. మున్నూరేండ్లకు మున్ను వేమన్నకు దగిలిన మన సంఘస్థితి — ఆ అంధ విశ్వాసములు, ఆగతానుగతికత్వము, అవిమృశ్యకారిత్వము, ఆత్మవిశ్వాసరాహిత్యము, హృదయ దౌర్బల్యము, సంప్రదాయ విధేయత — ఇంత కాలము జరిగి ఇంతగా విజ్ఞాన శాస్త్రాభ్యుదయము కలిగి, పాశ్చాత్య నాగరకతా సంసర్గము బడసినను ఇసుమంత కూడ సడలినదనరాకున్నది. పైగా పైవన్నియు స్వాతంత్ర్యానంతరము మరింత పెరిగినవనియు నాగరకతాభాసములై గౌరవపాత్రతకు నోచుకొన్నవై బలపడినవననలెను. గ్రహాంతర యానమును, విద్యున్మేధను సాధించి, జనిరసాయన మర్మమును భేదించుచు ఆచరణైక విజయకోలాహలియైన విజ్ఞాన శాస్త్రము సిద్ధాంతపరమయిన అవ్యవస్థకు గురియై పారంపరీణముగా పాతుకొని పోయిన అహేతుక అంధవిశ్వాసములు ఆభాస విజ్ఞానముగా నిలువరించుకొనుటకు అవకాశమిచ్చినది. నేటి పరిస్థితి వేసవి మధ్యాహ్నమున హఠాత్తుగా చిమ్మచీకటి గమ్మినట్లున్నది. ఈ సాంకేతిక యుగమున మార్పు చండవేగమున జరుగుచున్నది. భౌతిక జీవితములో కలుగుచున్న మార్పు

వేగమునకు తీవ్రతకును మానవుని మనస్సు తట్టుకొని, స్థాయి చిక్కించుకొని ప్రశాంతి ననుభవించుట దుష్కరమగుచున్నది. జీవితములో విలువలకొక వ్యవస్థ మృగ్యమగుచున్నది. స్థిరము, అనవరతప్రాయము అన్నదొకటి కఱవై పోవుచున్నది. కాగా, మనస్సు దుర్బలమైపోవుచున్నది. అశాంతికి ఆందోళనకు నిలయమగుచున్నది. ఆత్మవిశ్వాసము క్షతమగుచున్నది. అందుచే మరల అహేతుక విశ్వాసపాశములు తిరిగి మానవునిపై బిగుసుకొనసాగినవి. భౌతిక విజయము చిత్తక్షోభకు ఎడమిచ్చిన దోషమీనాగరకత మోయుచున్నది. మానవునింత ఉన్నతుని గావించిన హేతుబుద్ధినే నిందించవలసియున్నదా అన్నంత ప్రశ్నను లేవనెత్తు పరిస్థితులెదురైనవి. ఆధ్యాత్మికానుభవమునకు దానివలనిప్రయోజనమునకు ఆటంకములుగా ఆధ్యాత్మిక గురువుల చేతనే నిరసింపబడిన క్షుద్రశక్తుల మహిమా ప్రదర్శనములు తిరిగి గౌరవమునకు పాత్రములగుచున్నవి. కేవలము భౌతిక విషయములైన విశ్వాసములు కూడ అధ్యాత్మజ్ఞాన భాండాగారములోనివిగా పూర్వము చెల్లి, మరల చెల్లుబడికి వచ్చుచున్నవి. గ్రహప్రభావము మాట యున్నది. మానవుల పుట్టుక మీదనో, పెండ్లి మీదనో, కార్యారంభము మీదనో భౌతిక ద్రవ్యరాశులైన గ్రహముల కూటములు ప్రభావము కలిగియుండు ననుటను యోజించినచో అందున్న అధ్యాత్మతత్వమేమున్నది ? పచ్చి భౌతిక వాదీయమైన విశ్వాసముగాక అందు మరేమున్నది ? కర్మవాదమన్నదనలట్టిది. పూర్వమీమాంసా శాఖలో వైదికతయే దాని భౌతికత లోతులరసినది. ఆత్మమాటయున్నది. ఆదిలో ఆదెట్టిది ? ఇప్పుడు బోధించునట్లుగా అది చిన్మాత్రము, శుద్ధచైతన్యముగా మాత్రము తలంపబడలేదు. మొదలదికూడ భౌతిక విషయమే.* అయిన అందులో సూక్ష్మ విషయము. అంతే. తర్వాత భావపరిణామమున చిద్రూపమైనది. నిజమునకు మూఢ విశ్వాసములు పెక్కులు భౌతిక సంగతులు. కాని మతములను బట్టుకొని అధ్యాత్మ సంభారములో జేరిపోయినవి. వాని దుర్భర భారమును మతములు అధ్యాత్మవాదము లును మోసినవి, మోయుచున్నవి. కొందరు ప్రవక్తలట్లు కాదన్నను ఆమాట చెల్లనిమాటగా మిగిలిపోయినది.

కోర్కెను జయించుట, ఇంద్రియములను నియమించుట, మోక్ష గామిత్వము యథార్థమున మతములయొక్క, విశేషించి ఆధ్యాత్మికత యొక్క పరమ లక్ష్యము. కాని నేటికి ఆ మతములొద్ద, ఆ మఠములొద్ద, నేటి ఆధ్యాత్మిక జగద్గురు

---

* ఈ రచయిత వ్రాసిన 'ఆత్మవృత్తాంతము'ను వివరములకు చూడవచ్చును.

మానులొద్దను ఇవి యున్నవా? భక్తుల ఆపదలకన్న కోర్కెలు దీరుగాక యను దీవెనలు, అభయముద్రలు యిచ్చు వైనమే వైనము. భక్తకోటి తన కోర్కెలు, సంకల్పములు సాధించుటకు వలసిన మనోద్రఢిమను గూర్చుటకు ఉపకరణములు గాను, తత్సాధనకై చేసిన అకృత్యములు, త్రొక్కిన అవినీతి పథములకు లోలోన మూగగా ఏడ్చు అంతరాత్మ బెదరు బాపి, మరల చిత్తస్వాస్థ్యము కల్పించుచు సాంకేతికయుగములో వాంఛాయంత్రమైన మానవుని అంతరాత్మగోప్త (concience keeper) లుగను, అవినీతి క్షుబ్ధ హృదయులకు చిత్తశాంతి విక్రేతలుగను (Vendors of mental peace) నేటి గురువులు మిగిలినారు. విశేషించి భారతదేశమున మనస్తత్వ పరిశీలక వైద్యులు (Prychoanalysts) కలవైన లోపమును బాబాలు, అమ్మలు, యోగులు, గురువులు కుప్పతెప్పలుగ లేచి దీర్చుచున్నారు. సాంకేతిక విజ్ఞానముచే సమాజమున కలుగు మార్పు వేగము, నవ నవావశ్యకతలు వాంఛలు నేటి మతస్వరూపమును ఉన్నత ఆధ్యాత్మిక ప్రమాణముల నుండి పరిచ్యుతము జేసి భౌతిక జీవితములో గెలుపుదేవత కొలుపులకు, విపణి విక్రయమునకు పరిమితమగు దుష్ప్రభావమును కలిగించినవి. ఇటీవలి సాంకేతిక విజ్ఞానవిజయ సన్నివేశమున ఏర్పడు నిత్యాస్థిరత్వ ఉల్బణము, వాంఛా విప్లవముతో విజ్ఞానశాస్త్ర యుగారంభమున హేతువాద వికసనముచే వెనుకబట్టి, గౌరవహానికి గురియై, తలవాంచి, మొగము చాటువేసిన మూఢవిశ్వాసకశ్మలమంతయు మరల చెల రేగి మతకుటీరద్వార తోరణమై గలవొడిపింప జొచ్చినది. అనుకోకుండ విచిత్రముగా నీ సాంకేతికయుగము మతపునర్విజృంభణమును కల్గించుచున్నది. అందును మతములందున్న మంచిని చంపి పరిహరణీయమునే పైకి దెచ్చుచున్నది. అహేతుక విశ్వాసపాశములు తిరిగి మానవుని బంధింపసాగినవి; అవినీతిని పెంప దలరినవి. నేటి సాంకేతిక విజ్ఞానము హేతువు పరిమితిని స్థాపించుచున్నదను గోల యొకదాని నడ్డము చేసుకొనికూడ యీ నాటు మనోవైద్యము మతముపేర, అధ్యాత్మికతపేర తెగసాగుచున్నది. హేత్వతీతమైన మతానుభవము పొందిన వేమనవంటి యోగి జీవిత వ్యవహారమున హేతువు నాశ్రయించి విమర్శాదృష్టి వెలయించినది నేడు గమనించుకోవలసినవారము. యోగియై వేమన హేతువు నుపదేశించుటకు అశేషమైన ప్రాధాన్యమున్నది; అది విచారణీయము.

అనుభవమునకు రానివి, జీవితమున ఫలమీయనివి, ఉపయోగము మాలినవి అయిన విశ్వాసములు కూడవన్న దతని మతము. ఒకానొక విశ్వాసము ఒక సందర్భమున నొకరీతిగను, వేరొక సందర్భమున అందుకు విరుద్ధముగను విశ్వసిత

మైనచో అది అసత్యమని చూపును. ఇది శూన్యవాద ప్రాసంగికుల పద్ధతి. ఒకానొక విషయము స్వయంబాధితము, స్వవచోవ్యాఘాతకముగ (Self-contradictory) నుండరాదన్నది సత్యమునకు ప్రమాణమని ప్రాసంగికుల సూత్రము. ఉదాహరణము నకు కాకుల విషయమున్నది. హిందువులు కాకులను పూజించుటున్నది. వానిని పితృరూపములుగా భావించి పిండములు పెట్టుదురు. కాని ఆ పితృరూపములనే వివాహవేళ దగ్గఱకు రానీయరు; చూడనీయరు; వానికూత విననీయరు. తద్దినము లందు పూజ్యములు, వివాహములందు అమంగళప్రదములు — పరస్పరవిరుద్ధమైన విషయము గదా అన్నాడు.

"కాకి పక్షులందు కడునీచమందురు కాకిపెండ్లివేళ గదియనీరు
దానికన్నమిడుచు దండంబు లిడుటేల . " (629 బ్రౌను)

"పిండములనుజేసి పితరులదలపోసి కాకులకునుబెట్టుగాడ్దెలార
పెంటదినెడు కాకి పితరుఁడెట్లాయెరా ... .. .. "(3164 నేదునూరిప్రతి)

అని ఒడలు గఱపొడుచునట్లుగా అడిగి నిరసించుచున్నాడు. కాకులకిడి కడచన్న పెద్దలకే యిడినట్లు, వారినే గౌరవించునట్లును భావించుకన్న ఘనులగు పురుష శ్రేష్ఠులను పిలిచి పెట్టి ఆ భావమును కావలెనన్న పొందుమన్నాడు.

"ప్రేతయన్నమునకు ప్రీతితో పిలిపించి కాకులకు నిడుదురు కర్మలార
కాకులకదియేల ఘనులకు బెట్టుడీ .. ......."(1406 గోపాల్ అండ్ కో)

అని నిర్మాణాత్మక సూచన మొనర్చినాడు.

అట్లే శకునముల విషయమున్నది. చిన్నపనికి పెద్దపనికికూడ శకునము లను చూచి పూనుకొనుటో, విరమించుకొనుటో మనయందున్నది. కాని పెళ్ళి మాత్రము లగ్నము ముహూర్తము వధూవరుల జాతకబలములు చూచి తలపెట్టు దుము గాని, శకునములను జూచి చేసికొనము. అనఁగా శకునములంత విశ్వా స్యములు గావన్నట్లేగదా ! యనును వేమన్న. శకునములన్నవి విషయమే గావు. జనుడు గావించు కర్మలను బట్టియే పనులు ఫలములునని చెప్పును.

"మంచి శకునములను ఎంచి పెండ్లాడిన వారు మున్నవారె చూడ
జనుల కర్మములకు శకునముల్ నిలుచునా .. .."

(1677 గోపాల్ అండ్ కో)

పశు పక్షి క్రిమి కీటకము లన్నియు శకున సామగ్రిగా దలంచుటను తప్పని పేరుపేరున స్పష్టపరచును.

"పాలపక్షి శకున ఫలమిచ్చునందురు, పాలపక్షికేమి ఫలము దెలియు
తనదు మేలు కీళ్ళు తనతోడ నుండగా ... ... . "

(3126 నేదునూరి ప్రతి)

"శక్తిపూజచేసి సరవి కుంభముపోసి మ్రొక్కుచుండువేళ కుక్కయేడ్వ
నూరు పాడటంచు నూరెల్ల నేడ్తురే .. . " (4592 నేదునూరిప్రతి)

కుక్క ఏడుపు శక్తిపూజామహిమను కూడ దిగదుడుపు చేయగలదన్నట్లే గదా! విధవాదర్శనము కార్యభంగమను నమ్మిక ఒకటున్నదిగదా! విధవరాంద్రన్న ఆర్ద్రిత లేనివాడైనను ఇట్టి విశ్వాసము కారణరహితమని ఖండించినాడు.

"ముండను పొడగన్న మోమోటపడుదురు, ముండకూడుదినక ముక్తిలేదు
ముండమోపివల్ల మూలంబు గాదొకో ... .... . "(3853 నేదునూరిప్రతి)

ఇట్టివింకెన్నో యున్నవి. కార్యములు నెఱవేఱి విశ్వాసములు అనఁగా శకునములు ఫలించినట్లగుపించుటనే అజదీసుకొందుముగాని, అనుకొన్నట్లు గాక కార్యములు విఫలములయిన శకునములకు వ్యతిరేకముగా దలంచవలసిన సందర్భములను అజ లోనికి దీసికొనకుండ దాటవేయుట పరిపాటి. శకునముల సాఫల్యావైఫల్యములను సమప్రాధాన్యమిచ్చి వానివాని యాథార్థ్యమును ఆమూలము వివేకించుటకు దలపడని తనము మనుష్యునందున్నదనియు గమనించినాడు : అందుకే అవి అతనిని వీడకుండ వెంటాడుచున్నవి.

"శకునములను మంచిసాముద్రికములను కనినవారలెవరు కలియుగమున
మేలుకో కీడుకో మేలిమిజూపును కూర్చగలుగుచోఁెు గుర్తువేమ!"

(880 బ్రౌను)

"బల్లిపలుకులువిని ప్రజ తమపనులెల్ల సఫలములగునంచు సంతసించి
కానిపనులకు తమ కర్మమందురో . ..... " (3358 నేదునూరి ప్రతి)

"గద్దెగణము నిద్రకలలును కోరికల్ ముదమొసంగ శకునములకు జెలఁగు
ప్రశ్నలుపదివేలు పరికించి చూడంగ అవును కాకపోవునవును వేమ!"

అసిధారావ్రతముగా అనుభవ పరిశీలన చేయనేరక, హేతువిచారమునకు ఆలోచనను పదునుపెట్టక మానుషవ్యక్తికిగాని సమాజమునకుగాని పూర్తిగా స్వాధీనముగాని ప్రకృతి, జీవితసన్నివేశముల వలన మనోదౌర్బల్యమబ్బి, మనసు గట్టి పరచుకొనుటకు బాహ్యాలంబములు ఇట్టి విశ్వాసములను కల్పించుకొనుటను ప్రశ్నించుటతో నాగినవాడు కాడు వేమన. భారతప్రజల బ్రదుకువిలువలకు ఒఱవడికట్టు

ఏర్పరచిన భారతరామాయణాది జాతీయలాక్షణిక కావ్యములు పురాణములు మున్నైన సారస్వతమున్నది. భారతీయుల జాతీయశీలము అందలి గుణాగుణములు బల దౌర్బల్యములు వానిలో స్పష్టముగా ప్రతిఫలించినవి. విచారకుశలుడెవ్వడుగాని వానిని పరామర్శింప దలపెట్టక మిన్నకుండుట స్వభావవిరుద్ధము; కర్తవ్యమును నిర్వహింపకపోవుటగును. వేమన యీ పనిగూడ కొంతజేసినాడు : పంచమ వేదమై చెల్లు భారతము మీద వేమన,

"పంచమనిగమంబు భారతంబగునని పొగడిరేల జనులుబుద్ధిలేక
హింసకార్యము మనకిష్టమేలాయెరా ..... "(2889 నేదునూరి ప్రతి)
"కులమునీఱుజేసి గురువుల వధియించి పొసఁగనేను గంత బొంకు బొంకె
పేరు ధర్మరాజు పెనువేపవిత్తయా.... ......." (1418 పై ప్రతి)

వేమన్నది అహింసాసూత్రమని మొదలే ఎఱుఁగుదుము ; భారతకథా సందర్భమున వేమన హింసను తెగడకుండగలడా ? భారత సంహితలోనే సుయోధన సఖుడని చెప్పిచూపబడిన చార్వాకుడు ధర్మరాజును విమర్శించుట కూడ అతడు చేయించిన ఘోరహింసకే; గురువధకు బంధువధకు సర్వయోధవధకును కారణుడగుటకే. ఆచార్వాకుని మతము కూడ అహింసా సూత్రముతో పుట్టినదే. సత్యనిష్ఠకు శాంత స్వభావమునకు భారత-విశేషము వైదిక – సంస్కృతిలో కొండగుర్తువలె చెప్పుకొను పేరు ధర్మరాజుది. దిశలు పట్టనంతగా ప్రతినిమేషము ధర్మఘోష గావించు వైదిక సభ్యత గురువధ, జ్ఞాతివధ, అనృతము ఆచరణమున నెఱపగలిగిన వానిని మరి జాతి ముందర ఆదర్శ పురుషునిగా ప్రదర్శించి ప్రతిష్ఠించినది. అదే వేమన విమర్శ. ఇంత ధర్మఘోషచేయు జాతిలో ఆదర్శములకు ఆచరణమునకు అంత అంతరముండుటను మన లాక్షిణిక కావ్యనాయక పాత్రములే నిరూపించునని గుర్తించవలసి యున్నది.

తాతజనించె కన్యకకు తండ్రులు తామును కుండగోళకుల్
మాతపరాను కూలిఁయె మక్కువ ద్రోవది భర్తలేవురే ;
నీతులు సెప్ప పాండవుల నీమము లిట్టివటంచు నెన్నుచున్
భూతలమందు నెంతయును బూమెలజేసిరి వెట్టివేమనా ॥

[2320 నేదునూరి ప్రతి]

ఇటువంటి వృత్తాంతములు గల గాథలు నీతిబోధలు చేయుట కుపయోగించుటను తప్పుపట్టినాడు. మనమేని ఆలోచించవలసినదే. ఇది జాతీయ కావ్యము అగుట జాతిశీలమును బింబించినదందురు.

"కనకమృగము భువినికలదు లేదనకుండ తరుణివిడచిపోయె దాశరధియు
తెలివి లేనివాడు దేవుఁడెట్లాయరా........." (1111 నేదునూరి ప్రతి)

"అగ్నిబాణమునను అబ్ధియింకినపుడె రాముడవలికేగ లావుమరచె ..."
(73 నేదునూరి ప్రతి)

ననుచు తెలివి తక్కువ జనుసిదెచ్చి సర్వజ్ఞత్వ స్థానీయుడైన దేవునిగా ప్రకటించి కోవెలలు కట్టించి, భజనలు పూజలు నెలకొల్పినది తప్పన్నాడు. రామాయణ మహాపురుషుని దైవత్వమును త్రోసిపుచ్చిన పూర్వ మనీషి వేమనయే గావచ్చును. ఆ వేమనకు సీతామహాదేవి జన్మమును గూర్చి ఏమంత సదభిప్రాయ మున్నదనలేము కూడ :

"హరునివిల్లువిఱిచి యారామభద్రుండు ప్రియముతోడనాడు పెండ్లియయ్యె
భూమికన్య యెచట పుట్టెనో కానడో ... .. "
(2249 గోపాల్ అండ్ కో ప్రతి)

భూదేవి బిడ్డయనగా అంతే యనుకొనుట కూడ రాముని బుద్ధి మాంద్యమునే సూచించుననవలెను. అతడింకేమి దైవము ? భూపుత్రిగా జెప్పుట వంటివే ఋషుల జన్మములనియు చెప్పినాడు :

"చిలుకగర్భమందు చెలఁగి శుకుఁడు పుట్టె, మరియొకండు పుట్టె ఖరమువలన
ఇట్టి ఋషికులంబు నెంచఁగబనిలేదు ... ......" (1758 నేదునూరి ప్రతి)

ఇట్టి బూటకములే పురాణములుగా రాణకెక్కెనని పుక్కిటి పురాణములన్న జనుల సామెతకు దెచ్చి పురాణములను జెప్పినాడు :

"బూటకపు పురాణకథయు వాటముగాదయ్య పరమువరియింపగ........."
(1466 గోపాల్ అండ్ కో)

అనియును పురాణములు పరసాధనకు పనికిరానివిగా పలికినాడు. కల్పనలన్నాడు. కావ్య, పురాణములనేగాదు భారతీయుల తర్కశాస్త్రములను గూర్చి, ధర్మ శాస్త్రములను గూర్చియు తన హృదయము గ్రిమ్మరించినాడు.

"న్యాయశాస్త్రమరయ అన్యాయమునదించు, ధర్మశాస్త్ర మొసఁగు దుర్మతంబు
జ్యోతిషమ్ము జనులనీతుల దప్పించు .. .. .. " (2737 నేదునూరి ప్రతి)

న్యాయశాస్త్రమనగా గౌతమ న్యాయసూత్రములు, వాత్స్యాయన భాష్యపురస్కృతము. వేమన అంత మాట అనుట అనాలోచితముగాని వేగిరపాటుగానికాదు. వాదమునకు బదులు జల్పవితండములను ప్రయోగించుమని ఉపదేశించిన న్యాయ సూత్రములు

సత్యస్థాపనా శీలములు గాకపోవును. "తత్వాధ్యవసాయ సంరక్షణార్థం జల్పవితండే బీజప్రరోహ సంరక్షణార్థం కంటక శాఖావరణవత్"–"తాభ్యాం విగృహ్యాకథనమ్" – [4-2-47,48 సూ.] జల్పములో ప్రతిపక్షము నపవదించి, అపార్థము కల్పించి వ్యర్థ మొనర్చు ఛలము కూడ భాగమగునని చెప్పినవి న్యాయసూత్రములు. ఇట్టి వానిని గూర్చి వేమన మిన్నకోగలడా? భారతీయ ధర్మశాస్త్రములు దుర్మతము కల్గించుననుటకు వేమన వంటి ఆర్థిక, సామాజిక, వైవాహిక సంస్కారకునకొక లెక్కగాదు; ఒక పవిత్ర కర్తవ్యము. పక్షపాత భూయిష్ఠమైన వ్యత్యాసపు ప్రమాణము చూపిన మనుగౌతమాది స్మృతులను గూర్చి విశేషించి వివరణము చేయుట అనావశ్యకము.

ఇట్లు మన తర్కశాస్త్రమునుండి కావ్యపురాణములను సమీక్షించినవాడు, హిందూదైవతవర్గుపై చూపు సారించినాడు. రాముని దైవత్వమును తిరస్కరించిన వేమన బ్రహ్మ విష్ణు మహేశ్వరుల దైవత్వమును మిగిల్చినవాడు గాకపోయెను.

"కొడుకును బ్రదికించుకొనలేదు శంభుండు, కొడుకును బ్రదికించుకొనడు శౌరి
దైవబలములెల్ల దాననే గనుపించె.......... " అని వారి శక్తిని పరిమితిని ప్రశ్న పూర్వముగా స్థాపించినాడు.

"వాతియోనివాని వర్ణింప దోషఁబు హృదయయోనివాని నెన్నినట్లె
మకుటయోనివాని మఱియెన్నఁబాపంబు .........."

(1894 గోపాల్ అండ్ కో ప్రతి)

"కంటిమంటచేత కామునిదహియించి, కామమునకు కడకుగౌరిగూడి
నట్టి శివుని తేజమంటినంతనె జూడ పూర్వకర్మఫలము బోవువేమ॥"

(304 బ్రౌను)

ఇది ఎత్తిపొడుపు, ఎగతాళిగా నున్నది.

"విష్ణువునకు సొడ్డు వృషభాంకునకు సొడ్డు బ్రహ్మకైన సొడ్డు బలువుగాను
వేమనకును సొడ్డు వేసితినని చెప్పు .........." (271 బ్రౌను)

హిందూదేవతా ప్రపంచమున సృష్టి స్థితి లయ కారకులుగా పురాణములు చెప్పిన ముగ్గురు మూర్తులను తనతోపాటు జేసి, నామ రూప వ్యవహారములో వారిని జేసి తిట్లు వడ్డించిన తత్వకవి. తిట్లు వడ్డించుటేమి, చంపనే చంపినాడుకూడ. లోగడదే చూచినాము. మరల గుర్తు జేసుకొందము.

"బ్రహ్మజంపి విష్ణుభాగంబులోగల్పి విష్ణుజంపి శివునివెలయగలిపి
శివునిజంపి తాను శివయోగి గావలె.........."

ననిగదా పద్యమున్నది. హిందువుల సృష్టిదేవతల నిట్లు చంపివేసి, చంపివేయుమని ఉపదేశించిన శివయోగి వేమన. ఇదంతయు మనసృష్టి మనకల్పన గావున నట్లు చెప్పినాడు. సృష్టికర్తృభావమును నశింపజేసినవాడైనాడు. కట్టకడపటికి శూన్య వాదమున నిలుకడగొన్న వేమన్న సృష్టికొక దైవతము నక్కఱలేదన్నవానిగా తేల్చిన వైరుధ్యమున్నదా ? దానికేమి. అందాశ్చర్యమేమున్నది. శూన్యవాదమునకు కర్తయయిన నాగార్జునాచార్యుడు సృష్టికర్తను మరింక కొందఱ దేవుళ్ళను సృష్టించు కొన్నాడుగదా యని యనవచ్చును. యథార్థమున సృష్టిని, స్రష్టను తిరస్కరించుచు శూన్యతాసూత్రమునకు అందలి అజాతవాదమునకు భంగము లేదు, రాదు. నిజమున కట్టి పరిణామము అందులోనే కలిగినది. ముందే చూచినాము. అయిన వేమన యందదేమియు వింతగాదు. అసంభవముగాదు. అసంబద్ధముగాదు. కాని వేమన సృష్టికర్తృభావమును అట్లు సూటిగా తిరస్కరించిన పంక్తులు కనరాలేదు. అదొక్కటి కొదువగా ఇతర విధముల నతడు ఆ భావమునే చెప్పినాడనుట నిజము.

కాని సృష్టిదైవతములేని ఆధ్యాత్మవాదమో (Spiritualism) భావ వాదమో ఆదర్శవాదమో (Idealism) అసలుండునా యన్నదొక ప్రశ్న. ఉండ కేమి ? చరిత్రలో నున్నవి. పాశ్చాత్యుల తత్వప్రపంచమునగల Subjective Idealism అన్నదాని మాటేమిటి ? కాక సృష్టిదైవతము లేక ఆత్మానుభూతి యుండదందుమా ? నిరీశ్వర సాంఖ్యమున అది లేకపోయినదా ?

వేమన వేదము నంగీకరించినవాడు గాడని మొదలే ఎఱుగుదుము. జగద్రచన కొక కర్తకూడ అతడవసరముగా భావింపలేదని యిపుడు తీర్మానించి నారము. ఇంకేమి, వేదనిందకుడైనందున, నిరీశ్వరవాదియైనందున వైదికపరిభాష చొప్పున వేమన్నను నాస్తికుడనవలెను. కాని యోగిని నాస్తికుడనవచ్చినామే ? నాస్తికయోగి యొకడుండుటకు వీలున్నదా ? అనగా సృష్టిదైవతము లేకుండ ఆత్మానుభూతి యుండునా అన్నదే మరల ప్రశ్న. యోగము ఆత్మానుభూతికి సాధనము. బౌద్ధశాఖలన్నియు యోగాభ్యాసము జేసినవి. వానిలో వైభాషిక సౌత్రాంతిక శాఖలు హీనయానములు. అవి భౌతికవాదీయములు, స్రష్ట నంగీకరింపని వని తెలిసిన విషయము. వానికిని శీల సమాధిప్రజ్ఞలున్నవి. అర్హతస్థితి — మోక్షము నకు ప్రతి — అందును గమ్యమే. అవి యోగసాధనను నాల్గు భూమికలుగా విడదీసి సమాధ్యనుభవమును సాధించినట్టివే. ప్రజ్ఞను హేత్వతీతము, హేత్వితరము నైనదన్న దానిని గ్రహించి సాధించినవే. కావున నాస్తికయోగులుండుటకు అభ్యంతరము లేదు. వైదిక నిర్వచనము ప్రకారము స్రష్టను వేదాధికారమును అంగీకరింపక,

ఆత్మ—పునర్జన్మ—మోక్షములను మూడింటిని మాత్రమే అంగీకరించినవాడుగూడ నాస్తికుఁడే. అతడు యోగియు గావచ్చును. వైదికపరిభాషనుబట్టి, భారతీయ తత్త్వ చరిత్రమునుబట్టి ఆత్మానుభవమున్నవాడును నాస్తికుడగుటున్నది. వేమన అట్టి నాస్తికయోగి.

అదట్లుండగా, హేతువునకతీతముగా ఆత్మికానుభవమును, ఆంతరికానుభూతిని పొంది, దాని నమూల్యముగా భావించినవాడు ప్రాపంచిక వ్యవహారమున దైనిక జీవితమున హేతువు నాశ్రయింపుమని చెప్పుట గొప్పవిశేషము. ఈ రెండింటికి విరోధమన్న భావము సర్వసామాన్యము. హేతువు, వివేచన విజ్ఞానశాస్త్రమును, ఆంతరికానుభవము మతమును మతానుభూతిని సూచించగా మతము విజ్ఞానశాస్త్రముల విరోధము సిద్ధించును. కాని, వేమన మనమిట్లలవాటుపడిన పడికట్టులకు భిన్నుడుగా నున్నాడు. ఇదే సమాలోచింపదగినది.

మతము విజ్ఞానశాస్త్రముల మధ్య ఏర్పడిన స్పర్ధ మాన్పు ప్రయత్న మున్నది. మతము పరిధి వేరు, విజ్ఞానశాస్త్ర పరిధివేరు అని ఆ ప్రయత్నపరు లన్నారు. ఇంద్రియగమ్యమెల్ల విజ్ఞానశాస్త్రమునకు, అతీంద్రియమెల్ల మతమునకు కేటాయించినారు. ప్రకృతివ్యాపారము ఎట్లు జరుగుచున్నదన్నదే విజ్ఞానశాస్త్ర విషయము కాగా, ప్రకృతిసారమేమిటి అన్నది మాత్రము మతానుభవమనియు చెప్ప సాగినారు. ఆ స్పర్ధకదే పరిష్కారమని భావించుచున్నారు. ఇట్లు చెప్పుటలో మత గ్రంథములు విశ్వసృష్టి క్రమమును గూర్చి చెప్పినదానిని వదలుకోవలసి వచ్చినది. లేదా, విజ్ఞానశాస్త్ర సిద్ధాంత ప్రతిపాదనలను పట్టుకొని వానికి సంగతముగా తమ మతగ్రంథములను, గ్రంథపంక్తులను వ్యాఖ్యానించు వ్యాయామము జరుగుచున్నది. లేదా, తమ మతగ్రంథములకు అనువుగా విజ్ఞానశాస్త్రములోనే ప్రతిపాదనలు చేయు చున్నారు. యజ్ఞయాగాదులు తదితరములైన అనుకరణపూర్వక మాజిక్ ప్రక్రియలు వంటి కార్యకలాపమును ప్రకృతిని శాసించుటకు మానవుని భౌతికావశ్యకతలను సాధించుటకు ప్రయోగించుటను, సమర్థములని చెప్పుటను విడనాడి ఆ పని విజ్ఞాన శాస్త్రమునకు వదలివైచుచున్నది. రాను రాను భౌతిక విషయము సర్వము విజ్ఞానము నకు విడచుచున్నది; ఇట్టి విభాగము హిందూవేదాంతమున మతమున ఉపనిషత్తుల నుండి యున్నది. అయిన భౌతిక విజ్ఞానముతో సర్వము సమాప్తము కాదు, ఆపై నొకటున్నది, అదే ముఖ్యము అని యందుండవచ్చును. అదివేరు. పరాపర విద్య లన్న విభాగమదే. గణితము, ఖగోళము, క్షత్రవిద్య, నీతి అర్థశాస్త్రములు (రాశి, నక్షత్రవిద్య, ఏకాయనము) అన్నవన్నియు, అంతేగాక దేవవిద్య. భూతవిద్య,

సర్వవిద్యలవంటివి కూడ అపర విద్యలలోనికే (ఛాందోగ్యము — నారద సనత్కుమార సంవాదము) చేర్చబడినవి. యజ్ఞాది మాజికల్ కర్మకలాపము ఆత్మసాధకము కాదన్నారు. బౌద్ధములో శూన్యవాదము సృష్టికథలే చెప్పలేదు. బుద్ధుడట్టివే కూడదన్నాడు. కాగా, ఆంతరికానుభవము ఆత్మానుభవము అను మార్మికతనే మతములకు మిగిల్చినారు. ఇట్టి పరిణామము పాశ్చాత్యులందు వినూతనముగా ఇటీవలనే మొదలైనది. భారతదేశమున ఎన్నడో ఏర్పడి, మరల మధ్యయుగములలో మరుగువడి, తిరిగి తలయెత్తుటయు — అతికష్టముమీద — కద్దు. పాశ్చాత్యులందు క్రైస్తవ దేవాలయములలో గెలేలియో, న్యూటను మొదలు అయిన్‌స్టీనువరకు గల విజ్ఞానశాస్త్రవేత్తల శిల్పములు ప్రతిష్ఠింపబడినవి. (అమెరికాలో మాన్‌హాటన్ నగరములో ప్రొటెస్టెంటు చర్చిలో జరిగినది).

మతానుభవములోనికెల్ల మార్మికానుభూతి శిఖరప్రాయము. మతము చెప్పి చూపిన కడపటిస్థితి మార్మికత. దీనిని అపరోక్షానుభూతియని, సమాధ్యవస్థయని భారతీయులన్నారు. 'సర్వంఖల్విదంబ్రహ్మ' — 'ఈశావాస్యమిదం సర్వం' — 'వాసుదేవస్సర్వమితి' యను భావము Pantheism. అట్టి అనుభవమీ మతములు చెప్పిన విశ్వప్రేమకు ఆధారభూతము. క్రైస్తవులు ప్రేమ యన్నారు. బౌద్ధులు — మైత్రి యన్నారు. ఇదికాక, ఆనందరూపమో, శూన్య శాంత రూపమో యయిన సమాధ్యనుభవమన్నది యున్నది. యోగము తంత్రము అనేక సాధనలు దీనికి చెప్పియున్నవి. ఇవి సన్యాసులకేగాక సంసారులకును ప్రాప్తించును. స్త్రీ ప్రసక్తిగల సాధనలున్నవి. ఈ భిన్న సాధనలలో విశ్వముతో తాదాత్మ్యము చెందు ననుభవము, నానాత్వమందేకతానుభవము, అహంకారాధిగమము (Self-Transcendence) ఇది యది యని మాటలచే చెప్పనలవిగాని యనుభవము, దేశకాలపాత్రముల స్ఫురణ లేకుండు ననుభవము దొరకుచున్నదని చెప్పుచున్నారు. ఇది హేతవున కందనిదని, ఆవలిదని అందురేగాని, దానికి విరుద్ధమైనదని యనకుండుటయు పూర్వమునుండియు నున్నది. సర్వం ఖల్విదం బ్రహ్మయని పూచికపుల్లనుండి బంగారు వరకును, చీడకుక్కనుండి పురివిచ్చియాడు రంగుల నెమలి వరకును బ్రహ్మము ననుభవించుటలో అది హేతువునకును హేతుమయ ప్రపంచమునకు విరుద్ధము కాదని, విజ్ఞానశాస్త్రమునకు విరుద్ధముగాదని చెప్పనక్కరలేదు. విజ్ఞానశాస్త్రము ఏకత్వము వేపునకే గొనిపోవుచున్నది. అంతేగాక, సంసార నిర్వాణము లొక్కటేయని చెప్పిన మాధ్యమక, విజ్ఞానవాద బౌద్ధములు కూడ హేతువుతో దాని స్పర్ధను పరిహరించినవే. హేతువునకు పరిమితి యున్నదని మాత్రము చెప్పినవి. ఈ సమాధ్యనుభవము

భౌతిక మానసిక జగత్తును హేతుబుద్ధిచే త్రోసివుచ్చదు. నిజమునకు హేతుపూర్వక గ్రహణను యీ మార్మికానుభూతివి సమానముగా స్వీకరించవలెను. నానాత్వమందలి ఏకత్వమును, విశ్వతాదాత్మ్యమును, భాషయొక్క సాంకేతికత్వమును, పరిమితిని విజ్ఞాన శాస్త్రములు స్థాపించుచున్నవి. పాశ్చాత్య తత్వచారిత్రకుడు, తాత్త్వికుడు నయిన Bertrand Russel విజ్ఞానశాస్త్ర మార్మికానుభవముల అవిరోధమును గుర్తించి చెప్పినాడు. 'తాత్వికులైన మహోన్నతమానవులు మార్మికానుభూతి విజ్ఞానశాస్త్రములు ఉభయముయొక్క ఆవశ్యకతను దర్శించియున్నారు.'*

**వీని స్పర్ధ ఒకప్పుడు లేదని – ఒకప్పుడనగా హిబ్రూప్రవక్త మోజెస్‌కు ముందు లేదని, ఈజిప్టు – మెసపోటేమియాలలోని మతసాహిత్యము గాని, హిబ్రూల 'పెంటాటెక్'గాని అవి రెండును పెనగొనియున్న స్థితిని చూపునందురు. అవి విడిపోవుటచే రెండింటికి కొంత నష్టమే జరిగినదని అన్న శాస్త్రజ్ఞులున్నారు. ***

"అపరోక్షానుభవము మార్మికానుభూతి అన్నది అహేతుకశ్రేణికి (Irrational category) చెందిన మతానుభవమను భావము లోకసామాన్యమైనది. కాని, అందుకు భిన్నముగా హిందూ, బౌద్ధ విచారధార స్పినోజాతత్త్వముల యందువలె మతవిచారములోనికెల్ల హేతువాదము యొక్క మహోన్నతాభివృద్ధిని తార్కాణించును" అని Erich Fromm అను మనస్తత్వ పరిశీలకుడు అనుచున్నాడు. తాననుటేకాదు, క్రైస్తవ మానవతా వాదియైన Albert Schweitzer "నిరూపణా నిరపేక్షకాంశములన్నవి ఏమియులేకుండ సాగు హేతువిచారణము మార్మికతలోనికి తప్పక పర్యవసించును"**** అని అనుటకు కూడ అంగీకరించుచు ఉట్టంకించినాడు. మతములలో అనుభూతి ప్రాధాన్యమును దర్శించి, దానిని పొందినవారు తరచుగా అసమానతాదూషితమైన సమాజములో మానుష సోదరత్వమును సమాచరించుటకు విశేషము పాల్పడుచున్నది. భారతదేశమున రామానందుడు, కబీరు, దాదూ, రాయిదాసు, చైతన్యాదులు సమానత్వమును చెప్పి

---

* But the greatest men who have been philorophers have felt the need of both science and mysticism' – Russel Mystidimd Logic

** Haldane – Science and Theology as art forms

*** J. B. S.

**** Psychoanalysis and Religion – Erich Fromm, page 90, Footnote – Bantum Edition – 1972.

పాటించి కులమునెదిరించు వారగుటకు అనుభవ ప్రాధాన్యముగల మార్మికులైనందు వల్లనేనని చెప్పుకోవచ్చును. వేమనయు అట్టి అనుభవైకవాదియయిన మార్మికుడే యని కొత్తగా చెప్పవలసిన పనిలేదు.

ఇక్కడ హేతువిచారమును, అంతర్వీక్ష (Insight, Intuition)ను గూర్చి కూడ చెప్పవలసియున్నది. విజ్ఞానశాస్త్రమనగా హేతువిచార క్రీడ దప్ప మరొకటి కాదని యనుకొందుము. కాని విజ్ఞానశాస్త్ర పరిశోధనలు – నూతన ప్రతిపాదనలు హేతుబుద్ధి ప్రబుద్ధములు కావనితెలియుచున్నది. హేతువునకు స్థానభూతమైన మెదడు పైపొరలో నుండి (cerebral cortex), కేవల జాగ్రదవస్థ నుండి విజ్ఞానశాస్త్ర నూతన ప్రతిపాదనలు వెలువడలేదన్న సమాచారము లభించుచున్నది. మెదడు పైపొరకు, హేతుబుద్ధికి అట్టి సృజనాత్మకత లేదని సిద్ధాంతమగుచున్నది. 1945 లో అమెరికాలో పెద్ద పెద్ద గణితశాస్త్రజ్ఞులందరను Jaques Hadmard అనునతడు ప్రశ్నించి పొందిన సమాధానముల సారమది. అయిన్‌స్టీను కూడ జాగ్రచ్చేతన, జాగ్రదాలోచన, తర్కము, భాషావహితమైన ఆలోచనము తన యోజనా వ్యాపారములో పాత్ర వహించవని నిష్కర్షించి చెప్పియున్నాడు. "గొప్ప గొప్ప గణితవేత్తలు, భౌతికశాస్త్ర శోధకులు నిర్ణయము తెమల్చుకొను నిమేషములలో అగాధమైన చింతాసాగరములో దుమికి మున్కగొన్నప్పుడు తర్కము తమకు మార్గదర్శి కాకున్నదని, తాము నిర్వచింపలేని ఒకానొక సౌందర్యస్ఫూర్తి నడుపు కొని పోవుచున్నదని ఒప్పుకొనుచున్నారు ........ ఎంతగా సాక్షిభాస్యము, వైయక్తికము అయినప్పటికిని సత్యానుభూతి యన్నదొకటి సౌందర్యానుభవము కలుగుటకు సహోపలబ్ధమై యుండవలెను; అట్లే సత్యానుభవమునకు సౌందర్యాను భూతి వెన్నంటియుండవలెను. ఒకానొక సమస్యకు చదురైన పరిష్కారము తోచు నప్పుడు విచారవంతునిలో సౌందర్యానుభవ స్ఫురణమును కలుగును. దీని స్ఫూర్తి (Intellectual illumination), ఆవేశక్షాళనము (Emotional catharsis) అన్నవి రెండును అవిభాజ్యమైన ఒకే వ్యాపారము యొక్క పరస్పరపరిపూరకాంశములు"* అని ఆర్థర్‌కోస్లరు చెప్పుచున్నాడు. సత్యమే సౌందర్యము సౌందర్యమే సత్యము అన్న Keats కవి పంక్తులకు మరల శాస్త్రజ్ఞుల సృజనాత్మక చింతనా క్షణముల పరిశీలన మనలదెచ్చి పడవేయుచున్నదన్నమాట. సత్యం శివం సుందరం అన్న భారతీయ వాక్యమునకును చేరువైనాము. "సృజనాత్మకమనుటకన్న హేతువు

---

* Ghost in the Machine – Arthur koestler pages. 209, 210, 227, Pan Piper edition – 1970.

సామరస్యసంధానకము, నియమనశక్తిసంయుతము (Hormonising, controling) నని చెప్పవలసియున్నది, శుద్ధతార్కికక్షేత్రమందుకూడ ప్రథమతః నూతనాంశము నందుకొనునది అంతర్వీక్ష (Insight) యే యయియున్నది"* అని పరమతార్కికుడు హేతువాద ప్రథమాచార్యుడు అయిన Bertrand Russel కూడ అన్నాడు. ఆయన అంతర్వీక్ష యొక్క చాలనితనమును కూడ చెప్పినాడు, "అంతర్వీక్ష – పరీక్షింప బడనిచో, అన్యధా బలపఱపబడనిచో – సత్యమును గూర్చి వలసినంత హామీదారు మాత్రము కాదు. ………… దాని ఫలితములను హేతువు ధ్రువపరచుటో, దోషనిరూపణము చేయుటో చేయును." హేతువు పరిమితులను విజ్ఞానశాస్త్రవేత్తలైన హేతువాదు లిట్లెరిగియే యున్నారు. కాగా, యిచ్చట చెప్పిన అంతర్వీక్ష పైన చెప్పుకొన్న ఆంతరికానుభవమే యనలేము. ఆయనుభూతి విజ్ఞాన సంపాదకము కాదు. ఆ మతానుభవము విషయము కూడ విజ్ఞాన శాస్త్రకారుని ప్రయోగశాలలో పరీక్షకు గురియగు చున్నది. అదికూడ ఎఱుఁగవలసి యున్నాము.

ఈ మార్మికానుభవము ప్రపంచ మతములందన్నింట నున్నది. జపానులో బౌద్ధము ధ్యానమును 'జెన్' అనిపిలిచినది. చైనీయుల 'టావో' (Tao) అనుభవ మున్నది. మహమ్మదీయులలో సూఫీల అనుభవమున్నది. భారతీయులకు యోగానుభవమున్నది. మెదడునందలి విద్యుత్ప్రసరణ స్థాయిని (electrical potential) కొలుచు పరికరములు తయారైనవి. వానిని ఎలెక్ట్రో ఎన్‌సిఫాలో గ్రాములందురు. వానితో ఆయాయిమార్మికానుభవలక్షణములలో మెదడుయొక్క విద్యుత్ప్రసారస్థాయిని కొలువసాగినారు. ఈ శతాబ్దము ఉత్తరార్థమునుండి యీ పరిశీలనలు అమెరికాలో బాగుగా సాగినవి. మెదడుకు నాలుగు రకముల విద్యు ప్రసారక్రమములు కలవని తేలనది. గాఢనిద్రలో విద్యుత్ప్రసారమొక క్రమమును, మెలకువలో మెదడు చుఱుకుగా శ్రద్ధవహించియున్నప్పు డొకక్రమమును, ఆవేశ సన్నివేశములో ఒకక్రమము, జాగ్రత్తులోనే ప్రశాంత విశ్రాంతి స్థితియందొక క్రమమును వెలువఱచుచున్నట్లు కనుగొన్నారు.** ఈ యోగానుభవనిమేషములందు మెదడు, జాగ్రదవస్థలో ప్రశాంత మనస్కతలో వెలువరించునట్టి ఆల్ఫాప్రసారమునే (సెకెనునకు 8 నుండి 12 సైకిల్సువరకు గల అల్పవిద్యుత్ప్రసరణక్రమము)

---

* Mysticism and Logic – B. Russel – pelican Book, 1954. P. 18, 19.

** ఈ నాలుగు విద్యుత్క్రమములేగాక, అయిదవది "కప్పా"క్రమమని మరొక పరిమాణముతో కలదనుచున్నారు.

అధికముగా తీవ్రముగా చేయునని కనుగొన్నారు. యోగానుభవస్థితిలో ఆల్ఫా ప్రసారము తీవ్రత (Intensity) లోను, మార్పు (Modulation) లోను. వెడల్పు (amplitude) లోను ప్రత్యేకత మాత్రముండునని సిద్ధించుచున్నది. వివిధ దేశములలో వివిధనామములతో వివిధములైన సాధనలు, ప్రక్రియలవలన పొందుచున్న మార్మికానుభవమంతయు ఒకే 'ఆల్ఫా' విద్యుత్ప్రసారస్థాయి, క్రమము కలదిగాకూడ నిరూపితమయినది. ఆల్ఫా ప్రసార తీవ్రత ఒక స్థాయికి వచ్చుసరికి యోగి శూన్యశాంతానుభూతిపారమ్యమును పొందుచున్నాడు. మనస్సు రాక పోక లేని రాజవీధియైనది.

ఇది యిట్లుండగా, ఈ అనుభవము మెదడులో ఒకానొక కేంద్రకమునకు కట్టుబడియున్నట్లు కనుగొనబడినది.* Septal Area of Rhinencephalon అన్నది మెదడులో అట్టి సౌఖ్యానుభవకేంద్రము. ఆ కేంద్రమును అత్యల్ప విద్యుత్ ప్రేరణకు గురిచేసినచో పరమసుఖమనుభవింపబడుచున్నది. ఆ సుఖానుభవ మొక మానవునకేగాదు, ఎలుకలకు కోతులకును ఆ తావుననే కలుగుచున్నది. ప్రయోగ శాలలో మీట నొత్తినచో మెదడులో ఆ భాగమున ఎలెక్ట్రోడువలన ఆ ప్రేరణ కలుగునట్లు పరికరము లమర్పగా, ఎలుకలు కోతులు ఆ మీట నొత్తుట కనిపెట్టి తమంత తామే పదేపదే నొక్కుకొనుచు ఆనందానుభూతి నొందుట కానవచ్చినది. అలాగున ఆ ప్రాణికోటి పొందు గాఢానందము ముందు బాహ్యసుఖమొక లెక్కకు రాకపోవుచున్నది. ఆహార, మైధున సుఖములను అలక్ష్యముచేసి, త్యజించికూడ, వానికై చలింపక, లోలితముగాక మీటనొత్తి పొందు ఆంతరికానందానుభూతినే యోగులవలె పొందుట గోచరించినది. భౌతికమైన బాహ్యసుఖముకన్న అభ్యంతరానుభవసుఖము మిన్న యను యోగుల మాటను యివి నిరూపించుచున్నవి.

మీట నొక్కుకొని మెదడులో నిర్దిష్టకేంద్రమున విద్యుత్ప్రసారమును కలిగించుకొని అనుభవము పొందుటగాకుండ, ఎలెక్ట్రో ఎన్‌సిఫలోగ్రాముతో పరీక్షింపబడుచు, దాని ముల్లును గమనించుచున్నచో ప్రతియొకడును తన ఆల్ఫా ప్రసారమును ఇచ్చకొలది హెచ్చించుటకు, తగ్గించుటకు యత్నింప పాల్పడును. అతిసహజముగా ఏర్పడు యీ ప్రయత్నమున ప్రతివాడును ఆల్ఫా ప్రసారము నొక తీవ్రతకు దెచ్చి యీ యనుభవము నొందుచుండును. Biofeed back పద్ధతియని

* Towards a Humanist Biology, (1968) లో Abraham Maslow వ్రాసినాడు.

దీనికిపేరు. జె. కమియా యను గెస్టాల్టు మనస్తత్వ శాస్త్రకారుడు ఈ పద్ధతిలో యీ అనుభవావస్థను కల్పించినాడు.

సాంకేతిక పరికరము లపేక్షించి యిట్లును, పరికరాపేక్ష లేకుండ శారీరక లేక చిత్త నియమన ప్రక్రియలచేతను — అనిచ్ఛానాడీ, కండర వ్యాపారమును కూడ ఇచ్ఛానియమనకు లోబరచు సాధనలు — పొందు నీయనుభవము తనంత తానుగా "అప్రయత్నముగ"నే కలుగుటయు నున్నది. ఇది యోగులకేకాదు, ఎల్లమానవు లందు నున్నది. కళానుభూతియు యోగానుభవము నొక్కటే యని చెప్పుటేగాదు. ఆమాట యోగానుభవము నంతగా నెఱుఁగని పాశ్చాత్యులనుటకేమిలెమ్మని భారతీయు లనవచ్చును. అందులోను, అద్వైతులు సన్యాసమున "కావ్యాలాపః వర్జయేత్" అని విధించుకొనుటచే ననవచ్చును. కాని ఆ కోవలోను చాల మార్పు కలిగినది. కావ్యానుభవము బ్రహ్మానుభవము వంటిది, బ్రహ్మానుభవ సబ్రహ్మచారి అనుటతో నాగక, రెండును ఒక్కటేయని మధుసూదనసరస్వతి నుండి ఏర్పడినది. బ్రహ్మాను భవసహోదర్వము సబ్రహ్మచారిత్వము పాత పడికట్టుమాటలై పోయినవి. భారతీయు లింతవరకు పాశ్చాత్య మనఃపరిశీలకులతో అంగీకరింపవలసినదే. పాశ్చాత్య పరి శోధకు లింకింతకన్న ముందుకు జరిగి దైనికమైన సంఘటనలలో, సాధారణ మానవవర్తనా సన్నివేశములలో సామాన్యులే ముగ్ధులై మైమరచి పొందు ఆంతరి కానుభూతిని కూడ జోడించుచున్నారు. చిన్నారిపాపలను నీరాడించి, దిద్ది, దుస్తులు వేసి — కార్యాలయోన్ముఖుడై దిద్దుకొని సిద్ధమైన భర్త సరసన కూర్చుండబెట్టి తానుగా వండివార్చిన ఉపాహారము వడ్డింపగా సల్లాపసుఖమనుభవించుచు తిను దృశ్యమును చూచుకొని జీవితసాఫల్యమూహించి తన్మయత్వము చెందు యువతీ కుటుంబిని పొందునట్టి యనుభవమువంటి అనుభవము కూడ కళానుభూతి, యోగాను భూతి రాశిలోనిదనియే యనబట్టినారు. తన్మయత్వము, తాదాత్మ్యము పారవశ్యము, ముగ్ధత, సుఖమయాశ్చర్యానుభూతివంటి మాటలచే దైనిక లౌకిక జీవితవ్యాపారము లోని సర్వానుభవము మార్మికానుభవసహోదరముగానే మనస్తత్వశాస్త్రము గైకొను చున్నది. దానిని శిఖరానుభవమని (Peak Experience) పేరిడినది. ఉపవాస క్రియలు, ఆసనాదివిధులు లేకుండ ఊరకుంట చూత ఉత్తమయోగము యని వేమన్నయు, అచలగురువులు ఒకటి చెప్పుచునే యున్నారు. ఈ శిఖరాను భవములను కలిగించుటకు ఉపాయములు చాల కనుగొనుచున్నారు. త్రాగకుండ

గడవనివారికి (Alcoholics)* కొన్ని మందులిచ్చి, ఆ మందుల ప్రభావములో నుండగా సంగీతమో, కవితయో, వర్ణసమ్మిశ్రదృశ్యములో ప్రయోగించి కళానుభూతికి గురిచేసి వారిని సరిచేయుచున్నారు. జీవితమును అర్థవంతము జేయుచున్నారు. తమయందున్న శక్తియుక్తులను, గర్భితమై, స్వభావనియతమై యున్న వానిని ప్రత్యక్షీకరించువారిలో (Self-actualisers) యీ శిఖరానుభవము అధికముగా కానవచ్చుచున్నదని కనుగొనుచున్నారు. ఈ స్వశక్తిఅభివ్యక్తికారులు (Self-actualisers) ఎక్కువ ప్రేమ, ఆర్ద్రిత లున్నవారుగానున్నారు; వారివి గాఢమైన అనుబంధములు. సామాన్యులకన్న వారు ఎక్కువ ఏకాంతము ననుభవింపగలరు. అంతస్తుల భేదము. చదువు, రాజకీయముల తారతమ్యము పెట్టుకొనకుండ స్నేహముగా నుండగలరు. సహనమున్నను మంచి చెడుగుల వింగడింపు వీరికెక్కువ. ఇంక ఇత్యాదిగుణములు వారికుండుటను అబ్రహాం మాస్లోవంటి మనస్తత్వ సిద్ధాంతకర్తలు గమనించినారు. సృజనాత్మకత, ఇచ్ఛ, అర్థార్థిత్వము (creativity, Will and Sense ol Meaning) కలిగియుండుటకు శిఖరానుభవమునకు సంబంధమున్నదనుచున్నారు. అంతేగాక, ఆహారము, మైథునము, భద్రత, ఆత్మప్రాధాన్యము, (Self-Esteem) అన్నవి మానవవర్తనకు చోదకములై అవి నెరవేరగా యిక మానవుని నడిపించునది స్వశక్తివ్యాకృతి (Self-actualisation) యన్న ప్రవృత్తి యని యనుచున్నారు. అనగా మానుషచోదనలయందు (Human Motivation) ఉన్నతమైనదానితో శిఖరానుభవము ముడివడియున్నట్లున్నది. దీనిపై పరిశోధనము సాగుచున్నది. కీ. శే. మాస్లో కృషి యీ విషయమున గొప్పది. ఏదో దుస్సాధమనుకొను యోగానుభవము (Mystical Experience) సాంకేతిక యుగమున సుసాధమై, దైనిక లౌకికానుభవప్రాయముగా సిద్ధింపనున్నదనుకొందును. దీర్ఘాయురారోగ్యములు దీనితో ప్రసక్తి కలిగియుండునా యన్నది పరిశోధనలో నున్నది.

యోగమును గూర్చి మనవారి గొప్పల కంతులేదు. హృదయస్పందనమే ఆపివేసి, తిరుగ స్పందింపజేయుదుమని వచ్చిన గట్టి యోగులున్నారు. స్పందన సగానకు సగము తగ్గించిరిగాని అసలు ఆపినవాడు లేడు. నీటిపై నడచెదమని ప్రకటించి దాగినవారేగాని చూపినవారులేరు. 'నింగి నెగయువాడు నేటిలోకమున లేడన్న' వేమన్న వాక్యమిప్పటికిని యథార్థమే. సమాధ్యవస్థచే జీర్ణవ్యాపారము

---

* Dr. A Hoffer అనునతడివి చేసినాడు. Psychedelic drugs – Mescalin and L. S. D. Aldous Huxley యీ వైద్యమును ప్రపంచమునకే సిఫారసు చేసినాడు. (Heaven And Hell)

(metabolism) మందగింపవచ్చును. తక్కువ ప్రాణవాయువుతో ఎక్కువసేపుండ వచ్చును. జపాన్ దేశీయులు 'జెన్' ధ్యానమును సైనికున కుపకరించునని సైన్య శిక్షణలో భాగము జేసినారు. ఇదంతయు భౌతికవ్యాయామము. గుణమున్న గ్రహించుటకు భౌతికప్రాధాన్య మెఱిగిన సమాజము త్వరపడనుగలదు. ఆక్షేపణయు లేదు. యోగానుభవము ఆత్మికపు విలువలొద్దనే చరితార్థము గావలెను.

విశ్వసత్య శోధనము, విశ్వసత్య అనుభూతి అవిరోధములనుటేగాదు, మార్మికానుభవము, హేతుదృక్కు రెండును వలసినవే యనుటేగాదు, J. B. S. Haldane వంటి శాస్త్రవేత్త మత విజ్ఞానములు రెండును కళారూపములే యన్నారు. అంతేకాదు, హాస్యము – కళ – సత్యాన్వేషణము మూడును సృజన వ్యాపారత్రయము (Creative Trinity) అన్న గొప్ప సమన్వయ మొక టున్నది. హాసకుడు – కళాస్రష్ట – సత్యశోధన సాధనచేయు విజ్ఞాన శాస్త్రకారుడు, యోగి (Saint) – యన్నవారు సృజనాత్మకత యొక్క విభూతిత్రయమని ప్రతిపాదించి నిరూపించుచున్న మనీషి Authur Koestler*. యోగి – కవి హాసోపహాసకుశలుడును తానెయై యీ సిద్ధాంతమును తార్కాణించినవాడు వేమన్న.

## నాస్తికయోగి చెప్పిన నీతి

మతమును, సృష్టికర్తను 'చంపి', అడుగుదీసి అడుగువైచుటకు ఎన్నెన్నో కలిసి రాఁజూచుకొను జనములు పూనిన విశ్వాసపు పోటుగజ్జలను గుంజిపారవైచిన వేమన మనకింక మిగిల్చినదేమిటన్న ప్రశ్నయుండనే యున్నది. ఇది తప్పు ఇది తప్పు అని లోకము తప్పు లెన్నుటే పనిగా బెట్టుకొని, ఎట్లు నడచుకోవలసినదీ అన్వయ పూర్వకముగా (positive) స్పష్టపరుపని కేవల వ్యతిరేకార్థకుడు, 'ఎతిమతము' వాడుగా మిగిలిపోయినాడేమో గమనింపవలెను. సంసారము రోసి, సన్యాసియై – అందును గోచిపాతతో గూడమానము గప్పుకొనక – లోకవిరుద్ధముగా తిరిగి, లోకమును అద్వైతులన్నట్లు 'సతులు సుతులుమాయ సంసారములుమాయ' యని చెప్పిన వాడుగదా! కాని ఆ అద్వైతులు లౌకిక వ్యాపారమున స్మృతులను తలదాల్పగా, అదియు కాదన్నవాడు గదా; సృజనాత్మకత ముప్విధములను గల వానిగా చూపితిమే – మరి యీ విధ్వంసకవిమర్శ దానితో సరిపొందునా యని ప్రశ్నింపవచ్చును. సంప్రదాయవాదులీ ప్రశ్నను అనిశము ప్రయోగించుచుందురు. త్రివిధ సృజనాత్మకతను చెప్పు కోస్లరు మాటలనే వినవచ్చును.

---

* 'Creative Act' అను గ్రంథము.

"విజ్ఞాన శాస్త్రములలోను కళలలోను సృజనాత్మకమౌలికతయందు ఎల్లప్పుడును నిర్మాణాత్మక భాగము, విధ్వంసనాత్మక భాగము ఉండనే ఉన్నవి. విధ్వంసమన్నది, సాంకేతిక రూపములు, శైలి, పడికట్లు, నిషేధములు మొదలైన విషయములలో పాతుకొనియున్న సంప్రదాయముల పట్ల విధ్వంసనమే. శాస్త్రమన్నది శాస్త్రకారుల సృష్టిగావున, అందలి అంగీకృత విశ్వాసముల మీదికి దూకుడుగా బోవుటకు సంసిద్ధత యన్న విధ్వంసకితా ధాతువు ఒక కొంతను — శాస్త్రకారుని మనస్సులోగల యీ అంశను విజ్ఞానశాస్త్ర విప్లవములలోని విధ్వంసనాకోణము ప్రతిబింబించుచున్నది. కళాకారుని విషయము గూడ అంతేయని చెప్పనక్కరలేదు. దాడి యన్నది ఉల్లిపాషాణము (Arsenic) వంటిది. అది కొద్దిపాటి మోతాదులలో ప్రేరకము (Stimulant) — పెద్ద మోతాదులలో విషము". తరతరములుగా కరడు గట్టిన సంప్రదాయము నెడ వేమన విమర్శ ప్రేరకముంగా పనిచేయుమోతాదే.

అన్నమయితేనేమిరా, సున్నమయితేనేమిరా — యీ పాడుపొట్టకు (సున్నమేగాక) అన్నమే వేతామురా యని దర్శనము దర్శనముగాను జీవితము జీవితముగను సమన్వితముగాని తెలుఁగైన అద్వైతమువలెగాక 'మాయ జగమటంచు మరి బల్కుచుందురు, మాయగాదు బ్రహ్మమయము గాని', 'ఇహమునందునేమి యిడుమలబడినను పరము సాధనార్థ పదవిగాదు' అని, మాయానిర్వాణము లొక్కచేయను దర్శనమువాడైనందున దర్శనము — జీవితము సుసంగతముగా సువ్యవస్థితముగా యోచించినవాడు. అట్టి ఆతడు చెప్పిన నీతి స్వరూపమును గమనింపవలసి యున్నది.

ఎవని కాయకష్టమున వాడు జీవింప వలెనన్నదాతని ముఖ్యమైదటి బోధ యని మాత్రము నిరాఘాటముగా ప్రకటింపవచ్చును. దీని నతడు సూటిగా చెప్పుటే గాదు, అతడేది చెప్పినను అదంతయు దీని నుండి వెలువడినదిగానే యుండును. దానమడుగునతడు ధరలోన నధముఁడు — దానమడుగనతడు దైవసముడన్నది అతని వాక్యముగా మున్నే కనుగొన్నాము. అనగా, ఎవని కడుపున కతడే ఆర్జించుకొనవలెనన్న దాతని దృష్టి కాకున్న యీ వాక్యమునకు వ్యవస్థ ఏమున్నది. యాచనా దైన్యమాతనికి కంటగింపు. యాచనఁగప్పిపుచ్చి అప్పుగా గైకొనియు ఎగబెట్టుటాతనికి పరమ అసహ్యము. 'అప్పుదీర్పలేని ఆనేర్పుదేటికో' (174–నేదునూరి ప్రతి); పరులమోసపుచ్చి పరధన మార్జించి, కడుపునింపుకొనుట కానిపద్దు, ఋణము సేయు మనుజుడు డెక్కువ కెక్కునా [3051 నేదునూరి ప్రతి] — అన్నవతడడిగిన ప్రశ్నలు. గడనలేక బైరాగులై కడుపుబోసుకొనుట నాతడు

తిట్టిన దింతి-తకాదు గదా! వేసమూనిగాని, ఊనకగాని బిచ్చమెత్తుట రోత; అప్పుదీర్పమిరోత; తాకట్టిడుటరోత [175 నేదునూరి ప్రతి] — ఇన్నియు రోత లగుటగు, నీతిగాకపోవుటకు వేమనకు ఆలంబమేది? కాయకష్టమున కడుపు నిండించుకోవలెనన్నదే అతని పరమాభిప్రాయముకాకున్న ఇవి రోతలనుటెట్లు? ఇన్ని మాటలెందుకుగాని అతడు నేరుగా చెప్పిన వాక్యముండనే యున్నది.

* "చెమటకారునట్లు శ్రమపెట్టి దేహంబు గడనజేసి కూడుకుడువవలయు
తల్లి దండ్రిసొమ్ము తాఁదింటకారాదు ....... .. "(1717 నేదునూరి ప్రతి)

తండ్రితాతలు కూర్చిన యాస్తిపాస్తులు సంతానమునకు సంక్రమింప రాదన్న భావముకూడ వేమన యందున్నట్లు మున్నె ఒక సందర్భమున చెప్పుకొన్నాము. ఈ పద్యము దానినే ధ్రువపరచుచున్నది. ఆ భావమునకును మూలము శ్రమజేసి బ్రతుకవలెనన్నదేకదా! మూలవాక్యము, తత్పర్యవసానమును కూడ యిందున్నవి.

లేమికాడు కష్టపడి తినవలెనన్నదేకాదు, కలవాడు కూడ కాయకష్టము మానరాదనియు నతని దృష్టి.

"కలుగు కాలమునను కష్టించి కష్టించి అయిన దివసములను అన్యులకును
కోరఁ (కోరి) బెట్టువారు క్రూరులె యౌదురా ... ... ...."

(535 బ్రౌను ప్రతి)

కలిగియున్ననాళ్ళ కలిగినవారేని కాయకష్టమింకనింకను జేసి మరింతగడించి, యితరు లడిగినచో పెట్టువారైన వారిని క్రూరులన నేమిటికని అడుగుచున్నాడు వేమన. అతని నిరసనకు పాత్రమగునది కలవారి పిసినిగొట్టుతనమేగాని, దానలోపమే గాని, వారి కాయకష్టమును, తన్మూలమైన ఇతోధిక సమార్జనయు కానేకాదన్నది స్పష్టము. చూడగా, వేమనయందు కాయకష్టమన్నది ఒక మతబోధ వంటిది అన వచ్చును. కలిమిలేములతో నిమిత్తము లేకుండ కాయకష్టము చేయవలసినదే.

మరొక గొప్ప విషయముకూడ మనకతడు మప్పుచున్నాడు: కాయక మున జీవించు బడుగుప్రాణి ఎవడేని దొరలకో, దొడ్డవారికో, ధరావరులకో భయము చొప్పునో గౌరవగణ్యతల చొప్పునో ఆత్మన్యూనతా భావము చొప్పునో ప్రతిఫల శూన్యముగా పనిపాటులు చేసిపెట్టరాదని వేమన చండశాసనము. "వెట్టి గొలువరాదు

---

* "చెమటకారునట్లు చట్టను శ్రమపెట్టి గడియించినన్నంబు కుడువవలెను
తల్లి దండ్రిసొమ్మె తినుటకారాదురా.... .... ...." అని వ్రాత ప్రతిపాఠము.

విభుడెంత ఘనుడైన" నన్నదాతని ఆజ్ఞాసమమైన ఉపదేశము. ఊరకొక్కని కొలువ రాదు. శ్రమనొకని కొల్లకిడరాదు. కాయకష్టమునకును గణుతి యుండవలెను; గణుతి తెచ్చుకోవలెను.

కష్టించి వర్షదినమునకై కూర్చుకొన్న అర్థమును బడుగువాడు కానివానికి అప్పుగనో, దాపురముగనో చిక్కబెట్టి కోల్పోక కాపాడుకొమ్మని మెలకువ జెప్పినాడు.

"కానివానిచేత కాసువీసములిచ్చి వెంటదిరుగుబెల్ల వెఱ్ఱితనము
పిల్లి కోడిబట్టి పిలిచిన పలుకునా.... ...... " (1293 నేదునూరిప్రతి)

వెట్టి జేయకుండుటేగాదు, కానక కష్టార్జిత మొకనికి పోగొట్టుకొనకు మనియు దెలిపి నాడు. కావలెనన్న కష్టమునుండి కలిగినదానిలోనే యింత దానమిడుమనును. తిరిపె గాడును, తిరిపెమునుండి తిరిపెమిడవలెనని యుద్బోధించినవాడుగదా! కష్టముచే జీవింపుము — కష్టమొకనికి కోల్పోకుము — కష్టము నుండి దానమిడుము — సమా సముగా ఇది విశ్వదాభిరాముని విశ్వాభిరామమైన ప్రప్రథమ నీతిబోధ. ఇది లేమికానికి, కలవానికి కూడ వర్తించునట్లు సుసూక్ష్మముగ చెప్పినట్లగుపించుచున్నది.

ఇక రెండవది: నీకును ఇతరులకును కొలబద్ద ఒకటే. నీకొక ధర్మము, పరునకొక ధర్మము నుండరాదు. నీకు హితము నిష్టము గానిది ఇతరులకును కాదను కొనుము. పరులవలన నీవేది కోరుదువో పరులకును నీవదే కోరవలెను. పరుల దూలనాడకుము. ఎందువలన నంటివేని, నీవు తూలనాడబడుట నీకిష్టము కాదు కనుక.

"కానలేరుగాని కలియుగంబుననున్న మనుజులందఱకును మానమొకటి
దౌష్టికులగువారు తమవలెజూడక పరుల దూలనాడుదురుగ వేమ !!"

(1105 గోపాల్ అండ్ కో ప్రతి)

ఇందు మానమనఁగా అభిమానము ఆత్మగౌరవము గౌరవము మర్యాద మున్నైనవిగా చెప్పుకొనుటతో అర్థము సర్వము సంపూర్ణము కాదనవలెను. కొలమానము, నైతిక ప్రమాణమునని తప్పక చెప్పుకొన్ననే అర్థపుష్టి, ఔచిత్య దృష్టి. పరులను తమవలె చూడక అన్నందుకు సార్థక్యము. పరులను తమవలె గణింపక, ఊరకమాటలు తూలుదురని తప్పెత్తి చూపు చున్నాడు వేమన్న.

"And as ye would that men should do to you,
do ye also to them like wise"

అన్న క్రీస్తు వాక్యమునకు విపర్యయమును గూడ సత్యముజేసి వేమన బోధించి యున్నాడు. ఇమ్మాన్యుయల్ కాంటు చెప్పిన ధర్మస్వరూపమున ప్రథమ సూత్ర మిదే.

"అన్యులకును వచ్చు నాపద తనదిగా నెన్నువాడు భువిని నున్నవాడు
ఎన్నువారిలోన ఇహపరంబుల లెస్స గన్నవాడు మిగుల ఘనుఁడువేమ॥"

అన్నదాతని యింకొక పద్యము. ఇది తన్నుమాలినధర్మము మాత్రముగాదు. మహాయానబౌద్ధములో నున్నట్లు పరులకోసమే తానన్నట్లు, పరసుఖ శ్రేయస్సులకు తానుపకరణము నన్నట్లుగా ఈ బోధలేదు. Self-love is sin అన్నట్టి Calvin బోధయు కాదు. తనకు తాను విలువనిచ్చుకొనుటను ప్రాతిపదిక జేసుకొని, అట్లే ఇతరునకును విలువ నియ్యవలెననుటయే వేమన తాత్పర్యము. స్వపరార్థములను సమన్వితము జేసిన నీతి యిది. వ్యక్తికి, వ్యక్తిత్వమునకు విలువనిచ్చు మానవతా వాదము జెప్పు సూత్రమిది.

ఇట్లే ఇంకను గలవు. తప్పులేనివాడు ధరనులేడు—వేమన. To err is human అన్నది ఇంగ్లీషు సామెత. కావున తప్పులెంచుకొనుట కార్యము కాదు. తప్పును సైరించుటయందే మానవత్వమున్నది. ఒరుల తప్పునేకాదు, నేరమునైనను మరచిపోవలెను.

"తప్పులెన్నువారు తండోపతండంబు లుర్విజనులకెల్ల నుండు తప్పు
తప్పులెన్నువారు తమతప్పు లెఱుఁగరు.........
మఱవవలె పరుల నేరము, మఱవంగా వలదు మేలు మహిలో వేమా!"
(1967 గోపాల్ అండ్ కో ప్రతి)

ఎల్లజనులును తప్పుజేయువారే. అట్టి తప్పులను ఇతరునందెంచగలవారు లక్షోపలక్షలు. అదొక విద్యగాదు; విశేషముగాదు. ఇతరుని తప్పులెన్నగలవారు తమయందలి దోషములను గుర్తించి, అణచుకొనజాలరు. ఆత్మదోష పరీక్షయే కావలసినది. అది కలిగిన దోషబాహ్యునిగా తన్నుదాను శిక్షించుకొనును; మార్చుకొనును; మలచుకొనును. అది కార్యము. పరుడు తనకు గావించిన అపకారమునే మఱచిపోవలెను; తప్పును మఱచిపోవుట ఎంతపని? అనగా పగకూడదు. క్షమ ఆవశ్యకము. తప్పు సైరించుటకన్న మరచిపోనేపోవలెనన్నాడు. మరువవలసినది అపకారము; మరవరానిది ఉపకారము.

"Judge not and ye shall not be judged;
Condemn not and ye shall not be condemned;
Forgive, and ye shall be forgiven"

అన్న బైబిలు వాక్యముకన్న వేమని వాక్యములలో విచక్షణ, వివేకము నున్నవి. క్రీస్తు పర్వతబోధ (Sermon on the mount) యందుగల ఎల్ల నీతులను విశ్వదాభిరాముడు మరింత సున్నితముగ సుసూక్ష్మముగ చెప్పినాడన్నది స్పష్టము.

ఒక చెంపగొట్టిన రెండవచెంప జూపుమనిగదా క్రీస్తు నుపదేశము. 'శత్రువులను ప్రేమింపుము, శత్రువులకు మంచిచేయుము; అడిగిన బదులిమ్ము, కాని బదులాశింపకుము. దాన నీవొందు ఫలము దొడ్డది; దాన నీవా అత్యుత్తముని సంతానమయ్యెదవు. ఏమన్న అతడు దుష్టులకును కృతఘ్నులకును కరుణాళువు' — ఇవి బైబిలు వాక్యములు. ఇక విశ్వదాభిరాముని సూక్తి :

*"చంపదగినయట్టి శత్రువు తనచేత జిక్కెనేని కీడు సేయకుండ
పొసఁగ మేలుచేసి పొమ్మనుటే చాలు ......... "

శత్రువునకు మేలుచేయుట ఫలము లక్షింపని పనిగాదు. పగ యణగించు మార్గము. విశ్వదాభిరాముడిట్లు చెప్పినది, "దేవుడిట్లు చేయును గనుక నీవిట్లు చేయుము, నీవట్లు చేయునపుడు బదులాశింపకుము, ఆశింపకున్న పడయు ఫలము పారలౌకికము, అది పెద్దది, అది నీవు పడసెదవు" అన్నట్లు లేదు. బైబిలులోని దేవునివంటి దేవుడాతనికి లేడు. భగవద్గీత చెప్పిన దేవుడును అతనికి లేడు. అందుచే ఆ గ్రంథములు చెప్పు చొప్పున ఇతడు చెప్పలేదు. అంతేగాదు. మానవునకి జన్మమే కడగొట్టుదనియో, పునర్జన్మ భావమే తప్పనియో ఒకప్పుడు జెప్పిన వేమన్న కడపటికి వాల్తేరు (Voltaire) వలె భావించియుండె ననవలెను. లోకమును నీతిలో నిలువరించుటకు దేవుడనువాడవశ్యముండవలసియున్నది. నిజమున కతఁడొకడు లేకుండినగూడ అతనిని కల్పింపవలెనన్నది వాల్తేరు వచనము. గట్టిగా నిలదీసినచో, ఆ దైవభావమొక్క పేయైన నిష్ప్రయోజనమే యన్నాడు. మరణమున కనంతరము జీవితమును, ఇచట చేసిన మంచి చెడుగులకు అచట శిక్షాబహుమానము లుండునను విశ్వాసముగూడ జోడింపబడదేని దైవమందలి విశ్వాసమునకు నీతి మూల్యము శూన్యమని ఆ ఫ్రెంచిమనీషి తుదితీర్పు. అనఁగా దేవునికన్న

---

* కడిసి శాత్రవులను కరుణజూచినవాడు పాదుకొన్న ముక్తిపరుడు వేమ !
(949 గోపాల్ అండ్ కో ప్రతి)

మరణము పిమ్మట నింకేమో మిగిలియున్నదని ఇచటి నడవడి ఫలితము లచటనే యనుభవింపవలసి యుండునన్న విశ్వాసమే నీతివిషయమున విలువైనదని, ఉపయోగము గలదని అతడెంచినాడన్నమాట. మనుష్యప్రాణికిక జన్మ లేదన్న వేమన్న తిరిగి పునర్జన్మ విశ్వాసమును విశేషించి వక్కాణించుట కిట్టిదే కారణము. ఇది భారతదేశముగావున ఇది పునర్జన్మ విశ్వాస విశిష్టమైన జాతిగావున మరణానంతర జీవితమనఁగా క్రైస్తవుల విశ్వాసము వంటిదిగాక, కడకు వీరశైవుల విశ్వాసమును గాక కర్మవాద పురస్కృతమైన జన్మచక్రమునే అవశ్యము జెప్పినాడు. వాస్తేరు అంతజెప్పినను దైవభావమును తీసివేసినవాడు గాడు. వేమనయు తీసివేసినవాడు కూడ. హరిహరాజులందు ఆశలుడుగుమని, అట్టి సృష్టిదైవతములను త్రోసిరాజు చేసియు, అనఁగా నాస్తికసముడయ్యును కర్మవాదసూత్రితమయిన పునర్జన్మ విశ్వాసమును మరల నవలంబించినది మానుష ప్రపంచమును నీతిబద్ధమొనరించు వినియోగవాద దృష్టి చొప్పుననే యనవలెను. కర్మఫలితములను మార్పుజేయుటకు కరుణాసముద్రుడగు దైవతము నతడు నిలబెట్టవలసిన ఆవశ్యకత లేకపోయినది. అందుచే నతనికి దైవవాక్యము లేదు. అతని బోధ ముఖ్యముగా మానవజీవిత సన్నివేశమును, తదావశ్యకతను గాఢముగా నెఱిఁగి ప్రవర్తిల్లినది.

కోపము కూడదని అతనిబోధ యున్నది. అందుకుగా నతడిచ్చిన కారణ సముదాయము పరిశీలనార్హము.

కోపమునను ఘనత కొంచెమైపోవును;
కోపమునను మిగుల గోడుజెందు;
కోపమడఁచెనేని కోరికలీడేరు;
కోటిదానమిచ్చి కోపంబు నొందిన పాటిజేయరతని ప్రజలుమెచ్చ;
కోపమునను బ్రదుకు కొంచెమైపోవును;
కోపమునను గుణము కొఱతఁ బడును;
కోపమునను నరకకూపము జెందును;

నరకభయమును చూపిన దొక్కకారణమువినా తక్కినవన్నియు జీవితయాథార్థ్యము నుండి పెల్లగిలివచ్చినవి. ఈ ఐహిక కారణములు అనుభవ సత్యములు. కోపమునను బ్రదుకు కొంచెమైపోవునన్నదియు గ్రుడ్డి నమ్మకములోనిది కాదు. కోపగించుకొను వ్యక్తికి కలుగు నష్టమును లెక్కించి చక్కగా చెప్పినాడు. సాంఘిక స్నిగ్ధతకు వ్యాఘాతకమైనదనుకంటె వ్యష్టికే నష్టమని స్థాపించుటకు యత్నించినాడు.

ఇట్లతని ఉపదేశము వినియోగదృష్టిసమ్మితము, ఇహమున సుఖశాంతులను సాధించునదిగాను నుండుట తప్పనిసరి. ఆపైన పరసుఖ సాధకముగా కూడ భాసించును. ఇహమున ఫలశూన్యమై పరసుఖైక సాధకముగా మాత్రమే చెప్పినసీతి యాతనియందు గానరాదు. సంఘమునకు నష్టమనియే గాక వ్యక్తికి నష్టమని నిరూపించుటాతని నియమము.

దాతృత్వము కారుణ్యము నను గుణములున్నవి. వానిని పెంచుమని విశ్వదాభిరాముడు పెట్టిన ఘోష యింతింతకాదు. అతని జీవితమునట్లాక ప్రయోగ శాలనుగా మార్చివైచినవే ఆ గుణములు। అయిన వానిని బోధించినపుడు కోపము కూడదనుటకు చూపినట్లు ఐహిక యాథార్థ్యము నుండి వెలువడి, కోపము వలన కోపికి కలుగు హానివలె దానము వలన దాతకు కలుగు శుభము, లాభము, అభ్యుదయమును ప్రేలుమడంచి చెప్పుటకు వీలున్న విషయముగాదు. వినియోగదృష్టి దాతృత్వము స్వప్రయోజన సాధనమని చెప్పదగినది కాదు. కాక న్యాయార్జితము నితరున కియ్యవలె ననుటకు హేతువును సరిపోదు. దాతృత్వము ధనికునకే గాదు వేమన బోధించినది. గానుగలోనిదే గంపెడని రెక్కాడినగాని డొక్కాడని కష్టజీవులకును తిరిపెము నుండి తిరిగి తిరిపెమిడుమని బిచ్చగానికిని బోధించినవాడు. అంతేగాక, నీతిగనే ధనము గడింప వీలున్నదన్నవాడు కూడ వేమన. న్యాయార్జితము నుండి, కాయకష్టము నుండి మరొకని కిడనన్నను నీత్యుల్లంఘనము కాజాలదు. 'శక్తికొలఁది పనిచేయుము; పనికొలఁది ఫలితమును పూర్తిగా గొనుము' అన్నది సామాజికవాద సూత్రము. 'శక్తికొలఁది పనిచేయుము; కాని అవశ్యకమైనంత గైకొనుము' అన్నది సామూహికవాద సూత్రము. పనికొలఁది పూర్తిఫలితమును స్వీకరించి, స్వాయత్తము జేసుకొని అనుభవించుటగాని, నిల్వచేసికొనుట గాని నీతితరము కానేకాదని సామాజికవాదముగదా। కాని శక్తికొలది మాత్రము పనిజేసి, అవశ్యమైనంతే దీసికొని మిగిలినది పడిచిపుచ్చుమన్నదియును నీతియే కాదు; ఉన్నతమైన నీతియే గావచ్చును. కాని, అట్లు తప్పక చేయవలయునన్నది తర్కనిష్పన్నము గాదు. అనగా, ఒక విధముగా కారుణ్య దాతృత్వ గుణములు హేతుపరిధిని దాటినట్టివేమో. ఇందు భిన్నాభిప్రాయమున్నది. ఇట్లు సున్నితము సూక్ష్మమునైన సమస్య కారుణ్య సమస్య. దానిని బోధించుటకు కర్మవాదముతో సమన్వితమైన పునర్జన్మ విశ్వాసమును విశేషముగా అతివేలముగా చాటినాడని ముందే గ్రహించినాము. కాని అదే అతఁడిచ్చిన కారణ సర్వస్వమును కాదు. ఇప్పుడే ఇక్కడే

భౌతిక జీవితసత్యగర్భ ప్రసూతము, వైయక్తికము అయిన కారణజాతము మీద వేమన్న కన్ను ఏమరదని చెప్పుకొన్నాము గదా। ఇందును చూడవచ్చును.

పరులకుపకరింప పట్టుగొమ్మ — పరులకుపకరింప బలిమివేమ
దిక్కులేనివాని దీనతబాపన పురుషుడిహమునందె పూజ్యుడగును
(3045, 2525 నేదునూరి ప్రతి)

కరుణాళువు గాకున్న పోనిమ్ము, కలిగినవాడు పేదలపట్ల దాతృత్వము జూపుట ఆత్మరక్షయని కడమాట జేసినాడు. లోభినూరక ఎగతాళి బట్టించినవాడు అసలు విషయమును తెల్లముజేసి "లోభమోహములను ప్రాభవములుదప్పు, తలఁచిన పనులెల్ల తప్పిచనును" (4247 నేదునూరి ప్రతి) అని ఐహిక సత్యమును దెల్పినాడు.

అంతేగాదు. అతడు పరుల ప్రేమింపనేరనివాడేగాడు. తన్నుదా ప్రేమింపనేరనివాడు. పరశ్రేయముగాదు స్వశ్రేయమే ఎఱుఁగనివాడు. తాదినడు. ఇతరుల దిననీడు. అతడు జీవితకామియేగాడు. అతడు నిర్జీవమైన వెఱబొమ్మ. 'చేనిలోన బొమ్మ జేసి కట్టినయట్లే'.

వావివరుసల విషయమున్నది. అగమ్యాగమన పాపభయమున్నది. లైంగిక సంబంధము లందలి విధి నిషేధములు మానవసంఘము నడచుకొఱకుగా నకుదేర్పఱచుకొన్నవేగాని, దేవుని నిబంధన మేరకు కల్గినవి కావని దెలిసినవాడు వేమన. దేశసంచారియై జాతి జాతికిని వావివరుసలలో విరుద్ధ నియమములున్నవని గమనించి వ్యాఖ్యానించినాడు.

"మేనమామ బిడ్డ మెఱసి పెండ్లామాయె, అఱవలందు చెల్లెలాయెనదియు
వలయపుణ్యమాయె వలదన్న పాపంబు . . "

అంతటితో నాగినాడా? "లంజె లంజె యనుట లౌకిక ధర్మాన" (1805–గోపాల్ అండ్ కో) నే గాని, 'పారమార్థికమున' గాదన్నాడు. లైంగిక ప్రవృత్తిని గూర్చి దాపటికములేకుండ అతడు చెప్పినంతగా ఈ దేశమున పూర్వ మెవ్వరును జెప్పి యుండరు.

"తరుణి యన్న గన్న తనయుని గన్నను మరునికళలు మించిమనసు పాఱు
పాపజాతి మనసు పట్టంగ రాకుండు... ... ... "(?247 నేదునూరి ప్రతి)

తల్లిదండ్రులకు సంతానమునకును నడుమ లైంగికాకర్షణమే, కామస్ఫూర్తియే అసలు పొడమదనుట సత్యసంగతముకాదు. పొడమిన వ్యావర్తనమో, నిగ్రహమో

నెఱపుదురని వేమన ఎఱిగి పల్కినాడు. 'తల్లి నాలనేటి తత్వంబదేమిటో' 'వావి వరుస దప్పి వర్తింత్రు మహిమలోన' యని తంత్రాచారము సేవగించుకొన్నవాడు విషయమును విషయముగా జెప్పవచ్చి 'ఫ్రాయిడ్' కళ్ళకద్దుకొనునట్లుగా జెప్పినాడు. ఆకలి తరువాత మానిసిని నియమించునది కామమని

"కూటికి వగలేక కూర్చున్నవానికి ఆడుదానిమీద నాసగలదె ?
అన్నమదముచేత నన్నిమదములౌను ........."

(545 గోపాల్ అండ్ కో ప్రతి)

అన్నాడు.

పూర్వాశ్రమము నందతడు కట్టుతిరుగుబోతు. ఈ నిజములప్పటివని సరిపెట్టుకొనుట నిరర్థకము. కులముకొల్పుమని చెప్పు సంస్కర్తయైన మీదనే కామము సత్తువదెలిపి కులశుద్ధి బూటకమని భేరివేసినాడు. కులము కట్టళ్ళు కామమునకు కప్పము చెల్లించి బ్రతుకుచున్నవని చాటినాడు.

"కచ్చలు కామలు నాడగ, ద్రచ్చంగా జగము బుట్టె తాతలనాడే —
ఇచ్చట కులజుండెవ్వడు ? 'సచ్చరితులె' యందగనుచు చాటరవేమా !"

"కులము హెచ్చు తగ్గు గొడవల పనిలేదు,
'సానుజాత'మయ్యె సకలకులము" —

(2403, 1111 గోపాల్ అండ్ కో ప్రతి)

అన్నాడు. యోగియై 'స్త్రీ నెడపగ గుసడపివె' యని విజ్ఞపిగుచు కూడ మానుష కామమును నిరాఘాటముగ చర్చించగలిగినాడు. తాఁదిరిగిన తిరుగుడునకు పరిపరి పరితాపపడువాడుగాడు. గతమున పాపినైతినేయని బావురుమను బెఱుఁగడు. నడుమ విషయవిముఖులై సన్యసించినవారు అప్లేద్చుట సర్వసామాన్యము. అరుణగిరి లీలాశుకులు చెడదిరిగి కోల్పోయినామని వెక్కి వెక్కి ఏడ్చినవారే. ఆచాలీతనికి రాలేదు సరిగదా, 'కామిగాక మోక్షగామికాడు' అని మరి మరి బజాయించి సిద్ధాంతించిన విలక్షణ ప్రకృతి. ఇదియాతని ప్రత్యేకతలలో ప్రత్యేకత. పాపవర్తనము షణ్యావర్తనమునకు రహదారియను సిద్ధాంతము క్రైస్తవ మార్మికులు కొందఱలో నున్నది. మానస పరిశీలనా శాస్త్రము Narscistic psyche అని చెప్పిన ప్రవృత్తి పారమ్యమే యీ దోరణి. వేమన ఆ కొండకొమ్మున గూర్చున్నవాడు. అదట్లుండనిచ్చి ప్రస్తుత మాలోచించెదము.

అట్టివాడు 'సతిని పెనఁగువాడు సంసారయోగిరా' యని సతివ్రతుని యోగివంతున జెప్పిన యోగియైనాడు. ఉపదేశముగా అది విశేషముగాదు, లోకసామాన్యము. ఆచరణైక దృక్కు, మానవ రక్తమాంసముల దౌర్బల్యము నిజ గైకొని చెప్పగల స్వతంత్రుడు, సంసారపు టొడుదుడుకుల నరసి సూత్రీకరించిన సువిశేషమసలున్నది : అగత్యమేని, గణికా సాంగత్యము కోరుముగాని పొరుగువాని యాలునాశింపకుము. అవశ్యకమేని వేశ్యవరకు సెలవిచ్చిన యోగపురుషుడు. పరుని యాలునంటకుము అన్న నియమము యోగియైచేయుటేగాక, భోగియై తిరిగినప్పుడును నుల్లంఘించినట్లు గానరాదు. అతనికి యౌవనోదయము సానివాడలోనైనది. ఆదినే వేశ్యావైదుష్య రేఖకు చొక్కిన రాసిక్యము, సంసారస్త్రీల చౌర్యరతమును రుచి చేయకపోవును. 'సానిదాని పొందు సౌభాగ్య భాగ్యంబు' అని పరవశించి పాడినవాడు "పరునియాలి పొందు పరసుఖ ప్రాయంబ" ని నిరూపించిన గాథా సప్తశతి, అమరుకమును తలగొన్న భారతీయ సాహిత్య సిద్ధాంత సంప్రదాయమున మునుకలువేసి పారదారిక శృంగార శతశృంగ పర్వతారోహణ పర్వమును అతనిముక్తక కవితలో సాక్షాత్కరింప జేయలేదు. జీవత్పతికనేగాదు, మృతపతిక విధవను, కోడెవిధవనైనను పొందరాదన్న అతనిమాట ఇంతకు మున్నే విన్నది. విధవయు ఒకనియాలు, గృహస్థురాలు. కుటుంబ జీవితము పవిత్రము. మరింత స్పష్టముగా, కుటుంబ జీవితమున పురుషుడు పురుషునెడ ద్రోహికారాదు. ఒకని స్త్రీ నొకడు ముట్టకుండుమని – ఒకని సొత్తుగాని వేశ్యతో వ్యామోహము దీర్చుకొనుమని పురుష పుంగవు ననుమతించినవాడు. నాటి మతములు ఆస్తిక్యము నామాంతరములు పెక్కులిచ్చి వేశ్యలకు సంఘానుమతిని సంపాదించి పెట్టగా వేమనయు వారి యుపయోగమును అంగీకరించినాడు. అట్టి సందర్భమున ఇల్లుజాలని కామికి తల్లిగలుగని వేశ్యను జూపి, ఇరుగు పొరుగు సంసారములు చెరుపకుండు మన్నాడు.

హేతువు సహాయముననో మరొకరీతిగనో ఒకకొన్ని సూత్రము లేర్పఱచుకొని జీవితములోని చిక్కులను, లోకవైవిధ్యమును ఎలువు సులువులను గమనింపక వీసము బెనగకుండుమన్న పిడివాదము చేయలేదు. ఆచరణీయతను, గడచిబ్రతుకుటను గ్రహించి నడువ నవకాశమిచ్చిన యుపదేశమాతనిది. అని అవకాశవాదము ననుమతించినదిగాదు. "అన్యుల మనముల్ నొప్పింపక తానొవ్వక తప్పించుక తిరుగువాడు ధన్యు" డన్నట్టును, ఆపద్ధర్మములను పేర నీతితరము సర్వమునకు సకల ద్వారములు పాఱదెఱచునట్లును, "వారి జాఙ్ఞలందు వైవాహికము

లందు ........ బొంకవచ్చు" నని ఆర్షధర్మము ప్రవర్తిల్లినట్లును చెప్పుట దివ్వెటీ వేసినను వేమనలో దృష్టి గోచరముగాదు. అతనిది అవకాశవాదచ్ఛాయ సోకని ఆచరణీయత — చిత్తశుద్ధిగలిగి చేయు యత్నమునకును గూడ గలుగు పరిమితి ననుమతించుట — సగటు మానిసి సగటు వర్తన క్రమాభివృద్ధి లక్షకము. జన్మ సిద్ధమైన శక్తిచతురతలు కొదవైన అసంఖ్య సామాన్యజనుల నుద్దేశించి దేశకాలపాత్రములన్న స్ఫురణకు చోటిచ్చిన బోధ. అంతే.

పుట్టుకచేరాని నేర్పులు సాధనమున సంపాదింపవలెను. కళాప్రతిభ జన్మ సిద్ధము. గాయకుని కంఠ మాధుర్యము పుట్టకతో వచ్చినది. కాని సాధనచేతనే రాగ విన్యాసము — అనగ ననగ రాగ మతిశయించుచునుండును. అభ్యాసముచే కళలందేని సాధింపగలదున్నది. చేదైన వేముకూడ తినఁగా తినఁగా తియ్యనన్నట్లగును. సాధన మున పని నేర్పులు, పట్టుదలచేత కార్యములును సాధించవలెను. పట్టుదల ఆవశ్యకము. పట్టుబట్టుముందు విచక్షణ మెండుగా నుండవలెను. "పట్టరానిపట్టు పట్టియుండినవాడు పుడమిలోన కీర్తి బొందలేడు." ఏ విషయమున పట్టుదల పట్టవలసినదియు నిర్ణయించు కొనుటలోనేగాదు విచక్షణ. పరిస్థితులు సాకల్యము అవలోడించు కొనవలెను. "ఎదుటి తన బలంబులెంచుకో నేరక ఢీకొనియె చలంబు దీర్పనేని ఎలుగు దివిటి పేవకేర్పడు చందమౌ" ను. అనువగుట, కాకపోవుటయు నుండును. ఆధిక్యము లెల్లచోట్లను చెల్లవు. చెల్లనిచో తగ్గి వర్తించ గలుగవలెను. న్యూనతను కూడ తలదాల్పగల్గవలెను. కొండ అద్దమందు కొంచెమై యుండును గదా; స్థానము ఆస్థానమునని యుండును. స్థానబలము ఇంతంతగాదు. ఎఱిఁగి వర్తించ వలెను. నెలవు దప్పుచోట నేర్పులు కొఱగావు. నీటిలోన మొసలి నిగిడి ఏనుగును లాగును. అట్లే సమయాసమయ వివేకము ప్రధానము. వేగిరించిన విషమించును. ఆలసించిన తప్పిచనును. సమయమునినే తలపెట్టిన నెఱవేరును. దిద్దవలసిన దాదిలోనే దిద్దవలెను. చెట్టు ముదిరిన చిదిమినబోదు. నిజమాడవలెను. "నిజము దెలియనైన. పరులకొఱకు దావగూడ, దింకనోపదన్యము పల్కు", కాని అయినవాని ముందు కానివాని ముందును పల్కవలెననిలేదు. "నిజమునాడువాని నిందించు జగమెల్ల, నిజమునాడరాదు నీచుతోడ నిజమునాడవలెను నిర్మత్సరుని జేరి" — పాత్రమెఱిఁగి పల్కవలసిన వానియొద్దనే నిజమాడుము. ఎవరు పల్కరేని ఏ పట్ల వినయంబు వినగవలయు నరుడు వేగపడక — వినుటనీతి, విని విచారము సలిపిన నిజము తేటపడును. నిజము తెలియుమీద నీతిపరుడగును. పెద్దవారాడిన మాటయని పాటి చేయకుము. పిన్నవాని మాటయని పెడచెవి బెట్టకుము. అంకిలెఱిఁగి

మాటాడుటనే మన్నింపుము. పదుగురాడినవే పాటియై చెల్లుట నిజమే ఒక్కడాడిన దెక్కకుండుటయు ధ్రువమే. అంత మాత్రాన నీ మాట, నీ విశ్వాసమును వదలుకొనకుము. కాకున్న మిన్నకుండుట నయము.

జీవమునెడ నతనికి ఆరాధనా భావమున్నది. జీవి జీవి జంపి జీవింతునను కంటె — చెట్టయెందు కూడ బుట్టబోదు అన్నదతని మాట. కాని మానవ సమాజములో హత్యలకు హంతకులకు కొదువలేదు. యోజించినాడు :

"హత్య జేయగూడ దదియెందులకునైన హత్యజేయువాడు అధముఁడౌను
హత్యసేయువానికాజ్ఞ యేమనవచ్చు . . " (4955 నేదునూరి ప్రతి)

చంపరాదని చంపవచ్చునా ? అది స్వవచన వ్యాఘాతమగును. సరే కాని హంతకునినేమి చేయవలెను మరి ? వేమన కది ప్రశ్నగనే — సమాధానము లేని ప్రశ్నముగనే మిగిలినదేమో ! నాగార్జునులు శాతవాహనులకు మరణశిక్ష రద్దు చేసి దేశ బహిష్కారమే శిక్షచేయుమని బోధించినారు. అది కూడ పూర్ణ పరిష్కారము కాదనుకోవచ్చును. మరణదండన రద్దు చేయవలెనని సంస్కారకు లెందరో చెప్పిన వారే. వారే రాజ్యాధికారము వహించిన సందర్భమేర్పడి మరణదండన తీసివేయుట కుదరకపోయినది. నేరగానిని సంస్కరింపవలెనన్న యత్నము బహుముఖముగా సాగినది. సాగుచున్నది. సంస్కరింప సాధ్యముగాని వారుదేలినారు. దండసాధ్యులేగాని ధర్మసాధ్యులు గారన్న వారున్నారు. వేమనయే అదెఱుఁగును.

"దూరదృష్ట గనరు తూగినదనుకను, పొట్టపొట్టెఱుఁగరు పడినదనుక
దండసాధ్యులరయ ధర్మసాధ్యులుగారు . ...." (2976 నేదునూరి ప్రతి)

నీతిబోధ కొందఱయందే పనిచేయునుగాని అందఱపట్లను గాదని అతఁడెఱుఁగును.

"పొట్లకాయ రాయి పొదిగి త్రాటను గట్ట లీలతోడ వంకలేక పెరుగు
కుక్కతోక గట్ట కుదురునా చక్కగా .........."(3287 నేదునూరి ప్రతి)

కొందఱకు దండము నంగీకరించినాడు. అంతేగాక,

"పది యసంగతములు పదిసార్లు చేసిన తప్పుత్రోవ ద్రొక్క దార్ఢ్యమొదవు
కూడదేల యట్టి కుదిరిక మంచికి ........ " (2976 నేదునూరి ప్రతి)

యనియునరసి, నీతి యన్నది కేవలము బోధలేక కొదువైనదిగాదు, అన్నింటికన్ననది ఆచరణ సమస్యయని దేల్చినాడన్నమాట. నీతికి నిలబడుట కెక్కువ శ్రద్ధ, దీక్ష, దార్ఢ్యముకావలెనని తేల్చినాడు.

# అతని విమర్శకులు

అతనిబోధనతో ఏకీభావము లేకుండుటేగాక, అతని బోధక ప్రతిపత్తినే ప్రశ్నించువారై అతని గూర్చి వ్రాసిన వారిలో నిజముగా రసజ్ఞులు రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారు. వేమన్నను ఒక గొప్ప సంస్కారకునిగను, స్వతంత్ర విచార కుశలునిగను "మనము" గుర్తింపమన్నారు వారు. వేమన పామరుల పాలిప్రవక్త యన్నదియు వారే. అంతగా దృష్టిభేదము గల శర్మగారు వేమన కవితను కళ్ళకద్దుకొని అతనికి కవితా పట్టము గట్టినవారైనారు. తెనుఁగు సాహితీ లోకమున వారు వేమనకు వేసిన పీట పీఠమై కాలక్రమమున స్థిరపడగా, ప్రవక్తగనో, సంస్కారకునిగనో, బోధకునిగనో, స్వతంత్ర విచారకుశలునిగనో వారియ్యలేమనుకొన్న స్థానము తెలుఁగు విద్యాధికుల హృదయపీఠములపై సమకూరి స్థిరపడినది. కాని శర్మగారు వేమనలో ప్రేలెత్తి చూపిన లోపములు, బోధకతకు బాధకములు, ఎట్టివి? వేమన గెలుపుగొన్నంత మాత్రమున అతని బోధ నిర్దోష మనరాదు. గెలుపు నిజమునకు గీటురాయిగాదు. మానవ వ్యవహారమున అసలేకాదు. కావున వారు చూపిన దోషములు విచారణ చేయవలసినవి.

అతడు 'ముంగోపి'. 'ఉద్రిక్త స్వభావుడు'. ఇతరుల తప్పులనుగని యసహ్యపడఁగలఁడేగాని వారి యందలి గుణములను గమనింపలేడు. తనకిష్టము కాని పనులు చేయువారిని, తన మాటలు విననివారిని జూచి, వారి యజ్ఞానమున కయ్యోపాపమనుటకు బదులు ఇతని కసహ్యము జనించును. ఆ అసహ్యము మనసులో నుండక నోటి నుండియు నసహ్యముగానే పలుమాఱు వెడలును. అట్టి సందర్భములలో తానాడు మాటలలో యుక్తియున్నదా, లేదా, యని కూడ విచారింపడు. నిదానముగా జనులను దగ్గఱకు పిలచి పదిమాఱులు వారికిఁ జెప్పి బోధించు నోర్పుగాని పాండిత్యముగాని కలవాఁడుకాఁడు. తనమాటలను తిరస్కరించినవారిని తెలుపరాని ముప్పె, మూర్ఖుడు అని తిట్టును. అతనిలో మూర్ఖనింద మెండు. అది ఎల్లరకు బోధింప దగ్గశక్తి, నేర్పు లేని స్థితి యది.

ఈ విమర్శ ముప్పాతిక మువ్వీసము పొరపాటు. ఈ దేశమున పూర్వ బోధకుల బోధనా విధానములతో బేరీజు వేసి వెడలినది గాదు. మత బోధకుల అసహన బుద్ధి యింతింతగాదు. భర్తృహరి సుభాషితములున్నవి. అతఁడిట్టి మత బోధకుఁడు గాడు. కాని అతడెత్తుకొన్నదే మూర్ఖపద్ధతి వర్ణనము — నిరసనము. మనుష్యులను మూర్ఖులుగను విద్వత్పురుషులుగను రెండుగా చీల్చినాడు. "తివిరి

యిసుమున తైలంబు దీయవచ్చు దవిలి మృగతృష్ణలో నీరుద్రావవచ్చుఁ దిరిగి కుందేటికొమ్ము సాధింపవచ్చుఁ, జేరి మూర్ఖుని మనసు రంజింపరాదు" ఇత్యాదిగా అబోద్ధవ్యులుగా మూఢులను భర్తృహరి దేల్చినాడు. అతనికి ఓర్పు నేర్పు పాండిత్యము చాలకయే మూర్ఖపద్ధతితో బోధనారంభించి నాడందుమా ? అన్నారా ?

"ఎద్దుకైనగాని యేడాఁడెల్పిన మాట దెలిసి నడచు మర్మమెఱిఁగి
ముప్పె దెలియలేడు ముప్పదేండ్లకునైన ...... .. "

అన్నంతకు వేమనను ఓరిమి, నేరిమి, యుక్తి చాలనివానిగా దేల్చుచున్నారు. ద్వంద్వ ప్రమాణములు కూడవు అన్నచో భర్తృహరినైన అంతే యందు మన వచ్చును. అనరాదనియే చెప్పవచ్చినది. ఈ దేశముననేగాదు, ఎక్కడను ప్రవక్త మూర్ఖ నింద గావించినవాడే. తన మతమునకు మారని వానిని పాషాండుడని, కాఫిర్ అని, హెరిటిక్ అని, తీర్థికుడని పేర్లు పెట్టి అసహ్యాభావము అసహన భావము కన బరచినవాడే. క్రీస్తు మృదుభాషియని పేరు. ఒకచెంప గొట్టిన వేరొక చెంప జూపు మన్నవాడు; శత్రువును ప్రేమించుమన్నవాడు. కాని, జెరూసలేము ప్రవేశించి ఫారిశీలను ప్రేమమయ మృదు సంబోధనము చేయగలిగినాడా ? నూతన నిబంధనము మాత్యూ వ్రాసిన 22,23 అధ్యాయముల నిండ ఫారసీల నాడిన దుర్భాషలు, శాపనార్థములే గదా ! Woe unto you, ye blind guides. ye fools and blind, ye serpents, ye generation of vipers అన్న తిట్లేగదా ! Woe unto you scribes, pharisees, hypocrites అన్నది "విశ్వదాభిరామ వినుర వేమ" వలె ఆ అధ్యాయమున మకుటముగా ఆవృత్తమైనది గదా ! The fool has saith in his heart, "there is no god" — దేవుడు లేడన్నవాడు మూర్ఖుఁడని మాటదూలకున్నారా? మూర్ఖనింద – ఎదుటివానిని, అందున విననివానిని మూర్ఖుడనుట మతబోధకునికి పరిపాటి. గీత యిట్టి మూఢ నిరసనతో ఘూర్ణిల్లుచున్నదే గదా ! అందుండి చూపనేయక్కరలేదు బోధకులలో సుతిమెత్తని వాడను పేరున్న ఏసుక్రీస్తే నిలువకపోయినాడు. బోధనచేతనే ఒక్కడైన మిగులకుండ నెల్లవారిని యొప్పింపవచ్చును, మార్చవచ్చు ననుకొనుట సత్యదూరము. ఏప్రవక్తకును సాధ్యము కాలేదు. మూర్ఖునికి దెబుపలేమన్న వారే ఎల్లప్రవక్తలును. రామ కృష్ణులనలేదా ?

అతఁడు ముంగోపి, ఉద్రిక్తస్వభావుడు, పరుల తప్పుల యెడల అస హ్యామేగాని సానుభూతి లేదను మాటకును మూలము మూర్ఖనిందేగాని యితరాధా

రము చూపినదిలేదు. కోపమువలన చెఱుపు గలదని చెప్పినది తెలిసితిమి. అవి వట్టి మాటలుగాకుండ పాటించినవాడనిపించుచున్నాడు. 'గోచియూడెనంచు కోతి నట్లాడించి, వెఱ్ఱియనుచు నూరు వెడలగొట్టి'రన్న దుర్ఘటనలకు గురియైనాడు. తిరుగబడి తిట్టలేదు. 'తిట్టికొట్టిరేని తిరిగి మాటాడక యూరకున్నఁ జూడ నుర్వి మీద వాఁడగుఁ బరమాత్మ ' యని తను పడ్డ పాట్లకు ఓర్మివహించి తత్వజ్ఞుడు, ఇతఁడురా భూలోకపరమాత్ముడు అనిపించియుండినవాడు. అయిన కొట్టినవారితోగాని, వారినుండి బైటబడి యితరులతోగాని 'తనదు భార్యయెదుట తాఁ గోచి విప్పడా' యని ప్రశ్నించియుండవచ్చును. అది సముచితము యోగ్యము అయిన వాదనూ కూడ కాకపోవచ్చును. కాని అతడు వారిని బూతుసాతులు తిట్టుకొని అవతలపడ లేదు. అవతలపడి వారి నల్లరిచేయలేదు. పరుల తప్పులన్న అసహ్యమనుట యిచ్చట కనరాదు. తప్పులేనివాడు ధరలోన లేడన్న ఉదారుడతఁడు. కాని అతనికి అసహ్యమే అసలు లేదనరాదు. మోసపు మతగురువులన్న సానుభూతి లేనేలేదు సరిగదా ఉన్న దసహ్యమే. దానికేమి? అది Holy discontent. ప్రవక్త లందున్న లక్షణమే యది. అతని యుక్తులు అయుక్తములు, అతని తర్కము లోపమంతము అందురా అది వేరుమాట. దానినట్లే విచారించెదము.

ఉపవాసము తపస్సు విగ్రహపూజ — ఇవి అతని ప్రబల ఖండనకు గురియైనవి. మొదలునకంట తప్పనబడ్డవి. మొదలందు తప్పులుగావు గాని అతియైననే, మితిమీఱిననే తప్పని శర్మగారి ప్రత్యయము. అందుకని అవి "శుద్ధముగా నిష్ఫలము లని యే తెలివిగలవాడును ఇదివరకుఁ జెప్పలేదు", వేమనయే జెప్పినాడు, అది అతని తెలివితక్కువతనమునకు నిరూపణము అని శర్మగారి యభిప్రాయము. కాని ఇది అవిచారఫలము, ఆవేశఫలము అయిన వాక్యము. వేమనకు ముందెందరో దేశ దేశముల నట్లుపదేశించినవారున్నారు. మతములకు మతములే యున్నవి. జాతులకు జాతులట్లే నిలచినవి. విగ్రహపూజకు దొంకొన్నచో పతనమయ్యెదమని యనుకొని నిలిచిన జాతి ప్రపంచమున తెలివైన జాతిగా నున్నది. హిబ్రూప్రవక్తలు — తజ్జాతి అట్లే వర్తించి ఉన్నతిగన్నారు. మహమ్మదట్లే బోధించినాడు. ఇవి వెలుపలి కత లన్నచో మనయింటి మాటగా వేదములందే మూర్త్యుపాసన కానరాకపోయెనని చూప వలసివచ్చును. వైదిక దేవతలు మంత్రమాత్రమూర్తులేగాని తదధికరూపులు గారన్న మీమాంస వెలసినది చెప్పుకోవలెను. విగ్రహపూజ ఆర్షేయము వైదికము గాదన్న దయానందుని జూపుకోవలెను. భుక్తితో ముక్తికి త్రోవయే రాచబాటయని ఉప వాసమును నిషేధించిన తంత్రాచార మీ దేశము దేశమునే ఒక కాలమున నేలు

కొన్నది. తపముతో శరీరతాపన మక్కఱయేగాదన్న సహజయోగమున్నది. అది మున్నే చెప్పుకొన్నాము. శర్మగారిచ్చట సమచిత్తులు గాకపోయినారు. విచక్షణ కోల్పడినారు. వావిళ్ళవారి వేమన పద్యముల పీఠికలో వారి యాక్రోశము మరింత విశదము. వేమనను గూర్చి "ఇతని కాలముననే కలియుగము మునిగి యా జల ప్రళయములో హిందూ శబ్దమునకు సంబంధించినదంతయు నూపిరాడక నశించియుండె నేని యితనికి సంతోషముగా నుండియుండునేమో" యని వ్రాసినవారైనారు గదా!

అట్టివారు గావుననే అంత తమ పరిశోధనా గ్రంథమైన 'వేమన'లో కులభేదములు మాన్ప యత్నించినవాడన్న భావమే కలుగనీయలేదు సరిగదా బ్రాహ్మణ వ్యతిరేకి యని మాత్రము తేల్చి తేలికగా ముద్రింపమరచినవారు గారైరి. మానవ సౌభ్రాతృత్వమును నమ్మి కులము గాల్చుట కతడు జేసిన, చెప్పిన విశేషములనుగాని, ఏకపాత్రభుక్తిని కులనిర్మూలన దీక్షావిధిగా నేర్పఱచగా నెంగిలి తినఁజెప్పినవాడుగా పేరొందెననిగాని, అతడు చెప్పెనన్న ఎంగిలికిని కులము వలదనుటకును సంబంధ మున్నదనిగాని చెప్పనే చెప్పక మొత్తము మూసిపెట్టి, అతని లోపముల లెక్కలో మాత్రము ఎంగిలి సమర్థనను ఎక్కించి యూరకున్నారు. ఇట్లు గుణముదాచి, లోపమును జూపఁ దలపడి, వేదము వల్లించువారిని ఎదురడిగిన పద్యమొకటి పట్టుకొని,

"ఎంగిలెంగిలనుచు నీ నోటితోడనే వేదములను జదువు వెర్రులార!
ఎంచిచూడ నదియు నెంగిలి గాదొకో ... ..... " (733 వేదునూరిప్రతి)

యని మాట నోట వెడలుటలో నెంగిలి యున్నదనుట ఉద్రేకములో జేసిన అసహ్యమైన దుర్బలవాదమని చెప్పినారు. వేమనను గూర్చి కొండంత సత్యము నణఁచిపెట్టి, యీగకాలంత దోషమును చాటుటయందెంత కానరాని యుద్రేకము కారణమో గదా! ఉద్రేకింపకుండగనే, శాంతగంభీరవిచారఫలములుగనే యింతకన్న దుర్బలము కృతకము అసహ్యము గూడనైన వాదము, భాష్యవిన్యాసము జగద్గురువులందున్నది. ఉదాహరణ మియ్యవలెనన్న, వేదాధ్యయనాధికారము శూద్రులకు లేదని చెప్పుటకు — ఆవశ్యకము గాకుండగనే — బ్రహ్మసూత్ర భాష్యమున అపశూద్రాధికరణము నేర్పఱచి చేసిన భాష్యవ్యాయామమున్నది; కష్టపడి కట్టిన యుక్తుల అయుక్తతయే యున్నది. అవి క్షమ్యములై ఇవి క్షమ్యములు కావా? కులము గూల్ప జెప్పిన సంస్కరణమును ప్రకటింపని శర్మగారు స్త్రీలయెడ వేమన అసంస్కారకత్వమును స్థాపింప నుత్సహించినారు. ఎంగిలి సంగతి నొకింత పరీక్షింపవలెను.

వలదని ఎంత బోధించినను ఎంగిలి ఆగక సాగను గలదు; వలెనని ఎంతగా వాదించినను సాగనే సాగకుండను గలదు; ఎంగిలి సందర్భమే యంత.

తల్లిదండ్రుల కంచములలో పిల్లపాపలు కలియబడి తినుచున్నది. స్త్రీ పురుష చుంబన వ్యాపారముండనే యున్నది. అదంతయు ఎంగిలే. ఎంగిలి ఇష్టచర్య: ఇష్టమునకది సహజ సంకేతము; ఇష్టమోహముల పర్యవసానము ఎంగిలి. ఇంతయు వేమన తీర్మానమే. ఈ సన్నివేశములందు ఎంగిలి సాంక్రామిక రోగముల కెడ మిచ్చునని యెచ్చరించినను ఆగదు. పెండ్లిపీటల నుండి లేచిన వెంటనే వరుడు తిని మిగిల్చిన పెరుగన్నమును వధువుచే దినిపించుట యిప్పటికిని వివాహ విధిలో భాగము. మగడు తిన్న విస్తరిలో కంచములో మగనాలల్లే వడ్డించుకొని తిను సంప్రదాయము వెనుకటికి మెండు. ఇట్లు కుటుంబము, దాంపత్యము ఎంగిలికి స్థానము. ఆ వెలుపల అయ్యవారల యెంగిళ్ళు శిష్యకోటికిఁ దినజెప్పిన వైన ముండనేయున్నది. భక్తిముదిరి, శబరి ఎంగిలివిందు శ్రీరామచంద్రభగవానుఁ డారగించినట్లుగా వాల్మీకి చెప్పని సంగతులు నడుమగా వైష్ణవము కల్పించి పరవ శించినది. ఆమీద తురకల విందులు — అంటుసొంటులు లేని కలిమిడితిండి యది: ఉమ్మడి కుడుపు. విందులో వారు తినుతీరు హిందువుల దృష్టికి యెంగిలి కొకింత చేరువగాఁ దోచి నాటికి తఱచైన దృశ్యము. ఇది పూర్వరంగముగా వేమన విజృం భించినాడు. ఎల్లరొక్క కులమని, ఒక్క కుటుంబమని యొప్పినందుకు సంకేత విధిగా ఏకపాత్ర భుక్తి నేర్పఱచినాడని ముందే జూచినాము గదా! పూర్వ సంస్కర్తలు పెట్టిన చాపకూడు, దొడ్డికూడుకన్న విశేషముగా ఒక్క కంచపు కుడుపన్నది చెప్పినాడు. కులభేదమును గాదని మానవులెల్లరు సమానులుగా మెలఁగుటకు, కుటుంబమందో, దాంపత్యమందో కలుగు నిష్టమోహములు ఏర్పడ నక్కఱలేదు. ఎంగిలి ఏవగింత కానంత వ్యక్తిగతమైన యిష్టానుబంధము కులము విడుపవ కక్కరలేదు. అంటు పాటింపకుండుపాటి గణ్యత చాలును. వసుధైక కుటుంబమనఁగా కేవలకుటుంబముగనే జేసి వేమన ఒక్క కంచపుఁదిండిఁ దెచ్చి పెట్టినాడు. దాని నెంగిలితిండి యని బ్రాహ్మణులు చెలరేగినారు. అయిన నేమాయె, ఎంగిలిగాని దేమున్నదని వేమన ఎదురడిగినాడు. తన బోధ నభిమానించినవారికే యది సమ్మతము గాలేదని వేమనకే తెలిసినది. "ఎంగిలంతవట్టు హితవుగా నెంచక యొగ్గియుందురంత నుర్విజనులు" — అయినను విడువక 'కన్న ఎంగిలికిని కను లెంగిలధికమౌ' (731 నేదునూరి ప్రతి) నని కానుపులో నెంగిలి, కనుచూపులో నెంగిలి యున్నదిగదా యని నచ్చజెప్ప జూచినాడు. జనాదరణ పొందలేదుగాని, కొన్ని వేదాంత కూటములలో వేమన ఎంగిలి సిద్ధాంతము కూనరాగము తీయు చుండినది. 'ఎంగిలన్నా వారు వేదాంతులై యుంటె జగమంత ఎవరెంగిలి' యన్న

పాట వచ్చినది. గురుని ఎంగిలి శిష్యులకనిగాక, గురుశిష్యులు పరస్పరము ఎంగిలి పాటింపని పాటగా తెలుఁగునాఁట నిప్పటికిని యిది వినవచ్చు సంప్రదాయమైనది.

అతఁడుగాదు, ఏయితరుఁడును బిత్తలియై తిరుగుట కొప్పము. ఏవగించు కొందుము. తొలఁగి పోదుము. లేక తొలగింతుము. కాని వేమన్న,

తల్లిగర్భమందు తాఁబుట్టినప్పుడు మొదలబట్టలేదు తుదనులేదు
నడుమబట్టగట్ట నగుబాటు గాదొకో ........."

యనఁగా చదివి నవ్వుకొందుము. చమత్కారమని వినోదింతుము; కవితగా ననుభవింతుము. కాని, శర్మగారికి 'అసహ్యము' కలిగినది. కంటగించుకొని వారు "యోగవిద్య, కవిత్వము తల్లి గర్భమునఁ బుట్టినప్పుడే వేమన్నకు వచ్చినవా? ఏమియుక్తి!" యని విమర్శించినారు. వస్త్రముక్తి జెప్పిన ఎల్లసంప్రదాయములను యీ యుక్తిలేదు. వేమన దిసమొలకది మూలమునుగాదు. ఇంద్రియజయము, ప్రపంచజయము సాధించినదానికది చరమసంకేతము. కాని ఇదేమిరాయన్న వారిపై చమత్కారముగా అద్వైతయుక్తి నిట్లు కుప్పించి వాకట్టియుండును. 'ఆదావన్తే చ యన్నాస్తివర్తమానేఽపి తత్తథా' యని గౌడపాదుల మాండూక్యకారిక. మధ్య గనునది మిథ్యయని శాంకరుల పల్లవి. ఆ యుక్తి చొప్పున సంసారగతులను గూడ దిసమొల జేసుకోమని చెప్పవచ్చును. వేమన సంఘమున కట్లు చెప్పలేదు. సంఘధర్మములను సంఘమునకు సంస్కరించి చెప్పినాడు. ప్రతివ్యక్తికి మానాభి మానములు లోపము గానీయని మధ్యమతరగతి ఆర్థిక ప్రతిపత్తు నిర్దేశించి, 'గోచిపాతకంటె కొంచెంబుమరిలేదు' అను సాంఘిక ఆర్థిక బోధ కావించినాడు. అదేదో తొలుత జెప్పి తుదకు వదలుకొన్నదిగాదు. వదులుకోనక్కఱలేదు. వేమనకు వేదాంతము ముదరగా సంఘచేతన యంతరించినదికాదు. సంఘచింతవీడి వ్యక్తిముక్తి నన్వేషింప దప్పునిసరిచేయు తత్త్వములో నతడు నిలకడగనలేదు సంసార నిర్వాణములొక్కటే, మాయలనేముక్తి గలుగు, మంటిలోని సుఖము మంటిలో గనవలెనన్న తత్త్వముగదా అతవి కడమాట. అందుచే నతడసలు మరల బట్ట గట్టెనన్నను తత్వమును బట్టి తప్పులేదు. అతని సంఘ చేతనకు, నీతికి మరింత బలకరము. కటారుపల్లె తుంగవేమన్నను ఈ వేమనలో గలిపి, అతని అనుచరుల పసుపు బట్టలను — కాషాయములుగావు — వేమన ధరించెనని వ్రాయగలవారు వ్రాయనే వ్రాసినారు. ఈ విషయమంచసలు వేమన్న కవియన్న సత్యము ఏమఱరానిది. తార్కికుల యుక్తిగా భాసించవచ్చునుగాని ఇది కవితా దృష్టాంతము. అట్లే ద్రష్టవ్యము, ఆస్వాద్యము. తత్వమును కవితామయముగా

జెప్పిన రీతి యిది. దానిని యుక్తిగాగాని ఎబ్బెటికము చేయుట సత్యమునకు రసజ్ఞతకుని హాని.

## స్త్రీయెడ సంస్కర్త గాకపోయెను

అతడందుకొన్న హేతువాదమునకు ఆర్థిక సాంఘిక, సంస్కరణమునకు, భావవిప్లవమునకు తగిన, తూగిన భావపరిణతి స్త్రీ విషయమున వేమనలో ప్రచురము గాలేదు. పాశ్చాత్యుడైన W. H. Campbell మొదలుగా మనలో అతని సంస్కారకత నంగీకరించువారు, అంగీకరింపనివారు అందరు ఏకీభవించి వ్రేలెత్తి చూపిన లోపము : స్త్రీయెడ నతఁడు సంప్రదాయబద్ధుఁడని.. అందుకా పాశ్చాత్యుడు కారణము వెదకు బాధ్యత వహించి, సత్యము గాకపోవచ్చును గాని అతని సంస్కారకతకు స్త్రీల వైముఖ్యమే అతనిచే నట్లనిపించినదని చెప్పి క్షంతవ్యుని జేసినాడు. మనవారుమాత్ర మాతనిని మన్నింపలేమన్నారు. అదే చూడవలసినది.

స్త్రీ తల్లిగా అతని ఆరాధనకు గొప్పగా పాత్రమైనది. స్త్రీ సంతానముగా మగసంతు సమముగా క్రమముగా నతని గణుతి గొన్నది.

"కొడుకుకలిగెనేని గునిసియాడగబోరు, కూతురొకతెపుట్ట గునియుచుంద్రు,
తనకు కొమరుడైన తనవెల్ల దోచునో .. ... "(1479 నేదునూరిప్రతి)

యన్నాడు. స్త్రీ గుణవతియగు సతిగా అతనికి దేవార్చనగృహములో దేవిగా దీపించినది.

"గుణవతియగుయువతి గుటిపక్కగానుండు చీకటింట దివ్వె చెలగుఁరీతి,
దేవియున్న యిల్లు దేవార్చన గృహంబు" (1608)

అన్నవాతని పంక్తులు. కాని స్త్రీ గుణవతి యగుట అరుదన్నదే అతనికి బట్టిన పెద్ద యనుమానము. ఆడుదనఁగ బొంకు, స్త్రీల నేర్పులు భువి చీకురాయితపము, నింగి పక్షులెగయు బాట కాన రానట్లే ఆడువారి నడత ఆనవాలు దొరకనిదని ఇంకనేమేమో ఇల్లాండ్రగూర్చి వెల్లువగొన్న అసంతృప్తి గుప్పించి పద్యములెక్కువ చెప్పినాడు. గృహజీవితములో అతని విలువలత్రాసులో ఆలుకన్న అన్నదమ్ములు, అంతకన్న తల్లి తూగినది.

"ఆలిమాట వినుచు అన్నదమ్ముల రోసి వేఱుపడెడువాఁడు వెఱ్ఱివాఁడు"
(376)

"తల్లియేడ్వ వినక తనయాలు వగచిన జాలిపడెడువాడు జడుడు సుమ్ము"
(2319)

అన్నాడు.

"స్త్రీలుగల్గుచోట చెర్లాటములుగల్గు, స్త్రీలులేనిచోట్లు చిన్నవోవు,
స్త్రీల చేత నరులు చిక్కుదున్నారయా ..........."

యని తప్పనిసరి చెడుగుగా స్త్రీని గైకొన్నాడు.

"పెరటిఁజెట్టు బెట్టి పరికింపకుండిన వెలుగుదాటి తీవ వెడలబారు
నాడుదాని గుణము నటువలె నుండురా..........." (3271)

యని కాపురమనఁగా కాపుదల యన్నాడు.

నాడు ఈడుజోడుగాని దాంపత్యములు దండిగా నున్నవి; శుల్కవిపణిత వధువులే వధువులు — ఓఁమాలునాలు ఓలిమాడలచేటు అని చాటూక్తి లోకోక్తిగా జెప్పు స్థితి. స్వతంత్రలుగాక ఇష్టప్రసక్తిలేని పెండ్లిండ్లకు గురియయిన స్త్రీలు ప్రక్కపుంతలు ద్రొక్కవలసివచ్చి నేర్చిన నేర్పులు, బొంకులు, ఇతరములు వారిలో మెండుకొన్నవి. రోత గలిగించినవి. ఉన్నమాటన్నాఁడు. జారపురుషులను తిట్టినాడు. జారిణిపై గొన్నరోత జారునిపై జూపలేదు. ఇప్పటికిని లోకమంతేగదా! కాని అతని సున్నితమైన పురుషాభిమానమే పెండ్లియందు స్త్రీ విషయమున సంస్కరణము జెప్పించినది. కన్యాశుల్కమున కతఁడు విరోధియేగదా! వయోధికులు యువతులను వివాహమాడరాదన్నాడు. అంతకన్న, ఒప్పులేని పెండ్లి ఒనరఁజేయఁగ రాదని ఆజ్ఞ జేసినాఁడు. మనుగుడుపులకు ముందే వలపులొనగూడెనేని ఆ దాంపత్యము వృక్షమై విస్తరించును; అనలుననలుసాగును; విరియగాయును అన్నాడు. అట్టిచో,

"తగిన కులజుఁడైన తలయెత్తు ధనమైన, భాగ్యపురుషునేలపట్టనెంచు,
పరమసాధ్వి చూడ పరుల నంటదు సుమీ ....... . "

యన్న స్థితి నరసినాడు.

అది అట్లుండగా, 'పాపమంతగూడి పడఁతిగాఁ బుట్టిన కష్టమా సతిదని కనువారు లేరయా' (3212) యని స్త్రీజాతిని గూర్చి జాలిజెందినాడు. 'పురుష భాగ్యమునను పుణ్యవతి లభించు పుణ్యవతికి నట్టె పురుషుఁడబ్బు' (3222) అని శీలము ఇరువాగులందు తక్కువే; అది దంపతులిరువురందుకుదురుట భాగ్యము అన్నాడు. మరికొంత పరిశీలించి, 'తరుణి పుణ్యవతిగ వరునిబట్టియె యౌను, పాపియగును వరుని బట్టియె యిల' (2245) అని కూడ స్త్రీ పక్షస్థుఁడై ఒక పాక్షిక సత్యమును పల్కినాడు. కడకొకనాటికి, 'ఆలనఁగా ఆత్మసుమీ, ఆలనఁగా నమ్మ సుమ్మ' (367) అన్నంత పరిణతి నతఁడొందినాడు.

ఇట్టిదంతయు ఆరా గొనక, ఆడువారిని 'అయ్యోపాప' మనలేదని రాళ్ళపల్లివారు వ్రాయుట అనుచితము. స్త్రీ యెడల ఔదార్యబుద్ధియే అతనిలో కొరవడిన దన్నమాట నిలువదు. స్త్రీపురుష సమానత్వము, స్త్రీల స్వత్వములు, స్వాతంత్ర్యము నతడు చెప్పలేదు. నిజమే. అతని భావ విప్లవ నైశిత్యము అతని నింతకు గొనిరాదగ్గదే.

"ప్రజయొనర్చుచెడుగు ప్రభునకువచ్చును ప్రభువుమంచియందు ప్రజకుసగము
ప్రభువొనర్చు చెడుగు ప్రజలకు రాదురా ... .... .."
"సతియొనర్చుచెడుగు పతికవశ్యమువచ్చు, పతియొనర్చుమంచి సతికి సగము
పతియొనర్చు చెడుగు సతికేల రాదురా . ... ...."

అతనిలో విరోధము పరిణామ సంకేతము. కాదన్నచో అంత స్వవచన వ్యాఘాతకుఁడు మరొకడుండడు. పాలితపాలక సంబంధముకన్న దాంపత్య సంబంధము వేరన్నది ఉద్దిష్టార్థము గాకున్నచో ప్రభువొనర్చు చెడుగు ప్రజలకు రాదనుచు, పతియొనర్చు చెడుగు సతికేలరాదురా యని ప్రశ్నము లేవనెత్తు కలుగదు. మగని చెడుగును దిద్దగల స్వత్వము, విధి సతికి నిరాకరించి యొకప్రక్కన వేరొక ప్రక్కన పతిచెడుగులో సతికి పాలు పంచిన ఫలమేమి ? కావున వేమన దాంపత్య సంబంధము సమూలవిచారమునకే యీ ప్రశ్న లేవనెత్తినాడనుట న్యాయము. కాని, అతడిట్లు గర్భితముగనే మిగిలిపోయినాడు. స్పష్టమైన తీర్మానము వెలువరచి ప్రకటించినట్లు కానరాలేదు. అతడు స్త్రీ స్వాతంత్ర్య భావ నిర్మాత కాలేదు. ఆమాటకు వచ్చిన, ఈ దేశమున పాశ్చాత్య సంసర్గమునకు పూర్వము స్త్రీ పురుష సమానత్వము జెప్పిన సంస్కర్త లెవ్వరున్నారు ? స్త్రీ ని గౌరవించవలెనన్నదే గొప్ప. బుద్ధుడు కూడ స్త్రీ ని పురుషప్రాణి సమముగా చూడలేదు. సంఘ ప్రవేశమామెకియ్య సచ్చగింపలేదు. పినతల్లి నాయకత్వమున స్త్రీలే తలలు బోడలు గావించుకొనివచ్చు, మోడివేసుకోగా శిష్యుని సిఫారసు మీద ప్రవేశము ననుమతించినాడు. అప్పటికిని సంఘమున భిక్షుణికి స్వత్వభేదముండనేయున్నది. భిక్షుణీ వినయమువేరు. భేదమింతంతగాదు. వివరణము సందర్భమును మీరిపోవును. వేశ్యలను నిర్మించిన ఆధ్యాత్మిక మతములున్నవిగాని, స్త్రీ పురుష సమానత్వమును చెప్పిన మతములు లేవు. స్త్రీ ని గౌరవించుటలో చెప్పదగినది వామాచార తంత్రము. చరిత్రలో వామాచారతంత్రమునకు బహుకాల స్థావరమైన వంగదేశములో బహిరంగణమున స్త్రీలకు చూపు గౌరవము ఈ దేశమున వేరొకచోట లేదు. వామాచార విరోధము, పురుషుని పతనము జెందించు పాత్రయను స్త్రీనిరాసమును

కలిసివెడలిన భావములు. వేశ్యాసుఖమును ఇల్లాలితో సుఖమును వదలుకొని మోక్షకామియైన వేమన మోక్ష సాధనముగా వామాచారము భామాయోని పీఠమునకు మరల గొనివచ్చుచున్నందుకే మండిపడినాడు. మతము పేర, మోక్షము పేర మరల మైధునమున జిక్కించు తంత్రాచారమన్న వేమన తలమంట యింతింతగాదు. వేమననాడు తంత్రము తెలుఁగునాట విరివిగానున్నది. మత్స్యము, మాంసము, మద్యము, ముద్ర, మైధునములన్న పంచమకారములు మలసికొని పులికంపుగొట్టుచున్న తంత్రము సర్వమత శాఖోపశాఖలందును కానవచ్చినది.

"తంత్రవాదులెన్నఁ దఱచుగా నుందురు మంత్రవాదులరయ మహినిలేరు
జంత్రగానిబొమ్మ చందంబులాయెరా...... ...."(2 03 నేదునూరి ప్రతి)

తంత్రవిషయమున వేమన వైష్ణవనింద మెండుగా సాగినది.

ఎంబెరు మతమంచు నెసఁగ మాంసముదిని మారుపేరుబెట్టి మధువుద్రావి
వావిసరుస దప్పి వర్తించి చెడుదురు.... ......"(770 నేదునూరి ప్రతి)

"రంగధామమునకు హంగుగాఁదానేగి కల్లుకంపు సొంపు గలిగియుండు
నరయలోకనాధు నలమట జేయును... ... ...." (877 బ్రౌను)

"మద్యమాంసరుచులమాదిగ దైవాల ఎంగిలిదిను వారిదెట్టికులము
భక్తిని హరుఁగొల్చి భవ్యులు గారైరి.... ...."(3644 నేదునూరిప్రతి)

ఒక్క వైష్ణవమే వామాచారముగాదు. శాక్తమున్నది. యజ్ఞయాగాదులు జేయు వైదికము తంత్రమయమైనది. అద్వైతములో గూడ నదిప్రవేశించినట్లున్నది. తెలుఁగు నాటి బ్రాహ్మణ్యము నాడట్లున్నది.

"శాక్తమతము చేత జగతిలోపలివారు శక్తిదైవమనుచు యుక్తిలేక
శ్వపచవంశసేవ చక్కంగ జేతురు . . .. ...."(1034 బ్రౌను)

"శక్తిమహిమనోకి చెడిరయా పురుషులు ముక్తిమహిమెఱుఁగని మూఢులగుచు
ఆదిశక్తి గూడ నన్యాయమైపోయె .. ... ...." (4593 నేదునూరి ప్రతి)

"క్రతువు జేసెదమని కడువిర్రవీగుచు. కచ్చగడుగు నెయ్యికడుపునించు
అంకుకొడుకులన్న రంగానమెత్తురో... ... ...." (868 బ్రౌను)

"యోనికడుగునీటి నొనరంగ ద్రావుచు బ్రహ్మశ్రేష్ఠలమని పలుకనేల?
సిగ్గులేదుగాక సీమలో ద్విజులకు.... ... ...."(4086, నేదునూరిప్రతి)

ఒడలు గఱపొడిపించు నసహ్య చర్యలతో గూడిన తంత్రాచార విశ్వరూపమునిట్లు విస్తరించిన వేమన,

"తల్లి వలన బుట్టి తల్లి చన్నుగుడిచి తల్లితోడ జాణతనములాడి
తల్లినాలనియెడు తత్త్వమేమందునో..........." (344 బ్రౌను)

అని వాపోయినాడు. ఈ అసహ్యమైన 'భామాచారమే' నిత్యజీవితములో స్త్రీ వంచనము, తాడనపీడనలు సిద్ధికి భంగకరములని, తాడనమనఁగా పూవుచే గొట్టుటయేని కూడ దనియు జెప్పినది. స్త్రీ సిద్ధికి మూలమని సిద్ధాంతము. ఇంటను బైటను ప్రాపంచిక వ్యవహారమున స్త్రీ సౌఖ్యరసమును విరసముజేసికొని యోగసంప్రదాయమున నిలిచి తంత్రాచారమునకు విముఖుడుగ నిల్చిపోయిన వేమనకు స్త్రీ నిందనము స్త్రీ నిరసనము అలవడకుండునా ? స్త్రీ వ్యామోహమే తంత్రాచారము పేర ముముక్షువును పాడుచేయుచున్న దనుకొనఁడా ? పురుషుని ముక్తిగతికి స్త్రీ ఆటంకము, ఆమె మాయామోహిని యను యోగుల పడికట్టు మాటలందుకొనఁడా ? పురుషప్రకృతులనుతత్వమును జెప్పిన సాంఖ్యము ప్రకృతి స్త్రీ యని అది మాయా శక్తికియై పురుషుని, అనఁగా, ఆత్మను సంసారభ్రాంతుని జేసి జననచక్ర భ్రమణమునకు గురిచేయుచున్నదని ఆదిలో ఎప్పుడో స్త్రీని మాయావినిగా జెప్పినది. అంతేగాక, జైన, బౌద్ధ, శాక్త, శైవ, గాణాపత్య, సౌర, కాపాలికాది సర్వ మతములను లోగొన్న తంత్రాచారముపై తిరుగుబాటుగా మధ్యయుగమున భారతదేశమందంతటను అల్లుకొన్న నాథసిద్ధుని నాథమతమొకటున్నది. వేమనకు గల తత్సంబంధము ఇదివరకే ప్రస్తావింపబడినది. స్త్రీ నిందనము నతితీవ్రముగ సాగించిన మతమది. కబీరు కూడ నాథ సంప్రదాయము నుండి స్త్రీ నిందనము నేర్చుకొన్నవాడే. 'గృహజీవితమును' వదలనివాడయ్యు నాథుసిద్ధులను కఠినముగా హేళనజేయుచుండియు కబీరు, స్త్రీ పురుషుని జెరుప బుట్టినశక్తిగా తీర్మానించినాడు. స్త్రీలు పురుషుల పాలిట రాత్రులు తిరుగాడు ఆడుపెద్దపులులని పాడినాడు. దిన్‌కామోహిని రాత్‌కా బాఘ్ని అన్నాడు. తంత్రవైముఖ్యమున్న సంప్రదాయమున మెలఁగిన వేమన స్త్రీ యెడ ఔదార్యపరిణామము నొందుటకు సానుభూతి మంతుడగుటకు నెంతప్రయత్నము కావలయునో ఊహింపవచ్చును. అతడెక్కువ కాలము స్త్రీ యెడ కఠినముగా అనుమానముగా పలికినదాని కిదంతయు కారణము కాగా, ఆర్ద్రత మరల సాధించుటెంతో విశేషమని తప్పక తోచును. అతడు స్త్రీ పురుష సమానత్వము జెప్పలేకపోవుటకు హేతువును గానవచ్చును. స్త్రీ విషయమున నతడు చూపిన కాఠిన్యము విచక్షణము నిరసనమునకును అతని అనుభవ శాలిత్వము, స్వతంత్రాలోచనమునే కారణములైనవి గాని సంప్రదాయము నంధానుగమనమనరాదు. అతని తప్పిదములో నున్న యొప్పిదమిది.

# విశ్వదాభిరామ వినురవేమ

ఇంతవినసొంపైన మకుట మింకొకటి తెలుఁగులో లేదు. ఇత అర్థవైవిధ్యమున కెడమిచ్చునట్టిదికూడలేదు. కాగా, ఆ అర్థభేదము తృప్తిగా తేలలేదు. 'అపండితుని' యీ చిన్ని వాక్యమునకెన్నో యర్థములు విన్యసించి పండితులు పండితులమని నిరూపించుకొన్నారు.

1. విశ్వదుఁడనఁగా విశ్వమునిచ్చు నీశ్వరుఁడు. అతని యభిరాముడు — ఈశ్వరునికిష్టమైన వాడా, వేమా. వినుమా — వాడుకకెక్కిన యర్థమిది.
2. విశ్వదుఁడనఁగా విశ్వసంహారకుఁడు అని కూడ కల్గును. అతడు శివుడు. శివునికిష్టమైనవాడా, వేమా, వినుమా — వంగూరి సుబ్బారావుగారిచ్చినది.
3. విశ్వదుఁడు అనఁగా సమస్తమునిచ్చివేసినవాడు, త్యజించినవాడు, సన్యసించుటచేత నిష్టుడైనవాడా, వేమా, వినుము.
4. విశ్వదుఁడనఁగా సమస్తమును దానము జేసినవాడు. దాతయై యిష్టుడైనవాడా! — బండారు తమ్మయ్యగారు యీ యర్థమిచ్చినట్లే. "ఉన్న ధర్మమెల్ల నుర్విలో నరులకుఁ గొల్లబెట్టెఁ బరముగోరి వేమ" యన్నపాఠమును "ఉన్నయర్థమెల్ల" యని దిద్ది చూపించినారు.
5. విశ్వదుఁడు అనఁగా అందఱను ఖండించినవాఁడు "అందఱును తమ్ముదిట్టిన పద్యములను మఱచియో మఱుఁగు పఱచియో యితరులను తిట్టుటను మాత్రము చెప్పుకొని సంతోషింతురు. కావున నితఁడందఱకును అభిరాముడే" — రాళ్ళపల్లివారు చమత్కారముగా నిచ్చిన యర్థము.
6. విశ్వదాభిరామ — వేమన్న వేశ్య విశ్వద యను పేరిదని, దానికిష్టమైన వాడాయని నిరాధారమైన ఊహాగానము చేసి చెప్పిన యర్థము. అట్లే, యిందులోని అభిరామశబ్దము వేమన్న వంచించిన కంసాలి బత్తుని పేరని కథ పుట్టించినారు.

'విశ్వతాభిరామ వినురవేమ' యన్నదొక పాఠముండుటఁజూచి రాళ్ళపల్లివారు దానినే ముందు గ్రాహ్యమని పాటిజేసి పిదప వదలుకొన్నారు. వదలుకొనుటకొక

కారణమిచ్చినారు. "వేమన స్వచ్ఛందచారిగను, సంసారిగాను, ఉన్నప్పుడు వ్రాసినవని యూహింపవలసిన పద్యములనేకములు గలవు." గావున విశ్వతాభిరామ — తానే సమస్తమును అను అద్వైతానుభవస్థితి కలిగిన తరువాతనే యితఁడు పద్యములు వ్రాయ మొదలుపెట్టెననవచ్చునని — అది అసంగతమని, ఆ పాఠము వదలవలసిన దగును అన్నారు. అదే కారణము, విశ్వదాభిరామ యన్నదానికి జెప్పిన పై నాలుగర్థములకును ఆటంకమే యగును. స్వచ్ఛందచారిగా వేశ్యావాటము నుండి వ్రాయుచు ఈశ్వరునకిష్టుడనని, శివునకిష్టుఁడనని, త్యజించి యిష్టుడనని, దానమిచ్చి యిష్టుడనని, వ్రాసుకోగలడా ? కావున "సహజమైన యర్థము దీనికిదివరకు లభింపలేదు. ఇకముందు లభించునాశలేదు. దీని కర్థమే లేదనుకొని యింతటితో నూరకుండుట క్షేమమని" పండితులు విసుఁగుజెందినారు. కాగా, స్వచ్ఛందచారిగను సంసారిగాను సన్యాసిగను ఉన్న యన్నిదశలందును సరిపడు నర్థముగాని, యర్థములుగాని కుదిరినచో మాత్రమే సమస్య తీరినదని తలంపవచ్చునని సిద్ధించు చున్నది. అది వీలైనంత సహజముగా కూడ యుండవలెను. విశ్వదాభిరామ మకుట పరిశోధనములోని పరిస్థితియిది.

వేమన పద్యములు పరిశీలింపగా అతని కతఁడే దీనికి యర్థమును జెప్పుకొన్నట్లుగా స్ఫురించినది. రచయిత శబ్దము నేయర్థమున వాడినాడో, రచయిత దృక్పథమసలెట్టిదో తెలియుట కవకాశమతని రచనలలో కలిగినచో అదే నిజమును చెప్పును. మన యర్థములు జొనుపఁబనిలేదు. రచయితనే స్వకీయ వ్యాఖ్యాతగా జేసినదే దానికి పరిష్కారము. కనుక 'విశ్వదాభిరామ' యనఁగానేమో వేమననే చెప్పుమని విన్నవించెదము.

"విశ్వమనఁగనేమొ వివరించి చూడుఁడీ విశ్వమైదు చేత వెలయుచుండు
విశ్వము మదిలోన వెదకి వీక్షింపుడీ .........."

(1917 గోపాల్ అండ్ కో ప్రతి)

వేమనయే ప్రశ్నించుకొని, వేమనయే వివరించు చున్నట్లులేదా ? ఇంకేమి అతనినే అనుసరించుదము.

విశ్వము ఐదుచేత వెలయునది.

మదిలోనే వెదకి కానవలసినది. — వేమన దృష్టిలో విశ్వలక్షణములివి.

అయిదు అనఁగా పంచేంద్రియములు పంచభూతములు పంచతన్మాత్రలు — ఇవే వైనను గావచ్చును. అయిదుచేత వెలయునదనఁగా వీనిచేఁ బొడమినది, కూడు

కొన్నది యగును. అప్పుడు ఇవే విశ్వదములైన గావచ్చును. లేదా, వీనిచేఁ గూడిన దనఁగా — పంచతన్మాత్రలతో కూడినది, పంచభూతములతో కూడినదని యన్నవార మయ్యేదము. అప్పుడు పంచతన్మాత్రల, పంచభూతముల మయమైన విశ్వము నిచ్చునట్టిది విశ్వదము కాగలదు. హిందూవేదాంతము మనస్సు తర్వాతనే తన్మాత్రలు ఇంద్రియములు పరిణమించినవనును. అప్పుడు విశ్వదము మనస్సగును. అదికాక, ఏది ఎట్లున్నను పద్యము మూడవ పంక్తిలో వేమన విశ్వమును మనసులో వెదకి పీక్షింపుమని చెప్పనే చెప్పుచున్నాడు. విశ్వము మనసుచేఁ బడసినదని అతనిమాట — అనగా, మనసే విశ్వదమని అతని భావమని తేల్చుకోవచ్చును.

కాగా. విశ్వదాభిరామా యనఁగా పంచభూతములను సంతోషపెట్టువాడా, ఇంద్రియములను సంతోషపెట్టువాడా, శబ్దస్పర్శరూపరసగంధములను తన్మాత్రల యందే యిష్టుడైనవాడా, మనస్సును రంజించువాడా, మనసందే యిష్టుడైనవాడా యను నర్థజాతము సిద్ధించును. ఇందే యర్థమైనను వేమన వేశ్యా విశ్వవిహారియైయుండగాఁ గట్టినవని చెప్పవలసిన పద్యములకు సరిపడినదగును.

"సానిదానిపొందు సౌభాగ్యభాగ్యంబు .. ..."

"ఒడలు మదముకంపు ఓలికింతైయుండు, కారుచున్న గుడిసె చేరరాదు,
ఇంటిదానిపొందు హితవు గాదెంతయు ...... " (3౬1 బ్రౌను)

వంటి ఇంద్రియలోలుపతాదశయందు జెప్పిన పద్యము లన్నింటను యీ యర్థములు జెల్లును. కాని, ఇదే మకుటము మరొక విధముగా నతడు సంసారిగను, సన్యాసిగను నున్నప్పుడు జెప్పినవానికి సరిపడుచున్నట్లయిననే గదా మన సమస్యకు పరిష్కారము.

మనస్సును రంజించువాడా, మనసందే యిష్టుడైనవాడా యని చెప్పుకొన్న యర్థమున 'విశ్వదాభిరామ' యనఁగా 'మనోభిరామ' యన్నట్టి ఆ యర్థమునే గైకొన్నచో సానివాడలో నున్నప్పుడు, సంసారిగా నున్నప్పుడును తాను మనోమయ జీవిగను, తద్రంజకముగను, సన్యసించిన పిమ్మట ఆ మనోమయ జీవిని దిద్దుకొనుటకు, బుద్ధిగఱపుటకుగాను అట్లు సంబోధించుకొన్నట్లుగాను చెప్పుకోవచ్చును. ఉభయాశ్రమములందును సందర్భించు నర్థమగును. 'మనసా' యని సంబోధించుకొనుచు మానస బోధగా నీతిగఱపుకొనుట, నీతిగఱపుట తత్త్వముపదేశించుట తత్త్వకవితా సంప్రదాయమే గదా! విషయలౌల్యమునందు సంసారితనమందు మనోరంజకముగను, విషయ వైముఖ్యమబ్బిన తర్వాత మనోరమణమున కధిక్షేపకముగను మనోనియమనకుగాను ఒకే ప్రతిపదార్థమున దృష్టిభేదము మాత్రము చెప్పుకొన్నచో చక్కగా కుదురును. ఇదొకతీరు.

విషయ సుఖము లన్వేషించునాటి పద్యములందు మాత్రము ఇంద్రియాభిరామా యని చెప్పుకొని, సంసార సుఖమున మనోమయ జీవికి రంజకముగను. 'సంసారయోగి'గా నుడివినప్పుడు ఔపదేశకముగ 'మనోభిరామ' యను నర్థము జెప్పుకొనుచు, సన్యసించిన పిదప ఆత్మాభిరాముడవు కావైతివే యన్నట్లు మన శ్లేషకముగ 'మనోభిరామ' యని న్యూనతార్థకమున చెప్పుకోవచ్చును. ఇందే విధమున చెప్పుకొన్నను అతని జీవిత సర్వదశానుగతముగ సహజతకు సహజతయు, కవియుద్దిష్టార్థతయు సిద్ధించుచున్నదని గోచరించుచున్నది. మరి సమస్యకు పరిష్కారము లభించినదనుకొనుటకు అభ్యంతరమున్నదా?

ఆపైన మన పండితుల అర్థోత్పాదక పరిశ్రమ వ్యర్థమయిపోకుండ మధ్య మధ్య ఆయా విశేషార్థములను అదనముగా సందర్భమునుబట్టి అతడు గడచిన పరిణామదశలకు, భావపరిణామదశలకు సంగతముగా సంకేతముగా చెప్పుకొనుటకు ఆటంకమేమియు నుండదు.

"పలుకుమన్న నేల పలుకకయున్నావు, పలుకు నన్నుజూచి ప్రబలముగను
పలుకుమయ్యా నీదు పలుకు నేనెఱుఁగెదె ... . ... "

నన్నప్పుడు ఈశ్వరప్రీతిపాత్రుడా, ఈశ్వరరంజకా యను నర్థమును విశేషముగా గైకొనవచ్చును.

"అల్లుడైననేమి అన్యుడైననేమి చెప్పవలయురీతి చెప్పినాము
హరుని యాజ్ఞలేక ఆకుసల్లాడునా . . ...... "

యన్నప్పుడు 'శివప్రియుడా' యన్న యర్థమును విశేషించుకోవచ్చును.

"అరయ నాస్తియనక యడ్డుమాటాడక తట్టువడక మదిని తన్నుకొనక
తనది కాదనుకొని తాఁబెట్టినది పెట్టు ... ...... "

యన్నప్పుడు 'సమస్తమును దానముఁజేసి రంజించినవాడా' యనిచేర్చి విన్యసించుకొందము.

"సిగ్గువిడువకున్న శివసౌఖ్యమేలేదు, తగ్గిమొగ్గకున్న సిగ్గువిడదు,
సిగ్గువిడచువాడె చిరకాలజీవిరా ..... ...."

యన్నప్పుడు 'సర్వమును త్యజించుటందు యిష్టుడైనవాడా' యని విశేషించుకొందము. ఆయా జాతులను, మతములను, దేవుళ్ళను, తుదకు "వేమన కొక సొడ్డు వేసితినని చెప్పు"మని తనను ఖండించినప్పుడు రాళ్ళపల్లివారు చమత్కరించిన యర్థమును కూడ వదలక అదనముగా చెప్పుకొని సంతోషింపవచ్చును. ఈ యర్థపరిశ్రమ నింతటితో మూతవేయుఁచుట కొప్పుక మరొక విశేషార్థమును బౌద్ధమునకు సంగతముగా జెప్పుకొందము.

బౌద్ధమునకు సంగతముగా ననఁగా మరేమోగాదు. చిత్తరంజనుడా, మనోభిరతుడా, మనోభిరామా అన్న అర్థమునే తత్త్వ గంభీరముగా విశేషించుకొన్నచో బౌద్ధమునకు–అందులో విజ్ఞాన వాదమునకు–సంగతమైన యర్థము సిద్ధించును. విజ్ఞాన వాద బౌద్ధమునకు చెందిన పద్యములు కూడ వేమనయందున్నవని మున్ను కొన్నింటిని కన్గొంటిమి. అట్టివి మరిన్ని కలవు.

"మనసే లోకాలోకము, మనసే చూపించి మెచ్చు మాయలసమ్మి.... ....
యనియు, మనసుతోనే, మనసులోనే లోకమున్నదని అర్థమిచ్చుచు
"లోనుజూచువాడు లోకంబు లెఱుఁగును.... .... ...."
"లోను బయలుజేసి లోకంబు తెగటార్చి.... ...."

"లోను చూడజూడ లోకాభిరామంబు.... ...."అనియు, మనసే గారడికత్తెయై యింద్రజాలముచే లోక దృశ్యమును చూపించుచున్నదని,

"మనసే మాయామృగము.... ...."

"మనసే ఒక మాయలోడి.... "యని చెప్పు పంక్తులు, పద్యములు వేమన యందున్నవి.

పరబ్రహ్మము నాశ్రయించియుండు మాయకు బదులుగా వ్యక్తియొక్క మనస్సే జగత్తును, తద్దృశ్యమును కల్పించుచున్నదని. జగత్తు బుద్ధినిష్ఠమని కేవలము చిత్తచిత్రమని శంకరాద్వైతమునకు భిన్నముగా నెన్నడో సిద్ధాంతీకరించినది విజ్ఞాన వాద బౌద్ధము దానికే మరొకపేరు యోగాచారబౌద్ధము విశ్వము మనలోపల నున్నదని విజ్ఞానవాదులనఁగా, కాదు మనతో నిమిత్తము లేకుండ బయటనున్నదని బాహ్యార్థ వాదియైనాడు శంకరుడు

బుద్ధునిమతముగావున బౌద్ధమనుటేగాకుండ, "సర్వం బుద్ధిమయం జగత్" అని ప్రపంచించుటచేగూడ బౌద్ధమును బౌద్ధము జేసినవారు విజ్ఞానవాదులు మనస్సును వారు విజ్ఞానమన్నారు. చిత్తము, బుద్ధి, అవిద్య, ఆత్మ అన్న శబ్దములుకూడ అందులో విజ్ఞానమునకు, అనఁగా మనస్సునకు పర్యాయ పదములు. అట్టి విజ్ఞానము పరిణామమే, విలాసమే, స్పందమే విశ్వమునకు కారణము విశ్వమునకు ఆలయమై విజ్ఞానమున్నదన్నారు. ఆలయ విజ్ఞాన ప్రతిపాదకులైనారు వెలుపల వస్తువులు రూపములు లేకుండగనే, కలలోవలె తననుండి విశ్వదృశ్యమును, వస్తుప్రపంచమును మనస్సే కల్పించుచున్నదనువారు విజ్ఞానవాదులు. లోకములు (మన) లోపలనేయున్నవి–కాని వెలుపల

నున్నట్లగుపించును "యదంతర్ జ్ఞేయరూపమ్ తద్బహిర్వదవభాసతే, సోఽర్థః విజ్ఞాన రూపత్వాత్ తత్ప్రత్యయతయాపిచ"–దిఙ్నాగుడు.

కడకొకానొకప్పటికి–వేమన కించుకముందుగా–అనఁగా పదునారవ శతాబ్దాంతమున శంకరాద్వైతమున యీ విజ్ఞానవాదము బయలుదేరినది. దేశమున త్వరగా వ్యాపించినది. దృష్టిసృష్టివాదమని దానికి పేరు. ప్రకాశానందుడు దానికి కర్త. దృష్టితోనే సృష్టి. దృక్కుతోనే దృశ్యము. దృష్టముగాక సృష్టిలేదు, దృక్కే దృశ్యము.

దృక్కునకును దృశ్యమునకును

మక్కువతో భేదమెంచ మఱి లేదుసుమీ .... ....యను పద్యములో దృష్టి సృష్టివాదము పేర వేదాంతీకరించిన విజ్ఞానవాదమునే వేమన పలికించినాడు.

ఎచట జూచిన నచ్చట నేమిదోచు
నచటి దృశ్యము దృక్కుగా నంటిపట్టి
రచ్చచేయుట ముక్తికి రాజపథము
సచ్చిదానంద మపుడొప్ప జాలు వేమ .... ...."

ఇట్టి విజ్ఞానవాదబౌద్ధమును బాహాటముగా వేదాంతీకరించుకొనుటకు అయ్యేలు "యోగవాశిష్ఠము" వారు శంకరుని పరమగురువగు గౌడపాదునికించుక ముందు వెనుకల నున్నవారు. లంకలో రావణునకు బుద్ధుడు సమాధానించినట్లుగా నడచిన "లంకావతార సూత్రము" బౌద్ధమున విజ్ఞానవాద గ్రంథము కాగా, రామునకు వశిష్ఠుడు బోధించినట్లుగా నడచిన యోగవాశిష్ఠము వేదాంతమున విజ్ఞానవాదీయగ్రంథము అయినది ఈ వైదిక మహాపురుషుల సంవాదముగా చెప్పిన అవైదిక తత్త్వార్థముతో బాటు అవైదికమైన సాధనారీతులు, లోకోత్తరనా సూత్రములు కొన్నియందున్నవి. యోగవాశిష్ఠమున బౌద్ధములో వలె బాహ్యాచారనిరసనమున్నది ఉపవాస తపోయోగ సాధనలు దిగువాయి చేసి చెప్పబడినవి. సుకరము ప్రాపంచికమునైన సాధనామార్గము చూపబడియున్నది జీవన్ముక్తుడు నిష్క్రియుడై యుండరాదనుటేగాక, గీతా నిష్కామ కర్మమును దాటి పరులకుపకరించి పరుల సుఖదుఃఖములందు పాలుపంచుకోవలెనని కూడ వేమన వలె నెప్పుడో నిర్దేశించినది.

అన్నిటికన్న కొట్టవచ్చినట్లగుపించి, అత్యంతము ప్రత్యేకమై వేమనయం దున్నదే యోగవాశిష్ఠమునందున్నది పురుషప్రయత్నము ప్రతిహతమని, విధిని విధిబ్రాలును ప్రస్తుతజన్మలోని పురుషకారము జయింపగలదని, అసంగానంతటి ఇచ్ఛాస్వాతంత్ర్యము, కర్మస్వాతంత్ర్యము సంకల్పబలము మానవునకున్నవని, పూర్వజన్మకర్మనధిగమించగలంతగా నవికలవని అట్లధిగమించుటే దాని పారమ్యము, సార్థక్యమునని యోగవాశిష్ఠము సిద్ధాంతము. ఏ వైదికశాఖయందును యిట్టిపురుషకార సిద్ధాంతము మచ్చుకైన దొరకదు. ఇది బౌద్ధుల కర్మవాదమందేయున్నను ఇది అందున్న మోతాదునెంతో క్రిందుచేసినది. యోగవాశిష్ఠశాఖకిది మౌలికము స్వోపజ్ఞమునని యనుకొనవలసినట్లుగా నది ఉపన్యసించినది. వేమన ఆ ఉపన్యాసమునందుకొన్నాడు కాబోలు "బ్రహ్మవ్రాత కెదురుపల్కెడువాడొక్క వేమనయేయని" బ్రహ్మ మొదట వ్రాసిన వ్రాతను, "తప్పజేయనిపుడు తానుకర్త"యని నరునకెఱింగించి చేతకొలది గాని వ్రాంతగాదు, వ్రాంతకజుడుకర్త, చేంతకుశాంగర్త"యని మనము నివ్వెరలోమునుగ జెప్పినాడు. వాశిష్ఠమింతకన్న ముందున్నది. విధియన్నదసలొకటి(బ్రహ్మ-దైవము) లేనేలేదని తెగవేసి (వేమనచెప్పనిది) కూడ చెప్పినది. ఇంత అపురూప సిద్ధాంత మందింత సారూప్యముండగా, వేమన విశ్వదాభిరాముడైనందుకు సంగతముగా నర్థము చెప్పుకోవలదా! "విశ్వము మదిలోనవెదకి వీక్షింపుడీ" యని ఘంటాపథము చేసి చెప్పిన తర్వాత లోకములు లోపలనే యున్నవను తత్వార్థమున తప్పక చెప్పుకోవలసినదే విశ్వచిత్రకారిణియయిన ఆలయ విజ్ఞానము నంటభిరాముడా, అట్టిచిత్తమును రంజించువాడాయని ఆయా పద్య సందర్భములలో చెప్పుకోగలము

అర్థమేమాయని మనమిప్పుడు తలబ్రద్దలు గొట్టుకొన్నట్టుగా నాడుకూడ అర్థము అగమ్యమై విశ్వదాభిరామయనంగా నేమిటయ్యా, సానివాడలోను, గార్హస్థ్యములోను, కడకు సన్యాసములోను అదే"విశ్వదాభిరామ" యనుచున్నావేమిటయ్యా యని యడుగగా, "విశ్వమనంగనేమొ వివరించిచూడుడీ"యని వారిని విచారణోన్ముఖులను జేసి, రెండు అంచెలుగాగల అర్థమును చెప్పినాడు "విశ్వమైదుచేత వెలయుచుండు" నని భోగపరాయణమైన భౌమమైన భౌతికమైన అర్థమును సన్యాస పూర్వదశకుచెప్పినాడు. "విశ్వముమదిలోన వెదకి వీక్షింపుడీ"యని రెండవయర్థమును విజ్ఞాన స్కంధమును మనస్సును సూచించుచు సన్యాసమున జెప్పినాడు. అది విజ్ఞాన వాద బౌద్ధమున జెప్పినాడు. కాని అది అంతటితో ఆగదు- ఆగలేదు. బౌద్ధము మొత్తమునకు సరిపడునట్లుగను, విజ్ఞానవాదపుయమైన, విజ్ఞానవాదపయముగాని అద్వైతమునకు అనుగుణముగను-అర్థమియ్యగలదైనది అద్వైతబౌద్ధములు రెండిం

టికి సరిపడునర్థము దానియందున్నది. అది కనుగొనుటకెంతో దార్శనిక విజ్ఞానముతో బనిలేదు. మెలకువ, ఆకళింతయుగల ప్రాథమిక పరిచయమే చాలును.

జగత్తు,సంసారము మాయవలననేర్పడినవి. పరబ్రహ్మముదప్ప తక్కుంగల దంతయు మాయావిన్యాసము. అవిద్యామాయలు పర్యాయపదములు, రానురాను ప్రకృతికికూడ అవి పర్యాయములైనవి. అనగా విశ్వము మాయా విలాసము: అవిద్యా మూలము. ఇది శంకరుల వేదాంతమున ప్రథమపాఠము, ఓనమాలునుగదా! మరి విశ్వదమనంగా అవిద్యయని సామాన్యభాంతియుదే యూహి పవీలున్నది. వేదాంతము మొగమెఱుకగల వాడెవ్వడేని అవిద్య విశ్వదమని యిట్టే సులభముగా అనగలడు. మరి విశ్వదాభిరామాయనగా అవిద్యారతుడా, ప్రకృతిగతుడా, అజ్ఞానానుమోదీయను నర్థములుట్టిపడును. అందుచేతనతడు విషయలోలుడుగానుండి ఉన్నదున్నట్లు చెప్పు కొన్నట్లును– అతడు తెలిసితెలిసియే కట్టు తెగివిషయలోలుడైనాడనుటకు కావలసినంత ఆకరమున్నది. విషయములు వర్జించినమీద అవిద్యారతుడాయని తన్నుదానుతక్కువ జేసికొని మందలించుకొనుచు తనకుదాను గఱపుకొను చున్నట్లును చెప్పవచ్చును.

మనమీ యథార్థమును జెప్పుకొనుటకు స్వయముగాస్వీయార్థమిదిగో యిట్లున్న దని వేమన చెప్పుకొన్నపద్యమును– విశ్వమనంగనేమొ వివరించిచూడుడీ– యన్న దానిని కాననక్కరలేదుకూడ ఇదెంత సులభవేదాంతార్థమో అంత సులభమైన బౌద్ధా ర్థముకూడ. మాయావాదముచేతనే శంకర వేదాంతము ప్రచ్ఛన్నబౌద్ధమని పేరొందుట తేటతెల్లమయిన విషయము. బౌద్ధమునుండి శంకరులు (వారిపరమగురువులు)అవిద్యా మాయలను విశ్వదృశ్యమును అయథార్థముగా చెప్పుటకు గైకొన్నారను మాట ప్రసిద్ధము. కావున అవిద్యను (మాయను) బౌద్ధపరముగా విశ్వదమనుకొన్నచో– ఇందాక చూచినట్లుగా విజ్ఞానవాదమునకు మాత్రమే అర్థము పరిమితముగాక– అవిద్యాసూత్రము విజ్ఞానవాదమునకేకాదు– శూన్యవాదబౌద్ధమునకుకూడవర్తించును. శూన్యవాదమునుండియే అసలు అవిద్యామాయావాదమును వేదాంతము సంగ్రహించిన దని ప్రతీతి శూన్యవాదమందే వేమనతత్త్వపారమ్యము, స్థిరత్వమునని కనుగొన్న మీద, శూన్యవాదమునకుకూడా విశ్వదాభిరామ వినురవేమయను మకుటమే వర్తించు నని వేమన తెలిసియే వాడుకజేసినాడనుకోవచ్చును.

"కామిగాకమోక్షగామికాడు" అను తన పరిభాషమును దృష్టినిడుకొని చమత్కారముగా నతడాడినందులకు అదే మకుటము తన ఉభయ జీవితదశావిశేషము లకు సరిపడునట్లు కుదురుటొక అద్భుతము, ఒక ఔచిత్యము.

అంతేగాక, తత్త్వాన్వేషణలో అతడాశ్రయించిన బహుతత్త్వములందు ప్రతి దానికిని పొంది పొసఁగిన అర్థమునెప్పటికప్పుడు ఆ మకుట మొసఁగగలుగుట మరొక అద్భుతము.

# "వార్తలోని వార్త వరకప జేయురా"

వేదములు వ్రాసినవికావు. వేమన కవితలునంతే. సన్యసించిన మీద మఱి మఱియునంతే. గోచితోపాటు గంటమునుగూడ అతడు విసరి వేసినవాడే. సందర్భమునకు ఆశువుగా పద్యములతని నోటవెడలినవి. వెడలినవివెడలినట్లే విన్నవారి నోటికి బట్టినవి. విన్నతోడనే నోటికి బట్టగలశక్తి అతనిపద్యములకున్నది. అతనికిని అవి గుర్తు తప్పవు. ఏ కొంచెము తప్పినను మరలనట్టి సందర్భమున కొంచెము మార్పుతో నదేపద్యము పాఠభేదముగా నతడు చెప్పును. అవి ఆ నోటనానోట ప్రచారము పొంది పిమ్మటొకప్పటికి తాటాకుల కెక్కినవి.

తప్పులతో నెక్కినవి. నడక చెడినవి. భావమున చెడినవి. ఛందమున చెడినవి. పదమున చెదరినవి. ఇంకను సరిగాక, సరిజేఁత కెదురుజూచుచునే యున్నవి. సరిజేఁతకు గురియై మొదలి యర్థమునకు చేటువచ్చి సిగ్గిల్లుచున్నవికూడ యున్నవి. లేఖకపాఠకప్రమాదములు వేమనకున్నంతగానెవరికినిలేవు. అయినను బ్రదికిమనకందినవి. వేదములు వల్లెవేసినవారి ఉదరపోషణ కుపకరించి బ్రతికినవన్ననవచ్చునేమోగాని, అట్టి ఉపజీవిక కూర్పకుండగనే వేమనకవితలు బ్రతికినవి. నిరక్షరసముల నోటను వింటనుబడి బ్రతికినవి. ప్రజాకవి కవితలుగానే బ్రతికినవి.

కవిద్రష్ట, క్రాంతదర్శి, ఋషి-నానృషిః కురుతేకావ్యమ్ అన్నమాటలున్నవి. సంప్రదాయసాహితీమతాధిపతులనోట నీమాటలు చిటపటమని చిటిలిపడుచుండునుక అవినిజముగా నన్వయించువాడు తెనుఁగునవేమన్న. పైపడికట్టు మాటలువిన్నంతనే తటాలున దోచు పేరతనిది. కానిరసాత్మకమైన వాక్యములువ్రాయుటకుగాని రమణీయార్థప్రతిపాదక శబ్దజాలము సేయుటకుగాని, క్రాంతదర్శిత్వము ఋషిత్వము కావలసినదేనా యనిప్రశ్నించువారు ప్రశ్నింపవచ్చును. కాని అట్లనుకొనువారు మాత్రము వేమన్నను మనసున బెట్టకపోవుట మాత్రము విచిత్రమే.

వారికింతకును తెనుఁగున ఋషులే లేకపోగా యిక ఋషివంటివారికై నెమకులాట మాత్రము వారుమానలేదు. నెమకి తెచ్చి రెండవవాల్మీకులందురు. మారటవ్యాసులందురు. విశేషించి వేదమే కావ్యమందురు. వారికి గీతకావ్యము. సంవాదకావ్యము, విదురనీతి, కణికనీతి వారికి కావ్యమే. వానికి ప్రకరణమహిమపట్టించి కవితగా కళ్ళకద్దుకొందురు. కాని వారికి వేమనలో కవికానరాడు. కారణము వేమనతాఁజెప్పినది, వేదమన్నాడుగాని వేదముజెప్పినదే వేమనచెప్పుచున్నాడనలేదు. ఆపైనాతడు భాషలో

పేద.వారికి భాషయనగా సంస్కృతము.సంస్కృతమతని పద్యములలో లేదు.తేటతెనుఁగు నబెట్టి అతడు చెప్పిన తత్త్వార్థము రూపురేఖలేవో అంతుబట్టని అపస్మారస్థితిలో తామున్నామనికానలేక యీగాథదృష్టికలితులు, పరిమితదృక్కులు సహృదయతా దుర్భిక్షమున కగ్గమై వేమనకు పెడమొగముపెట్టినారు. వారు చేయగలదంతయుజేసి యున్నారు. కాని పరిస్థితి వారివశము దప్పినది.

ఈపిడివాదుల మాటకేముగాని, వీరేశలింగముగారిమాటే చెప్పుకోవలసి యున్నది. సంస్కరణదృష్టిచేత, హాసోపహాసరచనచేతను వేమనచాయవాడు వీరేశలింగము. అందుకేఅతడు నవయుగవైతాళికుడు. అతనికి వేమనయందు సహృదయత, గౌరవము పుష్కలముగా నుండవలసినది. కాని తన యాంధ్రకవులచరిత్రలో వేమనపేరే వారికి ఎన్నదగినది కాకపోయినది. అదేవింత. వారికీయఁదగుగౌరవము వారికియ్యదగునుగాని నిజమాడవలసినచో ఒక్క భాషాపాండిత్యమేమోగాని కవిత యందు కవితకు గుణోత్కర్షదెచ్చు నితరవిషయములన్నింటియందును వీరేశలింగము కన్న వేమన విశిష్టుడు. ఆయనకూడ వేమన్నను దాచిపెట్టిన వారితో సములగుట దురదృష్టము.

కావ్యకారణము వ్యుత్పత్తిగాదు. అభ్యాసముగాదు. కేవలము కవిగతప్రతిభ. ప్రతిభయనగా నిత్యనూతనతా విశిష్టమైన సృజనాత్మకత. అభినవత్వము కావ్యమునకు జీవగఱ్ఱయని, వ్యుత్పత్తి ప్రతిభముందు ప్రణమిల్లవలసినదేనని సిద్ధాంతమున్నది. ఇదిమిక్కిలి యిష్టారముజేసికొన్న ఆలంకారిక శిరోమణి తనపేరే అభినవుడనిచెప్పి పేరులోనే కావ్యసూత్రమును నిక్షేపించుకొన్నాడు. రసప్రాయముగాని వాక్యమసలే కావ్యముకాదను చండశాసనమును సడలించి, చమత్కారమేలేశమున్నను ఆస్వాద్యమని రమణీయార్థ ప్రతిపాదకశబ్దము కావ్యమన్నారు. ఆ యాలంకారిక సమయ మాకళించుకొన్నపండిత పాఠకలోకము వేమన్నను తలదాల్పవచ్చినారు. 'అతనికి పుస్తకజ్ఞానము ఇంచుమించుసున్న" [1] యనియు "వేమనపాపము జన్మమంచైన నాగంధము (అనగా సంస్కృత గ్రంథము) ఎఱుఁగనివాడు" [2] అనియు తేల్చుకొన్న వారయినను వేమనను కవిగా చెప్పి, అతని కవితా ప్రాశస్త్యమును వివరించి యున్నారు . 'వేమనకు సంస్కృతభాషాజ్ఞానముండెనని యంగీకరింపక తప్పదని' 'తనసమకాలీనుల పాండిత్యాడంబరమును నిరసించి సామాన్యప్రజానీకమున కవగాహ

1. కట్టమంచి రామలింగారెడ్డిగారు—కవిత్వతత్త్వవిచారము

2. రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు—వావిళ్ళవారివేమనపద్యములపీఠిక

నమగు సరళశైలినవలంబించెనని' అతనిది "హృద్భాష" యని యన్నవారు[3]ను సంస్కృత "భాషాపరిచయముగలవాడై యితరగ్రంథముల సారమునుగ్రహించి సొంతమాటలతో కొన్నితావుల జెప్పియుండెనని యుదాహరణములతో నిరూపించిన వారునున్నారు. [4]వారెల్లరతని ప్రతిభకు నవ్యతకు ముగ్ధులైనారు. కొంచెముమాటలలో కొండంతయర్థమునిమిడించుటలో తిక్కనకన్న మిన్న యన్నారు. ఇతనియందున్న పరిహాసమును కళ్ళకద్దుకొన్నారు.

కవితారచన ప్రయోజనాత్మకము గారాదన్నమాటేమనసాహితీసిద్ధాంతమున సంప్రదాయమున బుట్టలేదు.తదుల్లంఘనములు కాపలసినన్నియుండవచ్చును.కానికవిత ప్రయోజన లక్షకముగా రాదనిగాని, కిళకిళకొరకేయనిగాని భారతీయులెవరును సూత్రీకరించి యుండలేదు. తొలుతటి కావ్యములే ప్రత్యక్షముగా ప్రయోజనాత్మక రచనలు. అయిన నందలి ప్రయోజనము ధార్మికదృష్టివ్యామిశ్రము; వైదికశైవాది ధర్మావేశ పూరితము. ఆరచనలలో సమాజము దానినీతి వివేచనా విచికిత్సలునున్నవి. అర్థ కామముల విషయమై వివాదము నాటకీయత ఎంతేనియున్నది. కాని యవి ఆత్మిక ధార్మికదృష్టిపులుముడునకు గురియై స్వస్వరూపవైశారద్యము పొందలేదు. నవీన యుగముననే సాంఘిక ప్రశ్నములు సాంఘిక ప్రశ్నములుగ దృష్టములై సాంఘిక స్పృహ మెండుకొన్న రచనలు కలుగజొచ్చినవి. ఆమీద మరింత యిటీవలనే సంఘము నందలి ఆర్థికజీవితము, వ్యవస్థ, తన్నీతియన్నవి సాంఘికదృష్టిలో జేరినవి. ఆర్థిక కోణమును పొదవుకొన్న సాంఘికవృత్తము కవితా వస్తువైనది. అది మార్క్సీయ సిద్ధాంత సంచాలనమున గలిగినది. కాని వేమనలో మానవుని సాంఘిక-ధార్మిక-ఆర్థిక వ్యాపారమంతయు నెప్పుడో కవితకు విషయమైయున్నది. ఇంతగా విశాలనిబిడో ద్వేశపూర్ణమైన రచన పూర్వమింకొకనియందు కానము. అయిననతనిది కథాకవితగాక ముక్తక రచనగా మిగిలినదంతే. కాని ఇప్పటికిని ఇంతవస్తు గౌరవమున్న కవితా రచనమున్న నెమకులాడవలసినదే.

తాను కవి నన్న నమ్మకమాతనిలో నఖండముగా నున్నది. కాని, తాను తన కాలపురచన చేయుటలేదనితా నెఱుగును. సమకాలిక కవులతో నన్నింటను అతడు భేదించినవాడే. వారతనిలో తప్పులెన్నినారు.ఆ తప్పులను కాదనలేదు కాని తప్పు లెవ

3. వావిళ్ళ వెంకటేశ్వరశర్మగారు—వావిళ్ళవారి వేమనపద్యములపీఠిక

4. శేషాద్రి వెంకటరమణకవులు

రిలో నుండవు-వానినెంచుటే పాటిపని-అల్పుల పనియని నిబ్బరించుకొన్నాడు. తన దారివేరు-వారిదారి వేరు. తనది ఆదిమకవుల మార్గము-వారిదికాదు; వారట్లు వ్రాయ లేరు.తానట్లు వ్రాయుచున్నానన్నాడు. తప్పులున్ననేమి, తన విశిష్టతయది యని నెమ్మ దించినాడు. "ఆదిమకవుల వలె నల్పుండు తానేర్చి చెప్పలేడుగాని తప్పుబట్టు-దొబ్బ నేర్చుకుక్క దొంతులు పేర్చునా ." అన్నాడు-అనుకొన్నాడు.

తప్పులేనంతమాత్రాన నొఱిగిపడునదేమి ? తప్పును మఱపించి ఓహో యనిపించు చారుత్వము, చమత్కారము నెక్కడనో సాధించవలెను. "అవ్యుత్పత్తి కృతో దోషః శక్త్యా సంవ్రియతే కవేః" అన్న వాక్యము తనపట్ల చెల్లుననుకొన్నవాడ తడు ఎవరికిని లేని సులువతనికొకటున్నదని అతడెఱుఁగును. సమయోచితమైన ఆశు కవితకున్న సులువేయది. "ప్రస్తుతంపు వేళ పద్యంబు చదివిన తప్పులెన్నియున్న నొప్పియుండు-బిత్తలిపడకందు బిత్తరై యొప్పదా ....." యని సంస్కృత శ్లోక మును దెనిగించి చెప్పనే చెప్పుకొన్నాడు అది అతని స్వసమర్థనమని కూడ తెలియ వలసియున్నాము.

కావలెనని నిర్దోషముగా కథాకావ్యములల్లి చిల్లర దొరలకు కారుచౌకగా కృతియిచ్చు కవి గాండ్రను గాడిదలన్నాడు. వారు ఘనులమనుకొనుటకు నివ్వెరపడి నాడు "తోటకూరకైన దొగ్గలాకునకైన, తవుడుకైన తాలుతప్పకైన, కావ్యములను చెప్పుగాడ్దెలు ఘనులైరి......." అని ముక్కుపై వ్రేలిడుకొన్నాడు. అయినను, కృతిగొనిసొమ్మెగ వేసినవారిని తెగదూషించినాడు."గండయైనదొంగకవుల సొమ్మెగ వేసి, కండకావరాన గదియబలిసి, గండుకుక్కవలెను కాటుక తిరుగును ......." "పడుచునిచ్చువాని పద్యమిచ్చినవాని, కడుపుచల్లజేసి ఘనతజేసి, నడువనేరకు న్ననా........" అన్నాడు తన కవిత నట్లియ్యలేదు-అట్లియ్యరానిది అది సందర్భజనిత మైన ఆశువు-ముక్తకము-మించివెలగలది-విలువైనది.

జనుల నిత్యజీవిత వ్యవహారమున గలిగిన సన్నివేశము సందర్భముగా పదువురలో ప్రాసంగికముగా సహజధారలో అప్పటికప్పుడు సమయ సిద్ధముగా లోక రీతిని లోకనీతిని పద్యముచేసి చదువుటే అతని కవితారచన.తత్త్వమునకు వెలిగా తన కవితకు వస్తువేమన్నచో సంఘజీవితము లోకవ్యవహారమనియే సమాధానము."కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే సద్యఃపరనిర్వృతయే "యని అన్నం తలో ఏదైనను కాకపోయినను "వ్యవహారవిదే" యన్నంతకు మాత్రము వేమన

కవిత్వముపరమ ప్రమాణము. కధాగతముగాక రసనిర్దేశములేక చెక్కడపుపనికెడమీక చిత్తజల్లువలె క్షణసంభవమైన కవిత క్షణభంగురముగాకుండ లోకోక్తులుగా జనుల నోటికి బట్టినిలిచిపోయి, సమానసన్నివేశముల ఆవృత్తికి కొదువలేని సామాజిక జీవితమున బహూవారము సందర్భించి నిత్యభాషణమునకెక్కి శాశ్వత జీవితమును సంపాదించినది వేమనకవిత్వము. పదికాలములుండుగానని ప్రామాణికముగా అదోష ముగా పట్టిపట్టి పరమశృంగార ప్రాయముగా నిర్మించినతననాటి పద్యప్రబంధములు చెదల చదువుగా ముగిసినవెన్నో ! అగండముగడచి గద్దెకెక్కినవేని రచ్చమీద పదు వురలో పఠింపదగినవిగాగాక. రహస్యపాఠ్యములై ఏనలువురకోబట్టినవైనవి. అవే తళుకుబెళుకురాలతట్టలు. తాఁజదువుపద్యమో నిక్కమైన మంచి నీలమట! అతని ఆత్మవిశ్వాసమది. "నిక్కమైనమంచినీలమొక్కటిచాలు, దళుకు బెళుకురాలు తట్టె డేల? చదువపద్యమరయఁజాలదాయొక్కటి? ......." అతని ఆత్మవిశ్వాసము వంచి తముకాలేదు.

తాఁజెప్పు కవిత్వముయొక్క స్వరూపస్వభావములను కూడ వేమనయేనిర్దే శించుకొన్నాడని తలంపవలసియున్నది. తనమకుటమునకు తానైయర్థము చెప్పు కొన్నట్లే ఈవిషయముగా నతని పద్యమొకటున్నది. అది విచార్యము.

"వార్తలోని వార్త వసుమతీశునిజేయు, వార్తలోనివార్తవశ్యుజేయు
వార్తలోనివార్త వరకవి జేయురా.... .........................................

వార్త వరకవిలక్షణము—వార్తగలది ప్రశస్తమైనకవితయని వేమనభావముఅన్నమాట.

ఇక వార్తయనుశబ్దము వేమన ఎక్కువగా వాడుకచేసిన శబ్దములలో నొకటి. నేర్తునన్నవాడు వార్తకాడు, వార్తకెక్కుట, వార్తవిద్యలెల్లధూర్తులపాలాయె, గువ్వకొఱకు మేను గోసి యాశిబిరాజు, వార్తవిడువరాకకీర్తికెక్కె ...... ........ ఇత్యాదిగా కానవచ్చును.

వార్తయనగా అర్థార్జకమయినవృత్తి-కృషి గోరక్షవాణిజ్యములనువృత్తులు. దండనీతితోపాటుగా రాజకోశాభివృద్ధికిగాను నేర్చవలసిన రాజ విద్యవార్త. వార్త యన అర్థశాస్త్రము అర్థనీతియనవచ్చును. రాజునకాదాయవృద్ధికి మార్గము. కావుననది వసుమతీశుని జేయునన్నాడు.

ఇకవార్తయనగా సమాచారముఅని ఎల్లరు నెఱిగిన యర్థము. గూఢచారి సేకరించు సమాచారము, గుట్టుమట్టులు అవతలివానిని వశ్యునిజేయుటకు, లొంగ దీయుటకు, నిర్జించుటకు ఉపయోగించును.

మరి వరకవినిజేయగల 'వార్త' యనగానేమిటన్నది గదా కావలసినది. వార్తయను శబ్దమునకు సంస్కృత కోశములందుగల అర్థము లెవ్వియు కవిత్వపరముగా లేవు. వాడుకలో తెనుఁగున 'వార్త' యను శబ్దము ప్రత్యేకముగ నింకేమయిన నర్థములందు ప్రయుక్తమైయున్నదేమో చూచిచెప్పుకోవలసివచ్చును.

"గువ్వకొఱకు మేనుగోసియాశిబిరాజు వార్తవిడువరాకకీర్తికెక్కె" నను టలో వార్తయనగా నీతియని, నీతిదప్పనివాడై శిబికీర్తికెక్కెనని చెప్పుకోవలసియున్నారము. వేమన యిట్లువాడుకజేసియున్నాడు. 'వార్తవిద్యలెల్ల ధూర్తులపాలాయె'నన్నను నీతి శాస్త్రవ్యాసంగము ధూర్తులపాలయ్యెనని చెప్పుకోవలసియున్నారము. నీతిని వేమన విద్యగా గణుతించినాడు "విద్యలలోపలనీతియు, వాద్యంబులలోనవీణ" యనియునన్న వాడతడు. ఇకనీయర్థముతీసుకొని, నీతినిబోధించునదే వరకవిత్వమగునని వేమన మతముగా చెప్పవచ్చును, అందుకును కొంతవీలున్నది.

కాని వార్తను కవితాగుణముగా జెప్పిన సందర్భము తెలుగు కావ్యము లందున్నది. తెనుగులో వెడలిన అలంకారశాస్త్రములకాయర్థము ఎక్కలేదు. కాని తెనుగుకవులు 16, 17 శతాబ్దులలో వార్త ఒకానొక కవితా లక్షణముగా వాడినారు. అందు ప్రథమగణ్యము చేమకూర వెంకటకవివాడుక. విజయవిలాసములో

తారసపుష్టిమై ప్రతిపదంబున జాతియు వార్తయుం జమ
త్కారము నర్థగౌరవముగల్గ ననేకకృతుల్ ప్రసన్నగం

భీరగతిన్ రచించినవాడని రఘునాథరాయలవారిని స్తుతించియున్నాడు. జాతియనఁగా స్వభావోక్తియను నలంకారమనికావ్యశాస్త్రములిచ్చినవి. వార్తయనగా ఒకానొక అలంకారమనిగాని, మరొక కావ్యగుణమనిగాని కావ్యశాస్త్రములలో లేదు. ఆ చేమకూర వెంకనయే 'వార్త' నింకొకచో ప్రయోగించినాడు.

"మోక్షమునకుబోవ మొసలెత్తుకొనిపోయెననెడువార్త నిక్కమగునటంచు
గ్రుంకవెఱతురెవ్వరును, మీరలటు పోకుడనిన నవ్వుకొంచునర్జునుండు
విజయవిలాసము— (2—43)

ఇచట వార్తశబ్దమును విజయవిలాసకర్త లోకోక్తియనునర్థమున ప్రయోగించినట్లు విశదమగుచున్నది. ఇదేయర్థమున 'శకసప్తతి' యందున్నది.

'నక్కగన్నవాడెల్ల వేటకాడనెడువార్తనిక్కమయ్యె' (1—114)

'వార్తలేని కవిత్వంబును బోలె చెన్నుదరిగి' యని 17వ శతాబ్దమున కంకంటిపాపరాజు ఉత్తరరామాయణమునందన్నాడు. ఇచ్చటవార్తయనగా లోకోక్తియని

గాక వర్ణనయని సూర్యరాయాంధ్రనిఘంటు కర్తలన్నారుగాని అట్లనవలసినపనిలేదు. పాపరాజునర్థముకూడ 'లోకోక్తి' యనియే చెప్పనొప్పును.

వార్తయనఁగా లోకోక్తియని తెనుఁగునందున్నదన్నమాట. కాని లోకోక్తి స్వభావోక్తివలె నొక అలంకారముగా ఎన్నికగాలేదు. మరి వేమన కవితాగుణముగా "వార్తలోనివార్తవరకవిజేయురా" యనగా లోకోక్తులతో కవిత్వమును గూర్చువాడు వరకవియగునని వేమన అభిప్రాయమనవచ్చునుగదా: నిజమునకు వేమన యందున్నదే లోకోక్తి. కాని, వేమన లోకమందున్న లోకోక్తులనే దెచ్చి యితరులవలె సందర్భమునకు వాడుకసేయువాడుమాత్రముగాడు. అతడే లోకోక్తిబ్రహ్మ—అతని పద్యముపాదముపాదమున నొకలోకోక్తి. ఆలోకోక్తికతడే కర్త. లోకమందిదివరకదిలేదు. వేమనతర్వాత, వేమనయన్నతర్వాత నదిలోకోక్తి. స్వీయోక్తిలోకోక్తి యగునట్లు అనగలప్రజ్ఞ అతనికున్నది. తెనుఁగులో అనితరసాధ్యమైన ప్రజ్ఞగా వేమనయందే అది యుండిపోయినది. లోకవృత్తమును—లోకరీతిని—లోకనీతిని—లోకోక్తిప్రాయముగా చెప్పుటచేత వార్తయొక్క అర్థమును కవితావస్తువునందు కవితారీతియందు ఫలితార్థముగా చూపిన వార్తకవి—లోకోక్తికవివేమన.

"నీతిదెలియజెప్పె నిజముగా వేమన పాతకముల నెల్లఁ బడఁగద్రొక్కి—
లోతుతత్త్వమెంచి లోకులకును జెప్పె ....... ......." ననియన్నను, 'విద్యలలోపలనీతియే విద్య యన్నను కేవలము నీతి పద్యములను చెప్పుటవలన నాతడు వార్తకవి యనిపించుకోడు. నీతి జెప్పుట అతని ప్రత్యేకత కాదు. నీతి శతక కారులెంతమందిలేరు ? వారి నీ పేర నెవ్వరు పిలిచినారు ? వార్తయన్నను నీతి కావచ్చునుగాని, ఆ నీతిని లోకోక్తి సాత్కృతముగా చెప్పుటాతని ప్రత్యేకత-ఒక్క నీతినేమి, లోకవృత్తమునేమి-అతడు లోకోక్తిమయముగా చెప్పినాడు. తత్త్వమునే లోకోక్తిగా జెప్పినాడు. లోకోక్తి అతని కవితా విధానము. అదే వార్తకవిత.

"వార్తకవిత"యను పేరసలొకటి పుట్టినదా? వేమన్న "వార్తలోని వార్త వరకవిజేయురా" యన్నాడేగాని 'వార్తకవిత' యనిగాని 'వార్తకవి' యనిగాని ప్రయోగింపలేదే ! అలంకారశాస్త్రము లందెట్లునులేదు; ఈ శతాబ్దమున వెలువడిన * కావ్య విమర్శనలలో కూడలేదే. మరి యీ మాటకు గతి కల్పించుటెట్లు ?

వార్తకవి యనుమాట వ్యవహారమందుండినది. తెనుఁగులో మాత్రమే యుండినది. అది యింటి పేరుగా మారినది. వార్తకవి యను ఇంటిపేరి కుటుంబము లిప్పటికి నున్నవి. రాయలసీమయందు బ్రాహ్మణ కుటుంబము లున్నవి. రాళ్ళపల్లి

వారికే యిదితెలియును. **వార్తకవి రామచంద్రరావు అనువారినిగూర్చి వారివేమనలో ప్రాస్తావికముగా నెత్తినారు. వార్తలేక కవిత్వము వెల్వెలబోవునన్నంతవరకు వచ్చిన నాడు వార్తామయమైన కవిత రాజాలదా? వచ్చినది. వార్తకవియని బిరుదొంది వార్త కవియని యింటి పేరు స్థాపించిన పురుషుడెవ్వడోగాని అతని కవిత్వము మనకంద లేదు. కాని వాని కవిత్వమందుకు ప్రమాణముగా వెలువడినదన్నమాట. కావున వార్త కవియనిపించుకొన్నవారున్నారు. వార్తకవిత యుండకేమి ?

లోకోక్తి లోకోక్తిగా బ్రదుకుటకు దానియందు శబ్దలయ గొప్పగా నుండ వలెను. అది సుబోధముగా నుండవలెను-అందు చమత్కారముండవలెను. ఈ గుణ ములన్నియు వేమనకవితలో దండిగానున్నవి.అతని లోకోక్తి కవితకుదాహరణములు

అప్పులేనివాడు అధికబలాఢ్యుడు—కలిమిబలిమి రెండు తెలివికి హానిరా—
చేయుధర్మమెల్ల చెడనిపదవి—చద్దిమిగులనట్టి సంసారమేలరా—
రూపులేని వనిత రూఢిపతివ్రత—ఈటెలేనివాడు పోటుబంటు—
మాటవిననియాలు మగనికిమరగాలు—గడుసురాలు చెలియవడిసెలబోలురా-
ఓజమాలునాలు ఓలిమాడలచేటు—కాపులేనిదాని కాపురమగడురా
పరుడుఃపరుడుగాడు పరమాత్ముడౌనయా—పరమహంసగాడు పరహింస
కుండంద్రు
చింతలేకయుంట చెడిపోనిసంపద—సిగ్గువిడచువాడు చిరకాలజీవిరా
విశ్వసింపకున్న విశ్వమేలేదయా—మాటతప్పకున్న మఱిశతాయుష్యంబు
ఊరకుండువాని కూరెల్లనోపదు—పోరిపోరిగెల్చు నోరునొవ్వనివాడు
దాతలేనియూరు దయ్యాల పెనువాడ—దానమడుగనతడు దైవసముడు
కలుషితార్జితంబు తలవంపులకుమూలము—వెట్టిగొలువరాదు విభుడెంత
ఘనుడైన
భటుడు వెంటలేక ప్రభుడుశోభింపడు—మహిమలేనివేల్పుమంటిజేసినపులి
నొసలు భక్తుడైన నోరుతోడేలయా—తలలు బోడలైన తలపులుబోడలా
అన్నమదముచేత నన్నిమదములౌను—కామిగాక మోక్షగామికాడు

* వార్తయనఁగా "కథను నడిపించు నేర్పును చమత్కారమును" అని 'హృదయోల్లాసవ్యాఖ్య లో తాపీధర్మారావుగారు "తారసపుష్టిమై ప్రతి పదంబున ..." అన్న పద్యమున అర్థము చెప్పినారు.

** వేమన-23వ పేజీ

రోగికిడినవానిరాగి బంగారౌను—జాతిగానివాడు జగముల దేవుడు
పెద్దలుసురుమన్న పెనుమంటలెగయవా—నెలవుదప్పుచోట నేర్పులు
కొఱగావు
అనువుగానిచోట అధికులమనరాదు—పదుగురాడుమాట పాటియైధరజెల్లు
నిజముపల్కుకున్న నీచచండాలుండు—నిజమునాదరాదు నీచతోడ
సానిదానిబొందు సౌభాగ్యభాగ్యంబు—సతినిపెనగువాడు సంసారయోగిరా
సాధనమునపనులు సమకూరుధరలోన—పేరు ధర్మరాజు పెనువేపవిత్తయా
తప్పులెన్నువారు తమతప్పు లెఱుగరు—ప్రియములేనికూడు పిండపు
కూడురా
ఒప్పులేనిపెండ్లి యొనరజేయగరాదు—సమమురాని మనువుచాలగా
ఫలియించు
సమునకిచ్చు మనువు సరసగుణము—మంత్రజలముకన్న మంగలిజమెచ్చు
కల్లుత్రాగు కంటె కల్లలాడుట కీడు—నీతిలేనిమాట రాత్రివేటు
నేయిలేనికూడు నీయాన ! కసవది—ఉప్పులేనికూర ఊసనరుచులకు

వేమనసూక్తు లిట్లుండును. అతనిసూక్తి లోకోక్తి. పంక్తిసగమున కొకటి-పంక్తికొకటి. పద్యమంతటికి నొకటి. మచ్చునకనఁగా నివిగాని పట్టికలో పట్టనివాతని సూక్తులు. కవితయంతయునంతే. తిండిమొదలు పిండప్రదానము వరకు గలుగు ప్రతిజీవిత సన్నివేశమునకును సందర్భించు లోకోక్తియాతని యందున్నది. ఒకటిరెండుమార్లు విన్నను జదివినను మనసున నాటకొను సులువైన భాష, పొదు పైనవాక్యము, లయాన్వితరచన ఏ భాషయందుగాని లోకోక్తికి లక్షణము. ఇందులో లయాన్వితమైన శబ్దరచన జ్ఞప్తికుపకరణముగూడనైయున్నది. శబ్దలయయనఁగా చెప్పవలసినది శబ్దాలంకారము. సామెతలే శబ్దాలంకారమేలనములు. తెనుగులో నీమాట తిరుగులేనిమాట. అనగా లోకోక్తి సాత్కృతమైన వార్తకవిత శబ్దాలంకార మయమగుట తప్పనిసరి. మరి వేమనకవిత శబ్దాలంకార విలసితమేనా ? పైపంక్తులే యందుకు కారణము. కాని వేమనలోని శబ్దాలంకార వైశిష్ట్యమును వివేకించుపట్ల మున్ముందుగా నాతని ఛందోవిశేషమును దెలియుటావశ్యకము.

కందము తేటగీతి యింకితరములు వాడినను వేమన ఛందమనఁగా ఆట వెలఁదియే.ఆది దేశిచ్ఛందము. అందును తెనుఁగుఛందము.తెనుఁగుచందమునకు తగిన చందము. దేశభాషలందు తెనుఁగులోనే దాని ప్రత్యేకత.కన్నడమందది స్వతంత్రమైన

ఛందమే కాకపోయినది. *అంతేగాదు. తెనుఁగులోగల స్వరూపము దానికి కన్నడమున కలుగలేదు. అందుచే దానిని అక్షరాలదెలుఁగు ఛందమని చెప్పుకోవచ్చును.

తెనుఁగునగూడయది చిన్నకుచిన్నయగు ఛందము. మూడు మాత్రల కెక్కువలేక, గణములందు చిన్నగణములైన సూర్యగణములు ప్రాబల్యము వహించిన ఏకైకచ్ఛందము. పంక్తికిపంక్తియే సూర్యగణములతో పఠకవలసినది. పెద్ద గణములలో లెక్కవచ్చు నింద్రగణములుకూడ యిందున్నవనుకొన్నచో, ఇంద్రగణ మొక్కింటికి నాలుగు సూర్యగణములవంతుననున్నవి. ఈ చిన్నగణముల చిన్న పద్యముకడపంక్తిని మకుటముగావించి విడచినచోనిక మిగులునవి మూడుపంక్తులు. అంతటితోనది ప్రాకృతమందలి గాథాచ్ఛందమునకన్నకూడ చిన్నదగును. ఇంచు మించు సంస్కృతచ్ఛందమైన అనుష్టుప్పము. అనుష్టుప్పు ముప్పదిరెండు అక్షరము లైన, ఆటవెలఁది మూడుపంక్తులను ముప్పదినాల్గక్షరములలో బెట్టి చెప్పవచ్చును. అక్షరములకొలఁతగాక, మాత్రలలోకొలిచి కవితచెప్పినచో అనుష్టుప్పులోనే ఎక్కువ మాత్రలుండుటకు వీలున్నది. వేమన ఎంచుకొన్నదంత వామనచ్ఛందము.

భాషాసంగ్రహశక్తి అతనియందుసహజసిద్ధము. అదికాక, అతనియందుఉపహాసము (Wit and Satire) ఉన్నది. ఉపహాసమునకు భాషాసంక్షేపకత దేహముఆత్మయు ననిసూక్తియేయున్నది. తెలుగులోఉపహాసమాతనితోనే మొదలైనది. వనికితోడు అతడు చెప్పునది వార్తకవిత-అనగా లోకోక్తిప్రాయమైన రచనమతనిది. ఆపైన అతనిభాష జానుతెనుఁగు. సంస్కృత భూయిష్ఠముగాని-అనఁగా దీర్ఘదీర్ఘమైన సమాసరచనకు ననువునలవిగాని జానుతెనుఁగు. పదమొక గణముగా కుదురుట తెనుఁగునకు తీర గును ఇట్లతని భాషాస్వరూపము, అందతనికున్న భాషాసంగ్రహశక్తి, అతని ఉపహాసధోరణి, దానినాతడు లోకోక్తి ముఖమున ముఖరీకరింపనెంచుటయునన్నవి ఏకోన్ముఖమయి చిటుతకు చిటుతయు, తెనుఁగునకు ప్రత్యేకమనదగిన ఛందమైన ఆటవెలఁదినివాహికగా ఏర్పుకోగల్గినవి. అతని ప్రతిభకదే అర్హవాహిక. ఆటవెలఁది కాతని యౌవనము తాకట్టుపడినందుకు ఆఁటవెలఁదిపేరిటిఛందమే అతని ఛందమగుట ఒక ఔచిత్యము.

---

* కన్నడమున సీసపద్యమునకది అనుబంధమేగాని, స్వతంత్రముగాదు. కన్నడమున దానిపేరు ఆఁటగీతి. సీసముక్రింద ఆఁటగీతియేగాని తేటగీతి కాదట. ఆటవెలఁదికిదీటైన ఆఁటగీతిలో ప్రాసనియమము న్నది. నిజముగానది మన పవడగీతి-ప్రగీతి.

అంత చిఉపద్యమగుట సెందునుఒక గొప్ప వీలుకలిగినది. గణముగణ ఘనకొకపదముగా తెగిపడు తీరైన తెనుఁగు. విరామమను సంస్కృతార్థమును తూచా తప్పక పాటించుచు దేశిచ్ఛందమున ఆద్యక్షరావృత్తియే యతియన్న ప్రత్యేకార్థమున యతిమైత్రిలో కక్కుర్తిపాట్లకు తోనుగాక పోషించినచో-అనగా అప్పకవి చెప్పిన నలువదియొక్క యతిభేదములను వాడుకసేయు కక్కుర్తికి చొఱక, భీమకవి కవిజనాశ్రయము నిబంధనమేరకు నిజమైన అక్షరావృత్తి పాటించినచో, ఆ అక్షరావృత్తి అనగా యతిఆటవెలఁదివంటికుజచ్ఛందములో అదూరమై పూర్వానుభవబోధినియై స్పష్టముగా శ్రుతిగోచరమైనచో శబ్దాలంకారమై రణించును; రాణించును.

వర్ణావృత్తిరనుప్రాసః పాదేషుచపదేషుచ

పూర్వానుభవబోధినీ యద్యదూరతా ।।యనుకావ్యాదర్శ వాక్యమునకునముగ గతమై ఆటవెలఁదిలో అదూరమునందుండు యతి ఆద్యక్షరానుభవబోధిని కాగలిగి అనుప్రాసాలంకారమై కూర్చుండును. వేమనయతులు కవిజనాశ్రయము ననుసరించి నవి. స్వర, సరస, వర్గజ, ఎక్కటియతులే అతనియందతిమాత్రములు. యతికొఱకా తనిలో కక్కుర్తిలేదు. యతిమాట యట్లుండగా, దానిని ప్రాసయతిజేసినచో చిన్న పద్యములందు యతిస్థానములు స్ఫుటము స్వచ్ఛము ప్రముఖమునైన అనుప్రాసాలంకారము సిద్ధించును. అంతకుమించి, ఆఁటవెలఁది తేటగీతులలో నియమములేకున్నను ప్రాసను సాధించినచో నింకేమి చెప్పవలెను? అనుప్రాసాలంకార మాధుర్యము యినుమడించును. వేమనలో ప్రాసయతితరచు. దానియందము చూడవలెనన్న "చదువులందు రాజపదవులందును పాడిమొదవులందు స్త్రీల పెదవులందు నాశలుడుగునట్టి యయ్యలునుందురా అన్న పద్యమును చదువుకోవలసినదే. ఆటవెలఁదిలో ప్రాసవేయుట అతనికి మోజు. ప్రాసయతి వేసి ప్రాసపాటించినచో ఆటవెలఁదిలో అనుప్రాసముపరాకాష్ఠచెందవలసినదే. ప్రాసపాటించినచో ఆఁటవెలఁది 'పవడగీతి' యనియు, 'ప్రగీతి' యనియు పేరొందును. వేమన ఆఁటవెలఁదులు పెక్కులు ప్రగీతులు.అతని కవి అలవోకగా వచ్చినవే.

"తుంట వింటివాని తూపులఘాతకు మింటిమంటినడుముమిడుకదరమె
ఇంటియాలు విడిచి ఎట్లుండవచ్చురా .... ..."
"ఆఁకటికిఁ దొలంగు నాచారవిధులెల్ల, చీకఁటికి దొలంగు చిత్తశుద్ధి

వెఁకఁటికి దొలంగు వెనుకటి బిగువెల్ల............." ప్రాసపాటించిన ఆటవెలఁదులు వేమనలో వందలున్నవి. ఇట్లు కుఱుచపద్యములో యతిప్రాసలు చక్కఁగా పాటించిననే శబ్దాలంకారసిద్ధియున్నది.

అంతకుమించి మరింకొక విషయమున్నది. యతిపాటించుచుండగా మధ్య మధ్య అనియతముగా అక్షరావృత్తి, వ్యంజనావృత్తి ఒక్కఁపరిసిద్ధించినదేని మరింత ప్రశస్తముగా శబ్దాలంకారమగును. ఉదాహరణమునకు 'విశ్వదాభిరామ వినురవేమ' యేయున్నది. ఇందులో యతివలన ఆవృత్తియుండగా విశ్వయందు సంయుక్తలోవకారము, వేమయందు వేకారమును అయూరముగా ఆవృత్తమైనవి. ఫలితముగా పదకొండక్షరములలో నలుమార్లువకారావృత్తికల్గినది. వృత్త్యనుప్రాస దానిచే పుష్కఁలముగా కలిగినది. రామ, వేమ మరలనను ఛేకానుప్రాసముకల్గు చున్నది. వేమన కవిత శబ్దాలంకారమయమని మకుటమే ముందుగా మూదలించు చున్నది. "ఉప్పుకప్పురంబు నొక్కఁపోలికనుండు, చూడజూడరుచులజాడవేరు పురుషులందు పుణ్యపురుషులువేఱయా........చాకివాడు కోకచీకాకుపడజేసిమైలబుచ్చి మంచిమడుఁజేయుపువిన్నవానికన్న కన్నవాడధికుండు, కన్నవానికంటె కలియువాడు ఉన్నతోన్నతుడయి ఉర్విలోపలనుండు ......" అన్నంతలో చరణము చరణముననను ముమ్మారు నలుమారు రువర్ణావృత్తికలిగి వృత్త్యనుప్రాస మొనగూడుచున్నది.చూడగా వేమనలో వృత్త్యనుప్రాసము దట్టమనవచ్చును.

అదిగాక తెనుఁగుపలుకుబడితీరే అనుప్రాసమయము. జంట పదములకు తెనుఁగు పంటచేను. సామెతలు నియతముగా అనుప్రాసయుతములు. తెనుఁగు శ్రావ్యతకు, సంగీతమత్తతకు నివికూడకారణములు. ఈకీలెటిఁగికూర్చినచో ఆఁటవెలఁది పాదముపాదమున మంజుశింజానమే. నిసర్గజముగా తెనుగుభాషయందును తెనుఁగు ఛందమునందునుగల శబ్దలయ యంతయు నితడు సాధించినాడు. కావుననే అతనిపద్యములు తెలుగువారినోటికిట్టేపట్టును. పట్టినిల్చిపోవును.

శబ్దాలంకారముమీద వేమనకున్నమోజు అతని యమక ప్రియత్వములో ప్రచురమగును. అదియు సున్నితముగానే యుండును. చిన్నపదమునకే యమకము.

ఆఁకలేఁచుచుండు ఆఁకలేక—అన్నమందరకును అన్నవేమ—
మాయరూపు రూపుమాయగాజేసియు—కాపులేనిదాని కాపురమగడురా—
కరణముపకరణముగదరవేమ—విన్నవానికనకన్నవాడధికుండు—
పంచముఖములుగల భవసంజ్ఞగలవాని—పంచజేరువాడు పరగువేమ—

బయలందేముక్తి బట్టబయలురవేమా-
కనులుపొరలుగప్పికనిపింపకనరుండు-పొరలుదీయుమంచు పొరలుచుండు-

ఇక నిటువలె యమకము గాకపోవునేని యమకచ్ఛాయకు యమకాభాసము నకు దాని చేరువ చేరువలకు వేమన యత్నించును. ఉదాహరించుకోవచ్చును.

ముద్రలోనసున్న ముద్రిక గానరో-తలలు బోడలైన తలంపులుబోడలా-
మాయదెలియ దివ్యమాయెరా జన్మంబు- ఆడుదానిబల్మి యాడనేచూడరా-
పరమహంసగాడు పరహింసకుడుగాని-
అన్నమదముతోడ అన్ని మదములౌను-
విశ్వసింపకున్న విశ్వమేలేదయా- కామిగాక మోక్షగామికాడు-
ఒడలునందుగల్గు ఒడయనిచూడరా- ఇమ్ముదప్పువేళఎమ్మెలన్నియుదప్పు-
యోగిగాడువాడు నోగుగాని- గుళ్ళలోన దిరిగి కుళ్ళనేల-
కాసెయులులచేత గాపి చేసి- బ్రాహ్మణులనువారు బ్రహ్మంబునెరుగరో-

యమకము పొలిమేరకు బ్రాకిన యీ శబ్దచమత్కారము ఛలోక్తి జేయు టకు అమోఘమైన ప్రక్రియ. హాస్యమును శకార వికారాకార వేషభాషలను గిరిగీచి, ఆ గిరిదాటనీని ఆలంకారిక నిర్వచనమును మీరి హాస్యమును తెలివిత్రోవ బట్టించి, క్రొత్తగా నతదెత్తుకొన్న ఉపహాస అపహాస పరిహాసములను చంద్రహాసము పదనుతో తీర్చుటకీ శబ్దచమత్కారప్రక్రియ సాటిలేని సాధనము. "పరమహంస గాడు పరహింసకుడు వాడు" "యోగిగాడు వాడు నోగుగాని" "బ్రాహ్మణులనువారు బ్రహ్మంబునెరుగరో" "కామిగాక మోక్షగామికాడు" వంటి పంక్తులు ఒకసారి చెవి సోకినవేని, అంతేచాలును, అవి కంఠపాఠమైపోవును. మఱిమఱచుట మనవశములో లేనిమాట. మనసువిశ్రాంతమైనదో యిక చెప్పనేమిటికి? ఆ పంక్తులు జాగరితములై నాల్కపై కురుకులు పెట్టును. కూనరాగమునబడును.

యమకము కృతకమనిపించకుండ ఔచితీరుచిరమొనరించుటకు శృంగార (ఆభాస) సంభాషణము సందర్భమని రూపించినవాడు చేమకూరవాడు. దానికి ప్రయోగశాల అతని సారంగధర చరిత్రము. యమకమునకు లోకోక్తికూడ ఒక రంగస్థలమని, తత్సమీప శబ్దచమత్కారమునకు హాసోపహాసములసలైన పొలమని సాహిత్యమున స్థాపించినవాడు వేమన్న.

ఇంతేననుట అతని యమకానుప్రాసములాతని గణుతించిన పండితులకును వినిపించలేదు. ఆ యూసే వారెత్తలేదు. అనగా నాతని శబ్దాలంకారమంత హాళా హాళిక చేయనిది. కనకమువలె మ్రోగినదే గాని కంచువలె మ్రోగలేదు. కంచువలె మ్రోగని అనుప్రాసము మనవారికి వినబడదు కాబోలు! కంచువలె అనుప్రాసమును మ్రోగించవలసిన వీరరౌద్రాది రసములు వేమనకు కాబట్టినవి కావు.

శబ్దముయొక్క నాదశక్తి యంతయు శబ్దాలంకారముతో సరిపుచ్చుకొన్నది గాదు. అలంకారము క్రిందికిరానిదానిని గుణమన్నారు. మరొక కొంతను రీతియన్నారు. గుణమునెన్నినంత రీతినెన్నరు. పదమందక్షరముల స్వభావమునుబట్టి, పదము పదమును పొందించు తీరునుబట్టి కలుగు శబ్దములయొక్క నాదము గుణమైనది. పదములందలి హ్రస్వదీర్ఘాక్షరముల ఎక్కువతక్కువలనుబట్టి, వాని వరుసనుబట్టి, పదములందలి అక్షరములు సంయుక్తములు నసంయుక్తములు నగుటనుబట్టి, అందలి హల్లులు పరుషములో కోమలములో అగుటనుబట్టి, పదము పదమును కదిసి ఏర్పడిన సమాసము పొట్టిపొడుగులనుబట్టి, వాక్యముకూర్పు చిక్కనపలుచన లనుబట్టి, శబ్దముయొక్క నాదమునందెంతో భేదమున్నది. రౌద్రమునకొక పదఘటన, కరుణమునకొక రచన, శాంతమునకొక సంయోజన కావలసియుండును. భావాను కూలమైన భాషారచన, పదయోజన, పద్యము నడక, తూగునన్న శబ్దశిల్పము కవి మాత్రునకు ప్రథమావశ్యకము. భాషాయోజన భావమునుధ్వనించవలెను. భావమనగా అర్థమేగాదు; ఈర్ష్యద్వేషము ప్రేమభక్తి వాత్సల్యము అసహ్యము మెచ్చుకోలు ఉత్సాహము ఉద్రేకమువంటి మానసికావస్థ భావములని కావ్యశాస్త్రమునందు ప్రత్యేకార్థము. శయ్యయనుడు, రీతియనుడు, వృత్తియనుడు, గుణమనుడు-ఇవన్నియు శబ్దముయొక్క నాదశక్తి రూపములు. వేమన నుండి ఒక్కింత ఉదాహరణము చేయుదము. మగనితో తగవాడు మగువ చేష్టల తొందరను పద్యగత పదరచనచే కళ్ళగట్టించుటే చూడవచ్చును.

వాడకురికితిట్టు – వలదన్న పోటుపెట్టు
ముంటు మగనిదిట్టు-మునుగుబెట్టు, గడుసురాలు మగనిగంప బెట్టమ్మురా!

ఆమె చేష్టలక్రమము – వానివేగము – ఒకదాని పిమ్మటొకటి తొందర తొందరగా జరుగు పరిణామమును యీ కూర్పు ధ్వనించుచున్నదో లేదో పాఠకులు వారంతకు వారే సాక్షులు.

ధారయను మాటున్నది. పద్యము కట్టుబడిలో ధారావేగము సర్వేసర్వత్ర

కావలసినదన్నట్లు వ్యవహరించెదరు. ధారను రసవ్యంజకముగా చూచినచో, ప్రతి పద్యమునందును నడకవేగము కావలసినదికాదు. చెప్పలేక చెప్పలేక చెప్పవలసిన విషయమును జెప్పు సందర్భమున ధారావేగమేమిటికి? పాడుచేయును. అట్లే అమిత వేగము – వలసినకన్న వేగము హాస్యరేఖను కూడ వ్యంజించగల్గును. వేమన అందుకు నిదర్శనము.

"పనస తొనలకన్న పంచదారలకన్న జుంటితేనెకన్న జున్నుకన్న
చెఱకురసముకన్న చెలిమాటతీపురా ..... ..... ..... ..... ..... .....

ఇన్ని తీపులకన్న మిన్నైనతీపిగా చెలిమాట నతిశయముజేసి చెప్పినందు చేతనే గాకుండ, ఈ కూర్పునందున్న అమితమైన ధారావేగముకూడా ఇందున్న యథార్థము నొకపాటి ఉపహాసలేశమిశ్రితముగా నందించుచున్నది.

"వలపుగలిగెనేని వనజాక్షి యధరమ్ము పంచదారకుప్ప పాలలప్ప
చూతఫలరసంబు జున్నుసమానము..... ..... ..... ....."

ఇందులో ఉపహాసము జరిగివచ్చి అపహాసము పొలిమేర ద్రొక్కినది. దానిని ధారావేగము కొంతపెంచినది. మించి, "కుప్ప–లప్ప" యను అనుప్రాసము, అందలి పకార ద్విత్వము మరింతగా ఎచ్చించినవి.

"వలపు దీఱెనేని వనజాక్షి యధరంబు, ములకపంటిగిజురు ముష్టిరసము
చింతపొంతయగును జీడిసమానము..... ..... ..... ..... ..... ..... ....."

ఇది శుద్ధముగా అపహాస్యము. జుగుప్సనుకొంత తనలో మెదిగించుకొన్న అపహాస్యము. వల్లమాలిన చేదు పులుపులను అధరపానమున కంటగట్టుచున్నది. అసహ్యతాభావమిందు తాండవించుచున్నది. దానికి తగిన పదరచన "ములకపంటి గిజురు ముష్టిరసము" లోనున్నది. అందున్న అక్షరముల నాదగుణమునుబట్టి కూడ యున్నది. "గిజురు" ఉచ్చారణలోనున్నది; టకారమునుబట్టియున్నది. ష క్రింద ట చేరిన చేత రెట్టించిన శ్రుతికటుత్వమును బట్టియు అసహ్యతాభావము నాడీమండలము మీద మ్రోగుచున్నది.

ఇక్కడొకటి చెప్పుకోవలెను. వీరరౌద్ర బీభత్సరసములకు అనువైన ఓజోగుణ సామాగ్రి – సంయుక్తాక్షరములు, రేఫయోగములు, ఒత్తక్షరములు, శ ష హలు, మొదలైనవి– సంస్కృతమునందున్నట్లు తెనుఁగులో నుండవు. తెనుఁగను దానిలో దీర్ఘ సమాసములకే అవకాశములేదు. తత్సమమయముగాని తెనుఁగులో

సాధారణముగా ఆలంకారికులు వేసిన పట్టికలోని అక్షరరూపవిశేషములు, పొడుగు సమాసములును వీలుగావు. అనగా సంస్కృతము విభక్తులమార్పుతో తెనుఁగని పించుకొన్న భాషలోనేగాని, దేశ్యమైన తెనుఁగులో ఓజోగుణమును కుదిరించలేము, రౌద్ర బీభత్స వీరములు తెనుఁగులో పలికించలేము అని చెప్పవలెను. రౌద్రము భారతములోని "భీష్మ ద్రోణ కృపాది ధన్వినికరాభీలంబు...." అను సమాస భూయిష్ఠమైన తత్సమభాషా రచనలోనేగాని, యుద్ధపంచకమున మరెక్కడను, విరాటమందైనను తిక్కనగారు దేశితసమెచ్చున్న తెనుఁగులో పలికింపలేకపోయినారా? అట్లయిన అంత యుద్ధగ్రంథము రక్తికట్టగలదా? రౌద్రమంతయు తిక్కనగారు తత్సమములోనే పెట్టి పలికించినారా? యీ ప్రశ్నములు వేసుకోవలసివికావా? కీచకుని ద్రౌపదీ పరాభవమునకు కనలి భీముడు వహించిన రౌద్రాకారవర్ణనము తెనుఁగులో తెగవలుకగా సమాసభూయిష్ఠరచనకాదు గావున దోషమని తీర్పుజెప్పిన అలంకార శాస్త్రపండితులున్నారు. వారికి అనుభవముతో పనిలేదు. తెలుఁగువారు తమ కోపమును సంస్కృతములోపెట్టి చెప్పుకోవలసినదేనా? వీధికయ్యములందు రౌద్రము తెనుఁగులో చప్పగా వినబడుచుండునా? ఇవి మన విమర్శక శిరోమణుల విపృతి అన్వయముల తీరునుబట్టి కలిగిన ప్రశ్నలు.

కాని, ఇది సాహిత్య సిద్ధాంతకర్తలవల్ల నేర్పడిన వైపరీత్యముగాదు. ప్రసాద గుణము సర్వరసములందును సర్వరచనలందును సమర్థమైనదని అభినవ గుప్తుల వచనమేయున్నది. ప్రసాదగుణముగల రచనతో రౌద్రబీభత్సముల నెవరెట్లు పల్కించిరో, పల్కించగలరో సేకరించుకొని ఉదాహరించుకొనుట, ఉదాహరణమును సొంతముగా నిర్మించుట కావ్యశాస్త్ర వివరణకర్తలు కనీస పక్షముగా చేయవలసిన పని. అంతేగాదు. అసందిగ్ధముగా ప్రసాదగుణమునకు ప్రమాణమైన పదరచనలో తొమ్మిది రసములు వెల్తిలేకుండ పల్కిన పద్యముల నొక్కటగూర్చి చూపించి యీ సూత్రీకరణమందు నమ్మకము కల్గించుట, కల్గించుకొనుట ఎవ్వరును చేసిన పనిగాకపోయినది.

వేమనకీ ఓజోగుణముతోపనిలేదు. *రౌద్ర బీభత్స వీర భయానకములతో

---

* ఆ యోజో గుణమునుగూడ అవసరమైనంత మోతాదులో అతనితెనుఁగులో ఆటవెలఁదిలోగూడ నిర్వహించియున్నాడు ;

ద్రోహబుద్ధినైన దొంగతికమునైన - నటలనైన సాహసముననైన
సంపదధికునుండి సాధించి ధనమును బడుగునకు నొసంగబాగువేమ ॥

నతడు పనిపెట్టుకోలేడు. అందుచేనది సమస్యకాదు, శృంగారమున నడచిన అతనికవిత మనమెఱుఁగము. అతడు సంస్కర్త – త్యాగి – బోధకుడు. లోకదారిద్ర్యమును నిర్మూలించవలెనన్నదాతని తపన– అందుచే దానవీరమున్నది. పిసినిగొట్టునందు నగతాళియున్నది. అతడు సంఘసంస్కర్త–కావున మూఢవిశ్వాసముల విమర్శయున్నది; అందు హాసములో చాయలెన్నో చూడవలసినవాడు. అతడు విరాగియైన ఉపదేశకుడు–శాంతరసమున్నది. భక్తియు లవలేశము రుచిచూపకపోలేదు. హాస్యము, దానధర్మవీరములు శాంతము అతని రసములు. అందుకతనియందు తగిన భాషయున్నది. శయ్యయున్నది. ఇకనది వివేచించుకోవచ్చును.

వేమన భాష తెనుఁగు – అనఁగా ముప్పది యాఱక్షరముల తెనుఁగు – తియ్యని తెనుఁగు – ఒత్తక్షరములులేని తెనుఁగు – సంయుక్తములే లేవనిపించు తెనుఁగు – నోరుతిరుగని ఘోరసంయుక్తములు నిజముగాలేనితెనుఁగు – కోమలాక్షర బహుళమైన తెనుఁగు – 'అపారుష్యం సౌకుమార్యం' అన్నంతకు అతని భాష సౌకుమార్య గుణపూర్ణము.

ప్రాఁదెనుఁగుగాక – మారుమూల తెనుఁగుగాక – సంస్కృత పదములను వడించి ఆంధ్రనామ సంగ్రహములోవలె వరిగట్టుకొని కృతకముగా పుట్టించిన తెనుఁగుగాక – అచ్చతెనుఁగను చచ్చు తెనుఁగుగాక – ఒకానొక మాండలిక భేదమయిన తెనుఁగుగాక – తత్సమ తద్భవ పదములు తగుపాళముగా గలుపుకొని దేశితనము ప్రాచుర్యముదప్పని తెనుఁగు – సులువైన తెనుఁగు – తేలికగా నుచ్చరించదగిన తెనుఁగు–తెనుఁగు పొలము నలుపొలిమేరలను తెలియగల సగటు తెనుఁగు – ఇంకను బ్రతికియున్న తెనుఁగు – అనగా ప్రసిద్ధ పదములతో ఝుటితిస్ఫూర్తి గలిగించు నన్నంతకు అతనిభాష ప్రసాద గుణప్రకృష్టము.

దీర్ఘ సమాసమున కొదగని తెనుఁగు – పదముల చివరక్షరములను రూపవికారమునకు లోనుచేయని సమాసపుకట్టుగల తెనుఁగు – అల్పసమాసమో, అసలు అసమాసమో అయిన తెనుఁగు – గణమునకు పదమువంతునతెగి, పంక్తికొకసకో పంక్తిలో యతివరకో అభిప్రాయముకూడ తెగి జానపద పదరవణ మాచికొన్న తెనుఁగు – అనఁగా "పృథక్ పదత్వం" అన్నంతకు అతని భాషా రచన మాధుర్య గుణనిర్భరము.

ఈ గుణము లొకదానినొకటి పెనఁగొని, గుణ సమష్టియందు వైదర్భి రీతియై భారతీ వృత్తిని సంతరించుకొని హాస్యశాంతములను పలికించగల్గుచున్నది.

ప్రసాదమెచ్చుగానుండి దానధర్మవీరములకు తగిన వాహికయు నగుచున్నది. అసలది అన్ని రసములకు అన్నరసమేయని ఆలంకారికుల మతముగదా! "కావ్యస్య సర్వ రసాన్ ప్రతి సమర్పకత్వమ్ సప్రసాదోగుణః శబ్దార్థయోః స్వచ్ఛతా ప్రసాదః సచ సర్వరస సాధారణః సర్వరచనా సాధారణశ్చ" యనిగదా అభినవుని మాట.

యమకానుప్రాసములలంకారములట - శబ్దాలంకారములట! ఉపమా దృష్టాంతాదులు నలంకారములట - అర్థాలంకారములట. అలంకారము లలంకారములే గాని అధికములుగావు. కావ్యమునకాత్మగావు. ప్రాణములుగావు, దేహమునుగావు. దేహముమీద పెట్టుకొను వెండి బంగారు నగలు మాత్రమగునంతే. పెట్టితీయ నను వైనవి. పై మెఱుఁగులు. వానిని తీసివేసినచో, కావ్యాత్మకుగాని, ప్రాణమునకుగాని కావ్యశరీరమునకుగాని హానిలేదు; గ్లానిలేదు. రమ్యాతిరమ్యము; ఉచితాభ్యుచితము అయిన కాళిదాసుని ఉపమనాతని కావ్యమునుండి తొలగించినచో కాళిదాసుని కావ్యాత్మకు, కావ్యము ప్రాణదేహములకు ప్రమాదములేదు, బ్రదికియేయుండును. రస మహితముగానే మిగిలియుండును. ఇది మనవారి కావ్యసిద్ధాంతము.

ఇచట వేమన అలంకారము మానెట్లున్నదని అడుగఁగును. అరయదగును! ఉపమకు కాళిదాసుని జెప్పిన, దృష్టాంతమునకంత కెక్కువగా చెప్పుకోవలసిన వాడు వేమన్న.

అలంకారములు పెట్టు సొమ్ములపాటివని తీర్మానించినట్లే వేమన అలంకారమును వాడియున్నాడా యన్నది ప్రశ్న. కాదని సమాధానము చేయవలసి యున్నది. దృష్టాంతమున్న పంక్తులను పద్యమునుండి పరిహరించినచో పద్యము భంగమగుననికాదు చెప్పవలసినది. దృష్టాంతమువినా మిగిలిన పంక్తులలో చెప్పిన విషయము సంపూర్ణము, బలవత్తరము, హృదయస్పందకము నగునాయన్నది ప్రశ్న. ప్రత్యక్షముగానే చూడవచ్చును.

"ఉప్పుకప్పురంబు నొక్కపోలికనుండు చూడజూడ రుచుల జాడవేఱు
పురుషులందు పుణ్యపురుషులు వేఱయా ........ ...."

ఇందులో దృష్టాంతభాగమును కత్తిరించిన నిక మిగులునది "పురుషులందు పుణ్యపురుషులు వేఱయా" యనుభాగము. అందు ఇక ప్రాణస్పందనమేమైన మిగిలిన దేమో మీ యనుభవము నడిగిచూడుడు. అసలది అసంపూర్ణముకాదేమో యరయుడు. పురుషులలో పుణ్యపురుషులను వేరుగా కనుగొనవలెనని - అది అనుభవమున చేయ వలెనని కర్తవ్యము ఉపాయమునుకూడ "చూడజూడ రుచులజాడ వేఱ"ని దృష్టాంత

భాగమే నిర్దేశించుచున్నదిగాని, మిగిలిన విషయ వాక్యములో లేనేలేదుగదా!

"చిత్తశుద్ధిగలిగి చేసినపుణ్యంబు కొంచెమైననదియు కొదువగాదు" అను కథనము "విత్తనంబు మఱ్ఱివృక్షంబునకునెంత"యన్న దృష్టాంతములేకుండ వినదగినదా? ఆ చప్పనిమాట యీ దృష్టాంతముతో మరి మఱ్ఱిచెట్టంతయినది. పేదవాని పూజాదరముల విలువకు కొలకలిగినది.

"ఇహమునందు ఫలములింపారలేదట, పరమునందు సుఖముపడయుటెట్లు?" అన్నది ప్రశ్నము మూడవపాదమున దృష్టాంతములేకున్న ప్రశ్నము ప్రశ్నమే - దానికిక సమాధానమేలేదు. ప్రశ్నమే అతని ఉద్దేశమా? అయిననది యాతని వైఫల్యమగును ఆ ప్రశ్నకు దిక్కును తెన్నును లేకపోవును. ఇహములో లేనట్లు పరమున లేదనియా? పరమందున్నట్లు ఇహముననున్నదనియా? ఎటునుంచి ఎటుచూడవలెను- "మొదలులేనిచేవ తుదనెట్లుకల్గురా"యని ఎదురు ప్రశ్నవేసి దృష్టాంతమిడినచో గదా మొదలి ప్రశ్నకు దిశతోచుట.

ఇక దృష్టాంతము నష్టమైనచో వేమన పద్యభాగము నేమని చెప్పుకోవలెను? తలతెగిన మొండెమని. అంతే. అంతకన్న నింకేమనగలము? ఇక నలంకారము వేమనలో కావ్యశాస్త్రజ్ఞులు చెప్పిన చొప్పున కేవలమలంకారముగానే యున్నదేమో మీరే నిర్ణయించుకొనుడు. మరి కావ్యశాస్త్ర నిర్ణేతలను తప్పుపట్టలేమనుకొందురేని వారి సూత్రీకరణకు వేమన యపవాదము (Exception) అని చెప్పుకోవలసినదే.

ఆ కావ్యశాస్త్ర నిర్ణేతలతో విభేదించుటకు సాహసమున్నచో వేమన అలంకారమును వాడిన తీరు చూపించి ఎదుర్కొనవచ్చును. అలంకారమును నిర్మించుటలో నున్నది, మితి ఎఱిగి వాడుటలోనున్నది. అంతేగాని అలంకారమనగా అలంకరించునట్టిదిమాత్రమేయని భాషమూలములనుదడవి తీర్మానించుటేమి విశేషము? కావ్యము నొకదేహముగా రూపకముజేసి అలంకారములను దేహమునకు మనుష్యులు జేయుటకైసేతగా చెప్పిన ధోరణి నింకింత యనుసరించి చూడవచ్చును.

ఈ అలంకారములను కైసేసికొను శరీరమెట్టిది? కావ్యశరీరమనగా కావ్యగత శబ్దరూపము. కావ్యము శబ్దరూపి. శరీరమునకు సహజసిద్ధమైన లావణ్యము శోభయున్నవి. కావ్యశరీరమునకు ఆ సహజలావణ్యముండవలదా? ఉన్నదన్నచో అదిమెట్టిది? ఎందున్నది? శరీరము శబ్దరాశికాగా, అది శబ్దగతముగా నుండవలసినదే. అయిన శబ్దగత లావణ్యమనగానేది? శబ్దశోభను శబ్దాలంకార గుణము

లుగా చెప్పుకొన్నాము. ఇందుశబ్దాలంకారములు శరీరసహజశోభ కాదన్నారు. మఱిగుణ రీతివృత్తులన్న శబ్దశోభనుగాని అట్టి లావణ్యమన్నారా? అనలేము. వానిని శరీరము యొక్క నిసర్గశోభయనుట వానిని కించపరచుటనుకొన్నారుకాబోలు, ఇంకను పైనబెట్టి చెప్పినారు. మానవప్రాణియందు శౌర్యము ధైర్యము దయ సత్యము శౌచమువంటి గుణములాంతరికమై ఎట్లున్నవో, ఓజస్సు ప్రసాదము మాధుర్యమునని చెప్పుకొన్న కావ్యగుణములుకూడ శారీరకములుగాక అంతరికమైయున్నవన్నారు. ఈ కావ్య గుణములు రసభావములను పలికించునన్నారు. రసము కావ్యమున ప్రాణము, ఆత్మయన్నారు. రూపకమునిట్లు దీర్చినవారు గుణాదులను ఆత్మధర్మములనజొచ్చి నారు. అనగా ఆత్మనిర్గుణము కాకపోవును. కావ్యశాస్త్రమున ఆత్మనిర్గుణమన జెల్లనిమాటయైనది. కావ్యశరీరమునకా సహజలావణ్యమనుమాటకూడ ప్రసక్తించక పోయినది. రూపకముజేసి పొగలాగిన కలుగునవర్థములిల్లేయుండును. కావ్యమునకు రసమునాత్మనుచేసినపిమ్మట ఔచిత్యమును అరసమునకు జీవితమన్నారు. రూపకము రూపకముగా నిలువలేకపోయినది. రూపకముజేయుకుండ ఆయా విషయములకు ప్రాధాన్య భేదమును నిశ్చితముజేసి చెప్పుకొనుట నయము

అక్షరావృత్తిలేని శబ్దశక్తి గుణమని, ఆవృత్తిమూలమైన శబ్దశక్తి(నాద శక్తి) అలంకారమని వ్యవస్థజేసినారుగదా! ఆవృత్తిలేని పదరచనమందలి నాదము ముందు ఆవృత్తివలన గలుగు నాదమును చులకనచేసినారు. శబ్దమున అలంకారము కన్న గుణము గాఢమన్నారు. ఆవృత్తిలేని పదరచన రసభావములను ధ్వనించగలదని అక్షరావృత్తితోడిపదరచన రసమును ధ్వనించజాలదని తీర్మానించినట్లున్నారు. ఈ విభజనకృతకము – విపరీతము, ఈ తారతమ్యము అనుభవమునకు విరుద్ధమునని వివేకించుకోవలసియున్నది. వేమనయందిప్పటికే యదికొంత చూచినాము.

పాశ్చాత్యులు శబ్దముయొక్క నాదశక్తిమీదనెంతో ప్రయోగముచేసినారు. ఎంతో అతివాదమును జేసియున్నారు. అర్థమయములుగా శబ్దముల సంయోజనకంటె నాదముగా శబ్దములసంయోజన పద్యములలో అర్థమును ఆవాహనచేయును, అభి వ్యక్తికి అనుభూతికి దెచ్చును.... శబ్దముయొక్క నాదమునకు చలించిపోదుము, అర్థముతో సంబంధము తెగిన శబ్దముల నాదమునకుకూడ చలించిపోవుట ఎంతేని నిజము...." "కవితను అర్థముతోగాదు, ఊహతోగాదు, నాదముతోనే శబ్దముతోనే కూర్చెద"మని శపథముజేసి ప్రయోగములుజేసినవారు వారు. మలార్మే, రింబాడ్, ఆలెంపో, స్విన్ బర్న్, జాయిస్ మున్నైనవారిప్రయోగములిందు తలపొలము ద్రొక్కి

నిలిచినవి. అక్షరావృత్తియునికిలేములతో గలుగు శబ్దముల నాదశక్తిలో ఎక్కువ తక్కువలనుమాత్రము వారెవ్వరును ఎంచినవారుగారు. శబ్దముల నాదసారూప్యము నతివేలముగా వాడినారు. ఉచ్చారణనటునిటుజేసికూడ పదముల నాదసారూప్యమును సాధించి అర్థశక్తిని పెంచి చూపించినారు. అర్థశక్తిని దిగద్రొక్కిన నాదశక్తి ఒకేఒక్కటి విశ్వరూపమును చూపజాలదని పాశ్చాత్య సాహితీవేత్తలను కడపటికి వారిని నిలువరింపవచ్చును. అదివేరుమాట.

ఆప్రయోక్తలుగాని, వారితో భేదించిన సాహిత్య సిద్ధాంతులుగాని Alliteration and Assonances- అనుప్రాసముయొక్క నాదశక్తిని, తద్విరహితముగా యితర విధమున శబ్దరచనయందుగల నాదశక్తిని తారతమ్యముజేయునవసరమునకు లోనుగాలేదు. శబ్దముయొక్క శబ్దశక్తినావిష్కరించుచు పాశ్చాత్యులు చేసిన సాహిత్యోద్యమ ప్రభావమున బడి, దానిని తలకెక్కించుకొని, తన కవిత్వమును కావలెనని అనుప్రాసానుప్రాణికము జేసికొన్నవాడు శ్రీరంగం శ్రీనివాసరావు. విప్లవ సన్నివేశమునకు వలసిన వీరరౌద్ర రసముల విలయతాండవమును అనుప్రాస ముఖమున శ్రీశ్రీ సాధించగల్గినది ప్రత్యక్షోదాహరణము. అక్షరావృత్తి రూపమైన శబ్దాలంకారమునుబట్టియున్న నాదశక్తి - అనుప్రాసవాసితమైన భాష రసభావములను పలికింపజేదనుట వెఱ్ఱి. యమకము, దానిచాయ హాసోపహాసములను పలికించగలదనుటకు వేమనయేసాక్షి. ఆవృత్తికలిమికి, ఆవృత్తిలేమికి నిట్టిభేదము కృతకము, విపరీతము, అనుభవ విరుద్ధమని చెప్పకతప్పదు.

కాకున్న నొక జాగ్రత్తయవసరము. యమకానుప్రాసములు నియత రూపములు. గుణములందంతగా భాష, శబ్దరచన నియతరూపముగాదు. అతినియత రూపములు అభ్యాసమునకనువైనవి. వానియందొక యాంత్రిక సౌలభ్యముండును. అందుచే వానిని సాధించుటొక అలవాటుగా క్రీడగా, మించి వ్యసనముగా మారు అపాయమున్నది. రసముతో నిమిత్తములేని శబ్దక్రీడకు బానిసైపోవుట సులభము. మితిదెలిసివాడు నిగ్రహమిచట ఎక్కువగాకావలె. నంతే గుణసాధకమైన రచనాభ్యాసములో యీ ప్రమాదములేదు.

ఉపమానానుప్రాసములకు మనవారలంకారములని పేరిచ్చినదే దుర దృష్టము. పాశ్చాత్యులు వానినట్లుపిలువలేదు. తీసికట్టుచేయలేదు. తగిన పేరిచ్చినారు; తగిన స్థానమిచ్చినారు. మనమలంకారమన్న వానిని, అనని మరికొన్నింటిని

Figure of Speech యని, "ఇమేజరీ"యని పిలిచినారు. * అర్థవంతముగా బిలిచినారు. ఊహయొక్క ఆలోచనయొక్క ఆదిమావస్థ గుర్తులోనుండునట్లుగా, ఊహ యను వ్రూనుయొక్క తల్లి వేరును త్రవ్వి తడవిచూపించునట్లుగా పేరిచ్చినారు. పేరిచ్చుటేగాదు. విషయదృశ్యీకరణము శబ్దముయొక్క అర్థశక్తినిబట్టియేగాకుండ నాదశక్తినిబట్టికూడ యున్నదని – Verbal and Visual Image – చెప్పుకొన్నారు. అర్థమునుబట్టి దృశ్యీకరణము భావుకత్వముయొక్క (Imagination) ఫలము. అది భావయిత్రీప్రతిభ. విశేషించి భావజాతమును (Emotion, Feeling and Mood) శబ్దించగల శబ్దరచన, భాషారచన కారయిత్రీప్రతిభకు ఫలము.

అక్షరముల నాదసామ్యఘటనగూడునట్లుచేయు శబ్దరచనను గాని, రూపగుణ సామ్యమును పర్వత్ర సాక్షాత్కరించుకొనిచేయు నర్థరచననుగాని అలంకారము మాత్రముగాను, అల్లకపు వగిషీపనిగాను, అద్దకముపనిగాను పాశ్చాత్య సాహిత్యకులు చూడరు. ఇమేజరీని జరీబుతానేతగా తీసికోరు. నాదసామ్యము అర్థసామ్యము రెండును రసవ్యంజకములుగానే గమనించుచున్నారు. ప్రపంచమందున్నయన్నివస్తువులను అన్ని విషయములను ఒండొంటితో ననుబంధించు ఏకత్వభావమును దర్శించుటలోనే కవిత్వముచెప్పునట్టి సత్యమున్నది. విశ్వగతౌపమ్యమును కవిభావుకత్వమొకటే (Imagination) అవగతము చేసికొనును గావున మానవునిశక్తులలోనికెల్ల అత్యంతము శాస్త్రీయమైనదిదే. సంబంధములేని విషయములందు సంబంధమనునదే అసలు కవిత్వములో అర్థమిడునదగుచున్నది. పోల్కిలేమిలో పోల్కియునికని దర్శించుటందే ఆనందానుభవము"యని [ఆర్చిబాల్డు మెక్లీషు "కవిత్వము – అనుభూతి" (పుట-69)లో సిసిల్ డే లీవిస్ను, ఫ్రెంచికవి బౌదిలైను, వర్డ్సువర్తును ఉదాహరించు

---

* The repetition of syllables is a conspicuous phenomenon at the very origins of language.

The rhythym and assonance, pun and rhyme are not artificially created ornaments of speech: the whole evidence indicates that their origins go back to primitive and infantile forms of thoght and utterance in which sownd and meaning are magically interwoven and association based on sound – affinities is as legitimate as association based on similarities ... Page 315

Visual images and symbols are not fancifvl embroideries of concepts but precursors of conceptual thought ... Page 325, chapter Image – Poetry and Experience.

చునన్నాడు]పాశ్చాత్యులు భావింతురు. *సార్వత్రికమైన దృష్టాంతము లేక విశ్వగతా సమ్యము (Universal Analogy) అన్నది బౌదిలైరు మాట. పాశ్చాత్యుల సాహిత్య సిద్ధాంతమున ఆమాటతెచ్చుకొన్న ప్రాచుర్యమింతంతగాదు. పోలికలేనివానిలో పోలికను కనిపెట్టుటే, కలిగించుటే కవితలో భావుకత, ఊహాశాలిత్వము. నిత్యము పరిచితమైన వస్తువును ఘటనను ఒకకొత్తప్రాధాన్యస్ఫూర్తిలో గాంచునట్టి మేధాసద్యః స్ఫురణము (Intellectual Illumination) పొందగా ఒకానొక అద్భుతభావావేశము సముద్రపుపోటు (Oceanic wonder) వలెపొడిచి, అహంతాధిగమమైన సామాధ్య వస్థలోగొన్నపిదప ఆవేశక్షాళనమున (Emotional catharsis) తేలికొనుటే(రస) రామణీయకానుభూతి(Aesthetic Experience)యొక్క సారము ** దీనికే ఆర్కిమెడీసుఅనుభవించిన "యురేకా" అవస్థాకమమని పేరిడినారు. యోగి-కవి - శాస్త్రవేత్తవ నునీముప్వురయనుభూతిక్రమ మిదేయని శాస్త్రజ్ఞులనుచున్నారు.

పోల్కికిపొలమనిపించనిచోట పోల్కిదొరికించుకొనుట, అపరిచితినుండి అసంబంధమునుండి సుపరిచితిని సుసంబంధమును వెలయించుట, ఎల్లప్పుడునెల్లవారి ఎఱుకనే యున్నవానిని ఒకకొత్త కోణమునకెత్తి ఒకకొత్తవేషమునబెట్టి వెలువరించుట- అపూర్వసామ్యదర్శనము అద్భుతభావవ్యాప్తి రామణీయకానుభవమునందున్న విశేషములు.

---

* If the poets of England were questioned on ,the ultimates of their art, they would all reply... that poetry's truth comes from the perception of unity underlying and relating all phenomena. The poet's imagination, he(Charles Baudelaire) wrcte is 'the most scientific of all faculties because it alone comprehends 'the universal anology....It is precisely the relation of the unrelated which mean in poetry. To Wordsworth, for one, " the pleasure which the mind derives from the perception of similitude in dissimilitude ... is the great spring of activity of our minds....'' chapter 'Metaphor'- Poetry and Experience - A MacLeish.

**The intellectual aspect of this Eureka process is closely akin to the scientist's - or the Mystic's - " Spontaneons illumination'' : Perception of a familiar object or event in a new significant light; - its emotive aspect is the rapt stillness of oceanic wonder'' the two togetheer - intellectual illumination and emotional catharsis are the essence of the aesthetic experience'' P 328 · chapter Image, The Act of Creation by Arthur Koestler.

ఈ సిద్ధాంతము మొగమెఱుకలేకుండ కట్టమంచి రామలింగారెడ్డి గారు వేమన కవిత్వమున విశేషగుణముగా పట్టిచూపించినదిదేయగుట ముదావహమైన యదృచ్ఛాఘటనము. చూడదగియుండును.

"మనము ప్రతిదినముచూచుచు 'నంతేకదాయని' ఆదరము అవధానము నుంచని విషయములనే యీతడు గ్రహించి భావనాశక్తిచే కాంతిరూపము ప్రాణము నావహింపజేసి యెదుటనిలుపగా, గుర్తుతెలియక పూర్వముమనచే లెక్కింపబడని వయ్యును, నిదియేదో యమానుషవిగ్రహములని విస్మయముచెంది గారవింతుము.... సామాన్యవస్తువులకేదో ఒక కామరూపమునిచ్చి వెలయించుట యీతని మాహాత్మ్యములలో నొక్కటి" – కవిత్వతత్వ విచారము పుట 21.

అట్లే ఇతని అలంకార సామగ్రిసర్వము పల్లెటూరి పేదపెద్ద కాపులయిళ్ళు వాకిళ్ళు వంటిళ్ళుపెరళ్ళు పసులకొట్టములు పంటపొలములనుండి సమకూర్చుకొన్నవి. అంతేగాని, పురాణపురుషుల నడవళ్ళనుండి, *ఇతిహాససన్నివేశములనుండి, పురాతన ఆలంకారికసామగ్రి సంభారమునుండి, ప్రాతకవి సమయముల పట్టీనుండి పుచ్చుకొన్నవిగావు. ఎవరో ఎప్పుడో పుస్తకములకు పుక్కిటి కథలకు ఎక్కించిన ప్రపంచమును ప్రకృతిని రెండవచేతి వాడకమునకు గైకొనక, తనకళ్ళతో తన యింద్రియబుద్ధులతో తాను పుట్టిపెరిగిన పల్లె జీవితమునుండి ధారాళముగ నేరితీసికొన్నవి. అనగా, ప్రకృతి కవుల (Nature Poets) వంతున, ముగ్ధమోహన ప్రకృతి సౌందర్యమున కెగబడి అందుండి రంగురంగుల పువ్వులను, పిట్టలనుగాదు అతడెంచుకొన్నది. పల్లెటూరి కాపురముల పరిస్థితులనుండి, కాపులచెమటచిత్తడినుండి, బ్రతుకునకై వారు పెగుగులాడు ప్రకృతినుండి, వారి చేయిక్రిందమలగిమెదిగిన పరిసరమునుండి తీసికొన్నవి. అరువు, అప్పు, తిరిపెము దొంగతనమనిగాక పిత్రార్జితమునుకూడ త్రోసిపుచ్చి స్వార్జితమునేనీతిచేసిచెప్పిన వేమనగదా, ప్రాతపోలికలను ప్రాతకవిసమయములను ప్రాత ప్రాధాన్యమునను ఆ వంతునజూచి వానిజోలికిపోలేదు. అతని అలంకార సామగ్రియంతయు స్వార్జితము, అనిదంపూర్వము. ఒకవిషయమరసిన జాలును. వేమన వేయిమార్లయిన స్త్రీప్రసక్తి దెచ్చియుండును. అందాతడు స్త్రీని జెప్పుటకు పల్లవపాణి పద్మనయన, చంద్రాస్య, చక్రస్తని, కంబుకంఠి, కీరవాణి అలివేణి, కుందరదన, బింబోష్ఠివంటి ప్రాత ఆలంకారిక పర్యాయపదములను స్త్రీయెడ

---

* పురాణ పురుషులనెన్నలేదనిగాదు. చాలతక్కువని. అంతలోను వారికి తన చురుకు చూపించినాడు.

వాడుకచేయకపోవుట కొట్టవచ్చినట్లు కనిపించును. పట్టివేవకితిమేని తోయజాక్షి వంటిది ఒకటిరెండుచోట్ల కానవచ్చెడిని. ఆలు, ఆడుది, చెలి, నెలఁత, తొయ్యాలి కొంత, రమణి, సతి, స్త్రీవంటి శబ్దములే అతనియందున్నవి. స్వానుభవమను దానినిమీరిపోడు. సింహము మృగరాజని అతడు వినలేదా? చదువలేదా? సింహము నాతడు ప్రస్తావించలేదా? కాని తానుదానిని చూడలేదు. దాక్షిణాత్యులే దానినెఱుఁగరు. అతడందుచే పులిని మృగరాజన్నాడు. "పులి నిదెట్టిదనిన భూలోకమృగరాజు...." అనగా అతని స్వానుభవమితి, స్వాభిమానసంస్కృతి, స్వాతంత్ర్యము సాటిలేనివి. ఇకనాతని ఉపమావస్తుసంపద:

ఉప్పుమిరియములు నేయినూనియలు పాలువెన్నలు చిల్లగింజ మల్లగి దుంపలు, జంతికచక్కిలములు, కస్తూరికప్పురములు, పులుసుతగిలిన విరుగుపాలు, మరగ్రకాగి పొంగుక్రిందలోలోనిగిరి ఒక్కమారాపొంగులొట్టపోవుపాలు, పాలు మర గించిన మంటికుండక్రింద బీటలువిచ్చిపోవు నాపబండ, గుడ్డదోపిననాగు చిల్లికుండలు, ఏమియుచేయగాని ఓటికుండలు, నీరుచవిలినంతనే విచ్చిపోవు పచ్చికుండలు:

పిండెము పొడు చేదుపుట్ట అయి, పండిన తియ్యనగు బుడమదోసకాయ, కావులో పడవేసినను పండని పచ్చికాయలు, పండిన పొలములో నల్లుకొన్నవల్లేళ్ళు, పంటచేనిలో ఏరుకొను పరిగెకంకి, చేనినడుమ చేసికట్టిన వెఱబొమ్మ, చెట్టుమొదల ను డి చివరలేకుండుచేవ, పైనబాగు డి లోనపురుగులుండు మేడిపళ్ళు, రాలుగట్ట వంకలేకుండ తిన్నగా పొడవుగా నెదుగు పొట్లకాయ, మహావృక్షమును విక్షేపించు కొన్న మట్టిగింజ, ప్రతి ప్రొద్దునను పలుదోమగాతోమగా చేదనిపింపనివేము, కత్తుల కవచమువంటి తొక్కక్రింద తియ్యని తొనలుదాచినపనసపండు, విత్తనము నుండి మోసెత్తుచునే ముళ్ళతో వెళ్ళబారు తుమ్మచెట్లు. మల్లెపూవు వాసననైనను మరుగున బెట్టు ఉల్లి కాడలకంపు:

పుట్టలోపుట్టిచచ్చుచెదలు- పేడలోపుట్టి పేడనేతిని పేడలోపొర్లు పేడపురుగు- పుట్టలోదాగుండు పాములు - కొలనిలోకొక్కెరలు - పొలములోఓడెలు కొంకు కొంగలు- రాతిలోకప్ప- బురదలోపంది- మురికిలోముసురునీగ- తీపికై తేనెలోకెగసి తెగటారునీగ- తేనెగూర్చి తెరువరులకుకొల్పోవునీగ- కడుపుసొచ్చి కలవరపెట్టునీగ ఎలుకనుపట్టినమీద కోడినిపట్టనేర్చుపిల్లి -కోడినిపట్టిపిలిచినపలుకనిపిల్లి - కంచముకడ కాచుకొన్నపిల్లి- బోనుపెడలజూచునెలుక- తవుడుగంపలోబెట్టకముట్టనీయని కొన్న బట్టె- గడ్డివేయ కొమ్మాడించుపోట్లగొడ్డు- దొమ్మతెవులుతగిలి కుదిరినమీద మంచి పాలిచ్చుగేదె- కుడితిక్రొదావనలవడివిడినీరుముట్టనిబట్టె- గంగిగోవు, చెనటిగోవు- దాలి

గుంటలోని కుక్కకుదురు- కుండలదొంతి పడద్రోయుబేగావి పేర్చనేర్చనికుక్క- చెప్పుకొఱుకుకుక్క- గాజుటింటప్రతిరూపములుజూచి తబ్బిబ్బగుకుక్క- గ్రుడ్డిదయ్యి ఆడుకుక్క- ననుసరించుకుక్క - పళ్ళురాలిపోయికూడ ఎముకగఱచుకుక్క - వంక తియగానికుక్కతోక- కుక్కబోనువాత జల్లినకూడు;

సవతిసొంతతల్లుల పెంపులందలి తారతమ్యము- మగనికిచ్చకమునటించి ఏమరించి పరునిపొందు మాయలాడి - తోడినతఱుగకఊరునూటచెలమ-వానతోవచ్చి నిలువని వడగండ్లు-పూలవాసనకఱగని పులికంపు కల్లటికె-కట్టపన్ను కట్టించుకొన్న తొట్టివాడు, కొఱతవేయమని యడిగినదొంగ- కొఱతపైనుండి కూడడిగినదొంగ....

ఈ సామగ్రి సొంపైనదేనా? అసలిది కవితలో అలంకారమునకు సామగ్రి యేనా యనుసంశయము కలుగదా? ఇంత చప్పని పరిస్థితులనుండి ఇంతకాంతిహీన మైన ఆకాశముక్రింద, శ్రీమదూర్జితమైనవిభూతి వెలిగించకున్న పేదవాతావరణ నుండి తన అలంకారదృశ్యములు (Images) మొత్తమును సృష్టించుకొననెంచిన కవి మాత్రుడింకొకడీతనికి ప్రపంచకమున జతకున్నాడనుట సందేహమే. కాంతిలేని యీ వాతావరణమునుండి దృష్టాంతములెతుకొన్నవని ఆనందానుభవమున, అద్భుత మున ముంచెత్తుననుకోగలరా? సిద్ధాంతము జేసియున్నందున పళ్ళబిగువుజేసి తప్పని పరియై "ముంచెత్తకేమి?"యని మొరాయించవలసినదేగాని అచ్చముగా చలించని విశ్వాసముతో చెప్పలేరనవచ్చును.

రమ్యం × జుగుప్సితమ్—ఉదారమ్ × అథాపినీచమ్
ఉగ్రం × ప్రసాది — గహనం × వికృతంచ—వస్తు
యద్వాఽపి × అవస్తు—కవిభావకభావ్యమానమ్
తన్నాస్తియన్నరసభావముపైతిలోకే— అనిగదా సిద్ధాంతవాక్యము.

అసహ్యము నీచము వికృతము అవస్తువుఅనిపించుచోగూడ కవిభావనాప్రభా వమునరసభావము పొందవలసినదేనన్నవాడును మొత్తమింత నీరస నిరుత్సవ నిరలం కారమైన వాతావరణమునుజూచి జడిసికోవలసినదే. "హీనంగా చూడకుదేన్నీ, కవితా మయమేనోయ్ అన్నీ, కాదేదీ కవితకనర్హం, ఉండాలోయ్ కవితావేశం, కానీవోయ్ రసనిర్దేశం" అన్నవారుసైతం ఇంత అనుత్సుకపరిసరములలోపడలేదు.

సుభాషితములు ముందుగా మూర్ఖునిగూర్చి చెప్పినవి. వేమన తన నీతులకట్లు మూర్ఖునితో శ్రీకారముచుట్టకపోయినను పైననుకొన్నట్లు 'అవస్తువు'ను

దృష్టాంతముజేసి చెప్పినదానినిబట్టి వేమన మూర్ఖవర్ణనమును ముందుగా చూడ నగును.

> "తుమ్మచెట్టుముండ్లు తోడనేపుట్టును విత్తులోననుండి వెడలునపుడు
> (కాని)మూర్ఖునకును బుద్ధిముందుగా బుట్టురా...."

ముళ్ళుతుమ్మ దృష్టాంతమైనది: చాల అరుదైన విషయము. తుమ్మ చెట్లను తుమ్మపీకలను చూడనివారెవరున్నారు. మొలకతుమ్మను మాత్రము చూడ కున్నామా? విత్తనమును చీల్చుకొని పైకివచ్చునపుడే మెత్తనిముల్లు చూపుచునే వచ్చును. మొలక తెలుపువిరిగి పచ్చకుదిరుగునపుడే పచ్చవిరుగక కొనతెలుపుగాని ముల్లు కనవచ్చుచునేయుండును. వేమనయది చూచినాడు. మ న సు న బ ట్టి న ది. మూర్ఖునిబుద్ధిని చెప్పదమనకొనంగా మనసులో మెదలినది. అంతే. అయిన కొంచె మంత భేదమెంచిన బాగనుకొన్నాడు. ముల్లు తుమ్మకు తోడనేపుట్టగా మూర్ఖునకు బుద్ధిముందుగానని యూరకొన్నాడు. మూర్ఖమర్దనుని జన్మచిత్రమునుముళ్ళుతుమ్మ జన్మ చిత్రముక బెట్టిజెప్పగా ఔచిత్యమింతంతగాదు, ఊగించివేయుచున్నది. మూర్ఖ త్వము జన్మసిద్ధముగాని మధ్యకల్గునదికాదు. మధ్యమాన్పదగ్గదికాదు. తుమ్మకు ముళ్ళు దీర్పలేము. వేమన లోకమును రెండుగా విభజించినాడు ధర్మసాధ్యులు దండసాధ్యులని- పొట్లకాయవంక రాయిగట్టి తీర్పజాలినట్లు వివరము దెలిపిన కుదురువారు కొందరు. ఏమిచేసినను వంకతీరని కుక్కతోకవంటివారుకొందరునని అతనిఎంగడింపు. తుమ్మచెట్టు నుపమించినది రెండవకోవవారితో. తుమ్మవలన దుర్జ నత్వముకూడ ధ్వనితమైనది. భర్తృహరియు మూర్ఖదుర్జన పద్ధతుల జెప్పినాడు. అందు ఒక్కాగానొక్కటియైన దీనికిగాని, మరొకదానికిగాని దీటైన పోలిక చాలిక కలిగిన పద్యమొకటున్నదా? చూచిమీలోమీరు చెప్పుకొనుడు. అంతేచాలును. పైకన నక్కరలేదు.

> "అనువుగానిచోట అధికులమనరాదు కొంచెముండుటెల్ల కొదువగాదు
> కొండఅద్దమందు కొంచెమైయుండదా.... .... ...."

అర్థవివరణ మిందవసరములేదు. అద్దములో కొండచిన్నదిగా కనుపించుట అందరి అనుభవమే. అనువుగానిచోట అధికులమనరాదనుమని చెప్పుటకు అద్దములో కొండను చూపించగలుగుటే ఆశ్చర్యము. నవనవోన్మేష శాలినీప్రజ్ఞా అన్నమాటను తార్కాణించు దృష్టాంతము "Images become a proof of original genius and when a human and intellectual life is transferred to them from

the poets' own spirit, they burst upon us at once in life and power" అన్న ఆంగ్లకవి - విమర్శకుడు "కోల్రిడ్జి"ని నిరూపించు దృష్టాంతముగా కళ్ళకద్దుకో వలసినదిది. కోటిసేయునుపమానము।

"నీళ్ళమీదచూడు నెఱయనోడలపర్వు బయలుమీదచూడు పక్షిపర్వు
ఆడువారి గమనమాలాగునుండురా .... .... .... ....

నీళ్ళమీదనోడ నింగిలోపక్షియు వడిగా సులువుగాపోవును. అవి నడచుటకు ఎగయుటకు తావులవ్వేగాని వేరొకచోలేవు. అందుచేనది విషయముకాదు. నింగిలోగాని నీళ్ళమీదగాని అవివెళ్ళినజాలుజాడ లేమైన దిగవిడుచునా? అనవాలుమిగులని నడకలవ్వి. ఆడువారి వర్తనములు ఆమూకిదొరకవివని చెప్పుటకింతకన్న ప్రశస్తమైన దృష్టాంతమింకొకటున్నదా? ఉన్నచో చెప్పిచూడుడు.

"పూర్ణమైనతనదు భుజశక్తికూడక భువివిచెడుగుతోడ పోరరాదు
పాలకుండక్రింద పగులదా ఆరాయి.... .... ....

పాలుగాయుకుండ మంటిజేసినకుండ. గట్టిగామికి మంటికుండపేరు. అట్టిది నాపబండనే పగిలింపగలుగుచున్నది. అయిననదొక పనిచేయవలెను. తనయందు పాలను మరగకాగనియ్యవలెను. ఆకాగినపాలతో కడపనాపబండమీద పెట్టబడవలెను. ఆవేడికి అంతశిలయు తట్టుకోలేక వక్కలుగావిచ్చిపోవును. పూర్తిగా అన్ని దిక్కులనుండి కూర్చుకోవలసిన శక్తులన్నింటిని కూడదీసుకొన్నగాని చెడుగువానితో పోరికిదిగకుము. అంతయు పమకూర్చుకొనిదిగినచో నాపరాయిని మంటికుండబ్రద్దలు జేసినట్లు దుష్టునిజయింపవచ్చును. అంతయు సర్వసన్నద్ధము జేసికొనుటలోనున్నది. దీనికి వంటింటిదృశ్యముపమానము. ఎంతచక్కగానతుకుకొనిపోవుచున్నది.

భర్తృహరికూడ పాలుమరగించు దృశ్యమును దృష్టాంతము జేసికొన్నాడు. మిత్రులొకరికొకరెంత త్యాగముజేసి రక్షించుకొందురో పొయ్యిపైకాగు పాలనుచూడుమన్నాడు. పొంగి పొయ్యిలోపడునప్పుడు, నీళ్ళతోపొంగార్చు దృశ్యమును చూపించినాడు. అది కృతకముగాను సాగదీసినదిగాను, ఎట్లోముడిబెట్టినదిగానుఉన్నదిగాని సూటిగాలేదు. చూడగలరు.

క్షీరముమున్ను నీటికొసగెన్ స్వగుణంబులుతన్నుజేరుటన్—
క్షీరముతప్తమౌటగని చిచ్చుటికెన్ వెతచే జలంబు—దు
ర్వార సుహృద్విపత్తిగని వహ్నిజొరంజనెదుగ్ధము—అంతలో

నీరముగూడిశాంతమగు- విల్చు మహాత్ములమైత్రి యీ గతిన్‌।

తత్త్వము అనుభవప్రధానము. దర్శనశాస్త్రములందున్నవి యుక్తులు, తర్కము, వాదము. కాని తర్కముచే అనవస్థ- ఏదియుతెగదు, సత్యముసిద్ధించదు. సాకులుచేసి సాకుటనెగబెట్టు సవతితల్లి తర్కము, యుక్తులు, శాస్త్రము. అనుభవము సొంతతల్లి, నిజముగా సాకునట్టిది. అదిచెప్పుటకుగాను

"సవతితల్లిచూడ సాకులునెఱపును స్వంతతల్లివలెను సాకదెపుడు
వింతలడఁచిలోని విజ్ఞానమందరా .... ...."

లోని విజ్ఞానమనఁగా అనుభవము వింతలు అనఁగా పైపై సమాచారము. సొంతసవతితల్లుల పెంపులోని తారతమ్యమిట్లు దృష్టాంతముజేసినాడు.

"మర్మమెఱుఁగలేక మతములఁగల్పించి యుర్విదుఃఖులగుదురొకరికొకరు
గాజుటింటికుక్క- కళవళపడురీతి .... .... ...."

మతములు మనుష్యుల కల్పన. అసలు మర్మమెఱుఁగనందున చేయు కల్పన. మతములవలన దుఃఖము. ఒకమతమువారొకమతమునకు దుఃఖకారణము. అద్దాలగదిలో కుక్క- తననీడనే వేర్వేరుఅద్దములలో వేరొకకుక్క-గా దలఁచి భ్రమసి, అరచి పైకొనుటవంటి భావనావ్యాపారమే యీ మతముల సృష్టియన్నాడు. మతము దైవము మనుష్యుని ప్రతిబింబమునని (In the image of man and anthropomorphism) చూపి చెప్పు నవీనభావమును నాడే వేమనకున్నదనగలబలమీ దృష్టాంతమందున్నది, విషయ కథనమునగూడ భాషయట్లేయున్నది. వేమన యింక ననేక పంక్తులలో మతమునుకాదన్నాడు. మొదటనే గమనించినాము. మతరాహిత్య మతని సిద్ధాంతము

ఇట్లతని దృష్టాంతములు నిశితపరిశీలనాఫలములు, భావుకత్వశక్తిఫలములునై విషయమును బలవత్తరముగను విశదముగను, ఎగుడుదిగుడులేకుండ గరాగరిగను, పొదుపరి తనముతోను దృశ్యీకరించగలవై, అలంకారప్రాయముగాక ప్రాణభూతమై ఆలంకారికుల సిద్ధాంతమునకెదురుతిరుగుచున్నవి.

ఇంతవరకు అలంకారప్రస్థానము. ఇకనాతని ధ్వని నిర్వహణ - అలంకారధ్వనికి ఉదాహరణము :

"జారపురుషునకును జాజిపూవులతోడ పాన్పువేయునయ్య ప్రాతలంజ
సొంతమగనిమీద చింతనిప్పులజల్లు .... .... ...."

అవినిజమైననిప్పులుగావు. చింతనిప్పులవలె కొలుపుతిట్లు, మాటలు, చేష్టలు. కాని తిట్లుమాటలునను చింతనిప్పులనిమాత్రము అనలేదు. అట్లన్నచో వాచ్యము – అలంకారము అయిపోవును. అట్లనకపోవుటచేతనే ధ్వనియైనది. అలంకారధ్వనియైనది. "సొంతమగనిమీద చింతనిప్పులుజల్లు"నని ధ్వనించినదే ప్రబలము. ప్రత్యక్షముగా ననుభవమున నెఱుగవచ్చును.

ధ్వని మనకు దొడ్డసిద్ధాంతము. ధ్వనికావ్యము ఉత్తమోత్తమమని కంఠోక్తి. ధ్వని అన్నింటికన్న వెనుక బుట్టిన సిద్ధాంతము. వెనుకబుట్టిన కొమ్ము వాడియనిపించి యన్నిసిద్ధాంతములను త్రొక్కినది. శబ్దమునకు కొత్తగా ఒక అర్థశక్తియున్నదని (పదకొండు పన్నెండు వందల యేండ్లక్రింద) కనిపెట్టినారు. అట్టి దొకటిలేదని అప్పటికి సంప్రదాయానుసారులనబడువారు అనుచుండగా ఉన్నదని రూపింపవలసి వచ్చినది. దానిని వ్యంజన, ధ్వనియన్నారు. ఇది బోనసంగా కాదనియు కాదనంగా బోసనియు నర్థమియ్యగలది. శబ్దము తనకున్న అర్థమును అపహసీకరించుకొనగా, ఆయర్థము తనుదానన్లే అవధానముజేసికొనగా మరొక అర్థప్రతీతికెదమిచ్చుటను ధ్వనియన్నారు. అదిశబ్దార్థశాసనజ్ఞానము చేత తెలియునదికాదు. కావ్యార్థతత్వజ్ఞులకే అది ఎఱుకయని ధ్వనిశాస్త్రమే చెప్పుకొనగా, ఇప్పటి మార్క్సియులొక కొందరు ధ్వనిసిద్ధాంతము Intellectual Aristocracy తయారుచేసినదందురు. ధ్వనియనుభవమునకు సూక్ష్మమైనబుద్ధి సున్నితమైనగుండె రెండునుకావలెను. మాటలవెనుకతట్టునువెదకు నేర్పు అవసరము. ఇవి సగటుమానిసి మానసికమైన శక్తిపరిమితిలోనివిగావు. లోకోక్తివతుగా కవిత చెప్పుదమనుకొన్నచో – అనంగా వార్తాకవిత్వములో – ధ్వనినాశ్రయించుటెట్లు? తాను బోధించవలసినవారందుకోలేని త్రోవనేల త్రొక్కను. అందుచేత వేమన ధ్వనిమార్గమునందంతగా నడువలేదు. నడువలేకగాదు: నడువగలవాడేకాని అతనిప్రబంధన అందుకెక్కువ చోటీయదు,

"సంద్రమునకుజూడ సరియేదియునులేదు, అట్టిజలధినీరమనువుగాదు
అనువుగానినీరమది యేమిసేయను.... .... ...."

ఇది సముద్రమునుజూచి, దాని విస్తారమునుజూచి అద్భుతముపడి, దాని నీరు కటికిఉప్పులుగావుట అరసి నిరుత్సాహపడి ఆనిరుత్సాహమునుకూడ వ్యంజించుచు చెప్పినపద్యము. కాని సముద్రముమీద జెప్పినపద్యమాయిది? అనువుగాని నీరమది యేమిసేయను? అని అతడు నీరుగారుచు నిగుడించిన నిట్టూర్పు దప్పికదీర్చుకొనవీలుగాకనా? సముద్రము ముందాతడు నిలబడగా అతనిమనసును వేధించుచున్న సంపన్ను

డైనలోభి సముద్రరూపమునెత్తినట్లు అనుభూతిపొందినాడు. అదే అట్టి సముద్రమునుగూర్చిచెప్పించినది. సముద్రముచేత సంపదగలలోభిని వ్యంజింపజేయుచున్నాడు. "అదియేమిసేయను" అని నిరుత్సాహమును ధ్వనించుచున్నాడు. ఇది భావధ్వని.

చెఱకునందునైన చెడ్డగుణం బున్న తీపివేయకుండ తినంగపొసంగ
దంతిపురముద్రోహి యాతడెట్లుండురా.... ....

మంత్రిసేనాపతులవంటి వారెవ్వరో ప్రభువుగారి అంతఃపురమున ద్రోహమున పట్టుబడినప్పుడు చెప్పినదిగా యీ పద్యమును తీసికొనకపోదుమేని, చెఱకెంతో తీపియని కొఱికి నమలుచుండగా గడనడుమ కాఱువేసిరుచిజెఱుపునెట్టితెగులు భాగమున్నచో అది చెఱపున అంతఃపుర ద్రోహమంతటిదిగా భావించి చెప్పిన పద్యమనవలెను. అట్లయినచది చెఱకుగడమీద పద్యమేయనుకొందమా? లోకవృత్తము దానియందు ధ్వనించవలెనవిగాకుండనేచెప్పినా- ఎంత తెలివిగలవాడైన, యింకెంతనుపయోగశాలియైనను వాని దుర్గుణమును మాత్రము సహించరాదు అనియిందుధ్వనికాదా?

"పొట్లకాయరాయిపొదిగి త్రాటకుగట్టలీలతోడ వంకలేకపెరుగు
కుక్కతోకగట్టకదురునా చక్కగా.... .... ....

ఇందులోగూడ అసలు చెప్పవలసిన లోకవృత్తము అక్కడమాటలలోలేదు. కుక్కతోకవంటివారుకొందరున్నారు. వారిని సంస్కరించలేము. పొట్లకాయవంటివారు కొందరున్నారు. వారి వంకరకుదర్చవచ్చును. అందరను సంస్కరించలేము. కొందరినే, యిట్టివారినేయని వేమన యీ యిమేజరీమాటున ధ్వనించినాడు.

కులమునీఱుజేసి గుంపుల బొలియించి పొసంగనేనుగంత బొంకు బొంకె
పేరుధర్మరాజు పెనువేపవిత్తయా.... .... ....

ఏనుగంత పెద్దబొంకును పొసంగునట్లు బొంకినాడనుటేగాదు- ఏనుగును వంకపెట్టుకొన్నాడనికూడ మనకువ్యంజితమౌనటకే ఏనుగంతబొంకనుమాటవాడినాడు. ఇంతవరకు ధ్వనిమాట. ఇకరసము విషయము.

కొండవేడుసూమ-కొండకూతురునాలు-కొండయిల్లు-పసిడికొండవిల్లు-
కొండవంటిదొరయుగుండయిపోయెరా [కొండవంటి
దొరయుకుంటెనదతురా]

ఇందులో పరిహాసము పలికినదా? భక్తిపలికినదా? రెండును పలికినవా?

రెండును పలుకుటకు శాస్త్రానుమతియున్నదా? ఆయనుమతికేమి? అనుభవము అనుమతించవలెను. ఆరెండింటి మేలగింపు ఆస్వాద్యమనిపించవలెను. అంతే.

గుండయిపోయెరా యన్నను, కుంటెనెనడతురా యన్నను. హాస్యమున్నది- పరిహాసమున్నది. అంతవానికి కుంటెనభూమికయా యన్నప్పుడు కొంతగా తప్పుపట్టుట యున్నదికూడ. కానియది దైవనిందకుని అపహాసముగాదోచదు. భక్తుడొకడు తన యిష్టదైవతముతో చనవునమేలమాడినట్లున్నది. పరిహాసకమాడినట్లున్నది- రెండవపక్షమున ఇదేమి లేకిపని - తగునాయని ముక్కునవేలువేసికొన్నట్లున్నది. సామితోసయ్యాటములాగున్నది. అందమైన సన్నివేశము.

"ఓసామీ! అలకొండకోయెతకు నీ యొయ్యారమే బూదిపూఁ
తే సర్వంబయినీకు నాయమనొబంగేనచ్చి కన్నారుర
య్యా! సంతానము; నేస్గుమోమొకఁడు వింతౌ నార్మొగాలొక్కడో
హో! ..... ..... ..... ..... ..... ..... ..... ..... ..... అన్నధోఁణి*
"నీకున్ మాంసము వాంఛయేని కఱవా? నీచేత లేడుండగా
జోకైనట్టి కుఠారముండ ననలజ్యోతుండ నీరుండగాఁ
బాకంబొప్పఘటించి చేతిపునుకన్ భక్షింపకాబోయచేఁ
జేకొంటెంగిలిమాంసమిట్లుదగునా? శ్రీ కాళహస్తీశ్వరా!!"
అన్నవరుసయు పోల్కియగును.

భక్తి బహుభంగులు - విరోధమునుకూడ భక్తిక్రిందికి యీడ్వవచ్చును. విరోధభక్తియే యున్నది. ఇక హాస్యభేదమునేవా భక్తి జీర్ణించుకోజాలనిది? ఈ వెక్కిరింతలు- యీతప్పులెన్నుటలను స్వామి చిఱునవ్వుతో గైకొనునని భక్తుని విశ్వాసము. కొండల కొలమానమునగాని పట్టని మహేశ్వరత్వము చిన్ని గుండ్రాయిని చిన్నెగా గైగొనుటయు కుంటెనకాడుగా [illegible]వుటయు విపరీతస్థితులు-విపరిణామము. కాని అది భక్తసులభత్వము. వేమనగొప్ప పద్యములందిదొక్కటి. రసమొప్పించున దిది. కాని వేమనఎక్కడ? భక్తిఎక్కడ? అతడుజ్ఞానమార్గస్థుడు. విశేషించి యోగి గదా, యిదేమిటిఅనవచ్చును. యోగమునకు మున్నొకకల్పమైనదశలో భక్తి ఆతనికి నున్నదనవచ్చును. గొంతెత్తి దేవునినిలువరించి ముఖాముఖియడిగినవాడు, "పలుకుమన్న నేలపలుకకయున్నావు. పలుకునన్నుగూర్చి .... .... పల్కినంతనీదుపలుకునేనెఱిఁ

*విశ్వనాథ వారి 'మాస్వామి' నుండి

గెద.... .... ....నన్నవాడు [దేవభాష తానెఱుఁగుదుననికాబోలు!] అందెంత భక్తుని ఆవేదనయున్నది! తీవ్రతీవ్రముగానున్నది.

లేదు లేదటనను లేదులేనేలేదు, కాదుకాదటన్న కానెకాదు
తోడుతోడటన్న తోడనే తోడౌను.... .... .... .... ....
తావులేనిచోట తావు తానై యుండు, తావు గలుగుచోట తానులేదు
తావుతానెయైన తత్త్వంబుదెలియుఁడీ.... .... .... ....

భక్తిని రసమనుడు-భావమనుడు అదియీపద్యములో ఉద్వేలముగానున్నది. భక్తిరసార్ణవమున మున్కఁగొని వేమన్న వెలికిదెచ్చిన ముక్తామణులివ్వి.

వెలఁది చక్కఁదనము వెఱవైన యీడును విభుని కరుణలేక వితగనుండు
నీదు కరుణలేక నేర్పులు కొఱగావు .. .... .... .... ....
అని తన సహజ ప్రజ్ఞాఫలమైన దృష్టాంతముజెప్పి భక్తినెఱపినాడు.

వేమనలో యీభక్తిరసము మాటెత్తిన వారెంతగాలేరో, అంతగా అతని హాస్యరసము ఊసెత్తని వ్యాఖ్యాతలునులేరు. అతని గూర్చి వ్రాసినను జెప్పినను హాస్యమొక తప్పనిసరి విషయమైపోయినది. అతనిలో దానికంత గుర్తింపు వచ్చినది. అందుచేదానినంతగా యిచట జెప్పనక్కఁరలేదుగాని హాస్యమునుగూర్చి వారిలో హాసోపహాసకుశలులైన వారొకరు వెలివరచిన అభిప్రాయములను చర్చించవలసివచ్చినది.

"సంఘ సంస్కారదృష్టి హాస్యమును కలుషిత" మొనర్చుననీ, "వేమన్నయు గొప్పబోధకుడు సంస్కర్తయుగావున అతనియందును హాస్యరసము కలుషితమైయున్నద"నియు నొకమాటయున్నది. 'అప్పటప్పట' వేమన దాని పరిమితులను దాటి నొవ్వులేకుండ హాయిగా నవ్వించి నందునమెచ్చి కితాబులిచ్చినను మరుగుమర్యాద లేకుండగనే అనునని ధ్రువపరచినారు. నొవ్వు లేకుండ నవ్వించుచే హాస్యములో గొప్పతనమను భావము మాత్రము భయాలాభూము. హాస్యరసమును విదూషకత్వము ను డి విముక్తిజేసినను దాని వెయ్యారు తెలుఁగుల వికాసమును పరిమితము సేయుచేయగును. హాసోపహాసములని(wit and satire) కలిగిన నేకములను ఛాయాభేదముల పలికించుటలో గొప్పతనము లేదనవలసివచ్చును. హాస్యములో మాధుర్యమునేగాని చురుకుదనము నొల్లని మనస్సుతో మాటాడుచున్నారు. అది సహృదయతాకుంచనము.

ఎంతకాదన్నను మన సంప్రదాయానుసారులతోనున్న బాధే యిది. ఆచార సంప్రదాయ విశ్వాసములతో ఏకీభవింపనివారు, వానికెదురుతిరిగినవారు ఆ

సాహిత్యమును చదివినంతగా, తమ తిరుగుబాటుతనము నవతలబెట్టి రసానుభూతి నొందినంతగా, తిరుగుబాటుదారులను చదువు కుతూహలము సౌమనస్యము, చదివి యనుభవించు సహృదయత సంప్రదాయానుసారులలో మృగ్యము. సంస్కారకుల నుండి మృదువైన హాస్యమును కోరుటలోనున్న రహస్యమిదే యనవలసియున్నది. హాసోపహాసములను హాస్యములో నంతరానివానినిగా జేయుటనవలెను. లేదా తక్కువ స్థానమునకు గుంజుటన వలెను,

విదూషకత్వమునకు పరిమితమైన హాస్యము మన సంప్రదాయము కాగా, తెలివైన చురుకైన హాస్యము తొలుతనుండి పాశ్చాత్యులందున్నది, దానికందు విలువయున్నది. అది మనకు లేదనుకొనకుండ మనకా దారిద్ర్యమును బాపినవాడు వేమన్న. ఇంగ్లీషులో ఉపహాస కవిత్వమునకు పెద్ద పేరుగల కవులకన్న ముందే మనకు వేమన యున్నాడు. కాకున్న అతని హాసోపహాసములనుతీసికొని పోషించిన వారు యిటీవలి వరకెవ్వరును కలుగక మనకొక వెలితి యేర్పడినదిగాని అందు మనకు వేమన్న "వారసత్వము" దొడ్డది. అతని హాసోపహాసము వ్యక్తులపై ప్రసరింప లేదు. సంఘములోని దంభముపైన, లోభముపైన, నిర్దయపైన, వ్యత్యాసములపైన మౌఢ్యముపైన, ఆచార విశ్వాసములపైన మాత్రమే ప్రసరించినవి. ప్రయోజనాత్మకముగాని హాస్యమతనికక్కరలేదు. కేవలము వినోదము కొరకుగా హాస్యమతనివద్ద లేదు, హాసోపహాసములున్నంతగా హాస్యమతనిలో లేదు. అది సంస్కారకుని లక్షణము. సంస్కారణదృష్టి హాసోపహాసములకు పుట్టినిల్లు. అవి సంస్కర్త ఆయుధములు. నొప్పిలేకుండ నవ్వించుటనుండి, గాయపుమందు కత్తికేపూసి కొట్టినట్లు తిట్టుచు నవ్వించుటేమి, తిట్టినను బాగుగా తిట్టినాడురా యని యనిపించుసట్లేమి, "మరుగు మర్యాదలేకుండ మోటుగా"నున్నదనిపించు వరకునుగల అన్నివన్నెలలోను హాసోపహాసములు వేమన జేసినాడు. ఏ విషయమందెవరిపట్ల ఎట్లుగా చెప్పవలెనో అట్లనే ఉపహాసము జేసినాడు. అతడు కాగితముమీదకాదు చేసినది-నిజమైన సన్నివేశముల మధ్య మనుష్యుల మొకముమీద నిన్నితెఱంగుల హాసోపహాసములను అప్పటికి తగిన మోతాదులో చేసినాడు. ఉపహాస భేదమంతయు అతనిలో నున్నది. కానియిక్కడొక చిత్రమున్నది. అతనిలో ఉపహాసము కటువుగా, మృదువుగా నున్నది యుండగా, మనయందొకరికి అందముగాదోచినది ఇంకొకరికి అసహ్యముగా దోచుచున్న జాడకద్దు.

"తల్లిగర్భమందు దాఁబుట్టినప్పుడు మొదలు బట్టలేదు తుదను లేదు
నడుమబట్టగట్ట నగుబాటు కాదొకో.... .... ...." యను పద్యము బండారు

తమ్మయ్యగారికి "సున్నితమైన హాస్యధోరణి" యనిపింపగా, అనంతకృష్ణశర్మగారికి అసహ్యమనిపించినది. ఎంతో విమర్శించినారు. ఆ మంచిపెద్దలింతకుముందే వివేకించుకొన్నాము. ఈ అనుభవభేదమేమిచెప్పను? సహృదయతలో భేదమునుచెప్పుదా?

అంతేగాదు ప్రపంచమునందు ఏ సాహిత్యములోగాని హాస్యపాత్రము లనఁగా కొన్ని రూఢమైపోయియున్నవి. తిండిపోతు, పిసినిగొట్టు, దాంభికుడు, వికారుడు, జాయాజీవుడు, పుంశ్చలీభర్త..... హాస్యపాత్రముగా తిరుగులేని యోగ్యత సంపాదించుకొన్న పిసినిగొట్టునుగూర్చి అనన్యసాధ్యమైన ఉపహాసము చేసియుండగా అదికూడ సంస్కరణ విషయముగాజూచి అందున్న హాస్యమునెట్లుగా ఆస్వాదించుచున్నారో, మూర్ఖ్యనిర్ణయము జేయుచున్నారో చూడవలసినదే.

"ఇతడు అతివాది.... లోభివారిమీద చాల అసహ్యము .... ప్రపంచమందలి లోభులనెల్ల పట్టిచంపినను పాపములేదని యితడు తలఁచినట్లున్నది. వారిని చపుటకితనిమందు".

"లోభివానిజంప లోకంబులోపల మందువలదు వేఱెమతముగలదు
పైకమడిగినంత భగ్గునఁబడిచచ్చు.... .... ....
"ఇంత అసహ్యమునందును హాస్యములేకపోలేదు. ఇంకను వినుడు."
పిసినివానియింట బీనుఁగువెడలిన కట్టెకోలలకును కాసులిచ్చి
వెచ్చమాయెనంచు వెక్కివెక్కేడ్చురా.... .... ...." యను పద్యమును

వినిపించినారు. స్వచ్ఛమైన హాస్యమని వారనుకొనుదానిలోగాదు యీ పద్యముల జూపినది. వేమనజెప్పిన నీతులలో, చేయదలఁచిన సంస్కరణములో వీని ప్రస్తావన జేసినారు. వీనికి స్థానము హాస్యరసవర్చలో లేకుండజేసినారు. ఇది వీరికి సంస్కరకుని ఉపహాసము – అపహాసము * లోభివానిమీద యింతహాస్యమునకు కడుపుబ్బ నవ్వి కమ్మని హాస్యమని నిస్సంకోచముగా చెప్పవలసియున్నచోటఁ ఇంత అసహ్యమునందును హాస్యములేకపోలేదు' అనిమాత్రమే యనుచున్నారు. తెనుఁగులో లోభివానిగూర్చి యింతకుమించి ఆస్వాద్యమైన హాస్యమిప్పటికిని వెలువడలేదను ప్రశంసకివి పాత్రములు. బండారు తమ్మయ్యగారికి నవ్వేక పించినవి. రాళ్ళపల్లి వారి రసజ్ఞతకిందు సంఘసంస్కరణదృష్టి ప్రబలి హాస్యరసమించుక కలుషితమైనట్లు

* నార్లవారికిని హాస్యము (Humour) గానే తోచినవి.
రాళ్ళపల్లివారికివలె (Satire and Irony) అనిపించలేదు.

కనబడి, హాస్యములేకపోలేదని మాత్రమనిపించినవి. కాగా, వారికి 'స్వచ్ఛమైన హాస్యము'కనిపించిన వేమన పద్యములు ఆ పిసినివానిపైనేయున్నవి.

"గొడ్డుటావుఁబితుక కుండగొంపోయిన పండ్లురాలదన్ను పాలనీదు:
.... .... .... .... .... ....
"మేకకుతికబట్టి మెడచన్నుగుడువగా ఆఁకలేలమాను నాశగాక
లోభివానినడుగ లాభంబుగలుగునా .... .... .... ...."

ఇవి "హాస్యనైర్మల్యమునకును "స్వచ్ఛమైన హాస్యమునకును వారి ఉదాహరణములు. తరతమభేదమింక పాఠక మహాశయులే నిర్ణయించుకోగలరు.

పరిహాసము పిసపాలైన గలియని "నిర్మలమైనహాస్యము" ననుభవించుట నాశించి వేమన్నను చదువనక్కఱలేదు. దానికొతనిలో పనిమాల వెదకి వెదకి పట్టి చూపించిన వొక "పుంజీ"యైన గాకపోయినవి. అట్లు చూపించినవానిలోనను ఇంకను చూపవలసినవానిలోనను పరిహాసలేశ ముఁడనేయున్నది. అదికూడలేని హాస్యమత నిలో సున్న. పాశ్చాత్యులుగాని * పాశ్చాత్య సాహిత్య వైదుష్యముగన్న రామలింగా రెడ్డిగారు మొదలు మనవారనేకులు * వేమన్నలో wit and satire ను గూర్చి చెప్పుకొన్నారుగాని కేవల హాస్యమును (Humour) గూర్చి కాదని గుర్తుగొనవలసి యున్నది, డ్రైడెన్, పోపులనేగాక వాల్త్రేరు, బెర్నార్డుషా లను రుచిచూచి రుచి చేసినవారుమాత్రము వేమన్న ఉపహాసమునుగుర్తించి విఙవిచ్చి ప్రత్యేకముగా చెప్పి నారు.అట్లు చెప్పుకొన్నది వాస్తవస్థితి – ఔచిత్యబుద్ధి. వినోదప్రాయమైన హాస్యము. మృదువైన హాస్యములతోపాటు పరిహాసరసము నాస్వాదించు సహృదయత రసజ్ఞత అలవరచుకొనకపోవుట నిజముగా వెలితియనకతప్పదు. మనసాహిత్యమున ఉపాహాస పరిహాసములు పండించకపోవుటయు వెలితియే.

"విష్ణుభక్తులెల్ల వెలిబూదిపాలైరి వాదమేల మతవిభేదమేల
తెలియలింగధరులు తిరుమను పాలైరి .... .... ...."అని యనగా

---

* బ్రౌన్ తొలి ముద్రణము శీర్షికయే ఉపహాసమును జెప్పినది.
The Verses of Vemana, moral, religeous and satirical

* తెలుగు సాహిత్యంలో హాసోపహాసాలను (wit and satire) ప్రవేశ పెట్టిన ఘనత నిజానికి వేమన్నదే. – డా॥ బి.వి. కృష్ణారావు "వేమన"వ్యాసం

Vemana had in his armoury two more deadly weapons, namely, satire and grony. –V. R. Narla in his Vemana.

ఆస్వాద్యమయి,

"బం-ద్రె తాళ్ళుతెచ్చి బంధించి కట్టంగ లింగడేమి దొంగిలించినాడో

ఆత్మలింగమునకు నర్పింపనేరరో ............" యనుదానిని నాస్వాదింపలేకపోయినది లోపేయ నవలెను.

"కామిగాక మోక్షగామికాడు" - "మంత్రజలముకన్న మంగలిజలమెచ్చు" అన్నంతకు నవ్వుకొన్న సరిపోదు: "మొదట సోమయాజి తుద కామయాజిరా," "ముంజికోకలెల్ల లంజకోకలకాయె" "బ్రహ్మయాలిత్రాడు బండిరేవున దెంచ" యన్నప్పుడును నవ్వుకోగలిగినదే సాహిత్యములో రసజ్ఞత సహృదయత్వమగును. తిట్టును బూతును కూడ కవిత్వము చేయవచ్చును. అది సర్వశః నిషిద్ధముకాదు. తిట్టు కవిత్వమైనదాలేదా యన్నది చూడవలసియున్నది. లంజకోకలు, దైవనింద యన్నంతనే చెవులు మూసుకొనుటగాదు చేయవలసినది. "బ్రహ్మయాలిత్రాడు బండిరేవున ద్రెంచ" యన్నందుకది తిట్టుకవిత్వమని పెదవివిరిచిన వారున్నారు, కవులెందరో బ్రహ్మను వడవిట్టినారు. దేవతలలో ఆతనికే తిట్లు చీవాట్లు. సృష్టిలోగల ఎగుడు దిగుళ్ళను గతుకు కుదుపులకు శ్రీనాధుడాతనిని ముడదైవమన్నాడు. మాలదైవ మన్నాడు

"ఉదధులన్ని నీరు ఉప్పులుగా జేసె, పసిడిగల్గువాని పిసినిజేసె" నని అట్లు చేసిన బ్రహ్మ చావయని చావని బ్రహ్మను అతని ఆలిత్రాడు బండిరేవున ద్రెంచయని తిట్టుగానన్నది ముద్దుముద్దుగా నున్నదిగాని మొద్దుగా మొరటుగా లేదు. ఔచిత్యమునుభంగించిన తిట్టుగాలేదు.

వేమనతిట్లెల్ల, వాడినబూతెల్ల సందర్భ సమర్థనయుండి యొప్పి కవిత్వమయినదనిగాదు చెప్పుట. అట్లుకానివట్టులున్నవి. చివుక్కుమనిపించుచుండిన వున్నవి. కాని కావలెనన్నచో అతడు పచ్చిబూతుమాటనుకూడ సన్నివేశమువ టంకమువలె అతుకకొనిపోవునట్లు చేయగలశక్తిశాలియని చూపుటే ఉద్దేశము. అట్టిపట్టులను ఆస్వాదించగల సహృదయత మాత్రము మనలో కొఱవడరాదని చెప్పుటయు ఉద్దేశము. లంజ, అంకు, అంకుచదువు వంటిమాటలు అతనియందున్నవనంగా అవి బూతులనుకొనుకంటే వాడుకమాటలనుకొనుట నిజమేమో. ద్రొబ్బు, దెంగువంటి మాటల

వంతుననుకోవచ్చును. కాని లంజకొడుకు, అంకుకొడుకునన్నవి తిట్టుబూతుగానే అశ్లీల పదములని తెలిసియే వాడియున్నాడు. ఈ పద్యమే చూడుడు.

"లంజ లంజయనుట లౌకికధర్మాన లంజకానిదెవతె రాజ్యమందు

లంజకొడుకు బ్రహ్మ వ్రాలెట్లు వ్రాసెరా..... ..... ....." ఇక్కడ బ్రహ్మను లంజకొడుకని బూతుగాతిట్టినాడు. ఎవరెన్ని తెరంగుల తిట్టినను బ్రహ్మనింత బూతునతిట్టిన వారింకొకరులేరు. కాని ఈకటిక బూతిక్కడ ఔచిత్యముగానే యొప్పినదని మనవిచేయవలసియున్నది. సృష్టికర్త నరునినడవడి నిర్ణయించువాడు. అతడు నొసట మనశిలమును నిలుపుచున్నాడట. లంజెతనమును అతడువిధించుటేమి? అదేమైన శిక్షయా, దండనయా? పూర్వజన్మలోని దుష్కర్మకిప్పుడీ స్వైరవిహారము, ఇంద్రియ సుఖము శిక్షయగునా? మెచ్చియిచ్చిన వరమగునా? దీనికర్థమున్నదా? అందుచే బ్రహ్మపుట్టింటి విశేషము తడుమవలసివచ్చినది. అతనితల్లి లక్ష్మిదేవమ్మ. ఆతల్లికి నిలుకడలేదు. మూన్నాళ్ళకొకనివరించి మూనాళ్ళపట్టపగలుచేయించు చంచల. ఆలచ్చిని లంజయనుట లోకములోనిమాట. ఆపైన లంజయనగా సంస్కృతమున రెండర్థములు-లంజెయని, లక్ష్మియని. తాంజెడ్డకోతి వనమెల్లజెరచెనని లంజకానలక్ష్మి కొడుకు లంజెలుగమ్మని వ్రాయకేమియను సమాధానము వచ్చునట్లుగా వేమన యడిగినాడు. సందర్భ బలమునకు అర్థబలమును కలిసివచ్చి ఔచిత్య పుష్కలమై కటికబూతు కవిత్వమైయూరకున్నది. "దొంగలంజకొడుకు లసలేమెసలే ఈ ధూర్త లోకంలో" యని శ్రీశ్రీ చేసిన బూతు సంగతిసందర్భమునకు తగిపోయినట్లే, వేమన బండబూతు బూతుసన్నివేశమున రసయోగము జూచుచున్నది. అది అతని ప్రౌఢి.

ఇంకొకమాట. ఉపహాసావహాసములేమో యింతజేసినాడుగాని, అదంతయు ఖండనాదృష్టి - కాఠిన్యబుద్ధి యగునేమోగదాయని ఒకమాట తేవచ్చును. దానికాక రములేదు. నిర్మూలనములేని సృజనాత్మకతే-ప్రతివాదములేని ప్రతిపాదనమే మత మని మప్పుకొన్నవారినోట నిదిరావచ్చును. కాని వేమనయందు ప్రతిపక్షమున్నంత కన్న ప్రతిపాదన యెక్కువయున్నది. ఎవరు చెప్పినకన్న అతడు చెప్పినసీతులు ఆచరణైకదృగ్విశిష్టములు-సిద్ధాంతపుష్టములు. అతడు దర్శించిన ఆర్థికజీవి స్వరూప మున్నది. అతనితత్త్వము నిష్కృష్టము. ఒకదానికొకటి సుసంగతము. పరమ కారుణ్యమయమైన మానవత - హేతుమంతమైన మానవత అతనియందున్నది. చూచియేయున్నారు. నిర్మూలనమొకానొక పాలుకలగలుపు సృజనాత్మకతయందుండు

వని నేటి విజ్ఞానశాస్త్ర పరిశీలనలో తేలుచున్న వృత్తాంతము. దానిని తార్కాణించు వ్యక్తిత్వము – సృజనాత్మకత వేమనది.

* * *

పద్యములతడు ఇంటనొకమూల నేకాంతములో గూర్చుండి వ్రాసినవి గావు. అవి జనులతో భాషించుచు జెప్పినవి. తర్కించుచు చెప్పినవి. సంవాదమున చెప్పినవి. బోధించుచు సంబోధించుచు చెప్పినవి. "వినురవేమ" యని తనుదాను రాకొట్టుకొని తనకుదాను చెప్పుకొన్నట్లుండినను కూర్చుండియో నిల్చియో ఎట్టెదుర విను వారిని రాకొట్టి చెప్పినవి; అతడు రాకొట్టినంతగా నెవరును రాకొట్టలేదు. పంక్తి కొకమారుగాదు, ఇరుమార్లుగూడ రాకొట్టగలడు. "చేడెగాదుర యదిచేవాఁడికత్తిరా"– నాడు తన్ను విన్నవారితో ఆరాకొట్టు ముగియలేదు. మనలనిప్పటికిని అతడురాకొట్టు చున్నాడు. తన్నుజదువు తెనుఁగువానికెప్పటికిని అతని రాకొట్టు తప్పదు. పాఠకు నందంతగా చనవుదీసుకొన్నాడు. అంత పిన్ననుజేసి చెప్పుచున్నాడు. ఆశ్రితులైన కవులు రాజులనే రాకొట్టి అంకితపు పద్యములు చెప్పినవారున్నారు. అందులోను ఒక రాజసమొలికించినారు. మఱి వేమన రాకొట్టుటకేమి? అతడు రాకొట్టినదే తృప్తి. రాకొట్టుటకూడ చూడగా తెనుఁగుననున్న ప్రత్యేకతఏమో. సంబోధన రకారము తెనుఁగునందతికిఎంత సహజముగా తరచుగా మన పొరుగుభాషలలో అతుకదన వచ్చును. విభక్తులకేమి, భాషావిభాగములకేమి ఎక్కడబట్టిన నక్కడ సంబోధనలో రకారమును తగిలించవచ్చును. ఆ అందమంతయు వేమన రాకొట్టునందురాబట్టినాడు.

మననాతడు వెఱ్ఱులారా యని సంబోధించి చెప్పును. అతనికతడే "వెఱ్ఱి వేమనగని వెఱఁగుపడిరి" అన్నవాడాయెను. వేమన యనుటందే యున్నాడా? వేమడుగాగూడ జెప్పుకొన్నాడు– వేమడిట్లుపల్కె వివరపు వాక్యముల్, వేమడిట్లు పోవు వెఱ్ఱిపోక – యన్నాడు. మననింక వెఱ్ఱులార, వెఱ్ఱిమూఢులార, జీవులార, జనులార .... ....యని సంబోధించిననేమి? ఆ సంబోధనకు గురిగావుటొక అనుభూతి. లేదయ్యా కాదయ్యా లేరొకో ఔనొకో వంటి వానిని పాదాంతమునబెట్టి చెప్పుటొకయింపు. "నీమీద ఒట్టని" వినువానికెంతో విలువనిచ్చి ప్రమాణ పూర్వకముగా చెప్పుటొకటి సంభాషణా సంవిధానము. నెయ్యిలేనికూడు నీయాన! కసవది–నిన్ను నమ్మ ముక్తి నిక్కంబు నీయాన! మాటలలో మధ్య మధ్య నొక్కిచెప్పవలసినప్పుడు నమ్మజెప్పు నట్టుగా నీయాన – నీమీద ఒట్టు అని చెప్పినదొక సొంపు.

ఈ చెప్పుటలో నొక్కొక్కప్పుడు ఒకానొక విషయముదగ్గర ఆవేదనతో

ఎలుగెత్తిచెప్పినట్టు చెప్పును. అప్పుడారాకొట్టు రోకొట్టుగా మారి ఉచ్చైస్స్వరమున ముగింపునకు వచ్చును. ధనము వెంటరాదు దానంబు సేయరో-తలను చేయిబెట్టి తెగ నమ్మజెప్పరో-పాలవంటికులము బ్రహ్మంబు కానరో-ఇహములోనె పరము నెఱుగుట చూడరో- జీవుడె శివుడౌట సిద్ధంబు తెలియరో- ప్రశ్నార్థకమున అవధారణార్థక మున గూడ యీ వరుసలో "ఓ"కారాంతము జేయును. ఆడువారినింత అడుగుట చెల్లదో- తన్నుద్రిప్పువాని తానేలకానడో- తటుకు చనులనాడు దమ్మిడీసేయదో- పసిడిగల్గువాని బానిసకొడుకులో యనును. చెప్పరే, చేయరే, కానరే, తెలియరే, చూడరే- చెల్లదేయని గాని, చెప్పుడీ చేయుడీ కానుడీ తెలియుడీ యనిగాని యన వచ్చును. కాని, కానరో, చూడరో యన్నప్పటి యందము అందెందునురాదు. "బానిస కొడుకులు" అనవచ్చును- కాని "బానిస కొడుకులో" యని గొంతెత్తినదే ప్రబలము.

పాఠకులను తన యోజనా క్రమములో భాగస్వాములయిపోవునట్లు, భావనా వలయములో తగులము జెందునట్లు చేయగల సంవిధాన మాతనివద్ద నొకటు న్నది. అదేమనగా ప్రశ్న. అసలు వేమనయే ప్రపంచమునకొక పెద్ద ప్రశ్న- ప్రశ్న యొక్క- నరరూపమే వేమన్న. యోగియయ్యు హేతువు నరసినవాడు. మార్మికాను భవమునకు (Mystic Experience) కారణ విమర్శనశక్తికిని సమీకరణమైనవాడు. ఇకనాతని కవిత్వమున ప్రశ్నపంచారింపదా?

ఆయన కవిత్వమునకు జీవసూత్రము ప్రశ్న. దృష్టాంతమిచ్చినప్పుడును ప్రశ్నమున్నది. ఇయ్యనప్పుడు చీకటిలో మిణుగురు వలె తనకవితను వెలిగించుకొను టకు గాదు ప్రశ్నముంచినది. దృష్టాంతమునకే ఉపమకే ప్రశ్నవేషము వేయును. కొండ యుద్దమందు కొంచెమై యుండదాయని మననడుగునుగాని తననోట జెప్పడు. దృష్టాంతమను తలనతికించి బ్రతికించవలసిన నీతి, లోకరీతి యను మొండెమును సైతము- అనఁగా ఉపమేయ విషయమునుగూడ ప్రశ్నయను ద్రావకములో ముంచి మలామా చేసి బైటకుదీయును. బుద్ధిచెప్పువాడు గ్రుద్దిచెప్పనెవచ్చు ననుటకు గ్రుద్దిన నేమయా యని మనను నిగ్గదీసి యడుగును. అట్లు నిగ్గదీసి యడిగించగల బలమైన దృష్టాంతమును "చాకివాడు కోక చీకాకుపడజేసి, మైలబుచ్చి కోకముడుపుజేయు"నని భావార్థకమున జెప్పును. అంతటితోఆగునా? ఉపమానోపమేయములు రెండింటిని ప్రశ్నలుగానే వెలువరించును. "ఆత్మశుద్ధిలేని యాచారమదియేల? భాండ శుద్ధిలేని పాకమేల? చిత్తశుద్ధిలేని శివపూజలేలరా?"అనుచో యిరుపక్షములను ప్రశ్నార్థకములే.

సమాధానమే ప్రశ్న. అపుడే అది బలవత్తరము. ప్రశ్నే సమాధాన గర్భితమగును. ప్రశ్నోత్తరముల వోహళింపు అతనియందొక యందము.

జడలు గట్టనేల? జగముసీయనులేల?
ఒడలు విరుచుకొనెడు యోగమేల?

ఇదియాతని ప్రశ్నామాలిక. అతని జదివికొన్న మనము వ్రాయు సమాధానమే మనఁగా .... .... ....

ముక్తికాంతబట్టి ముద్దాడు కొఱకురా.... .... ....యని.

తాఁజెప్పు విషయమున కుతూహల కల్పనమొకటి అతనివిద్య. ఆటవెలఁది మూడుబంతులంతలోనే కథానికలో పర్యవసానమేమాయని పాఠకుని యూహకు పరీక్షపెట్టినట్లుగా ఉత్సుకత నొకలేశమును నిర్మించుటతని శిల్పము. విరోధములను, విరోధాభాసములను ఒక సన్నివేశముననే చూపించి పద్యోత్సుకులను జేయగలడు. అనుకోని మలుపులుద్రిప్పి విభ్రాంతులను జేయగలడు.

నిజమునాడువాని నిందించుజగమెల్ల, నిజమునాడవాడు నీచుతోడ
నిజమునాడవలయు నిజమహాత్మునితోడ .... .... ....
ఆరుమతములందు అధికమైనమతము లింగమతముకన్న లేదుమతము
లింగధారికన్న దొంగలులేరయా .... .... ....
తప్పులెన్నువారు తండోపతండంబు లుర్విజనులకెల్ల నుండుతప్పు
తప్పులెన్నువారు తమతప్పులెరుగరు.... ....
పదుగురాడుమాట పాటియైధరజెల్లు నొక్కఁడాడుమాట ఒప్పదెందు
ఊరకుండువాని కూరెల్లనోపదు .... ....
స్త్రీలుగల్గుచోట చెల్లాటములుగల్గు స్త్రీలులేనిచోటు చిన్నబోవు
స్త్రీలచేత నరులు చిక్కఁనబడుదురు .... .... .... ....
కలిమినాడు నరుడు కానడో మదమున లేనినాడు మొదలెలేదుపెట్ట
కలిమిలేమి లేని కాలంబు కలుగునా.... .... .... ....
దోపునిచ్చువాడు తులలేని నెఱదాత దోచుకొన్నవాడు ద్రోహియయ్యె....
దానమడుగువాడు ధరలోననధముండు దానమడుగడేని దైవసముడు
దానమీనివాడు ధరలోననధముండు.... .... .... ....

వేమనయందు గతితర్కఁ మెంతో యున్నదని, అతని పద్యములలో తొలిపంక్తిపక్షమును మలుపంక్తి ప్రతిపక్షమును మూడవపంక్తి సిద్ధాంతమును చెప్పు

నని మార్క్సియులనుండి ఒకమాట యున్నది. అది వారి యపేక్షావచనము. అంతే. అట్టివి చెదురుగానొండు రెండుండునోఏమో!

* * *

పుస్తకజ్ఞాన మతనికి ఇంచుమించు సున్నయని రామలింగారెడ్డిగారు మొదలుపెట్టగా, దానిని పోషించినవారు రాళ్ళపల్లి వారు. వీరి వ్రాతలు పాఠ్యగ్రంథములై వేమన ఏమంతచదువరిగాదన్న కథను లోకములో స్థిరపరచినవి. లక్షణముగా చదివిన నాతడింత స్వాతంత్ర్యము వహించి వ్రాయడని, వ్రాయనేరడని, చదువనిదే యతని యదృష్టమని వారు సిద్ధాంతము జేసినారు. మీదుమిక్కిలి చదువని వాడిట్లింత వ్రాసెనన్నదే అతనికిని మనకును ఘనతయను భావమొకటి వ్యాపించినది. వ్యుత్పత్తి లేనిప్రతిభకు ఉదాహరణముగా నీతనిజెప్పిచేయు కుతూహలముకూడకొంత కొందఱిలో గానవచ్చును. శుద్ధముగా చదువుకొని సంస్కృత మెఱిఁగి కారణ విమర్శనాశక్తి కలవాడై ఇచ్ఛాస్వాతంత్ర్యమున్నవాడై సంప్రదాయమునకెదురొడ్డి కావలెనని ఉద్యమించి సుబోధమైనజీవద్భాషలో* 'వ్రాసి'నాడన్నను, అట్లుగా నిరూపణమైనను బెంగగొనువారున్నారేమో యనిపించుచున్నది.

భాషా పాండిత్యమున వేదాంత పరిజ్ఞానమున తమకన్న మిన్నలై లబ్ధప్రతిష్ఠులైన పండితులిట్టి అభిప్రాయమును కొంత నిరూపణముతోగూడ వెలివరచి యుండగా చూచియుచూడనట్లు పట్టించుకోక, చర్చింపక, పూర్వపక్షము జేయబూనక, వారిలో బలహీనముగా జెప్పినవారి మాటపై విరుచుకొనిపడి విమర్శకులమనిపించి తమ మాటే మాటగా చెప్పుకొనిపోయి వేమన విద్యావంతుడు గాడను మాటను ప్రచారింప గలిగినారు. వీరి రచన అధికార ప్రాపకమునకు నోచుకొనుటచే నింతపుట్టినది.

కాని యింతకన్న పులిమీద బుట్ర యింకొకటిలేదు. అతడు తత్సంబంధముగా జెప్పిన పద్యరాశి జూచికూడ యిట్లనుట, అనుకొనుట ఆశ్చర్యము. ఒక్క ఉపనిషత్తులనేగాదు నాగార్జుననేగాదు ఇంకితరములెన్నింటినో చదివినట్లు, అందలి వాని కారణముగా తానెన్నో వ్రాసినాడని చూట్టే గుర్తింపవచ్చును. అనువాదములే యున్నవి. అనుకరణములున్నవి. ఎదుత్తిప్పినవున్నవి. టీకాటిప్పణములాతడు చదివియున్నాడు. అందునను స్మృతిశ్రుతులకు జేసిన టిప్పణులనాతడు ప్రస్తావించినాడు:

"టిప్పణములుజేసి చప్పనిమాటల జెప్పుచుందురన్ని స్మృతులు శ్రుతులు
విప్పిచెప్పరేల వేదాంతసారంబు..... ..... ..... ..... .....2079 నేదునూరి ప్రతి

---

* వాడుకభాష యనుకోవలసిన పనిలేదు.

"టీక వ్రాసినట్లనేకులు పెద్దలు లోకమందు చెప్పిరేకమతము
కాటులట్టి జనులు కానరా మర్మంబు.... .... .... 2980 నేదునూరిప్రతి.

అందుకుగాను వేదాంత సారమును తానై విప్పిచెప్పబూనుకొన్నాడు. సంస్కృతము తేకుండ పరిభాషలేకుండ తేలికమాటల తెనుఁగున జెప్ప యత్నించి నాడు. అతనియుద్యమమేయది. వేదాంతము ప్రజల తెనుఁగునబడిన దీతనితోడనే. ఇంకితరులున్నవారు ఇతని తర్వాతవారే. కాదంటకు వీరశైవము మాటదేవచ్చును. తెనుఁగున గల ఆ వాఙ్మయములో మతమున్నది; లేదా గాథలున్నవి. తత్త్వమంతగా లేదు. ఉన్న ఆ కొంతలోను యిట్టి సుబోధకత్వమును కొదువే.

మన పరిశోధక పండితులకు అశ్రుతములు అగోచరములు అచుంబితము లైన దర్శనములెన్ని యతనియందున్నవో, నాగార్జునాదులకు అనువాద ప్రాయము లైన పద్యములు భావములు నెన్నికలవో మున్నెప్పుడో యిందు చూచియున్నాము.

"ప్రస్తుతంపువేళ పద్యంబు చదివిన తప్పులెన్నియున్న నొప్పియుండు
బిత్తలిపడకందు బిత్తరై యొప్పదా.... .... (తొత్తుపడకయందు బిత్తరై యొప్పదా....) యను వేమన పద్యమును,

"అవసరపతితావాణీ గుణగణరహితాఽపి వహతిపరమోదమ్"
రతిసమయే యువతీనం భూషాహానిశ్చ భూషణంభవతి" యని తెనుఁగు వాడైన పండితరాయలు సంస్కృతము జేసినదని వంగూరి సుబ్బారావుగారన్న మాటనుకాదని నూతనోదాహరణములతో రసగంగాధర కావ్యశాస్త్రము వ్రాయుదు నన్నవాడు వేమనయొద్ద అప్పుజేయునాయని కొట్టివేసినారు, అంతటితో తమవాదము నెగ్గినదనుకొన్నారు, పాపము! పండితరాయ లనువదించలేదనుట సమ్మతమే. కాని అంతటితో విషయాము ముగియదు. రాయల శ్లోకమునకే వేమన పద్యముఅనువాదమని తిరుగవేయవలసివచ్చును. అంతేమరి. అట్లాడు తమవాదము మొదలికే మోసము వచ్చునన్న స్ఫురణ సంశయము రాళ్ళపల్లివారికి కలుగలేదన్న నేమిచెప్పకో వలెను. వేమన ఆ సంస్కృత శ్లోకము ననువదించెనని రాళ్ళపల్లివారే చెప్పవలసి యుండగా, చెప్పక సంగితనము చేసినారనకుండుటెట్లు? వాదము పర్యవసానము తెలియకుండ తెగబడినారు. పండితరాయలది కాక, అంతకు మున్నటి ప్రసంగ రత్నావళిలోనిదే యగునుగాక, ఆ సంస్కృత మాతృకలోకన్న వేమన తెనిగింపులోనే అందము బలము స్వారస్యముమెండు. శేషాద్రిరమణ కవులు వేమన పద్యములకు

కారణములైన సంస్కృత శ్లోకాదులు కొన్నింటిని ఇచ్చియున్నారు. వానిని చూడవచ్చును.

ఘనతరకష్టలోభి తమకంబునఁ జంపెడునంతనల్కనె
మ్మనమునఁబెట్టెనేని విషమారణకర్మ కృపాణముఖ్యసా
ధనములు గూర్పనేల? ప్రమదంబున డగ్గరి కాసువీసమి
మ్మనుటయె చాలు వాని నిమిషార్థమునన్ మృతినొందజేయగన్॥ అని యొక అనువదింపు పద్యమును జూపి,

లోభివానిజంప లోకంబులోపల మందువలదు వేఱెమతముగలదు

పైకమడుగనతడె భగ్గునబడిచచ్చు............ నను వేమన పద్యమునకు అది మాతృకయన్నారు. పద్యకర్త పండితుడని చాటించుచున్న పై పద్యము నిర్జీవము, నీరసము, కవితాస్పర్శశూన్యము. అదొక వ్యర్థరచన. దానిలో సగములేని వేమన పద్యము రసమహితము-హాస్యరసోపచితము. తత్పరిపోషకముగా భాషక్లుప్తము, సులభము. పిసినివాని సద్యోమృతిని చిత్రీకరించు అనుకరణశబ్దము - పద్య విద్యా నైపుణ్యము-ఎట్లు వ్రాయకూడదో, ఎట్లు వ్రాయవలెనో చూపుటకు పోల్కి చేయవలసిన సన్నివేశము.

కైకపుట్టి చెఱిచెగా రాముపట్టంబు-సీతపుట్టి లంక చెఱిచెగాదె
కౌరవులను చెఱిచెగద ద్రౌపదియును బుట్టి............ అని వేమనచే చెప్పించిన శ్లోకము "కృతేతురేణుకామృత్యుః, త్రేతాయాం జనకాత్మజా, ద్వాపరే పాండుపత్నీచ"యని చూపినారు కావచ్చును. కాని ఎంతో మార్చినాడు. ప్రసిద్ధ విషయముగానుండుగానని మార్చినాడు. అందుకే అనువాదము అనక అతనివి అనుకరణము లన్నారు శతావధానులు.

"శాల్యన్నం సఘృతం భుంజంతి యేమానవాః
తేషాం యింద్రియనిగ్రహో యదిభవేత్ ...... యనుదానినిబట్టి
'పాలుపెరుగువెన్న పరగునన్నముదిని స్త్రీలగననివాడు శీలవంతుడని' యనువదించినాడు.

తాతజనించె కన్యకకు తండ్రులుతాము కుండగోళకుల్
మాతపరానుకూలి మరిమక్కువ ద్రోవది భర్తలేవురున్
నీతులజెప్ప పాండవుల నీమములిట్టివటంచు నెన్నుచున్

భూతలమందు మిక్కిలిగ బూమెలఁజేసిరి వెఱ్ఱివేమనా! యని వేమన దను పద్యమునకు,

కానీనస్య మునేః స్వసోదరవధూవైధవ్య విధ్వంసినః
నప్తారంకిల, గోళకస్యతనయాః, కుండాః స్వయం పాండవాః
యేఽమీపంచ సమానయోని నిరతాస్తేషాంతు సంకీర్తనం
ధర్మ్యం స్వస్త్యయనం సమస్తసుఖదం, ధర్మస్య సూక్ష్మాగతిః॥ అన్న

శ్లోకమే మూలమని ఆరుద్ర సరిగా సంభావించియున్నారు. ఈ శ్లోకమే ఉపహాసగర్భితము కాదని, కేవలము ధర్మము బహుసూక్ష్మమని చెప్పుటకే యిది చెప్పెనందుమేని (అట్లే అర్థము చేసియున్నారు) వేమన మాత్రము యీ శ్లోకమును కకర్త అభిమతమునకే ఎదురుత్రిప్పి తనఅనుకరణపద్యమును చెప్పినవాడగుచున్నాడు. అట్లతడు చేయగలిగినవాడే. ఇదివేమన పద్యము కాదనలేము.

ఇంతకన్న సాక్ష్యము వేరుగా అక్కరలేదుగాని కొన్ని శబ్దరూపములు శబ్దములుగూడ ఆతని సంస్కృత పరిచయమును చెప్పుచున్నవి పాపియని స్త్రీ పట్ల గూడ వాడుక చేయుదుము గాని వేమన "పాపిని[1]"యని వాడగలవాడయ్యెను. పోషణకు పోషయని[2] యనగల్గెను. రూపములు శుద్ధములుగాని అపురూపులు. హృదయఖంబు[3], క్షుల్లకుడు[4], కల్యము[5] వంటి గాఢసంస్కృ* తములను వాడియున్నాడు.

1. తరుణి పుణ్యవతిగ వరునిబట్టియెయగు, పాపినియగు మగని ప్రాపువలన – 2245 – నేదునూరిప్రతి

2. జిహ్వాలంపటుఁబు జీవనంబై యుండు, జిహ్వాలంపటంబె జీవపోష – 2000 – నేదునూరిప్రతి

3. కంటిలోనివాని కళికంటుదెలుఁగును కంటిలోనివాని మింటఁజూడ
కన్నుమిన్ను హృదయ ఖంబాయెనెంచంగ.........321 – గోపాల్ కో॥ ప్రతి

4. ఒకరియాడుబిడ్డ కొనరఁవాకొడుకయి, తల్లి వెడలదోలు క్షుల్లకుండు – 802 – బ్రౌను

5 కల్యమారగించి కన్నులుముకుళించి విఱ్ఱవిగిసియుండు బీదయోగి – 1189 – నేదునూరిప్రతి

* ఛురిక (కత్తి), ఛర్ది (వాంతి), ఛందము (ఇచ్ఛ, అభిలాషము అను నర్థములో).... వాడగలిగినాడు. "వారణాసి తనకు వైయాసికాబోలు"నని ప్రయోగించినా, మన పాత పండితులు, నేటి డాక్టరేట్లు "హృదయఖంబు"ను హృదయకమలంబు నెఱుఁగుడి అని దిద్దివేసి అచ్చుగొట్టించుచునేయున్నారు. ఓదెలను తెనుఁగు మాటకూడ తెలియనివీరు బోదెలుగాదిద్ది నూట ఏబదియేండ్లకుపైగా అట్లే వేమన్నకు భ్రష్టుపట్టించుచునేయున్నారు. కొంగలు గుమిగూడి కొఱకవా బోదెలు అని ముద్రించుచునేయున్నారు, వీరిముందు వేమన చదువుకోనివాడయ్యెను!

అతనివిగావని సంశయింపరాని పద్యములందే యిట్టివి ఎడనెడమున్నవి. అతనిలో అపశబ్దములుండవచ్చును. ఉన్నవి. కాని సుశబ్దములు అపురూపములు గాఢములు భాషా పరిచయము లేకుండవాడుక సేయలేరుగదా!

ఇన్నియునేల? అతని జీవితము సర్వదశలకు అతని తత్త్వగవేషణమున తగిలిన బహు దర్శనములకును ఎప్పటికప్పుడు సరిపోవునట్లు అర్థమియ్యగల ఒక చిన్ని సమస్తపదము "విశ్వదాభిరాముడు" అని సృష్టించి వ డితులను పల్టీలు గొట్టించిన విషయమొక్కటి అతని పాండిత్య రహస్యమును రూపింపదా? "వార్త లోని వార్తవరకవి జేయురా" యని ఉత్తమ కవిత్వముగా తాను నిర్దేశించుకొన్నవార్తా కవిత్వముపేర అప్పటికించుకముందే కవిబిరుదమై, యింటిపేరై 'అనేక' కావ్యములలో కవితా గుణముగా ప్రసక్తమై తెమఁగున కొత్తగా బుట్టిన కవితావిశేషముగా పరిశోధనకు పనిగల్పించిదాని మూలములకై దండి కావ్యాదర్శములోని కాంతిగుణ నిర్వచనమునందున్న వార్తాభిధానమువరకు తిరుగవేయించుచుండగా వేమన వ్యుత్పన్నతను వేరుగా స్థాపింపవలసినదేనా? సంస్కృత భాషాకోవిదుడు కాకపోవచ్చునేమోగాని సాధారణ ప్రమాణమున సంస్కృత మెఱిఁగినవాడనుట నిస్సంశయము.

అతని భాషా పరిచయమునింతగా చెప్పుకొన్నందుకు అందుకు తగిన పద్యమాతనిదొకటి చెప్పుకొని ముగిచుట ఉచితము.

"కాశి పోదుననుచు గడకట్టఁ నేల? గాసితీర్థములకు గదలనేల?
దోసకారికెట్లు దొంకురా ఆ కాశి; ...... ...... ...... ......"

ఆకాశి యనఁగా ఆ కాశి నగరమనుట సామాన్యార్థము కాశి మొదలైన తీర్థములు దోస రిమాత్రము చేరుకోలేడనుటెట్లు? చేరుకోలేనిది నగరముకాదు తీర్థము కాదు. ఆ కాశియనఁగా ఆప్రకాశముగలవాడు-స్వయంప్రకాశమైన ఆత్మ, పరమాత్మ: లేదా, ఆకాశమందున్నవాడు-దేవుడు-అంతకన్న, దహరాకాశము, హృదయాకాశమునందున్న ఆత్ముడు - అతనిని మాత్రము కాశివెళ్ళినను దోసకారి చేరజాలడు అని యర్థము. చిన్నమాటతోవే గావచ్చునుగాని, భాషతో నతడిట్లు సాముచేయగలడు.

---

# అతని జీవితరేఖలు

జరిగిన పరిశోధనము వేమన్న తత్త్వమును తెమల్చి చెప్పుటకెట్లును చాలినది కాకపోయినది. అతని సంస్కారమును గూర్చియైనను – అనగా అతని ఆర్థిక సామాజిక నైతిక భావవ్యవస్థను గూర్చియైనను వెలికితీసి చెప్పినది పరిశోధనా ఫలమనిపింపజాలినదికాలేదు. ఇక పరిశోధనమనదగిన దానిలో ముక్కాలు మువ్వీసము వేమన కాలదేశముల నిర్ణయించుటకును, అతని జీవితమును "కల్పించుటకును" జరిగినది. ఇంతవరకాతనిగూర్చి ఏ భాషలో యిటీవల వెలువడిన గ్రంథములోనైనను సగము కాగితములకు పైగా యీసంగతులకే కర్చయినవి. పరిశోధకులలో వివాదము అతని మతమునుగూర్చి ఏకొంచెమోగాని, అంతయు యీ విషయములందే జరిగినది.

విషయమిట్లున్నందుకు అతని కాలదేశములేమైన ప్రామాణికముగా నిశ్చితమైనవాయన్న అదియును గాలేదు. అందుకాధారములు అసందిగ్ధములైనవి, అతని రచనలనుండిగాని వెలుపలనుండిగాని దొరకినవిగావు. అతనిగూర్చి అన్యథా చారిత్రకసామగ్రియులోపించినది. అతనిరచనలలో అంతస్సాక్ష్యము అంత విస్తారము, ఏకమాత్రముగా తెమల్చుపాటిదిని లేకపోయినది. ఎవ్వరే నిర్ణయముజేసినను, చేయుచున్నను అది యూహయే, స్థూలమైనదే యగుచున్నది.

ఇక నట్టిదాని సామంజస్యము అతని రచనలలోని అంశములకును, వానినెట్లుగాజూచి ఎట్టివిలువియ్యవలెనుఅను మనదృష్టికి రుచికిని విడువవలసినదే. అతని పద్యములు బోధనలు అతడు కనబఱచిన విలువలు, చెప్పిన లోకవార్తలు ఎంతవరకాతని ఆత్మకథయనదగును? అవన్నియు స్వానుభవమనలేము. కావక్కఱలేదు. కొన్ని కావచ్చును. అక్కడ ఎవరిదృష్టి ఎట్లుండునో యన్నదానిపై అతని జీవితము యొక్క ఊహాచిత్రము ఆధారపడియుండును.

వేమన్న కాలమును సి.పి. బ్రౌన్ ముమ్మారు మువ్విధములుగా ఊహించినాడు. మన పరిశోధకులును ఇందు ఒక్కొక్క కాలమునకు తగిన సాక్ష్యము సేకరించియున్నారు. బ్రౌను మూడుకాలములకన్న నివతలకు గుంజినవారొక్కరున్నారు. వారివతలకు గుంజినట్లే గుంజి వాదపటిమ చూపించి ఒక్కసారిగాజారిపోయి బ్రౌను చూపిన రెండవ మూడవ కాలముల కేదైన కావచ్చునని తేలిపోయినారు.

1. 15వ శతాబ్దము — వంగూరి సుబ్బారావు, వావిళ్ళ వెంకటేశ్వరశాస్త్రి.
2. 17వ శతాబ్దము తొలిపగము — వేటూరి ప్రభాకరశాస్త్రి
3. 17వ శతాబ్ది చివర, 18వ శతాబ్ది ఆరంభ దశాబ్దములు — బండారుతమ్మయ్య. వారినంగీకరించినవాడు: ఆరుద్ర.

4. 18 వ శతాబ్ది — రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ. 17 వ శతకముతో అంటువదలించినదివీరే. పిదప ఆ వాదము వదులుకొని, 16 వ శతకము తర్వాత నెప్పుడో యొకప్పుడన్నారు.

15 వ శతకగత ప్రాణినిజేసిన కారణములు దుర్బలములు. అవి మున్నే పరాస్తములు. ఇప్పుడును విచారసహములుగావు.

17 వ శతకము తొలిసగముకన్న ఈవలికి లాగరాదనుటకు మొదలి కారణము: కచ్చితముగా 1623 వ యేట చనిపోయినట్లు చారిత్రకులు దేల్చిన గుంటుపల్లి ముత్తన్న – గోల్కొండ నవాబుల క్రింద కొండవీటిసీమ కధికారి – మృతి ప్రశంస జేసిన వేమన పద్యములు.

మరి 17 వ శతకము మలిసగమున బెట్టుటకుగాని, మొత్తము 18 వ శతాబ్దిలోనికి లాగుటకుగాని తొలికారణము:

"షేకుసైదు మొగలు చెలఁగు పఠాణులు తురకల దొరతనము తొలుతజేసి రాగరాగ తుదకు రౌతులై కొలిచిరి...... అనుపద్యము.

తురకల దొరతనము తెనుఁగు నేలపైలేకుండ పోవుటకు తెల్లదొరతనము రావలెనుగాని తెనుఁగు హిందూ దొరతనమురాగలిగిలేదు, రాలేదు తల్లికోట–రాక్షసితంగడి (1564) యుద్ధము పిదప బీజపూరు, గోల్కొండ, మొగలు, నిజాం అసఫ్ జాహీల తురకరాజరికము లొకదానివెనుక నొకటి వచ్చిపడినవి. కడకు నిజాం అసఫ్ జాహీలు సర్కారు జిల్లాలను 1748లో ఫ్రెంచివారికి, రాయలసీమను 1799 లో ఇంగ్లీషువారికి యిచ్చువరకును తురకల దొరతనముండనేయున్నది. వేమన చరమ జీవితము కడప కర్నూలు మండలములందుగావున వేమన నెందాక మనకు దగ్గరగా లాగుకోవచ్చునో దీనినిబట్టి తెలియును.

కాని వేమన తెల్లవారినిగాని క్రైస్తవ మతమునుగాని తలఁచినవాడుగాడు. తెలిసినవాడుగాడు. కానివారు తెనుఁగుతీరమున 1610 నుండి మెసలుచున్నారు. గూడూరు తాలూకా దుగరాజుపట్నము, ప్రళయకావేరి (పులికాటు), మైలపూరులోను గిడ్డంగులు కట్టినారు. అంతలో వారిలోవారు – డచ్చివారు పోర్చుగీసువారు – పోరాడుకోజొచ్చినారు. గత శతాబ్దాదిలోనేదిగి తురకలకెదురెత్తుగా విజయనగరము వారితోకలిసి పోరాడిన పోర్చుగీసువారు చంద్రగిరినుండి ఏలుచున్న ఇమ్మడి వెంకటపతిరాయలొద్ద 1607 నాటికి మతప్రచారమునకు అనుమతి సంపాదించినారు. తెల్ల

వారిలో తొలుత మతప్రచారమునకు దిగినవారు పోర్చుగీసులు. వారి తొలుతటి ప్రచారభూమి రాయలసీమ. వారు చిత్తూరు, నెల్లూరు, కడప, అనంతపురము మండలములలో బోధింపసాగినారు. పుంగనూరు, చంద్రగిరి, వెంకటగిరి, వాయల్పాడు, సిద్ధవటము, మాదిగుబ్బ, ఆలమూరు, ధర్మవరము ఆమీద కోలారు చిక్కబళ్ళాపురమువరకును వారిప్రచారముండినది. 17 వ శతకము చివరలో, 18 వ శతకము తొలిపాదములో క్రైస్తవగురుడులు లేచినవి. వెలమలు కమ్మలు రెడ్లు మొదట మతము పుచ్చుకొన్నారు లీూక్, మాండ్విట్‌లను ప్రచారకులు ప్రసిద్ధులై యున్నారు. పదునెనిమిది రెండవపాదమున వారిగుడులను అచటిపాలెగాండ్రు, నిజాం సేనలును పడగొట్టినవి. అట్టిచో వేమనకు 18వ శతకమును చూపించినచో, అతడు క్రైస్తవమును, తెల్లవారిని ప్రస్తావించియుండవలసివచ్చును. అట్టిదిలేదుగావున 18వ శతాబ్ది మొగమాతడు చూడలేదనుట నిశ్చయము.

మరాటీల మాటకూడ వేమన తేలేదు. మరాటీదండు చెలరేగి ఊళ్ళను కొల్లగొట్టిన మాటగాదు. (అట్టిది 1820 తరువాత మాట- కడప అనంతపురసీమలో వేమన తిరిగినఊళ్ళే అట్లు కొల్లపోయినవి.) బీజపూరు మొగలు తురకరాజకీయముల సరిహద్దురేఖమీద ఆరెండిటికి ప్రాణకంటకముగా పూనాకొండలోయలలో కనుమలలో (కృష్ణ, దానిఉపనదులు పుట్టినమావల్) రూపుగొనుచున్నమరాటా రాజకీయముమాట, శివాజీమాట. ఆమాటతెనుంగుచాడు 1660వరకు వినుటకే యవకాశములేదు (1656సరికి గాని తనతండ్రికి బీజపూరు వారిచ్చిన పూనా, సూపా, చాకన్, ఇందపూర్ బారామతి మొఖాసాలను స్వతంత్రము చేసినవాడైనాడు.) శివాజీ ఛత్రపతియై మొగలు బీజపూరు విస్తరణకు వ్యతిరేకముగా గోల్కొండ నవాబుల ఆతిథ్యము, స్వాగత సత్కారములు, సహాయముపొంది. 1677లో వారు దారియిచ్చి, దారిచూపగా కర్నూలు మీదుగావచ్చి శ్రీశైలమెక్కి తొమ్మిదిరాత్రులు నిద్రజేసి, నీలగంగ మెట్లు కట్టించి, క్షేత్ర రక్షణకొరకు చిన్న మరాటీ రక్షకదళమును విడిచివెళ్ళి, కడప మీదుగా కాళహస్తి తిరుపతి చూచి, జింజిరాజ్యమును బీజపూరు నుండి గెల్చుకొని చిదంబరము, వృద్ధాచలము, కోలారులను తంజావూరేలుచున్న తనతమ్ముడు -ఏకోజీ- నుండి వశపరచుకొని (వెల్లూరు కోట 1678లో వశమైనది), మదురైనుండి కప్పము గొని దక్షిణ దేశమున 1675 లో తమ్ముని కైవసముయిన తంజావూరి రాజ్యమునకు తోడు, తమిళ కర్నాటకములను గలిపి బెంగుళూరు వరకును అధికారము గల జింజి (చెంజి) రాష్ట్రమును శివాజీ మహారాష్ట్రముజేసి సవతితమ్ముడైన శాంతాజీని పెట్టి పాలించుటకేర్పరచగా దక్షిణ దేశమున ఆ మరాటీ రాజకీయము 18 వ

శతాబ్దములో చాలకాలము మిగిలినది. ఇంతకలిగినను వేమనలో మరాటీల యూసు లేదు.

ఇక షేకుసైదు మొగలు తెలుఁగు పఠాణులు రౌతులో రైతులో అయి కొలుచుటను జూచుకాలము కావలెను. ఇందులో షేకుసైదు పఠానులమాట విశేషము కాదు, వారు పాతవారే. మొగలుప్రసక్తే ఇచటసమస్య. కాని మొగలులు రౌతులై రైతులై కొలుచుమాట తప్పు. మొగలువంశమువా ట్లు దక్షిణదేశమున దిగజారలేదు. అసఫ్‌జాహీలు 1734వరకును స్వతంత్రించనులేదు. అదికాక తెనుఁగునాఁట హంఁదాకు దర్పమునకు ఏమి మొగలాయీ పోవుచున్నాడురా అనుటున్నది. మొగలు తెలుఁగు పఠానులనఁగా, అట్టి మొగలాయీ చెలాయించు పఠానులనియు గావచ్చును, లేదా మొగలు రాజఠీకమునుగూర్చి వినియుండి, తురకలెల్ల తమపాలకభావము వదలుకొని హిందువుల వద్దనెన, రౌతులుగానో రైతులుగానో కొదురుచున్నారని చెప్పుటలో సామాన్యముగా మొగలులనుకూడ చేర్చి చెప్పినది కావచ్చును. అంతేగాని, మొగలు వంశమువారు తెల్లదొరతనమునందుగాని అంతకుముందుగాని దక్షిణ దేశమున నిల్లగుటకల్ల. అసలు మొగలు కుటుంబయులే దక్షిణమున స్థిరపడలేదు.

ఇక మొగలులమాట తెలుఁగుదేశమున విన్నచెప్పటనుండియన్నది ప్రశ్న. 16 వ శతకము నిండి నిండకనే వినవచ్చుటారంభమైనది. అక్బరు తమ అధికార మును బౌదలదాల్చి అరియప్పనములంపుమని 1604 సరికే యిరుమార్లు గోల్కొండ వారికి, చంద్రగిరిలోని హంపీరాజు వేంకటపతిరాయలకు వర్తమానమంపియున్నాడు. 1636 సరికి గోల్కొండ కుతుబ్‌షాహీలు మొగలు షాలకు కప్పముగట్టి తమ నాణె ముల మీద షాజహాను పేరెక్కించి ముద్రింపసాగినారు. షాజాను పేరెక్కించుకొన్న గోల్కొండవారి సేనానిగా సయ్యద్‌మహమ్మద్ మీర్జుమ్లా 1645లో గండికోట, కడప, నంద్యాల, కర్నూలు సీమలను ఆక్రమించి, దక్షిణమున వందవాసి యుద్ధమునగెల్చి, కర్ణాటకమునేలసాగి, స్వతంత్రించదలంచి కడకు గోల్కొండ రాజునకే వ్యతిరేక మైనాడు. అనతికాలములో మొగలుతో షాజహానుకు ప్రధానమంత్రియైనాడు. తన కర్ణాటక ప్రాంతమును మొగలు రాష్ట్రముగావించి, దానిని ఏడేళ్ళపాటు

---

* "కొంకణంబు పోవ కుక్క సింహముగాదు" అన్నపాదములో మరాటీ సింహములను చూడవలసినపనిలేదు. "కుక్క సింహమగునె గోదావరికిబోవ" అనుటయు గలిగినది. శివాజీ కొంకణుడుకాడు. కొంకణము మహరాష్ట్రకోస్తా. శివాజీ కొండ ఎలుక. మావళే.

ఏ పన్ను చెల్లించనక్కఱలేని మొగలు [redacted]రుగా పొందినాడు. దక్కనులో ఔరంగజేబుతోపాటు 1657 లో బీజపూరుపై పోరాడినాడు. మొగలు శిరాసుబారూపొందించినాడు. అందు కోలారు-పెనుగొండసీమలున్నవి. గుత్తి తాడిపత్రి ఆదోని ఆలూరు మడకసిర, ధర్మవరము ప్రాంతములు-అనగా అనంతపురము మండలమెల్ల మొగలు రాష్ట్రమైపోయినది. కొండవీటి సీమనున్నను కడపమండలమున నున్నను వేమనకు 17వ శతాబ్ది సగము గడవగా మొగలు రాజరికము తెలియ కుండదు. వేమనవంటి దేశద్రిమ్మరికి తెలియ కుండుటరిది. గోదావరిసీమ షాజహాను నాడే ఢిల్లీ ఆస్థానమువేపు చూడసాగినవి. పండిత రాయల వృత్తాంతమదే చెప్పును.

ఇటు బీజపూరు సుల్తానులకు అటు గోలకొండ నవాబులకు ఒక్కొక్క ప్రాంతమును కోల్పోవుచు, తిరిగి ఒక్కొక్కప్పుడు కోల్పడిన ప్రాంతములను పునరాక్రమించుకొనుచు హంపీ అరవీటి వంశము పదేడవ శతాబ్ది ఆదినుండియు పెనగులాడుచున్నది. ఆ పెనగులాటలో రాయలసీమలో పలుప్రాంతములు కోటలు బీజపూరు గోల్కొండ తురకరాజులకు కడపటి హంపీరాజులకు మధ్య చేతులుమారినవి. ఆ కాలమున నిన్న ఏలికలుగానున్న తురకలు నేడు హిందువులక్రింద రౌతులుగానో రైతులుగానో మిగిలి గ్రామములో యిస్తువుగడించి స్థిరపడుట వేమనచూచియుండును. షేకులు సయ్యదులు పఠానులు ఇట్లు స్థిరపడుట, హిందువులను కొలుచుట పాత సంగతి. వారు రౌతులై హిందూ సేనలలోకూడ నుండుచువచ్చిరి. ప్రౌఢదేవరాయల నాటినుండియున్నారు. రామరాయల సేనలో తురకల ప్రాధాన్యమే రాక్షసి తంగడిలోని విషాదపరిణామము. మొగలు రాజరికమును విన్నపిమ్మట యిట్టిపద్యము చెప్పియుండును. అంతేగాని, మొగలులీ దక్షిణదేశమున రౌతులో రైతులో అయి యితరులను హిందువులను కొలుచుట ఉత్తమము. (ఆ పద్యమును రైతులై కొలిచిరో యన్నట్లుకూడ యిచ్చినాను) ఈ పద్యము వేమన చరమ దశలో 1660 తర్వాత చెప్పినదనుకొనుటకు ఆక్షేపణముండరాదు.

షేకుసైదు మొగలు చెలగు పఠానులు రౌతులై రైతులై కొలిచిరనుటకు 1623 వ యేట కీర్తికాయుడైన ముత్తన్న మృతి ప్రశంసజేయుటకు, కొండవీటి వంతకుమున్నేలిన గజపతుల గవ్వనా జెముల మాచెత్తుటకును ఒక జీవితపరిమాణము చాలునాయన్నది ఇకప్రశ్న. నరుడు డెబ్బది ఎనుబదియేండ్లు జీవించుటబ్బురముగాదేని, అదిచాలును. అపాటి దీర్ఘజీవితము ఏమంత విశేషముగాదు. అరుదుగాదు. అనంగా వేమన 16వ శతకము కొట్టకొనలోబుట్టి, కొండవీటి బెఱుగుచు పెద్దవాడైన ముత్త

మంత్రి దానవీరమును, శివభక్తిని, మంచితనమును లెస్సగాతెలిసినవాడు గావచ్చును. ముసలి ముత్తన్నకు వేమన వడుచు సమకాలికుడు కాదగును కొండవీడు గజపతుల దుర్గము. రాయల మరణము (1529) పిదపకూడ నొకపరి కొద్దికాలము కొండవీటిని మరల స్వాధీనముగావించుకొన్న గజపతుల నాణెములు వేమన ఎఱుకలోనుండుటే మియు అసంభవముగాదు. నాణెములంత తొందరగా చెల్లుబడి చాలింపవు. గత శతాబ్దము వరకును గవ్వలు నాణెములే. చిల్లిగవ్వకు కొఱగాడు అనుమాట యుండనే యున్నది. మఱి "గజపతింట గుడ్డిగవ్వలు చెల్లవా"యని వేమన యనుటకేమి?

ముత్తమంత్రిని చూచుటకు, తురకల దొరతనము మానుకొని, మొగలు చెంగు పఠానులు రౌతులై కొలుచుట చూచుటకును ఒకరికి సంభవము కాదనుకొని, రెండవ విషయమును తమ యర్థమున నికరముజేసుకొని ముత్తన ప్రసక్తి కళ్యారచూచి చేసి నదిగాక, వేమన వినికిడిమీద చేసినదిగా రాళ్ళపల్లివారు తమ్మయ్యగారను తేల్చినారు. ముత్తనకు రాయని బాచన్న(భాస్కరుడు) తాతతాతయని చూపి, వారి సమకాలికత్వ మును కాదని నిరూపించి, అంతమాత్రాననే ముత్తన వేమనల సమకాలికత్వ మును త్రోసిపుచ్చినారు తమ్మయ్యగారు. ముత్తన బాచన్నలు సమకాలికులని వేమన్న యనలేదు. అట్లతడన్నచో అతడు ముత్తన్న నెఱుగడు, బాచన్న నెఱుగడు. ఆ ప్రశంస ప్రస్తావనమంతయు వినికిడి మాటలనుబట్టి జేసినాడు అని తేల్చుకోవచ్చును. కాని ఆ పద్యములనే చూచెదము.

> "పరగ రాయనికులు బాచని ధనమెల్ల భటులపాలు కవులపాలు దలఁప
> ఒనరహీనజనుని ధనము దాయాదులపాలు జారకాంతపాలు వేమ॥"

> "ప్రాకటముగ నిట్టి లోకములోగుంటు, పల్లి ముత్తడెన్న పరమగుణుడు
> అన్నదానమునను హరపూజచేతను హరునిలోన నైక్యమాయె వేమ॥"

వ్రాతప్రతులు పెక్కింటిలో యీపద్యములిట్లే యిదే క్రమములోనున్నవి. ముత్తని ప్రసక్తిగల రెండవ పద్యము ప్రకరణము నపేక్షించుచున్నదిగాని స్వతః పూర్ణముగాదు. దానికి "పరగరాయనికులు బాచని...... ...... ......" పద్యమే ప్రకరణము, ఉపక్రమణిక.

"ఇట్టిలోకములో" అనగా తాముదినక, పరులకిడక, చచ్చి ధనము దాయాదులకు దక్కవిడచు లోభులును, వేశ్యలకు వెచ్చించువారును అయిన హీన జనులు- రచ్చలో స్తుతిపాఠములకు చలించి భట్లకు కవిగాండ్రకు పిడికిళ్ళకొలఁది

నిచ్చు బాచన్నవంటి కీర్తికాముకులైన రాజసపు దాతలను గలుగునట్టి యీ లోకములో యని అర్థము. ఇట్టిలోకములో విషయలంపటుడు స్తుతికాముడునుగాకుండ కీర్తికాము కత్వముచేగాక ఆకొన్న అతిథి శివుడని నిరతాన్న దానవ్రతుడై నిత్యశివార్చనారతుడై సార్థక జన్ముడై శివైక్యము జెందినాడు. అరుదైన అతని విశిష్టతను మరింత అరుదైన తనమెప్పునకు పాత్రమైన ఏకైక చారిత్రక పురుషుని స్మృతి ప్రశస్తిని జెప్పి దానినింకను పొడిగించి యీ పద్యముతో ముగించినాడు

> అల్లువానిస్మృతికి నాత్మచింతించును, తనయు స్మృతికి తానెతల్లడిలును
> పుణ్యపురుషుస్మృతిక భూమిలో జనులకు యుగము గ్రుంగినట్టులుండు వేమ
> — 234 వేదునూరిప్రతి

ఎంతో తానెఱిగిన మహానుభావుడు గతించెనని వినగా విచారపడి వివేచించి తూచి తూచిచెప్పిన వైనమిది. ఎపుడోగతించిన పూర్వపురుషునిగూర్చి విన్న గొప్పనుబట్టి చెప్పినట్లేయున్నవాయివి? ప్రత్యక్షానుభవమున గాకుండ ఖండపరశువు వంటి తన ప్రకృతినిబట్టి యింత అసాధారణముగా అసాధారణమైన యోగ్యతాపత్రమును వేమన యిచ్చునా?

అదిగాక, బాచన ముత్తనకు సమకాలికుడని యిందున్నదా? ఇట్టిలోకములో ననగా సమకాల ప్రపంచమేగాని సమకాలిక వ్యక్తులతోమాత్రమే కూడినట్టిదే గాని మరి ఎప్పటినుండియో ఎప్పటికిని ఉన్నట్టి, ఉండునట్టి లోకము, లోకరీతి కారాదా? కాదా? ముత్తనమంత్రి దానశీలములకు కొండవీట వేమన ప్రత్యక్షసాక్షియై చిన్నతనమునందుండి, ఆతనితాత తాతయగు బాచన్న దాతృత్వము భట్టుకవుల స్తోత్రములలో విన్నవాడై ఆ యిద్దరి దాతృత్వములను వివేకించి ముత్తన దాతృత్వము నిర్వ్యాజమని కళ్ళకద్దుకొని వ్యక్తిగతమైన పరిచయముదతో చెప్పిన ప్రశస్తియిది. ప్రకరణ పద్యము బాచనముత్తనల సమకాలికత్వమును చెప్పినదనుకొనవలసినపని యసలులేదు.

వేమన్నను మనచేయవ చేయవలసి చేదుకొనజెప్పిన కారణమింకొకటున్నది. వేమన కగుపించిన వైష్ణవము భ్రష్టవైష్ణవము. అనగా తంత్రాచార దూషితమైన వైష్ణవము. అందుచేతనే వేమనదూరు దానిపై అధికము. వైష్ణవము అట్లు భ్రష్టుపట్టిపోవుట 1650 కి ముందు పొసగదని రాళ్ళపల్లివారి మాట. అందుకు వారి కారణములు : వైష్ణవమునకు రాజాశ్రయప్రాప్తి రాయలనాటినుండియేనట. దాని నిజమైనవ్యాప్తి రాయలగురువైన తాతాచార్యులవారి చక్రాంకితములతోనేయట. ఆమీద అది ఉచ్ఛదశపడసి, పిమ్మట పతనోన్ముఖమగుటకు తగినంతవ్యవధికావలె

నట. అనగా ఆపతనము 17 వ శతకము మలుసగమున నన్నచో సరిపోవును. ఇదీ వారివాదము.

ఇది చరిత్రకు విరుద్ధము. వైష్ణవమునకు రాజాశ్రయమన్నది కృష్ణరాయలకుమున్నే నరసింహదేవరాయలుతోనే (1465) లభించినది. అతని సాళువ వంశముతోపాటే హంపిరాజ్యమున అది వృద్ధిచెందినది. ఆ వంశమునకు ముందుకూడ అదేమంత పసికూనకాదు. బుక్కరాయలనాడే, అనగా 1356–77 లోనే జైనమతము మీద దౌర్జన్యముజేయ సమర్థమైనది. జైనముపై చేసిన దౌష్ట్యమువల్లనే బుక్కరాయలు కలిగించుకొని యిరుమతములకు సమరసచేసి ఒక శాసనమిచ్చుట కలిగినది. సాళువ నరసింహుని ఆస్థానము ప్రవేశించియే తాళ్ళపాక అన్నమయ్య కీర్తనలు పాడజొచ్చినాడు. ఈ నరసింహదేవరాయనికిముందే రెడ్డిరాజులు వైష్ణవము నాదరించినారు. కందుకూరురెడ్లు, కొండవీటి కుమారగిరి, కాటయ వేమారెడ్డి కూడ వైష్ణవమునకు రాజాశ్రయమిచ్చియున్నారు. పోతన భాగవతమే శైవము నుండి వైష్ణవమునకు దేశము తూగినదని సూచించును. అట్టియెడ పదునేడవ శతకము తొలిసగమువనే మద్యమాంసములు మరగి తంత్రాచార పరిభ్రష్టమై తోచుటకు వ్యవధానము చాలదనుట పొసగనిమాట. రామానుజులు ప్రవేశమియ్యనందుకుగాను, అతని మతమును తంత్రాచార దూషితముజేసి పతనము జేసెదమని యిద్దరుస్త్రీలు ప్రతిజ్ఞచేసి, పనిచేసినట్లు ఒక కథయేకలిగి వాడుకకెక్కియుండగా వ్యవధానము అసలు విషయమే కాజాలదు. ఆదినుండియు ఆ అపాయము దానికున్నదని విశదము గదా? ఆదురవస్థనాడు వైష్ణవమునకేపరిమితము, ప్రత్యేకముగాదు. హిందూమతమున సర్వశాఖలును తంత్రమునకు తలలొగ్గియున్నవి. అవంతయు యిప్పటికే తెలిసికొన్నాము.

ఇంతేగాక దీనికంతకు ఉపోద్బలకముగా ఒక పద్యమును దానిపరిష్కారమును చూపినారు. అది వేమన జన్మసంవత్సరము పేనున్న పద్యము

"నందన సంవత్సరమున పొందుగ కార్తీక శుద్ధపూర్ణిమ నాడున్
వింధ్యాద్రి సేతుబంధన సందునవొక వీరుడేలు సరిగున వేమా"

ఇది వేమనదని, అతడు తన జన్మకాల నిర్దేశముగా తానెవ్పుకొన్నదని మనవారన్నారు. మనమది నమ్మక పోయినను, వేమన అభిమానులెవరో వ్రాసి బ్రౌనుకు ముందే తాటాకులకెక్కించినారనుకోవలసి యుండును. వేమన జన్మ తిథి వత్సరము లాతనికి దొరకినవని మనమూహించుకోవలెను. అది కాదనుటెట్లు?

ఇక ఆ నందన సంవత్సర మెప్పటిది? ప్రతి అరువదేండ్లకు ఒక నందన యుండునుగదా! దానిని ఒకచోట నిలదీయుటకా పద్యములో ఆధారములేదు. మన పరిశోధనమే ఆధారము. మనవారు దానిని 1652 లోని నందన యన్నారు. బ్రౌనుకూడ (1824లో) కొంత ఊగులాడినాడు. (అతని నిశ్చితాభిప్రాయము వేమన 17 వ శతాబ్ది ఆరంభములో నున్నాడని, 15 వ శతాబ్దమను మాటతో అతడేకీభవించలేదు) కాని 1652లో వేమన పుట్టినాడన్నచో అతడు తెల్లవారిని, క్రైస్తవ మతమును, మరాటీలను వారిరాజకీయ విక్రమమును తెలిసినవాడు గావలసినదే. 1710లో చెంజిలో దేశింగురాజు కథయు 1 ఆంగ్లేయుల జోక్యము అతని ఎరుకలోమాట గావలయును. అట్లనగమా? 2

జాతీయతాదృష్టి ప్రబలి, జాతి ఆరాధించుటకు మహాపురుషులు కావలసి, వారి జయంతి వర్ధంతులు వాడుకకెక్కి అదొక ఆచారమైన సందర్భమున వేమనకొక జన్మదినము నేర్పరచవలసిన వారమై అట్టి అవసరము దీర్చుటకీ పద్యమొకపాటి ఆధారముగా పట్టి నిలుపుకోవలసి యున్నచో ఆ నందనను అరువదియేండ్లు ముందుకు జరిపి 1596నందనలో వేమన పుట్టినాడని స్వీకరించుట మేలు. కానిమరణ సంవత్సరము నిర్ణయించుటకింతపాటి ఆధారముకూడ కఱవైనది. ఆ తేదీ లేకున్నమానె, జయంతిని మాత్రము జరుపుకొనుచు, వేమన 1670 చేరువలలో కీర్తికాయుడైనాడనుకొందము. ఏమైననుకర్నూలు కడప మండలములందు వేమన తరచుగా దిరిగిన తావులందేపుట్టి పెరిగి ప్రచారము చేసి నిజాం అసఫ్ జాహీలను దర్శించి, తురకల నుండియే శిష్యుని రాబట్ట గలిగిన పోతులూరి వీరబ్రహ్మముకన్న వేమన నిస్సంశయముగా పూర్వుడు. తానీషాకాలములో (1671-87) భద్రాచల రామదాసుగా పేరుకెక్కిన కంచర్ల గోపన్న కన్నను ముందటివాడే.

గజపతులను, వారి గవ్వనాణెములను, ముత్తన్నను అట్లు ప్రస్తావించుట గలిగిన పిదప వేమనకు కొండవీటితోగల కొంత సంబంధము లేదనుటెట్లు? అతని పద్యమే యున్నది.

ఊరుకొండవీడు ఉనికి పశ్చిమవీధి, మూగసేతకెల్ల మొదటియిల్లు

1 అరవ దేశములో అతని సంచారమున్నది.

2 పోర్చుగీసులు తెచ్చిపెంచిన మిరపకాయనింక వేమన ఎరుగడు. వేమన ఎఱిగిన 'మిరెపుగింజ' యింకను మీదనల్లగ నున్నదే గాని వారు తెచ్చినదానివలె పసుపు పచ్చగాలేదు. అనఁగా వేమన మిరెపుగింజ మిరియపుగింజే గాని, దానిని వెనుకబెట్టి దాని స్థానమునాక్రమించుకొని దానిపేరును తగిలించుకొన్న విలాయతీ దినుసు నేటి మిరపమాత్రము కాదన్నమాట.

అరసి చూడజూడ నడిముక్తి మార్గమో ........ (477 – బ్రౌను)
ఊరుకొండవీడు ఉనికి పశ్చిమవీథి మూగసేతకెల్ల మొదటి యిల్లు
అరసిచూడ బయలు అవిముక్త శివుడయా ........
ఊరు కొండవీడు ఉనికి పశ్చిమవీథి, మూగచింతపల్లె మొదటియిల్లు
ఎడ్డెరెడ్డి కులమదేమని చెప్పుదు ........

ఇన్ని పాఠభేదములున్నను, అందులో మొదటియిల్లు మూగచింతపల్లె మాఱెగిరిపోయినను, మారిపోయి అది పల్లెగాకుండ పోయినను ఊరుకొండవీడను మాటకు మార్పులేకున్నది. తిరుగులేకున్నది. మూగచింతపల్లె – ఎడ్డెరెడ్డికులము ఉన్న మూడవపాఠము బ్రౌను ముద్రించిన సంకలనములో లేదు. అది బ్రౌను ఎఱుకలోలేని పాఠముగావచ్చు. [వేమారెడ్డీయని సంబోధించుకొన్న పాట* గూడ (ఆటవెలదిగాదు) బ్రౌనుకట పడలేదు కాబోలు, అతనికి వేమన రెడ్డికులజుడన్న నిర్దేశములేకపోయినది. అతనికి వేమన తొలుత జంగముగామారిన కాపురైతను అర్థమున ఒకకాపు*] మూడవ పాఠము లేకున్నను, అసలీపద్యము వేదాంతపరమైనదనుకొని కొండవీడన్న దానికి వేదాంతార్థము చెప్పికొన్నను వేమన కొండవీటివాడని చెప్పుకోవచ్చును. వేదాంతార్థమును తనయూరిపేరు మీదుగా చెప్పుకొనుటకు పేరుండి కవలెనని అట్లు వాడుక చేసినాడనుకొనగలము. వేమనను గూర్చిన గాథలలో ఒకటి కొండవీటి సీమనున్న వినుకొండలోగూడ గలదు. వేమన విరాగియై గోచితోనుండగా అమ్మపెద్దులు రెండు వినుకొండవీధిలో జనులకు విడదీయరాకుండ కలియబడి కుమ్ములాడుకొనుచుండగా గుమిగూడిచూచు గుంపునుండి వెలువడి చేతితో చరచి రెండింటిని రెండుకడలకు త్రోసివేసి విడిపించినాడట. ఆ ఒత్తిడిలో ఉన్నకొంచెముగోచియు ఊడిపడిపోయినదట. ఊడినగోచి ఎట్లును ఊడినది, అదికూడ తనకేలయని నాటినుండి దిసమొలతోనే యుండబట్టెనని కథయున్నది.

వేమన యనుపేరు కొండవీటిసీమలో జనులలో లేదనువారున్నారు.

---

* ఇనుమునజేసిన మైనపుకడ్డీ ఇంటివెనుక స్వరావుందొడ్డి ఊవిటికిమేపిన కుందురుగడ్డీ విప్పిచెప్పరా వేమారెడ్డీ

* కలియుగానసున్న కాపుకులానకు వేమన తనకీర్తి విక్రమించె – నన్న పద్యము బ్రౌనుచూచినాడు. ఆ పైన రెడ్లను మొఱసులనుట జూచినాడు. పాకనాటిరెడ్డి పరగ మోటారెడ్డి, ఎసగుతోట పెద్ద ఎట్టిరెడ్డి, మొరుసులందరు భువి హారువొప్ప నన్నింట ప్రతిభకెక్కిరెట్లు? ........ (బ్రౌను)

నేటి తెనుగువారిలోనే తక్కువని బ్రౌనుకు తోచినది. పూర్వమది తరచైన పేరు. బ్రాహ్మణాదిగా ఉన్న పేరు. వేమనారాధ్యుడు, వేమనామాత్యుడు, వేమ చమూపతులు బ్రాహ్మణులే. (వీర) శైవము నాడెక్కువైన పేరు. బ్రాహ్మణులందింకే ముండును ? కొండవీడేలిన ఆరుగురు రెడ్డి రాజులలో నలుగురు వేమారెడ్లే అగుటచే వేమన పేరు రెడ్లతో ముడిపడినదని భ్రాంతి కలిగించును. నాడును నేడును వేమన యను పేరు రెడ్లలోనే తక్కువ. ఇతరుల దాన శాసనములందున్న పేర్లను బట్టి చూచినచో వేమ సంబంధ నామము ఇతరకులములందే ఎక్కువ. ఇప్పుడా పేరు దిగువ కులములందే మిగిలి యున్నది. నామకరణములో నాగరికతకన్న నవ్యతా వ్యామోహముకన్న పెద్దల పేర్లమీద పెనకువ వదలనంతవరకు ఆ పేరెక్కడనో యుండుచునే యున్నది.

దిగువన ఒడ్డెరలందెక్కువ. వేములు, వేమాయలు, వేములయ్యలు అందెక్కువ. నెల్లూరు–కర్నూలు–గుంటూరు జిల్లాల పాతపొలిమేర తాలూకాలలో, నేటి ప్రకాశము - నెల్లూరు జిల్లా సరిహద్దు ప్రాంతములలో వేమన సంబంధమైన యింటిపేర్లవారు కొన్ని కులములలో ఉన్నారు. వేమన, వెమని, (యామని), వెమినేని యను వారు కమ్మవారిలోను, వేమిరెడ్డి వేమారెడ్డి యనువారు మాత్రము రెడ్లలోను, వేమా వారు కాపులందును, మాలలందును ఉన్నారు. ఆ ప్రాంతములో వేమన పేరింక నామధేయముగా కొంత బలిజ లందున్నది. వేమయసామి వేషములు వీరివే. జాతివార్తలు వీరివే ఆ ప్రాంతము గజపతుల పాలనలో కొండవీడు క్రిందే యున్నది. వేమనను కొండవీటి వాడని చెప్పుటకు ఆ పేరక్కడ వాడుకలో లేసి పేరనుమాట కూడదు. అచట ఆనాడింకను ఎక్కువ వాడుకలో నుండ పీలుండును.

పంక్తి పంక్తికిని పాఠభేదము లిన్ని కలుగగా,ఇంక మరిన్ని యుండగా, వేమన పోస్టలు అడ్రసు 'ఊరు కొండవీడు ఉనికి పశ్చిమ వీధి' యని యున్నను దుబాయ్ గాని, బ్రౌన్‌గాని వేమన కొండవీటివాడను మాట మాత్రము వినలేదు. పాశ్చాత్యు లందెక్కువ మంది వేమనను కడప సుబావానిగానే విన్నారనవలెను. బ్రౌన్ మాత్రము కర్నూలుజిల్లా 'క్రిష్టిపాడు', గుంటూరుజిల్లా 'వినుకొండ' యుకూడా అతని జన్మస్థలముగా విని, వెళ్ళి, విచారించి gained no information whatsoever అని వ్రాసు కొని, కడప 'చిట్వేలు', 'గండికోట'లను గూర్చి కూడ అట్లే అయి, అతని "కొన్ని పద్యాలలో కానవచ్చు మాండలిక భాషా స్వరూపము ఆధారముగా, పై జెప్పిన పల్లెలు పట్టనములు అన్నియు గల నైరుత్యాంధ్ర దేశవాసియై యుండుట అత్యంత సంభవము"ని తీర్మానించినాడు. అంతేగాని, ఊరు కొండవీడను పద్యమును చూచియు, అందు కొన్ని పాఠభేదము లెఱిగియు, దానిని Mystic Reverie గా మాత్రమే

తీసికొని, సాంకేతికార్థమే చెప్పుకొని, స్వీయ చరిత్రకు చెందిన అర్థము మాట స్ఫురణకేరాక, కొండవీడు ఒకస్థలనామము, దానినే ఇట్లు వాడి నాడనగా దానితో అతని సంబంధమేమై యుండునను మాటదలపక, 'అనవేమారెడ్డి' కుటుంబము వాడని విని కూడ, అనవేమారెడ్డిని కొండవీటి రెడ్డి రాజుగా గ్రహించగల చారిత్రక సామగ్రి నాటికింక సమకూరని దశలో అతనిని కర్నూలు సీమ ఏలికగానే విని, అంతేయని దలంచి, ముప్పది నలుబది వ్రాతప్రతుల నుండి ఎంచి ఎన్నికజేసిన రెండవ ప్రచురణలో "ఊరు కొండవీడు ...... " పద్యమునే —తొలి ప్రచురణలో ఉన్న దానినే-మలిప్రచురణలో తీసివేసి, మరల అచ్చుకు సిద్ధముజేసి అచ్చువేయక మిగిల్చిన D-1774(అకాడెమీప్రచురణగా వచ్చినది)సంకలనములో చేర్చి పెద్ద కసరత్తుచేసియు వేమన కొండవీటి సంబంధమును బ్రౌన్ ఊహించలేదు. చర్చించలేదు. వ్రాయలేదు.

వేమన కొండవీటి వాడని విని, వాదించి, వ్రాసిన ఏకైక పాశ్చాత్యుడు R. M. Macdonald. దుబాయ్, బ్రౌనుల అభిప్రాయములను చూచి- వానితో భేదించి, వానినే ఖండించి అతనిని కొండవీటికి దెచ్చిన వాడితడే. అతడాపని 1868 లో చేసినాడు. అతని కాధారమొక రెడ్డి తాసిల్దారు. కడప మండలము ప్రొద్దుటూరుకు తాసిల్దారుగా నుండి వేమనను కొండవీటి వాడని చెప్పి, అందుకు పద్య మాధారముగా జూపినాడు.

పీడు కొండవీడు వీథి పశ్చిమవీథి, మూలచింత (ల) కెల్ల మొదటిత్రోవ
త్రోవదెలిసి (న) కొన్న (వానికి) దొరుకును (నయా) లాభంబు ......
108 — వేమన-పాశ్చాత్యులు

ఊరు కొండవీడను పద్యమునకే యిదొక పాఠభేదము, రెడ్డి తాసిల్దారిచ్చిన యీ పద్య పాఠములోగూడ ఎడ్డెరెడ్డి కులమను పంక్తి లేదు. అది గుర్తిదుకొనవలసిన విశేషము.

---

* "ఊరు కొండవీడు ఉనికి పశ్చిమవీథి, మొలకచింతలోన మొదటియిల్లు
వెర్రి వేమనన్నగ వేదాంతవేత్తయ్యె విశ్వ... ...D-1789 వ్రాత ప్రతి."
"ఊరు కొండవీడు ఉనికి పశ్చిమవీథి, మూగసేతికెల్ల మొదటి యిల్లు
ఉరసి చూడచూడ అది ముక్తి మార్గమో ...... ...... ......
—వీనితో ఊరు కొండవీడు పద్యమునకు ఆరు పాఠ ములు.

రెడ్డి తాసిల్దారు కథనము విని, పద్యమును వ్రాసుకొని మద్రాసుచేరి బ్రౌన్ వ్రాత ప్రతులను వెదకి "ఊరు కొండవీడు...మూగ సేతకెల్ల...అరసి చూడఖూడ ..." అన్న పద్యమును చూచి, బ్రౌన్ మర్మ తత్త్వముగా ఇచ్చిన అర్థమును గమనించి ఆత్మకథా విషయార్థముకూడ గ్రైకొనవచ్చునని, బ్రౌన్ కేవలము సాంకేతికార్థమునే గ్రీసికొన్నాడని అతని పరిమితిని మాక్డొనాల్డు చూచినాడు. చెప్పినాడు.

కొండవీటికి దెచ్చినాడేగాని, వేమనను రెడ్డిని చేయలేదు, మించి రాజవంశము వానినిగాను చేయలేదు. కేవలము కొండవీటికిదెచ్చి వదలినాడు. దుబాయ్ బ్రౌనులు రెడ్డిగను, కాపుగను, వ్యత్యాసముగా వ్రాసినది చూచియు, తన వ్యాసమున దానిని ఉట్టంకించియు ఆ చర్చలో దిగకుండ, స్వవిషయమున కొత్త ప్రతిపాదనచేసి ముగించినాడు. మాక్డొనాల్డు అనగా రెడ్డి తాసిల్దారే కులము, రాజరికము మాట లేకుండ గనే చెప్పినాడనుకో వచ్చును.

ఆ రెడ్డి తాసిల్దారు కడప మండలములో నుండియు, కదిరికి కటారుపల్లెకు, అచటి వేమన పీఠమునకు ఏబడి యేళ్ళలో అధికారిగా నుండియు 1866సరికే వేమనను కడప వానిగను కటారుపల్లెవానిగను, చిత్వేలువానిగను, క్రిష్టిపాడు వానిగను చెప్పక కొండవీటి వానిగాజెప్పి చూపినాడు. దత్తమండల మంతయు పర్యటించుచు వేమన జీవిత సమాచారమునకై చాలచోట్ల విచారించు చుండగా మాక్డొనాల్డుకి రెడ్డి తాసిల్దారు ప్రొద్దుటూరులో తగిలి చెప్పిన యీ విషయ మొక్కటే మాక్డొనాల్డుకు పనికి వచ్చిన సమాచారముగా తోచినది. బ్రౌన్‌కన్న మాక్డొనాల్డు రాయలసీమలో వేమనకై ఎక్కువగా విచారించినట్లున్నాడు. * కడకిది ఫలమైనది. రాయలసీమలో వేమన సమాచార విచారణమే కొండవీటిని చూపినది.

18 : ఓవరకు మద్రాసు రాష్ట్రములోనేఉన్న అబేదుబాయికిగాని, 1820-22లలో కడపలో ఉండి, 1824 29 మధ్య వేమన సమాచార సేకరణకై వినుకొండ మొదలు చిత్వేలువరకు తిరిగి, 1855 వరకు యీ దేశములోనే యున్న బ్రౌన్‌కుగాని సమకాలికుడై యుండి , ఆ తాసిల్దారుకు కూడ సమకాలికుడయ్యు వారిరువురి ఎఱుక కెక్కని యీ కటారుపల్లివేమన కథ 1875 లో కడప జిల్లా మాన్యువెలులో దిగంబరుడైన అసలు వేమనతో కలిపివేయబడి, అప్పటికి పది, పదేను ఏండ్ల క్రిందనే మృతుడైన వానికథ ఇంగ్లీషువారు కడప మండలము నాక్ర

---

* బ్రౌన్ కడపలో ఉద్యోగిగా నున్నప్పటికి (1820-22) తెలుగు భాషాధ్యయనమున నిమగ్నుడు కాలేదు. వేమన మాటే దలచినవాడుగాడు.

మించుకొనుటకు (1792) 'కొంతముందు' జరిగినదిగాను, అతడు తన్నుదాను ఒక గురుపీఠమున అధిష్ఠించుకొన్నట్టుగాను జె. డి. బి. గ్రిబుల్ ఎక్కించినాడు. 1780 లో పుట్టి 1860 లేక 1969 వరకును గల కటారుపల్లె వేమన విషయమిట్లు రికార్డు కెక్కినది.

ఆ పైన తొమ్మిదేండ్లకు, అనగా 1884 లో కడప జేరి జమ్ములమడుగులో క్రైస్తవ బోధకుడుగా అయిదేండ్లుండి, వేమనయోగిని గూర్చి విని, చదివి, అతడే కటారుపల్లె వేమన యనుకొని, అక్కడికివెళ్ళి అచట సమాధిని,ఆ ప్రక్కన కోవెలను, అందు గల వేమన వికృతమైన కొయ్య విగ్రహమును చూచి, ధర్మకర్తల కుటుంబమును జూచి, వారి వద్ద ద్విపద వేమన తాళపత్ర గ్రంథమును గూర్చి వినక, దాని చూడక, చదువక, 'బాలచక్రవేమ భవ్యనామ' ('బౌద్ధరామ') మకుటము గల శతకము నెరుగక, కటారుపల్లె వేమన దిగంబరుడు గాడేయని, సన్యాసి కానేకాడని కానక, అనగా అతని బట్టలనచట చూడక, బడుగు గుర్రాలమీద పసుపుబట్టలతో వేమయస్వాములమని తిరుగువారి మాటెరుగక, భారతీయ ప్రజాకవులలో కెల్ల మహాకవిగా తాను మూల్య నిర్ణయము జేసిన తన మహాకవికి జననమరణ స్థలమొకదానిని ఆధారము చూపించితి ననుకొని పరవశించిపోయి 1898 లో W. H. Campbell ఒక వ్యాసము వ్రాసి ప్రకటించినాడు. దానితోసాహిత్య ప్రపంచమునకు కటారుపల్లె కథ ఎక్కినది. మాక్డొనాల్డు కొండవీటి వాదమునకిది ప్రతిస్పర్థియై కూర్చుండినది.

కాని, మరొక్క అయిదేండ్లలో, అనగా 1903 నాటికి వేమనను కొండవీటి వానిగనేగాక, రెడ్డిగను, అచటిరెడ్డి రాజరికములో వానిగను, వేశ్యాలోలునిగను, రాణియైన వదినెగారి ముంగరదెచ్చి వేశ్యకియ్యవలసి, యిచ్చెడి సందర్భమున దాని దిసమొలచూచి వైరాగ్యము కలిగి, యోగియై బోధకుడై దేశాలు తిరిగి తుదకు కటారు పల్లెలో సమాధి చెందినవానిగను ఒక భట్టిప్రోలు పంచాయితి పుట్టినది. మాక్డొనాల్డు క్యాంబెలులకు ఒక సమన్వయ మిట్లు కుదిరించినారు. పమ్మి త్యాగరాయచెట్టి ప్రచురణ మైన "వేమన యోగి విరచిత వేదాంత సిద్ధాంతము" పీఠిక ఇట్లు పంచాయతి చేసినది •.

ఆపంచాయతి మాటుననే కొండవీటికథయు ఇకపెరుగజొచ్చినది.1913లో రాయవరము పూర్ణయాచారి వేమనయోగీంద్ర చరిత్రము గూర్చి కొండవీటి రాజరికముతో ముడి బెట్టిన కథ తమ దనిపించుకొన్నంతకు దెచ్చుకొన్నారు. అసలు పమ్మివారి పీఠిక తెచ్చిన రెడ్డి రాజరికమునకు అందలి రాణివాసపు కంసాలినొకని నభిరామయ్యగా

• ఆ పీఠికకు కర్తలెవ్వరో మరి. ఆ ప్రతి నాకు దొరికినదికాదు.

సృష్టించి, జ్ఞాన సంపాదనమున వేమనచే వంచితుడైనట్లు చూపుటకన్న వేరేమి కల్పన మును చేయలేదు. ప్రధానముగా చరిత్రను కల్తీ చేసినపని పమ్మివారి పీఠికాప్రచురణ. కాని పూర్ణయాచారిపైనే ఎల్లవారును దాడి చేసినారు. ఆ చరిత్రకల్తీ కరణము ముందుగాని కటారుపల్లెలో వేమన నకిలీకరణము ముందుగాని అభిరామయ్య• కథాకల్పన మెంతపాటి నేరము? రామాయణములో పిడకలవేట వలె వచ్చిన అభిరామయ్య ముచ్చట నికనింతటితో వదలి కొండవీట బుట్టి కటారుపల్లెలో మరణించెనన్న తీర్మాన మెట్లు జీవితము వెళ్ళబారించినదో చూడవలసియున్నది.

1915లో పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు – 1917లో రాళ్ళపల్లివారు కొండవీడు, కటారుపల్లెను కలియనీకుండ పెనగినారు ఈ పెనగులాటను మరల పంచాయతి జేసి ఆ రెండు కథలను గట్టిగా అతికినవాడు వంగూరి. ఈ భట్టిప్రోలు పంచాయితికి కొమఱ్ఱాజు లక్ష్మణరావు కూడ పాల్పడినాడు. వీరి తీర్పు ఇట్లున్నను, వంగూరి–కొమఱ్ఱాజుల వలన కటారుపల్లెకు విశేషప్రచారము జరిగినది. శేషాద్రి రమణ కవులును వీరిని ధ్రువపరచినారు. అవిచారితమై అంధపరంపరా న్యాయ మిట్లమలు జరుగుచుండగా వేమన జనన మరణములు యీ కొండవీడు–కటారుపల్లెలకు గాకుండ జేసిన వారొకరు వెలువడినారు.

వారే వంగూరి వారి 'వేమన' గ్రంథ సమీక్షకులు, వేమూరి విశ్వనాథశర్మగారు. "ఊరుకొండవీడు ఉనికి పశ్చిమ వీధి" అన్న తొలి పంక్తితోనే యితరులు విరమించుకొనుచుండగా "మూగ చింతపల్లె మొదటి యిల్లు" అను రెండవ పంక్తిని గూర్చి పట్టించుకొన్నవాడితడు. అది పొదిలెకు ఆరు మైళ్ళలో నున్న "మూగచింతల" యని అదే అతని జన్మస్థలము, కొండవీడాతడు కొంతకాలముండిన యూరు అని చెప్పినాడు.

ఇక కటారుపల్లెలో వేమన సమాధి ధర్మకర్తలు చూపించు ద్విపద వేమన చరిత్రపుస్తకమే వేమన కటారుపల్లెలో మరణించినట్లు చెప్పుటలేదని •• కటారుపల్లెలో వేమన అన్నదమ్ములు తల్లిదండ్రులు బంధుమిత్రులు మాత్రమున్నారనియే చెప్పు చున్నదనియు, ద్విపద చెప్పిన కటారుపల్లె అసలుకే కదిరిసీమ కటారుపల్లె కానే కాదనియు, చెన్నకేశవాలయమున్న మార్కాపురమునకు ద్విపదలోని కటారుపల్లెదగ్గర

---

• అభిరామయ్య పేరు లోకములో (పూర్వము) లేనిదని వాదము చేయుట పొరపాటు. పూర్వకావ్యములందున్న పేరది. లోకములో అభిరామాంబికలునున్నారు

---

•• (కడప) చిత్వేలనకు 7, 8 మైళ్ళలోగల చింతపల్లెలో వేమన సమాధి యున్నదని జాగరగల్లు సుబ్బారాయుడుగారు 1941 వావిళ్ళ రజతోత్సవ సంచికలో వ్రాసినారు.

దనియు, చెన్నకేశవాలయమున్న ఒకేయొక్క మార్కాపురము పాత కర్నూలు మండలములోనిదనియు, ఆ చెన్నకేశవుని భక్తులు ధర్మకర్తలు వేమన తల్లిదండ్రులని ద్విపద చెప్పుచున్నదనియు, మార్కాపురమునకు కటారుపల్లె 24 మైళ్ళలో గలదని, నేడది పాడుబడి నిర్మానుష్యమై రివెన్యూరికార్డులో మాత్రము మిగిలియున్న బేచిరాగ్ గ్రామమని విశ్వనాథశర్మగారు తేల్చినారు. మార్కాపురమునకు రెండామడలలో (పొదిలె) మూగ చింతలయు, మూడామడలలో కటారుపల్లెయు కలవనియు, అవే ద్విపద వేమన చరిత్రములోని యూళ్ళనియు నిశ్చయించినారు. కడప-అనంతపురము సరిహద్దులలోని కదిరి కటారుపల్లెవారు చూపు ద్విపద వేమన చరిత్రమే అతని సోదరులుండిన కటారుపల్లె తమ కటారుపల్లె కాదనుచున్నదని చెప్పియున్నారు.

వేమన గూర్చి వెడలిన పండిత పరిశోధకుల కితడు అనపేక్షితుడు, ఉపేక్షా మాత్రదండితవ్యుడు, మిగిలి తస్కరణీయ విజ్ఞానసుశ్రీకుడు, అరక్షితుడునైనవాడు. రామలింగారెడ్డికి ఫలితములు తెలియుట చేతనే, కదిరి కటారుపల్లెగాథల అనుపానులు తెలుసుకొని రమ్మని రాళ్ళపల్లికి సూచించుట కల్గినది. రాళ్ళపల్లితనని కావలెనని కప్పి పెట్టినాడు.

రాళ్ళపల్లి విశ్వనాథశర్మగారి కటారుపల్లె- మూగచింతల నిర్ణయములను తమ్మయ్య గారి రక్తాక్షి సం॥ ఆంధ్రపత్రిక ఉగాది సంచికా వ్యాసము వలన ఎరిగినవారే గాని ఎరుగనివారు కారు. ఆ సంచికా వ్యాసమును వారు చదివినట్లు చెప్పుకొన్నారు. (వేమన. 28, 30 పుటలలో అధోజ్ఞాపికలు) విశ్వనాథశర్మ వ్యాసములను స్వయముగ చూడ వలెనని, తమ్మయ్యగారిచ్చిన దానితో తృప్తిపడక- ఆ యాంధ్రపత్రికలను నెమకు లాడక, తెప్పించుకొనక, ఆ వాదమంతయు చూడకనే తమ వేమన ఉపన్యాసము చేసినారేమో, స్థలకాల కులకుటుంబ విషయములలో వే ఎ. శర్మ పేరే వారెత్తలేదు. తమ్మయ్య గారు శర్మను గూర్చి వ్రాసి, దానిని (రక్తాక్షి సంచికను) చూచియు చూచి నట్లే చెప్పరు. కటారుపల్లె మిథ్యావృత్తాంతమును బైటపెట్టిన పాటి పేరైన తమకు దక్కదను భయమే ఇట్లు కప్పిపెట్టించినది కావచ్చును.

బండారు తమ్మయ్య 1924 ఆంధ్రపత్రికా వ్యాసములలో వె. వి. శర్మ మూగచింతల నిర్ణయమును స్వీకరించి ఆ నిర్ణయము విషయమున తమ పరిశోధన మున్నట్లే చెప్పనివాడై, తమ వేమన చరిత్ర ముద్రణము నాటికి (1970)యూ సంగతి వినా యితరత్ర నలుమూడు మార్లీతని పేరెత్తి ప్రస్తావించుచునే, ఇది మాత్రమేటో తమ నిర్ణయముగా పాఠకులను, భ్రాంతి పెట్టుచున్నారు వీరికి పొదిలె దగ్గరి మూగచింతల

దప్ప వేరొక మూగచింతల వినరాలేదు. ఆ పొదిలె మూగచింతలకూడ Alphabetical List of Villages in Madras Presidency లో కానరాలేదు.

1925 లో వావిళ్ళ ప్రచురణ పీఠికలో శేషాద్రిరమణ కవులీతని నిర్ణయము లసలు తెలియనివారుగా ఒంగోలు తాలూకాలో మూగచింతలను సూచించియున్నారు. (అదియు తమ్మయ్యగారికి లిస్టులో కనిపించలేదు) కదిరికటారుపల్లె తాళపత్రాలలో ద్విపద చరిత్రతో పాటుగా నున్న 'బాలచక్రవేమ భవ్యనామ' శతకపద్యముల నుండి కదిరి తూర్పునందు-వరకటారుపల్లె-యను పద్యమును శర్మగారి ఆక్షేపమునకు సమాధానమగునట్లు గుప్తముగా జెప్పినారు, గాని వే వి. శర్మ పేరెత్తలేదు.

ఈ పెద్దలెల్లరు వే. వి. శర్మకు జేసిన అన్యాయము మాట అట్లుంచి, మున్ముందు ద్విపదవేమన చరిత్రలోగల కటారు పల్లెమాట చర్చించవలసి యున్నాము. ఈ విషయమున వీరి వాదము తమ్మయ్యకు, జంటకవులకు, రాళ్లపల్లికి సమ్మతమే కాలేనిద అనుకోగలము.

ద్విపద వేమన చరిత్ర కటారుపల్లె నకిలీ వేమనది కాదు- అందు కదిరి పేరే లేదు అను వీరి మాటలు పొరపాటు. వంగూరి వారే వానిని ఉదాహరించి యున్నారు.

"అటు పశ్చిమంబున నమరియున్నట్టి, ఖాద్రి స్థలములో ఘనమైన యట్టి
రేపల్లె సరివచ్చు వరహేమ పురము (?) ఆ పురిలో కృష్ణుడాడుచున్నట్లు
వెలసెను వెమన్న వేడ్కతోనచట.... ...."

ఖాద్రియేకదిరి. ఒకసప్తతి కారుసకును కదిరి ఖాద్రి, ఖాదిరిగానేయున్నది. కటారు పల్లెకుకదిరి పశ్చిమమే ద్విపదలో కదిరి ఖా దిగా వ్రాసినారు ద్విపదలోతుంగవంశము న్నది. కదిరి కటారుపల్లెలో తుంగవంశమే యున్నది. కాకున్న, ద్విపదలో చెన్నకేశవాలయమున్న మార్కాపురము మాటున్నది. చెన్నకేశవుడున్న మార్కాపురము పినుకొండ పైన బొనకొండ దగ్గరలోనున్నది పూర్వమది పినుకొండసీమ - దూపాటిసీమ. కడపజిల్లాలో గలమరి రెండు మార్కాపురములందును చెన్నకేశవాలయములేదు.

చెన్నకేశవాలయమున్న మార్కాపురమని చెప్పి ద్విపద వేమన చరిత్ర గందరగోళము చేసినది. ద్విపదలోగల తక్కిన దంతయు కదిరి కటారుపల్లెకే చెందినది. ద్విపదలో లేని మాటొకటున్నది. మార్కాపురపు కటారుపల్లెలో మన వేమన కొన్నాళ్ళున్నాడను ప్రతీతి మార్కాపుర వాస్తవ్యులకు దెలిసిన విషయమట. కావచ్చును. అది

కూడ కదిరికటారుపల్లె నకిలీ వేమనకు కలిసి వచ్చినదనుకోవచ్చును. ద్విపద కథ కదిరి కటారుపల్లె తుంగవారిది కాకపోవుటెట్లు ?కాని ఆదే మన వేమన చరిత్ర కాకుండుటకు చాలప్రతి బంధకములున్నవి. అదియును, ఆ కటారుపల్లెయు అసలు వేమనవి కావనునంతవరకు ఆ పుక్కిటి కథ చరిత్రగానే సాగినది.

కాని విశ్వనాథశర్మగారితో మూగ చింతపల్లెను గూర్చిన చింతమాత్రము మొదలైనది.

రామలింగారెడ్డి మాటమీద రాళ్ళపల్లి కదిరి కటారుపల్లెకుపోయి,ద్విపదవేమన చరిత్రముచూచి,సమాధిధర్మకర్త అయిన తుంగచెన్నరాయని సాక్ష్యము సేకరించుకొనివచ్చి అసలు వేమన్న కొండవీటి వేమన్నయని,తమ వేమన్న పేరసలు తుంగపుల్లారెడ్డియేగాని వేమన కాదని చెప్పసాగినాడని, తమవాడసలు వేమనకానేకాదను నిజము నెమ్మదిగా చెప్పినాడట. చెప్పుటేగాక, ద్విపద నుండి దాఖలా కూడ చూపించినాడట.

"ఇతడు శ్రీహరి పుత్రుడితడు పావనుడు, మున్ను వేమన పరమ ముఖ్యుడైనాడు
ఇతడె యితడని పల్కి ఆశ్చర్యమంది, మంత్రాక్షతంబుల మహిమచేఁబట్టి
వేమనార్యుల మీద వెద చల్లిరంత. ........."

ఇప్పటి ధర్మకర్తలా ద్విపదలేదని, తమ వేమన సమాధి పెద్ద సమాధి కాదని, తమ వానిది వేరొక చిన్న సమాధియని చూపించుచు, పెద్ద సమాధినీ అసలు వేమన సమాధిగా కొత్తగా చెప్పదొడగినారు. అదే అపాయకరము. నెల్లూరు ప్రాంతములందు గల వేమన భక్తుల నుండి ఏడాడికొకమారు కాన్క కట్నములు పొందవచ్చునని కటారుపల్లె సమాధిని కొండవీటి వేమనదన్నాముగాని, నిజముగానది తుంగపుల్లారెడ్డి వురఫ్ వేమనదేనని ప్రకటించిన యథార్థము నిప్పుడీ తరమున దాచివేయ సాగినారు.×

1928 నాటి కిట్లు కటారుపల్లె సమాధియు— ద్విపద చరిత్రాదికమును అసలు వేమనవి కావని నిరూపణము కాగా, మరల మాకు మిగిలినది కొండవీడే. అది కాదని పెనగిన రాళ్ళపల్లి కూడ మరొక గట్టి ఆధారమేదైన దొరకువరకు వేమనను కొండవీటి వానిగనే చూచెదమన్నాడు.

ఈ లిఖితమునకు తోడు, ముత్తన్న మృగి ప్రశస్తి తీరు, "గ్రద్దవంటివాడు గజపతిగాడొకో," "గజపతింట గుడ్డిగవ్వలు చెల్లవా" యని ప్రజా కంటకముగా గజపతుల పాలనవెన్ని చెప్పిన విషయము వంగూరి నాటి కొండవీటి వాదములోనున్న హంశములు. క్రొత్తలేమైన చెప్పుకోగలమాయన్న ఒకటి చెప్పుకోవచ్చును.

---

× **DR. N** గోపి కటారుపల్లి మన సమాధి" యను వ్యాసము (11-9-1980 ఆంధ్రపత్రిక) చదువగా గలిగిన అభిప్రాయము.

కొండవీటిలో ఒంటి స్తంభపు మేడ యున్నదను గాథలున్నవి. కొండవీటి కైఫీయతులోనే ఒక కథ యున్నది. శ్రీనాథుడు హంపీ విజయగిరము సభలో కూర్చుండియుండగా హంపీ రాజు ఒంటిస్తంభపు మేడకట్టింపదలంచినవాడై అట్టిదెవరైన యిదివరకు కట్టియున్నారా యని విచారింపగా, శ్రీనాథుడులేచి కోమటి వెంకా రెడ్డి కొండవీటిలో కట్టించియున్నాడని తెలిపినాడట. తెలిపినాడేగాని అప్పటికి కొండవీట ఒంటి స్తంభపుమేడ కట్టనేలేదట. ప్రౌఢదేవ రాయలు తన దూతనంపి చూచిరమ్మనగా, ఆసరికి శ్రీనాథకవి తన మాహాత్మ్యముచే నల్లమలాడవులోనున్న బ్రహ్మాండమైన తుమ్మమ్రానును కొండవీటికి రప్పించి మేడ నిర్మింపబడునట్లు చేసెనని యున్నది. కొండవీటిలో ఒంటి స్తంభపుమేడ యున్నదని మాత్రమీ గాథ వలన స్పష్టము.

ఒంటికంబపిల్లినుగూర్చి వేమన బహుళముగా చెప్పుట ప్రముఖముగా కన్పించును.

ఇదేమా యనుకొనుచుండగా పై కథ జ్ఞాపకము వచ్చినది.

ఆరు అంకణముల కాధారమైనట్టి యొంటికంబపిల్లి నొనరనిల్పి
ఇంటి కొకడు కర్త ఏపారు చుండును ... [ బ్రౌన్, ఎకాడమీ ప్రతి, 436 ]

ఆరు నారుగురకు నాధారముగజేసి యొంటికంబపిల్లి నొనర నిల్పి
ఇంటికొకడు మగడు ఎన్నిక యేలయా .. [ బ్రౌన్, ఎకాడమీ ప్రతి 261 ]

ఆరు దూలములకు నాధారమైనట్టి యొంటికంబమింట నొనరనిల్పి
ఇంటి కొకడు కర్త ఏపారు చుండును ... ... [192 వ పద్యము]

ఒంటి మేడలోన నెనరంగజూచిన
..................
ఒంటి కంబమందు నొనరనుండును
.................. [435 – పమ్మి ప్రచురణ]

ఆరుఅంకణములు, ఆరుగురు, ఆరు దూలములుఅనగాషట్చక్రములు, షడరవింద

---

• [పల్నాటి వీరచరిత్ర నకు ... గారి పీఠిక ... వ పుటలో ఉదాహృతమైన కథ]

ములు, కావలయును. ఒంటికంబపిల్లి మనుష్యదేహము. పద్యార్థము తత్త్వము. కాని ఒంటి స్తంభపుమేడమాత్రమువాస్తవమైనవాస్తు నిర్మాణము. అదే గృహరాజుమేడ. కొండవీటిలో ఇప్పటికిని అక్కడ అది 'గుర్రాజుమేడ' దిబ్బే. చారిత్రక ప్రసిద్ధి గలది. తత్త్వార్థమునకు సంకేతమగుటకు కొండవీటిలో వేమన జూచిన యథార్థ దృశ్యమనగలము.

• • • •

ఇక మూగచింతల ముచ్చట. ఊరు కొండవీడను పద్యమునందేగాని అన్యథా దాని ప్రసక్తిలేదు. ఆ పద్యము పాఠభేదములన్నిటను అదియున్నదిగాదు. ఇప్పటికి మనమెరిగిన అయిదారు పాఠములలో రెండిట మాత్రమే మూగచింత యున్నది. మిగత వానిలో మూలచింత, మొలకచింత, మూగసేత యున్నవి గాని మూగచింత లేదు ప్రౌనెరిగినంతలో మూగచింతపల్లె గల పద్యమే లేదు.

కొండవీడను మాటెంతగా అధ్యాత్మికార్థము సెప్పననువైనదో, మూగచింత (పల్లె) కూడ అంతే అనువైనది. వేమనకీ సౌలభ్యము ల యూళ్లు నెలవులుగా దొరకు టెంత ఆనందప్రదమైన యదృచ్ఛాఘటనము! వేమన రెండర్థములలోను పీసిని వాడు కొన్నాడు. ఆత్మవృత్తాంతముగను, ఆధ్యాత్మికముగనువాడుకొన్నాడు. అదిఅతనిద్వ్యర్థి. కాని ఎడ్డెరెడ్డి కులమని పచ్చినప్పుడు మాత్రము అది ద్వ్యర్థికాకపోవును. కేవలము ఆత్మ కథయై మిగులును. అంతే.

మూగచింతపల్లె యనగా పొదిలె మూగచింతల యన్నారంటిమి వేరొకరు ఒంగోలు తాలూకా మూగచింతల యనగా ఆ తాలూకా గామనామములలో అది లేనే లేదన్నారని తెలిసితిమి. ఇంకొకరు "కడపజిల్లాలో కూడ నొక మూగచింతపల్లె కలద నియు, అందలి వారొక బయలుచూపి యిదే వేమన్న పుచ్చకాయలు పండించినచేనని చూపెదరనియుఁ జెప్పగా విన్నానని" అదెక్కడో చూపుమని వెంటబడక వదలిన వృత్తాంతము జెప్పినారు. కడపటి కిటీవల అర్ద్ర, "మూగచింతపల్లె" యని లక్షణముగా నిండుపేరున్న గ్రామము చిత్తూరుమండలము చంద్రగిరిసీమలో నున్న దన్నారు. 1922 వ సంవత్సరము నుండి మొదలైన మూగచింతపల్లె విచారణ మిట్లు సాగినది. ఇతరులిప్పటికి చెప్పనివి చిత్తూరు జిల్లా వాయల్పాడు తాలూకా మూగ [illegible]లయు, గుంటూరు జిల్లా వినుకొండ తాలూకా మూగచింతలపాలెము నున్నవి.

పొదిలె మూగచింతలను గూర్చి గాని, చంద్రగిరి మూగచింతపల్లెను గూర్చి గాని [illegible]తో అల్లుకొన్న కథలుగాని గాథలుగాని వాడుకలోలవు. ఇక ఒంగోలు తాలూకాలోను, ఇటు కడపమండలములోను మూగచింతలగాని, మూగ

చింతపల్లెగాని లేదు. ఆ రెండింటి నడిమి ప్రదేశమున మాత్రమింకొక మూగచింతల నిజముగా నున్నది. కందుకూరు తాలూకాలో కందుకూరికి 16 మైళ్ళలో పల్లె అది. అదే ఒకరికి ఒంగోలులోనిదని, మరొకరికి కడపలోనిదని కర్ణాకర్ణికగా తెలిసినది కావలయును.

కొండవీడువలె కందుకూరు వేరొక రెడ్డి రాజ్యము మల్లారెడ్డి సంతతి స్వతంత్రించిఏలినరాజ్యము. అందు శ్రీగిరిరెడ్డి ముఖ్యుడు. ఈ కందుకూరి రెడ్లకు పుచ్చ కాయల రెడ్లని వాడుక ఒకటున్నది నేటికి నచట అల్లే జమేదాడు కొందురు. వేమన పుచ్చకాయల తోటఒకటి పెట్టుటయు-జంప్పతడు స్వర్ణయోగమున పుచ్చగుజ్జునో, గింజలనో బంగారము చేసినట్లు కతలు నున్నవి గదా! వేమన పుచ్చకాయల బయలు చూపుటన్నది ఈ కందుకూరు మూగచింతలయందే కావలయును. వేమన మూగచింతపల్లె యనగా కందుకూరు మూగచింతల కావచ్చునేమో! పుచ్చకాయలు మాత్రము మూగచింతల లన్నింటను పండునట.

భౌగోళికముగా జూచినను వేమన ప్రస్తావనలో నున్న ఉదయగిరికిని, సిద్ధి పొందినాడను గుహయున్న పామూరునకునుఇదిఎంతో దగ్గరలోనున్నది. వేమనభక్తులు-బక్కగుర్రాల మీద పసుపుబట్టలతో వచ్చి వార్షికములు గైకొనిపోవు వేమయస్వాములు అధికాధికముగా నిప్పటికిని తిరుగాడు ప్రదేశములోనున్న మూగచింతల యిదే. దీనికిని పొదిలె మూగచింతలకును 30 మైళ్ళ దూరముండును. పొదిలె దీనికి వాయువ్యము.

ఇక చంద్రగిరి 'మూగచింతపల్లె' మాట. ఇతరములు మూగచింతలలు. ఇది మాత్రము యథాతథము పద్యమందున్నట్లే యున్నట్టిది అగుట దీని విశిష్టత, అదే దీని అనుత్తమమైనయోగ్యతయనిఆర్ద్రగవాచము.ఇదిచంద్రగిరి-బెంగుళూరుజాతీయరహదారి మీద ప్రయాణికులకు తగులునట్టి గ్రామము. దీనిపేరు ఆర్ద్ర చెప్పినట్లు అచ్చముగా 'మూగచింతపల్లె' కాదనియు- "మూగచింతప్పపల్లె" యనియు సవరణ జూపి, దాని అనన్యమైన స్వచ్ఛతకు భంగము కల్గించవలసి వచ్చినందుకు మాత్రము క్షమ్యుడను. ఇది మూగచింతన్న యనువానిపేరి పల్లెకానోపును. కాగా, పద్యములోపల్లె తప్పా యిదొక్కటే యనుమాట పొల్లు మాటైపోగా, దానియోగ్యతా యోగ్యతలు ఇతరాధారములను బట్టియుండును. అతని ప్రచారమెక్కువగాగల సీమకడి పెడగానున్నది. కందుకూరు మూగచింతలకు ఇది 130 మైళ్ళ దూరమందున్నది. గండికోట, ఉదయగిరి, మార్కాపురము, అచటి కటారుపల్లె, కందుకూరు- పాతనెల్లూరు, కడప, కర్నూలు మండలముల సరిహద్దులాతని ముఖ్యమైన ప్రచారభూమి.

చంద్రగిరిసీమ మూగచింత(న)పల్లెలో వేమన బాల్యము గడిపెనన్నచో, కొంత ఊహ దెలిసిన వాడగువరకు అతడందున్నవాడేని పోర్చుగీసు జెసూటిస్టు క్రైస్తవ ప్రచారకులనువిన్నవాడును కన్నవాడునుకూడకావలెను. వెంకటపతి రాయలను క్రైస్తవుని జేయుటకై క్రైస్తవ ప్రచారకులు చంద్రగిరిలో 18 యేండ్లుండి, రాయలకు పోర్చుగల్ రాజు నుండి ప్రశంసలుదెచ్చి, బహుమతులుదెచ్చి అతని చావుతో గోవాకు వెళ్ళిపోయిన చరిత్రమున్నది. చంద్రగిరి మీదే క్రైస్తవము కన్నుపెట్టి యత్నించిన రోజులవి. కాని ఆజాడ యేమియు వేమనలో కానరాలేదు. ఊహలేని పసినిసుగుగా మూగచింత(న)పల్లెవిడిచి కొండవీడుచేరి అచటనే పెరిగి పెద్దయై అచట మరేమో యయినా డన్నచో మూగచింత(న)పల్లె అతని జీవితములో మూగిపోయినదగును.

కందుకూరు—పొదిలి—వినుకొండ సీమల మూగచింతల లన్నచో వేమన బాల్యమననేగాదు, కొండవీడు వదలి తిరిగి జన్మస్థానముజేరి ఆ చుట్టుపట్లనే సంచరించెననుటకు, ప్రచారరంగముగా గైకొనెననుటకు వీలుండును. చిత్తూరు జిల్లా మూగచింత (న-ల) పల్లెలకు గాక తక్కిన యన్నింటికి యీ వీలుండును. అతని బోధనా ప్రధానరంగము ఒక్కడనే యున్నదని తెలుచున్నది

• • • •

కడపటికిక మిగిలినపంక్తి 'ఎడ్డెరెడ్డికుల మదేమని చెప్పుదు' నన్నట్టిది. ఊరు కొండవీడను పద్యమైదారు పాఠములలోను ఇది ఒకేఒక పాఠములో నున్నది. (మూగ చింతపల్లె రెండు పాఠములందున్నది, కొండవీడు అన్ని పాఠములందు నున్నది) అన్నింటికి కడపట దొరికిన పాఠమిది. కడపటి కచ్చయిన పాఠమిది. 1918 వరకు దీని నెవ్వరు నెరుగరు. దీని నీనాటికి తాళపత్రములలో జూచితిమన్నవారు లేరు. దీని నెవ్వరు జూచినను అచ్చులోనే. అట్టి అచ్చులో జూపినవారు రాయవరము పూర్ణయాచార్యులుగారే. వావిళ్ళవారు దానిని గ్రహించి ముద్రించు చున్నారంతే. బ్రౌను తాలి పాఠమును చంపి దీని నొక్కదానినే ముద్రించుచున్నారు. ఇప్పటికిని యీ పాఠమునుగైకొనక వేమనపద్యము లచ్చువేయువారుండనే యున్నారు. అయినను అదే అనన్య ప్రచారము పొందియున్నది. తక్కుంగల పాఠములన్నింటిని వెనుక బెట్టించి పరిశోధకుల పరిశీలనము నాకట్టుకొని యున్నది. కాని ఇది రాయవరము వారి అచ్చులో పాఠముగనే మిగిలి యున్నది. అసలీ పాఠమునకు తాళపత్ర యోగ మున్నదో లేదో తేల్చుట అత్యావశ్యకము

కులముకాలబెట్టిన వేమన కులముమాట దెచ్చిన పద్యములు దీనితోరెండైనవి.

దీనికి ముందు 'కలియుగాననున్న కాపు కులానకు వేమన తన కీర్తి విక్రయించె' నన్న పద్యమే పద్యము. అది వేమనయే చెప్పుచున్నట్లుండదు. కాని 'ఎడ్డెరెడ్డి కులమదేమని చెప్పుదు' నని ఉత్తమ పురుషలో నన్నది. ఇవి రెండును వేమన చెప్పినవేయని గ్రహించుట అనివార్యముగాదు. ఇతరు లైనను చెప్పి చేర్చి యుండ వచ్చును. తాటాకులలో ఉనికి ఎడ్డెరెడ్డి కులము నాతని పద్యమేయని నిరూపించునదయి నను, కాపుకులమను పద్యము అంతమాత్రాననే అతనిదేయనుటకు చాలదు. ఇంకితర విషయములందు కవసరమగును.

అబేదుబాయి ఇవేమియు చదివినవాడు గాడు. కాని, వినికిడిలో గల మాట చొప్పున వేమనను రెడ్డి యన్నాడు ఆసను అది నేటి అర్థమున రెడ్డి కులమనియే తీసుకొనుట అనివార్యము కాదన వచ్చును. ఏమైనను దుబాయి వ్రాత నెరిగికూడ, బ్రౌను వేమనను కాపని తద్భిన్నముగా వ్రాసినాడు. కావలెనని రైతను నర్థమునందే అట్లు వ్రాసినాడు. దుబాయిరెడ్డియని వ్రాయుట తనకు సమ్మతము గాదన్నమాట.

కటార్లపల్లెలోను, నల్లచెరువులోను అతని వారున్నారని వ్రాయుచునే 1917 లో వేమన కాపనియే రాళ్ళపల్లి వ్రాసినాడుగాని రెడ్డియని వ్రాయని వాడయ్యెను. వేమనను కొండవీటి వానిగను, అందలిరెడ్డి రాజటికము వానిగను చెప్పిన గ్రంథములతో వివ దించు చుండియు కాపనియే వ్రాసియున్నాడు. అనగా వేమన కులము కాపా, రెడ్డియా యన్న వివాదములో వారున్నారు. అప్పుడు వారికి వేమన కాపు. కాని, 1928 వేమన ఉపన్యాసముల నాటికి మాత్రము 'వేమన కాపువాడు—కాపులలోని రెడ్డి' యని చిగురు తొడిగినారు. రెడ్లలోను "ప్రభురెడ్ల" గుంపునకు చెందిన వాడని చేర్చి చెప్పినారు. వీరెవ్వరో మాత్రము వారు చెప్పలేదు. ప్రభురెడ్లను వ్యవహార మసలు రాయలసీమ యందున్నదో లేదో కూడ అవశ్యము విచార్యము. అదేమైనను, వేమన కాపని చెప్పిన తెనుగువాడొక్కడు నిట్లుమారిపోయి, రెడ్డి యనుటకు తలపడగా, వేమన నేటి రెడ్డి కులములోవాడుగా నిరాఘాటముగా చెల్లదొడగినాడు. 1913 తర్వాత పుట్టిన రెడ్డిసంఘ మాతనిని తమ కులస్థునిగా పూజించినది. పూజించుచున్నది.

కాని, ఎడ్డెరెడ్డి కులమదేమని చెప్పుదు నన్న పాఠము తాటాకులలోనిది కాక పోయినచో వేమన నేటి రెడ్డి కులములోని వాడేయన గల్గుదుమా లేదా యన్నది విచార్యము.

అందుకాతని పద్యములందెంత ఆధారమున్నదో, వ్రాతప్రతులందెంతయున్నదో, వాడుకయందెంతయున్నదో దానికి కారణములేమో తెలియవలసియున్నాము.

వేమన తన్నుదాను వేమ, వేమన, వేమన్న, వెఱ్ఱివేమన, వేమడు అని చెప్పుకొన్నాడు. 'యోగిరాయడు వేమా', దేవరవేమా' యని రెండు కందపద్యములు, 'విప్పిచెప్పరా వేమారెడ్డీ' యనిన ఒక చౌపదియును, 'వేమన్నృపాలశేఖరా' 'గోరాజవేమాహ్వయా' యను సంబోధనగల వృత్తములు రెండును గలవు. అనగా, ఒక్కచోటనే అతడు వేమారెడ్డి అయినాడు, అంతే. అదికూడ ఆటవెలదిగాదు. కందముగాను.

వ్రాతప్రతులు అరువదికి పైగా చూచి, వాని వ్రాయసగాండ్రను, ప్రతులపేర్లు మొదలైన విశేషములను అచ్చులో జెప్పిన మేరకు చూడగా రెండే రెండు ప్రతులు వేమారెడ్డి పద్యములని, రెడ్డివారి పద్యములని పిలువబడినట్లున్నవి. ఆపై నెల్లెడలను వేమన, వేమన్న, వేమయ్యపద్యములని, శతకములని వ్రాయుటెక్కువ. ఒక్కటి వేమయ దేవర పద ప్రతియని కూడ ఉన్నది వేమనరెడ్డియను వాడుకకు వ్రాతలో ఆధారములు కడు స్వల్పమే గాని దగినట్లు అధికముగావు. అవియును నేటి కులమునే సూచించు నన్నమాట నిస్సంశయము గాదు

వేమనరెడ్లలో కొన్ని శాఖలవారిని మొరుసులన్నాడు; అట్టి మొరుసులు తన నాడు కొత్తగా 'ప్రతిభ' కెక్కుచున్నారని సవిమర్శముగా జెప్పియున్నాడు.

పాకనాటిరెడ్డి పరగమోటారెడ్డి ఎసగుతోటపెద్ద ఎఱ్ఱరెడ్డి,
మెరుసులందరు భువి హరువొప్పనన్నింట ప్రతిభకెక్కురెట్లు పరగవేమ."

[ బ్రౌన్ అకాడెమి ప్రతి- 470 ]

ఇదివరకెన్నడును లేని విధముగా వీరు వేమననాడే "ప్రతిభ" కెక్కుచున్నందుకు, మరొకటిగా నుండి యిట్లు పైకివచ్చుటకు వేమనకొంత విస్మయపడుచున్నాడు. వేదన పడుచున్నాడు. మరి ఇందున్న పాకనాటిరెడ్డి, మోటా(టి) రెడ్డి, ప్రాయశః తక్కిన వారును, నేడు రెడ్లను వారిలోని ఉపశాఖలుగా దోచుచున్నవి.

కాని ఇటీవలి వరకు "రెడ్డి" శబ్దము వ్యావసాయకకులముల నెల్లను సూచించినది. కాదేని గ్రామ, సీమాధికారమును సూచించినది. 5 వ శతాబ్దము వాడు నేటి కృష్ణామండలమువాడును అయిన అనంతామాత్యుడు అతని భోజరాజీయమను కావ్యములో వెలమ, రెడ్డి, కాపు శబ్దములను సమానార్థకములుగా ఒక్కనికే యన్వయించి వంజరుని కథ గూర్చినాడు. కడప - కర్నూలు-నెల్లూరు పాతమండలములు తారసిల్లు చోట నెచ్చటనో 18 వ శతాబ్దాంతమందు- వేమన ఎక్కువగాదిరుగాడిన ఆప్రదేశమున అతని పిమ్మట నుండిన అయ్యలరాజు నారాయణయను వాడు "హంసవింశతి"లో కూడ "రెడ్డి" నేటి రెడ్డి కులవాచి గాదు.

"పంట, మోటాటి, పెడకంటి, పాకనాటి, యారె, కమ్మ, వెలమ, కొండ, యాది, గోన,కొణిదెకాపుల మొదలైన క్షోణిదనరు కాపులకునెల్ల మిన్నయక్కాపు కొడుకు" (హంసవింశతి - 4-136)

వీరందరూ కాపులే— శ్రీనాధుడు భీమఖండమునందన్నట్లు ఒంటరులు సరెసర్లు వెలమలు మొదలు పంటవారి వరకును కాపులలో "గోత్రభేదము"లే కాబోలు. ఆ కాపుకొడుకు భార్యను చెప్పవచ్చి "దుడ్డెతనమున దిరుగునారెడ్డిసాని"(4-238)యన్నాడు అయ్యలరాజు. కమ్మ, కాపు, పలుతెగల వెలమలకును గూడ వేమన పిమ్మట గూడ రెడ్డి శబ్దము చెల్లుచుండినట్లే గదా!

కదిరీపతి శుకసప్తతి పదునాల్గవ కతలో గూడ కాపురెడ్డి శబ్దములు "చౌదరితనము" తో నిండిపోయినవి.

వచ్చిజమలిక వాయించి వరుసతోడ
తాతదండ్రుల చౌదరి తనములెల్ల
నెన్ని కైవారమొనరించి యింపు సెరప........ (, 415)-

రెడ్డి అధికారసూచిగా వ్యావసాయకులకే పరిమితము గాలేదు. కడకుబ్రాహ్మణులును రెడ్డిగా వ్యవహరించుకొన్నారు. 16 వ శతాబ్దములో నెల్లూరి పడమర సీమలో గల 'చుండి' రాజుల మంత్రుల నాశ్రయించిన ఎడపాటి ఎఱ్ఱాప్రగడ (మల్హణచరిత్ర కర్త) గూడ 'రెడ్డి' పర్యాయము, పూర్వరూపమునైన "రట్టడి" గా తన్ను జెప్పుకొన్నాడు.

ఇట్టి మహాప్రధాన పరమేశ్వర మూర్తివి...... .............
.... చుండి పరిపాలక శాశనమంత్రి చంద్ర........ ..................
రట్టడియైన యెఱ్ఱకవి రాజిత మల్హణ కావ్యకన్యకన్ ॥

తిరుపతి వెంకన్నకే వేంకటరెడ్డియని పేరుప్రసిద్ధము. అదె నేటికిని ఎల్ల కులముల వారిలోనను వెంకటరెడ్లను చూపించుచున్నది. "శత్రుసంహార వేంకటాచల విహార" యను మకుటముగల శతకము నుండి ఒక సీసపద్యముదాహరించి కాపురెడ్డి శబ్దములక్కడ పర్యాయపదము లన్నాడు (వేమనలో, వంగూరి సుబ్బారావు). ఆది సరిగాదు

మలలపై పెద్దహోబలము సింగారెడ్డి, మంగళగిరికోట మెరుగ రెడ్డి,
ఓలుపొందు మారకాపురము చెన్నారెడ్డి, ది జిల్లునదయాద్రి రామరెడ్డి
.............................................................................
........................................ ....................... .......
సేయు కాపుదనంబులు సూచి నీకు కోరె ఋట్టెను తిరుమల కొండరెడ్డి
మగతనము మాని కాపైన నగవుగాదె, శత్రుసంహార వేంకటాచల విహార ॥

ఇచట కాపుగాని రెడ్డిగాని కులవాచకములు కావు. రెడ్డి అనగా ప్రభువు. కాపు అనగా రైతు. రాజరికమును వదలుకొని రైతుగా బ్రతికెదవా, పన్నుపెట్టి తలపించెదవా యని తిరువేంగడము రెడ్డికి అనగా దేవునికి రోసమెక్కించుచున్నాడు. అంతే, ఈ శతకము

18 వ శతాబ్ది మొదటిదట. అనగా అప్పటికిని రెడ్డి శబ్దము నేటివలె కులవాచకముగా స్థిరపడలేదన్నమాట ఇప్పటికిని కమ్మవారు కూడ రాయలసీమలో, చంద్రగిరిపైన ఆలంపురములో, అనంతపురములో బళ్ళారిలో– రెడ్లని పిలువబడుచున్నారు. రెడ్డి, వాసిరెడ్డి, కొమ్మారెడ్డి, వంటి రెడ్డి ఇంటిపేర్లు కాపులందును, కమ్మవారియందును కావలసినన్నియున్నవి. కాపు ముదిరి నాయుడగునన్నట్లు, కాపు ముదిరి రెడ్డియు, చౌదరియుననిపించుకొన్నాడు "కాపులెల్ల వెలమ కమ్మలైరి" యని వెలమ వెలుగోటి వారి చరిత్రమే ఎప్పుడో చెప్పినది. గ్రామాధికారియగుచు బలిజయు రెడ్డేయనిపించుకొనుచున్నాడు × గొల్లలును అట్లే రెడ్డియనిపించుకొందురు.

1863 లో సి. పి. బ్రౌన్ వ్రాసిన **Carnatic Chronology** లో కాకతీయ ప్రతాపరుద్రుడురెడ్డి– విజయనగరమేలిన బుక్కరాయలు బుక్కారెడ్డి **(P. 57).** బ్రౌన్‌కు రెడ్డివారనగా **Petty Barons** అని, సంస్కృతములో భూపతియని **(P. 54)** **అర్థము.** అంతేగాదు, రెడ్డి = Farmer Tribe (P. 53) యని యర్థము. శ్రీరంగ దేవరాయలను పెనుగొండవడ్డెరెడ్డి వంశములో చివరి రాజని, హంపీ రాజ్యమును కర్నాటకరెడ్ల రాజ్యమని బ్రౌన్ చెప్పుటకు వీలు కలిగినదని గుర్తింపవలసియున్నాము.

వేమన (నేటి) రెడ్డి కులస్థుడే కావచ్చును. అయినను అది నిరూపణమునింక నపేక్షించుచున్నది. ఇప్పటికి సంపాదించిన ఆధారములు నిర్ణాయకములుగావు. ఇంకనీ విషయమున పరిశోధన జరుగవలసియే యున్నది. అంతవరకే యీ చర్చ ఉద్దేశము. ఇప్పటికాతడు రైతుబిడ్డ – అది తిరుగులేనిమాట

• • • •

ఇక అతని సంచారమును తెలియవలసి యున్నాము. అందు కాధారము లతడు పద్యములలో పెట్టిన ఊళ్ళపేర్లు, నాళ్ళపేర్లు ; అతని పద్యములలో గల మాండలికములు ; అతడే చెప్పిన ఆచారాది ప్రత్యేకతలు ; అతనిగూర్చిన కథలు ; అతని ఆనవాళ్ళు దొరికిన తావులు.

కొండవీడు – గండికోట – మూగచింతపల్లె – తిరుమల – తిరుపతి– గోదావరి– నందిదుర్గములు అతడు ప్రస్తావించిన స్థలములని పదులని గుఱించి మున్ను పండితులు చెప్పుకొన్నారు. తమిళ దేశమున సంచారము జేసినవాడని చెప్పినారు. కర్నాటకమున సంచరించిన జాడలేదన్నారు ; "తెనుగు దేశమంతయు అరవదేశమందును తిరిగినట్లు కానవచ్చుచున్నదేగాని, కన్నడుల సహవాసమతనికి లభించెనని స్పష్టముగా జెప్ప వీలులేదు" [101 వ పుట – రాళ్ళపల్లి వారి వేమన] 'రెడ్ల రాజ్యమును రాజమహేంద్రవరము మొదలు విజయనగర రాజ్యము వరకు నీతడు తిరుగుచుండెనని తెలియవచ్చును' – వేమన, 22 వ పుట వ గూర్చి.

---

× శ్రీరామరెడ్డి **B × M.P.** బలిజవారు. గోల విడునూరు (కర్నాటకము) **హిందూపురమువద్ద.**

అతనికి ఆంధ్రదేశమున కడప జిల్లా జమ్ములమడుగు తాలూకా గండికోట లోను, నెల్లూరుజిల్లా పడమర తాలూకా గ్రామమైన ఉదయగిరితోను సంబంధ మెక్కువ. 'గండికోటలోన కత్తిబట్టినయంత, రాజు గాడు దొడ్డ రౌతుగాడు ... గండికోటలోన కస్తూరి మృగముండు ... అను పద్యములున్నవి. అందుకుతగినట్లుగా గండికోటలోను' ఆ దగ్గరి గ్రామమైన ముడియములోను వేమన శిష్యులైనయోగులును వారి పీఠములు ఏబదియేండ్ల క్రిందవరకు నుండి వాతల కెక్కినవి.

"ఒకటి రెంటమూడు యోగీంద్రులను గూడి, ఉదయపర్వతంబు మొదలుగిరుల

క్రమమెరింగి యల్ల ఘనపట్టణములెల్ల వీకనొక్కడేలు వినురవేమ"—

[1436 – వావిళ్ళప్రతి]

'ఉదయాద్రికి పైనుండెడు, సదయుని మదినిల్పిచూడ శక్యముకాగా కుదురుపడి జ్ఞప్తి నిలిచిన నదియే పరిపూర్ణ సౌఖ్య మందెడు వేమా" [331– పమ్మిప్రతి]

అను పద్యములు ఉదయగిరి వాసమును దెల్పుచున్నవి. కాగా, ఉదయగిరి కనతిదూర మందున్న పామూరు వద్ద కొండగుహలో కడసారి ప్రవేశించెనను జన శ్రుతి యున్నది. కందుకూరి సీమ మూగచింతలయు, భైరవునికోనయు అచటికంత దూరముగావు ఈ ప్రాంతము లందు గుహాలయములు పసుపుగుడ్డల వేమయ్యల సంచార మెక్కువ.

వేమన దేవరగింజని—అనగా నల్లగొండ జిల్లా దేవరకొండను ప్రస్తావించినాడు. 'తెనువు ముక్కుచాయ దేవరగింజిప నమగియున్న చిత్రమమరలేదు, అరసిచూడ బయలునదెను క్షితి శిష్యదయా' – (అకాడెమీ బ్రౌన్ ప్రతి 112 వ పద్యము)

వేమన తెలంగాణా పట్నమును చెప్పిన పద్య మిదొక్కటే యున్నది. "పట్టి మలముచేత పైగడ్డకట్లయా" యని –– (1029, బ్రౌను అకాడెమీ ప్రతి)

'ఎంతకాలమైన యేదలేకనుజీవి ..... – 1009 అకాడెమీ బ్రౌను ప్రతి, తల్లిదండ్రిహితుడు తగిన చుట్టములెల్ల నేరికోరిపోరనెగుపుజూచి పడుచునిత్తు రంతె భాగ్యమీయగలేరు – (2247) వావిళ్ళ యనుచో, పోరడు, యేద, పైయను తెలంగాణా మాండలికములున్నవి. అచలపీఠమున్న నల్లగొండసంస్థా నారాయణ పురముల దాక సంచార మున్నదని నిరాక్షేపముగా నిర్ణయించుకో వచ్చును.

వేమన తలచిన తెలుగునాటినది యొకేయొక్కటి గోదావరి, – 'కుక్కసింగ మగునె గోదావరికి పోవ – కుక్కతోకబట్టి గోదావరీదునా' యని అది కూడ రెండే రెండుమార్లు పేర్కొన్నాడు. "గోదావరి మండలమున వీధులలో బారవేచిన పుల్లాకుల లోని యాహారమును మృగపక్షులతో భుజించువాడను [ 70 పుట—వంగూరి వేమన] వాడుకయున్నది. 'కురులు మోపిదేవి గుడికి జేరు–' (నేదునూరిప్రతి –3889) అనుటచే కృష్ణామండలము దిరిగి గోదావరిలో సంచారము జేసినాడన గలము.

వేమన 'పర్వతము' నెక్కువగా పేర్కొన్నాడు పర్వతమనగా శ్రీశైలము. పర్వతము పోవుటగా శ్రీశైలమేగుయని యాముక మూడు పర్వతము పోవు అకాడమి బ్రౌన్ ప్రతి పాఠమందు – 815, 865

పర్వతంబుబోవ పతితగరితగాదు- (824, పై ప్రతి) శ్రీగిరిపయినెక్కి చెలరేగి తురకలు సొమ్ములెల్లజూచి సొగిసి తిరిగి, చెడుదురు తమయిల్లు చేరకలోపల —
[924, తెలంగాణా ప్రతిలో వున్నదట]

ఇట్లు నలుమార్లు శ్రీశైల ప్రస్తావనమున్నది. శ్రీశైలమును తురకలు లూటీచేయుటను వేమనకళ్ళార చూచినట్లున్నాడు. వారు కొల్ల సొమ్ముతో యిల్లు చేరులోపలనే దారిలోనే నష్టమైపోవుదురని శాపము పెట్టుచున్నాడు. 1618 లో బీజాపూరు దండయాత్ర శ్రీశైలము మీదికికూడ సాగినదిగదా. అబ్దుల్ వాహబ్, అబ్దుల్ మహమ్మద్ అను ఫౌజుదారులు శ్రీశైలము పట్టణముగా నుండగా పట్టుకొని, దోపిడీచేసి బ్రాహ్మణులను వెళ్ళగొట్టి, అచటి జంగాలకిచ్చిన మాన్యములను రద్దుచేసి కర్నూలు నుండి పాలింప సాగగా, శ్రీశైలముమీద పూజలు రద్దయి, తిరునాళ్ళు జరుగకపోయే స్థితి ఏర్పడినది. 1603 నుండి 1634 వరకు శ్రీశైలముమీద పునర్నిర్మాణముగాని, దానశాసనముగాని, లేనేలేదు. (The Temples of Srisailam - M. Ramarao P. 18) 1587 లో గోల్కొండ నవాబు అహోబిలమును ధ్వంసముచేయుట కెపకొల్పిన వీరశైవోన్మాదులైన హండే నాయకులు 1603 లో శ్రీశైలముమీద మంటప నిర్మాణములు చేయగా, కర్నూలు నేలిన ముశావర్ ఖాన్ మీద తిరుగబడిన ఒకానొక బ్రాహ్మణ దేశాయి శైవక్షేత్రమయిన శ్రీశైలమును మొత్తము దోచుకొని, కోమటులను సైతము వెళ్ళగొట్టినాడు. శ్రీశైలముమీద యీ అల్లకల్లోలము వేమనకు దెలియును. వేమన యీ తిట్టుచూడగా అహోబిలమును దోచి తెచ్చిన నృసింహస్వామి విగ్రహమును చూచి గోల్కొండ నవాబు ఇబ్రహీం కులీకుతుబ్షా నోరావులించి చచ్చినాడట. అది తెలిసి ఆ విధమెదో యిగునట్లున్నది వేమన శాపనార్థములు.

శ్రీశైలము సమీపమున గల వినుకొండలోనే వేమనకు దిసమొల యోగము ప్రారంభమను కథ యున్నది. శ్రీశైలము తూర్పు ద్వారమన దగిన త్రిపురాంతకమునకు దగ్గరలోగల మార్కాపురపు కటారుపల్లె యందు వేమన యున్నాడనువాడుక ఆ ప్రాంతము లందున్నది. వినుకొండ దరిదాపులలో మూగచింతల పాలెమను పల్లె యొకటున్నది. ఆ ప్రాంతములందు సాహసులైన పిల్లలను వాడు వేమనరా యను వాడుక ఉన్నదను చున్నారు.

అతని కాపాలిక మత విమర్శనము శ్రీశైలముమీది మతములతో, శైవ మత శాఖలతో గాఢ పరిచయమును దెలుపును. అందాతని పలుకడను దెలుపును. "రుద్రమ రూపుదాల్చి రుద్రుని నిందించి, భ్రష్టు త్రోవదిరుగు భ్రష్టజనులు ... (4161 నేదునూరి ప్రతి) "కాపల మతమందు కలిసియనాచారి ... ... (1038, బ్రౌన్ అకాడెమీ ప్రతి) యన్న పద్యములు జగత్తున కాద్యంతములు లేవని, నిత్యమని చెప్పినట్లును, శివనిందకమయినట్లును చెప్పుచున్నవి. కాపాలికము కామసాధనకు ఏకైక దర్శనమన్న పేరొందినది. చార్వాకమును కాపాలిక తంత్రాచారము నవలంబించుటను గూర్చి జైనమత వ్యాఖ్యాతలు — గుణరత్నాదులు — వ్రాసియేయున్నారు. చార్వాకమట్లు శాక్తేయముతో, శైవముతో కలిసిపోవుటను కూడ వేమన చెప్పి యున్నాడు.

చాలదయ్యెయింక చార్వాకమతరీతి శక్తిశైవమనుచు చాలనమ్మి
సరణిమిగిలిచెడును - చండాల సేవచే ... ... (1870, నేదునూరి ప్రతి)

యాంధ్రభారతమునకు శ్రీశైలమే కాపాలికుల ప్రధాన కేంద్రము. (భవభూతి మహాకవి ఆంధ్రమహారాష్ట్రము లసరిహద్దులలో గోదావరిదరిని అదిలాబాద్ పైవాడందురు) మాలతీ మాధవము లోని కాపాలికగురువు అఘోరఘంటుడు, శిష్యురాలు కపాలకుండల యును ఉజ్జయినీ నగరమునకు శ్రీశైలము నుండియే రావలసిన వారైరి. త్రిపురాంతకము, మల్కాపురము శాసనములలో 13 వ శతాబ్దాంతము వరకు మహావ్రతులుగా కాపాలికులయునికి ధ్రువపడు చున్నది. భయంకరమైన వారిసాధనలు జనులకు దూరముగా దుర్గమమైన శ్రీశైల శృంగములమీదే యున్నవి. భైరవుని కోనలోనే యున్నవి రెండు తావులను వేమన సంచారము అన్వేషణములోనివే.

అతని తాత్త్విక పరిణామ దశలలో ఆరంభమున సగుణోపాసనలో నున్నప్పుడు అపురూపమైన వాదమొకటి చేసినాడు. వైదిక సంప్రదాయమున పూజలేని బ్రహ్మదేవుని గూర్చి బ్రహ్మయే ముఖ్యదైవమను వాదము చేసినాడు. అతనియందు అదొక ప్రత్యేకత ఒకవింత. ఒకప్పటికి అదంశయు మానుకొన్నాడు.

ఎపగువేత్తయనుచు ఎరుగరే యీ నరుల్, వేయుమార్గములను వేలుపజుడు,
అవనిసృష్టికర్త అంతకుగురుడౌను-- - (876 నేదునూరి ప్రతి)
విధికృతములందురన్నియు, విధికిని విధిలెస్సగా యెవ్విష్ణుని జంపెన్
విధి యపురూపమణచెను, విధి బ్రహ్మము సుమ్ముదలప వినరావేమా॥
[69-391, బ్రౌను రెండవ ప్రచురణ]
హరిహరులకైన అజుడు తానె నడుము- (జగము)- (4967- నేదునూరి)

ఈ పద్యములలో దప్ప మిగతచోటులనెల్ల బ్రహ్మదేవునకు వేమన వేయని సొడ్డులేదు; శివునిముందతని మరియాద నిలువనిచ్చినదిలేదు కాని ఇంతమాత్రమైనను ఇంకెవ్వరును చేసినవారుగారు. దీనికి కారణమేమాయని యోజించవలసివచ్చినది యోజించిన శ్రీశైలమునకు పశ్చిమ ద్వారమనిపించుకొను అలంపురము - (అనంపురము)- అందలి నవబ్రహ్మలయము - అందలి తొమ్మిది బ్రహ్మలకు గల పూజ - బహుశః భారతదేశమునందింకొకచోలేని ప్రత్యేకత - ఆ క్షేత్రవర్ణనమే వేమన చేత బ్రహ్మదేవుని ప్రశస్తినిట్లు చెప్పించినది

ఆంధ్రదేశమును విడిచినచో మొట్టమొదట చెప్పుకోవలసిన అతని సంచారభూమి కొంకణము. ఉడిపి - గోకర్ణము - గోమంతకము మున్నైనవున్న పశ్చిమ తీరము కొంకణము గోవా మధ్యకొంకణము. గోదావరికన్న శ్రీశైలముకన్న వేమనలో కొంకణ ప్రస్తావన మెక్కువ. కొంకణమ్ముబోవ కుక్క సింహముగాదు. వినవివింతలెల్ల వినును. కొంకణమ్మందు అనుచు ఒక్క చరణమేమో చెప్పుటగాదు, పద్యము పద్యమే కొంకణము మీద చెప్పినాడు. అది అచ్చుగాని పద్యము. ఎంతో విశేషమున్న పద్యము.

కొంకణంబువందు కూహకపువిరక్తి ఇల్లుతోటదొడ్డి ఎసగగట్టి
పొసగియుందురు- అందు పొసఁగునాశివుకళ... (782 - తెలంగాణా ప్రతి)

కొంకణమందాతడు వినని వింతలు, కూహకపు విరక్తులు కన్నాడు, విన్నాడని స్పష్టమగుచున్నది. అనగా కొంకణముతో గాఢపరిచయమే కద్దు. మాధ్వులతురీయము అనగా సన్యాసము ఇతరులకు వింతగాను, కపట విరక్తిగాను దోచు ఆచార విశేషము గలిగియున్నది. మాధ్వములో మరి చాల వింతలున్నవి.

కొంకణతీరమును ద్రొక్కిన వేమన కర్ణాటకము తిరుగలేదా? అది వీరశైవము జన్మభూమి గదా! అల్లమప్రభు, అక్కమహాదేవి, బసవేశ్వరుల మాతృదేశముగదా! శైవమున శూన్యవాదము ననుపుకొన్న గురుపీఠములు గదా! తప్పక కన్నడసీమ కాళ్ళరుగ దిరిగినాడనవచ్చును. కొంకణమునకు దారిగదా యని యూహయేనా? మరేమైన అతని మాటలో ఆధారమున్నదా? లేకేమి?

హంపీ మొదలు కోలారు సీమయంతయు మొరసురాజ్యము— మొరసునాడని పేరు. (రెడ్లలో మొరసు రెడ్లొక శాఖ.) వేమన హంపీ వీధులయందు నిలిచి నీరై నిట్టూర్చి ఒకపద్యము చెప్పినాడు. పెన్నానది పుట్టినకొండ గట్టెక్కినాడు. అదే నంది దుర్గము — కడపజిల్లాలోని నందిమండలము కాదు. మొరసునాడలో తీర్థక్షేత్ర సేవలను— కన్నడములోని రామనాథ క్షేత్రమును— కొంకణపు వింతలను కలిపి ఒక పద్యముననే పెట్టి చెప్పినాడు.

మొరసు రాజ్యమెల్ల ద్రిమ్మెక్క బోవున కొంత, రామనాథమేగి రట్టువడును
వినని వింతలెల్ల వినును కొంకణమందు...

ఈ పద్యము మొత్తము కన్నడము నుండి కొంకణతీరమువరకు తీసుకొని పోవుచున్నది. మొరసురాజ్యమని కోలారునేగాక, హంపీసీమను కూడ వ్యవహరించినారు. శ్రీనాథుడు హంపీరాజ్యములో చెప్పిన చాటువున్నది.

వంకరపాగలున్, నడుము వంగినకత్తులు, మైలకోకలున్
సంకటి ముద్దలున్, జనుప శాకములున్, బలుపచ్చడంబులున్
తెంకగు నోరచూపులును, తేకువదప్పినయేసబాసలున్
రంకుల బ్రహ్మ యీ మొరసరాజ్యము నేల సృజించెనక్కటా!!

రామనాథమనగా తమిళదేశమందలి రామనాథపురమేకానక్కఱలేదు. అదే అయినను వేమన కన్నడ సంచారమునకు కొదువలేదుగాని కన్నడదేశమందే రామనాథమను క్షేత్రమున్నది. కొంకణము సరే సరి. గోవాకు ఎగువ దిగువల కోస్తా ప్రాంతము. మహారాష్ట్రముకాదు. అవిరెండును వేరు. వివాహములలో చదువు మహా సంకల్పమే వానిని వేర్వేరని చెప్పును.

[ 'కొంకణపు దేశపు కూహకపు విరక్తి' యను ఈ పద్యములో కూహకపు విరక్తి యనుమాట ఏ విషయమును దృష్టిలో బెట్టుకొని వ్రాసినాడోయని బంగోరెయడిగినాడు తెలంగాణా వ్రాత ప్రతి చూపి ]

"అంగవంగ కళింగ కాళింగ కురు కొంకణ టెంకణ మరుహాట పానాట చోళ మహారాష్ట్ర సౌరాష్ట్ర సింహ...ఘూర్జర కర్నాట కలుహాట..." (చల్లావారి

యజుర్వేద వివాహోప నయనములు) 18 వ శతాబ్ది మధ్య నెప్పుడో గల అయ్యలరాజు హంసవింశతిలో కూడ,

లాట కర్నాట మరాట వధూటుల, పాండ్యపౌండ్ర విదర్భ పద్మముఖుల
ద్రవిళ గాంధార కాశ్మీర ధరణి సతుల. మగధ కొంకణ టెంకణ మానినులను
[ప్రథమ- 54 వ పద్యము]

కొంకణం :- సహ్యపర్వతా మాశ్రిత్య మహారాష్ట్ర మళయాళయోర్మధ్యే విద్యమానా దేశః - రామాయణ సారోద్ధారే అరణ్యకాండః.

ఇంతేగాక, కొంకణమనగా కర్నాటకమని కూడ అప్పుడప్పుడు చెప్పబడినది. కొంకణ రాజవంశావళియని C. P. Brown 1863 లో Carnataka Chronology గా యిచ్చియున్నాడు క్రీస్తు శకము ముందటి నుండి వెల్లాల కులస్థులైన రాజులను అందులో కొంకణ మహాధిరాయలను పేరున్న వారలను సైతము(ముగ్గురను) పేర్కొనుచు హోయిసలరాజులకు పూర్వపురుషులెందరినో కర్నాటకమేలిన రాజులను పట్టికజేసి ఇచ్చినాడు 1570లో బీజపూర్,అహమ్మద్‌నగర్,కాలికట్ రాజులు గోవాలో పోర్చుగీసువారిపై ఒక్కసారి పడవలెననుకొన్నారని, బీజపూర్ సుల్తాన్ ఘోండాఘాటీ నుండి కొంకణములో దిగినాడని బ్రౌను వ్రాసినాడు (P 66)అది గోవా వెనుకతట్టు. గోవాకు 7,8 మైళ్ళు. సహ్యపర్వతశ్రేణి దిగువ పాదదేశమునుండి పడమటి సముద్రము వరకు గల కోస్తా మాత్రము కొంకణము. బొంబాయి చుట్టుపట్టుల దేశమునకు కొంకణమని తన ఇంగ్లీషు తెనుగు నిఘంటువులో యిచ్చిన బ్రౌను ఆ తర్వాత ON NAMESOF LANDS AND LANGUAGES' అను శీర్షికగలఅనుబంధములో 'From Bombay to Gova is called Deccan. South of this is Concan' అని వ్రాసినాడు. (Carnatic Chronology)

వేమన కన్నడము నలుగడలు కలియదిరిగిన వాడనుటకింకొక నిదర్శనము అతని చార్వాక మత నిరసనము, దాని బాహుళ్యము. భౌతికవాదము పుట్టుపూర్వములు వృద్ధిక్షయములు చరిత్రగూర్చ వెదలినవారికే యీనిరసనమును దానివిస్తృతియువిస్మయ పరచును. ప్రబంధములలో కుకవినిందవలె చార్వాకనిందనము దర్శనగ్రంథము లందుంచుట ఆచారము విధి. కాని వేమన యందట్లు కాదు. పది పన్నెండు పద్యముల కెక్కువేగాని ఆ పద్యములుతక్కువగావు. అంతేగాకఎదుటబెట్టుకొనిఖండించినట్లున్నవి. కాదేమో చూడవలసినది.

విశ్వకర్మలేని విశ్వంబుచూడరా, విశ్వకర్మ జేసె విశ్వమెల్ల
విశ్వకర్మలేక విశ్వంబు లేదురా...... 4431 నేదునూరి ప్రతి.
విశ్వకర్మలేక విశ్వంబులేదురా, విశ్వకర్మజేసె వివిధరచన
విశ్వకర్మలేక విశ్వంబెపాడురా... 1927, గోపాల్ అండ్ కో ప్రతి
సిగ్గటంచనబడు సిగ్గదెచ్చోనుండు ? ఆకలెచటనుండు సరయగాను?
దాగియున్నవాని దానేల తెలియడో .. 2333, నేదునూరి ప్రతి.
కొంపలోన మరుగు కోకలోన మరుగు కన్నతల్లి మరుగు కడుపు మరుగు

ఇన్ని మరుగలందు నీవుండుట వరగురా... 2624, వాపిళ్ళ.

కానలేడు నడురు కన్నులు వీపును, నెఱుల గానలేడు నెత్తిమీద
తన్నుగానలేడు తత్త్వమే మెఱుగురా.... 1288, నేదనూరి.

కానరానివాని కనిపించువానితో కాపుచేయనలుక కరుణతోడ
కానరానివాని కరణేమికందురో.... 1286, నేదనూరి.

చాలచాలలేర చార్వాక మత సంజ్ఞ తిరిగి తిరిగి వేలు తెలియలేక
... ... ....... ....... ... ... ... ....... .... 1872, నేదనూరి.

చాటదయ్య యింక చార్వాక మతరీతి శక్తి శైవమనుచు చాలనమ్మి
సరణి మిగిలి చెడదె చండాలసేవచే— 1870, నేదనూరి.

తాను తనువటంచు తప్పుగా బలికిన మోహవార్ధిలోన మునుగకున్నె
కాన తాననునది కానంగలేదయా.... 108౯, వాపిళ్ళ.

తనువు తానను కొని తనువాసనం దవిలి జనన మరణములను చక్కజిక్కి
పొలవు సందెరుగక పొర్లాడుచున్నట్టి భ్రాంతజీవి కెచటి పరమపేమ ॥

దేహమే యాత్మయను దేహాత్మవాదము, ప్రత్యక్షమే ప్రమాణము అనునట్టి వాదమును విమర్శించుచు, సృష్టికర్త లేకున్న నీతి నియామకములుండవనియు, ప్రపంచముండ దనియు, కానరానివెన్నో యున్నవని, అట్టివానిలో ఈశ్వరుడొకడని యుక్తులుకట్టి— తేలికగాకట్టి— చార్వాకమతఖండనము జేసినవీపద్యములు. ఇంక ఇన్నైనను వెదికిన దొరకగలవేమో.

ఇంత గలుగుటకు తెనుగు దేశమున చార్వాకులున్న జాడలేదు. కర్నాటకమున చార్వాకము, భౌతికవాదము శిలాశాసనములకెక్కి యున్నది. ఇంకితరమైన వ్రాతల కెక్కియున్నది. అక్కడ పదినండి పదియేను శతాబ్దముల వరకు చార్వాకము శిలాక్ష రములందున్నది. వైదికుల మన్ననకు గూడ పాత్రమై, రాజానుసరణము కలిగి, సిద్ధాంత కర్తగా నొక రాజపురుషుని గూడకలిగి,జైనులచేత నిరంతరనిరాకరణమునొంది,శృంగేరి పీఠాధిపతుల ఖండనకు విషయమై, ఆ పీఠము నధిష్ఠించిన విద్యారణ్యుల సర్వదర్శన సంగ్రహమున అత్యంతము మరియాద చొప్పున సంగ్రథితమైన స్థితి చార్వాకమునకు కర్నాటకమునందున్నది.

పదవ శతాబ్దములో చిత్రదుర్గము జిల్లాలో గల 'సుందేర' నగరము లోకాయత నగరమనియే పేరొందినది. అట్లని శాసనమునకెక్కినది. 985 A. D. లో రాష్ట్ర కూట రాజైన అకాలవర్షుని కాలమున మహాసామంత శూద్రకయ్య వేసిన దాన శాసన ములో 'లోకాయత ఒళలమ్ గుండేరియోల్' అని అనిపించుకొన్నది.

1085 లో పశ్చిమకర్నాటకమున షిమోగా జిల్లా బేగూరులో క్షౌళ్ళగరాధిపతి అప్పణ బట్టు దానము పట్టిన మువ్వేలమంది బ్రాహ్మణులు వైష్ణవమాహేశ్వరాది మతా వలంబులై న్యాయవైశేషిక లోకాయత బౌద్ధ మీమాంసాది దర్శనాధ్యయన పరులట. (ఈపట్టికలో జైనదర్శనాధ్యయన మొక్కటేలేదు. ఎల్లరకునదే పెద్దప్రత్యర్థి.) 1089లో మరల వారందరకు రేండవవిడత కాలచాముండని కొడుకైన కట్టగోసి దానముపట్టినది.

1103 లో బల్లిగ్రామములో లకులీశ శైవమఠాధిపతి సోమేశ్వరసూరి నైయాయిక పండితుడు, 'లోకాయతార్ణవ సుధాకరుడు' అని అనిపించుకొన్నాడు.

1148 లో బళ్ళారి జిల్లాలో ఉజ్జైణీపాండ్య రాజవంశీయుడైన వీరపాండ్యుడు సాక్షాత్తుగా "లోకాయత మతప్రచార చతురదేవతా చార్యుడ"ని బిరుదే వహించినరాజు

1331లో శృంగేరిపీఠాధిపతియైన భారతీ తీర్థులవారిని గూర్చిన ప్రశస్తిగద్యాలో జైన, బౌద్ధ, భాట్ట, ప్రాభాకర, నైయాయిక, చార్వాక దర్శనఖండనుడని, అద్వైతస్థాపకుడని యున్నది. 1415 లో షిమోగా మండలాంతర్గతమైన నాగర ఖండములోని ఖారంగి నగరములో కూడ లోకాయతికుల నోడించినట్లు జైనగురుని శాసనమున్నది. జైనగురువుల శాసనములు చార్వాక సమయ భంజకులుగా చెప్పుకొన్నవి కుప్పతెప్పలు. 1375 లో శృంగేరి పీఠమునధిష్ఠించిన విద్యారణ్యులవారి చార్వాక మత చిత్రణము గౌరవపురస్సరమేగాని ఏహ్య భావమున వెలువడలేదు.

కర్నాటకమున ఇంత చారిత్రక నేపథ్యముతో వేమననాటికింకను చార్వాక మచ్చటను, తెనుగు సరిహద్దులలోను నున్నదని, యుండి,వేమన ఖండనకట్లు కారణమైనదని గ్రహింపవచ్చును. 1674 లో ఔరంగజేబు చక్రవర్తి జిజియా పన్ను విధించగా ఛత్రపతి శివాజీ మహారాజు వ్రాసిన లేఖలో మత స్వాతంత్ర్యమును గూర్చి వ్రాయుచుదాదుపంథీలకు,బౌద్ధులకు, జైనులకు, జోరాష్ట్రియులకు,మలకీలకు, నాస్తికులకు, హిందువులకు మత స్వాతంత్ర్యము నిచ్చుట చేసినే అక్బరు గొప్పవాడైనాడు,

* Historical Notices of the Lokayatas - by B. A. saletore.

వీరశైవములో మనుష్యునికిక ఉత్తరజన్మలు లేవను వింత వాదమునకు విశేషములకు చార్వాక మత ప్రభావమన వచ్చును అందులో మరికొన్నిగూడా చార్వాక ప్రభావమే కారణము

అతనిననుసరింపుమన్నాడు అనగా, జైనులును బౌద్ధులునుగాని నాస్తికులు చార్వాకులే. శివాజీకి దెలిసి కూడ చార్వాకము సజీవముగా నున్నది. అదియు వేమన కాలమే. అది కర్నాటకముననే గావచ్చును.

ఇంద్రుడైనగాని చంద్రుడయినగాని, నందిదుర్గమెక్కి నాతితోడ.

............ 927, బాలసరస్వతీ బుక్ డిపో వేమనపద్య రత్నాకరము –

నందిదుర్గము పైనుండు నాతిగూడి ... 2591 – గోపాల్ & కో

ఈ నందిదుర్గము పెన్నానది జన్మస్థానము. అది ఊరును,కొండయునై యున్నది. మొరుసునాడులోనే ఉన్నది. గండికోటకూడ పెన్నమీదే యున్నది. కాని పెన్నానది నాతడు ప్రస్తావించలేదు.

ఇక హంపీ శిథిలములలో ఎడమచేయి విరుగగొట్టబడిన ఉగ్రనరసింహస్వామి యిరువది అడుగుల ఎత్తు విగ్రహము ముందునిలిచి కాటోలు,

రాళ్లు నమ్మియున్న రాజాధిరాజులు, కూటికెడలి భువిని కూలిరనిరి

రాళ్లు పగులగొట్టి రాక్షసపుత్రులు మాళ్ళునూళ్ళు గలిగిమనిరివేమ॥

అని చాటువు జేసినాడని దృశీకరించుకోవచ్చును.

లింగమతములో ఏవో రెండు కక్షలేర్పడి పరస్పర నిందనముగావించు కొనుచున్న స్థితి వేమనకాలమందేర్పడినది ఆ వైషమ్యమును నిరసించి ఐక్యమత్యమును బోధించినాడు.

లింగమతమునందు దొంగలుగాబుట్టి ఒకరి నొకరు నింద నొనరజేసి
తురకజాతిచేత ధూళియైపోదురో.................. [1072, బ్రౌన్ అకాడెమీ ప్రతి]

వీరశైవము ఆంధ్రదేశమున తక్కువ. ఉన్నంతలో కడప - అనంతపుర ములలో ఒకింతయున్నది. • లింగబలిజలు, లింగధారులైన సాలీలు, కొద్దిమంది జంగాలు (లింగాయతులు) మాత్రము వీరశైవులు కాని వీరి సంఖ్య అత్యల్పము. తగవులాడి చీలికదెచ్చుకొని పోట్లాడుకొనుస్థితి ఆంధ్రదేశములో మాత్రముగాదని చెప్ప వచ్చును. ఈ పద్యము చెప్పు దుస్థితికి రంగస్థలము వీరశైవముయొక్క జన్మస్థలమైన కర్ణాటకమే గావలయునుగాని తెలుగుదేశము కానేరదు.

వీనికితోడు వేమన వంటి సర్వజ్ఞుడను కవి కర్ణాటకమున గలడు వారిరువురకు సమాగమసంవాదములు కలిగినవని కన్నడులు కల్పించుకొన్నారు. సర్వజ్ఞ వేమన సంవాదమను • పుస్తకమును గూడ గూర్చుకొన్నారట.

వేమన తమిళ దేశమున సంచరించినాడని ఎల్లరును చెప్పిన విషయమే. వేమన చిత్రపటములన్నియు(3) తమిళదేశములోనే దొరికినవి. తంజావూరులో వంగూరికి, పెరంబూరులో వావిళ్ళవారికి, మరిపమ్మి త్యాగరాయ చెట్టిగారికి దొరకినవి. తెలుగుదేశములో ఒక్క చిత్రమైనను దొరకలేదు. తమిళదేశములో వేమన పీఠములుండెడివని వ్రాసినారు. వివరములు మాత్రము మనవారు సేకరించినవారుగారు. భద్రగిరి స్వాములను వారొకరాతని శిష్యులట, [వంగూరి వేమన] అరవము నెరిగి శివవాక్య • • • మనుదాసినేదో జెప్పినాడని చెప్పుచున్నారు అరవల ఆచారములు కొంత తెలిసినాడు.

"మేనమామబిడ్డ మెరసి పెండ్లాడునాయె, మరవలందు చెల్లెలాయె సటియె" నని అన్నాడు. శ్రీరంగము వెళ్ళి కళ్యారజూచి కాబోలు,

"రంగధామమునకు హంగుగా తానేగి, కల్లుకంపుసొంపు కలిగి యుండ్రు...
అని ప్రత్యక్ష కథనము జేసినాడు. కంచి చూచినాడు - తంజావూరు రాజుల పూజ ఆతిథ్యసత్కారము లందినాడు. అరవములోని కాతని పద్యము లనూదితములైనవని ముందే తెలిసితిమి. అభిధాన చింతామణి యను గ్రంథమున నాతని రసవాదము పేర్కొన బడినదట.

---

• బలిజలెల్లరు లింగబలిజలుకారు. లింగబలిజల సంఖ్య చాలతక్కువ. రామనారాయణస్వామి వేషమున దిరుగువారు సెట్టిబలిజలేగాని, లింగబలిజలుకారు.

• • వావిళ్ళవారి వేమన పద్యములకు, రాళ్ళపల్లి పీఠిక.

• • • వంగూరి వేమన.

వేమన ఒక పెద్ద రైతుబిడ్డ. ఊరి పెదకాపు బిడ్డ. పలుకుబడికి మోతుబరి తనమునకు కొదువలేని కుటుంబము. చదువులు కళలు ముద్దుసేయగలిగి, తమ సంతతికి అవి మప్పించు మనసును సాగుబాటును గల కుటుంబము. అటువంటి ఒకకుటుంబమున పుట్టి శైశవము నాగడముగా గడపినవాడు వేమన. ఊరి పిల్లజట్టున కతడపుడే మొనగాడు. ఒక పిల్లఫౌజుదారు. చెట్టుగుట్టలెక్కి వాగువంత లీది శైశవ సాహసిక్యములకు వెలితిలేని వాడు. ఊరి పెదకాపు కొడుకని మరింత వెన్నంటి కొలుచు చిన్నకులము కుఱ్ఱగుంపుతో కలిమిడి ఎక్కువ.

మూగచింతల పెదకాపునకు రాచవీడగు కొండవీడులో కూడ ఒక ఇల్లు, ఒక విడిదియు నున్నది. పదేండ్ల ప్రాయమున చదువుకై కొండవీడు పడమర వీథిలోగల తమ ఇంటికి తరలింపబడినాడు. దానితో కాయకష్టము జోలి బోక కళలజాడ బోయినాడు. అనాగరక వాతావరణము నుండి నాగరక వాతావరణమున బడినాడు. ఊరితో రాకపోక యుండనే యున్నది. సావాసగాళ్ళను మరచిపోలేదు. అతని యందు పల్లెయు పట్టణము రెండును ఉన్నవి. మొరటుదనము, సున్నితమును కలగలుపై యుండినవి.

పట్టణమున దిట్టయగు పండితునొద్ద చదువునకు కుదిరినాడు. పాఠములు శ్రద్ధగా జెప్పుకొన్నాడు. సంస్కృత మభ్యసించినాడు. గణితము నేర్చినాడు. "ఒకటి క్రింద నొక్కటొనర లబ్ధముబెట్టి వరుసగా గుణింప వరుస బెరుగు" పెట్టిదో [Geometric Progression] అతనికి తెలిసిన విషయము. పద్దులు వ్రాయుటయునెరిగినాడు.'ఆయవ్యయములు దెలియక వ్రాయను వ్రాయించుటెంతవారికినైనన్ న్యాయముగా దేపట్లను' అన్నవాడు. వేమనయందు తరచుగా వచ్చుమాటలలో 'పద్దు' ఒకటి. భారత,రామాయణములను పురాణములను మర్మముదెలియ విన్నాడు,చదివినాడు. ప్రబంధములకు పెడమొగముబెట్టి పురాణకవిత నభిమానించినాడు. లంజెరికము మిండతనము ననుమాట ఎబ్బెరికము లేకుండ వాడుకచేసిన శివకవులను బాగుగావల్లించినాడు. 'కబ్బమొకటిపూని గడగడ చదివిన లోనియర్థమెట్లు తానెరుంగు' నని లోనియర్థము నెరుగలక్షించుచు పద్యము పద్యము స్థాయిగా నిదానముగా విద్యార్థిగనే చదువనలవాటైన వాడు. ఎదిగియు నంతే.

జెట్టిసాము కసరత్తులందు ఆసక్తి నెరపిన వాడు. దేహయష్టి నియామకమున శ్రద్ధబెట్టినాడు. జెట్ల కుస్తీపట్లు చూచుటందాసక్తి గొన్నాడు. వాని మరపించునట్టి పండితుల వాదసభల కలవాటు పడినాడు. 'పోరిపోరి గెల్చు నోరునొవ్వని' పండి

తులపోరు జెట్ల పోరుకన్న ముచ్చటగా జూచినాడు. ఆ సభలలోని గెలుపు సరియైన గెలుపు గాదని అభిప్రాయపడినాడు. అట్టివే మత వివాదములను విన్నాడు. "సాటి చేయవచ్చు చదివి వాదములాడు చదువరులను జెట్టిసముదయమును" నని యన్నాడు.

విద్యారేఖ గలవాడయ్యెను. పద్యము గట్ట నేర్చెను. సంగీతమందభిరుచి జూపినాడు. సంగీతమే విద్యయనిపించినది. అదియు కొంత సాధన జేసినాడు. రాగజ్ఞానము బడసినాడు. తోడిరాగమందనురాగము జేసినాడు. తోడిరాగమున పద్యము చదువ నలవాటు పడినాడు. 'దున్నపోతునకును తోడిరాగంబేల' యన్నాడు. అదియాతని మనః ప్రవృత్తికి కవితా స్వభావమునకును సరిపడినది. సంగీత తత్త్వజ్ఞుడగు రాళ్ళపల్లివారి మాటలలో "'ఏమో చాలదను అతృప్తి, జుగుప్స, తన అశక్తిచే గలిగిన దైన్యము, దానికితోడు కార్యసాధనము నందలి పట్టుదల, స్వాతంత్ర్య రక్తి – ఇత్యాది భావములు చూపుటకు తోడిరాగమువంటిది లేదు. వేమనకీరాగమందు గలిగిన యభిమానము అతని మనో ధర్మములను స్పష్టముగా సూచించు చున్నది. [39, 40 పేజీలు, వేమన ఉపన్యాసములు].

వీణావాదనకు చెవిగోసుకొన్నాడు. వాద్యములందెల్ల వీణనే వాణెము జేసినాడు. దానికిగూడ 'సూక్ష్మములైన విషయములు గ్రహింప వలయునను తీవ్ర భావము గలవానికే వీణ యందభిరుచి కలుగు' నని రాళ్ళపల్లివారి వివేచనమున్నది. గణితమునకును సంగీతమునకును దగ్గర చుట్టరికమన్నమాట యుండనే యున్నదిగదా!

నీతియు నతనికి ఒక విద్యయేనట. 'విద్యలలోపల నీతియు, వాద్యములలోన వీణవర రసికులకున్–హృద్యంబయి విలసిల్లిన విద్యలలో బ్రహ్మవిద్య విద్యరవేమా' యని బ్రహ్మవిద్యా ప్రశస్తిని చాటిచెప్పునపుడును నీతిని విద్యగానే లెక్కించినాడు. నీతియొక్క 'లోతు తత్త్వమరసి లోకులకును జెప్పె' నని యతడన్నందుకు లోక యాత్ర కనువుగా ఆదర్శమును, ఆచరణమున అనువదించి చెప్పినదతని ప్రత్యేకత గానే మిగిలి పోయినది.

అంత తెగబడినవాడు, స్వచ్ఛందుడు, సాహసి యనిపించు వేమనయందు పిన్న తనమున వినయ విధేయతలున్నవి. బుద్ధిమంతుడు, నీతియందు నిలువరమున్న వాడు నని తోచుచున్నది. తండ్రి వెనుక నేఅతనిసాహసిక్యములుగాని తండ్రి ఎదుట మారాడు వాడుకానేకాడు. తండ్రిచాటు బిడ్డ. 'తండ్రి కెదురుకొంట, తల్లి కెదురుకొంట, అన్న

కెదురుకొంట యరయమూడు పాతకము'లని లెక్కబెట్టిచెప్పినవాడు. అలుకన్న అటి ని కొలమానమున అమ్మయే మిన్న. అటుమాటలు విని అన్నదమ్ముల రోసి వేరుబడెట వాడు' వెర్రివాడని ఉమ్మడికుటుంబ వ్యవస్థను తలదాల్చి, దానికనువైన మనస్సుపు. నడవడిని తన చిన్నతనమున తార్కాణించినవాడు యనిపించును.

అతడు తిరుగుబోతైన తర్వాత గూడ అతని తిరుగుడునందొక నియప మున్నదని ఇంతకు ముందే గుర్తించిన విషయము. త్రావుడు, జూదము మరియు యితర వ్యసనము లతనిలో లేవు సరిగదా, ఇరుగు పొరుగు సంసారముల జోలికి పోరాదని నియమము జేసినవాడు. పరదారాగమన మాతనికి పరమ నిషిద్ధము. విధవరాలను - కోడెవిధవ గానిండు, కుంకబోడ గానిండు - అదియు పరదారయే. కావున నిషిద్ధము. ఆపైన కలిమి గలవాడు, కులము గలవాడు, చెల్లుబాటున్న కుటుంబము వాడు. పల్లెలోని పాటక కుటుంబముల కన్యా మానస చోరుడైనట్లు కానరాదుమరి. అతని తిరుగుడు పల్లెలో తిరుగుడు గాదు. రుచులెరిగిన తిరుగుడు, నాగరకరేఖ నరసిన తిరుగుడు, దాపరికములేని తిరుగుడు ననిపించును. పట్టణమున తిరిగిన తిరుగుడే గాని పల్లెటూరి తిరుగుడు గాదు - పల్లెలోని వేశ్యతో సాంగత్య మునుగాదు. తమ పల్లెలోని వేశ్యతోనేయైన ఏనాడో తన తండ్రి ఆ వేశ్యామణిని వేశ్యమాతను నిలువనీడ లేకుండ ఊరినుంచి గెంటియుండు వాడే. కాసు వీసమియ్యకుండ కట్టుగుడ్డలతో పొలిమేర దాటించి యుండువాడే. తండ్రికి వశము గాని పట్టణము సానివాడలో యౌవనోదయమున బాహాటముగా అవివాహితుడైన వేమన విడిది దిగినాడు. వేశ్యా సాంగత్యము విద్యాసాంగత్యముగా చవిజూచినాడు. కొండవీడులో కుమారగిరి ప్రియ నర్తకి లకుమాదేవి కపరావతారముల కింకను లోటుగలుగని కాలమే.

వేశ్యావ్యవస్థఒకటుండగా-అతడుకలవారిఇంటిబిడ్డకాగా-ఆపైనకళాభిరుచిఒకటి తోడుపడగా-యౌవన ప్రాభవమునకు సహజముగా వశంవదుడైనాడన్న సామాన్యగాథ యుండనే యున్నది.దానితోనే సరిపెట్టుకోవచ్చును. లేదా మరొక ఊహచేయవచ్చును.

తండ్రి కెదురాడని ప్రకృతి - నైతికస్పృహ నిండుగా నెలకొన్న ప్రకృతి, వేశ్యవాటికి నేరుగా నడచి పోవుటొక విశేష పరిణామమని, అందుకొక బలవత్తర మైన కారణముండవలెనని యనిపించినచో అదొక సమస్య. అందుకై అరయగా ఒక పద్యము అగపడుచున్నది.

కొడుకును వరియింప గోరివచ్చినదాని తండ్రి పెండ్లియాడ ధర్మమగునె ॥
తప్పని తెలియకయు, తాఁజేయు కర్మంబు తప్పదెప్పటికి నితగులు వేమ ॥

ఇది ఆత్మకథ కావచ్చునేమో? తండ్రికెదురాడలేని చేతగాని చాటుమాటు శాపనార్థము లిందున్నవేగాని చబుకు వేసినట్లు బాహాటించి చేసిన ఖండనమిందు ఖంగుమని మ్రోగలేదు. స్వవిషయము గాకున్న యీ చప్పిడిమాట నాశింపగలమా! లోకవృత్తమేమయిన అతనిలో ఇంత నిస్సారముగ నుండునా?

అతనికింత ఘోరమే జరిగి యుండినచో చెప్పెడిదేమున్నది? అతడింత పని కొడిగట్టుటొకవింత గాదు. దాపరికమే యక్కరలేదు. తనను కాదు కూడదని అడ్డగించుటకును, మందలించుటకును తండ్రికే కాదుగదా సంబంధులంటెట్టి వారికిని కొంతవరదాక చొరవజేయ వీలుకాని పరిస్థితియగును. సానికియ్యవలసిన సొమ్ము చీటీవేసి ఇంటికంపినను కిమ్మనకుండ పంపించవలసియే యుండునేమో? వచ్చి వాకిట మోడిపేసి, వలసిన సొమ్మడిగి పుచ్చుకొని పోగలవాడగునుకూడ. ఆ అగడము సాగి యింటి ఆర్థికపరిస్థితి కుపద్రవకరముగా పరిణమించి, ఇంటి నుండి కాసు వీసము చిక్కక సానివాడకు బకాయిపడి, అది తీర్చలేని బకాయిగా పేరుకొనిపోయి, సానికొంపలో మర్యాద చెడి, వేశ్య మాతచే పడరాని పాట్లుబడి, కడకు దేవిడీ మన్నాయై దేబెగా తేలిన తోడనే అయినవారు కలుగజేసుకొనుటకు సమయమగును. వేమన కంతే యైయుండును.

తండ్రిచే నతనికింత యాస్తి యిప్పించి, తమవారి యిండ్లలో నొక పడుచును గూర్చి, అతనినొక యింటివానిని జేయుసరికి బంధువుల తలప్రాణము తోకకు వచ్చియుండును. పమ్మివారు కూర్చిన కట్టుకథలలోవలె వేశ్యవాటితోనే వైరాగ్యవంతుడుగాక సంసారియై కుటుంబ నిర్వహణమునకై ప్రయాసపడి యున్నట్లు పద్యములు చెప్పుచున్నవి. వేమన సాంసారిక జీవితమును చెప్పుకొను ముందీ కట్టుకథయోగ్యతాయోగ్యతలు, స్వారస్యమును కొంత చూడవలెను.

వేశ్య కోరిన నగలెల్ల రాణిగారైన వదిన నడిగితెచ్చి వేమన యిచ్చుచుండగా నావేశ్య కోరికకొక మేరలేకుండ పోయినదట. కడకు రాణిగారి ముక్కెర వంతు వచ్చినదట. మరది కాముక్కెర యిచ్చి ఒకనిబంధన విధించినదట. వేశ్యవస్త్ర విహీనయై వెలకిలపడి శిరస్సును పాదములునుకలిసి నేలకానునట్లు చేసికొని పాదముల మధ్యగా చేతితో ముక్కెరతీసికోవలెనని, వేమన దాని పాదముల ప్రక్కనిల్చి చేతితో

నియ్యజూప వలెనన్నదను నిబంధన విధించినదట.(1906 వమ్మివారి ప్రచురణపీఠిక). అతడట్లే గావించి, మొగ్గమీది నగ్నవేశ్యాగుహ్యస్థానమును జూచి ఏవగించుకొని తలదిరిగి వైరాగ్యోదయమై వేశ్యాగృహము వెలువడినాడట. ఇదొక వనితనసులేని పేలవమైనయల్లిక. వేశ్యల నాతడంతకుమున్ను నగ్నముగా చూచిగాని, అనుభవించిగాని ఎరుగడన్నట్లు, వాత్స్యాయనులు చెప్పిన చౌశీతి బంధములలో ఆ వేశ్యలను పొందనట్లు ఇదేదో కొరమాలిన చచ్చుకల్పన గావించినారు. నిజముగా నతడట్లు మున్నెన్నడును చూడక, యీ సందర్భముననే తొలిసారి చూచెనేని వేమన దాని నసలే వదలకపోవుననవలెను. విషయలాలసునిలో వైరాగ్యోదయమునకది కారణమే కాజాలదనిపునవి. కాళిదాసు అననే అన్నాడుగదా :

జ్ఞాతస్వదో, వివృతా జఘనమ్‌కో విహాతుమ్ సమర్థః ॥

తమిళమున అరుణగిరి నాథరు కథయున్నది. అతడును తిరుగుబోతు. అతడు వేశ్యావిముఖుడై ఆత్మనన్వేషించుచు కుమారస్వామి భక్తుడుగా పరిణమించుటకును కథయున్నది.అతనికి శైశవమున తల్లిదండ్రులుపోగా,అక్క పెంపకమున అంతులేని మారాము నాగడము నేర్చి అదుపుదప్పి వయసున కట్టుతిరుగుబోతై పోయినాడు. అక్కకుగల కాసులు కనకమును గిల్లుకొనిపోయి సానులకుపెట్టి సరదా తీర్చుకొనుచున్నాడు. తమ్ముడడుగగా ఇచ్చియిచ్చి యియ్యనికనేమియులేని స్థితిలో యింకయున్నదేమో యిమ్మని పీడింపవచ్చిన తమ్మునికి 'నాకున్నదిక యీ శరీరమే. నీకు గావలసినదియు ఒక ఆడు శరీరము. ఇది అట్టిదే. ఇదిగో. నీ కామదాహ మీ శరీరముతో చల్లార్చుకోనాయనా' యన్నదట. ఆ మాటలు విన్నవాని ప్రాణములు విన్నట్లే పైకెగిరిపోయినవి. అతని కన్నుపొరలు అప్పటికి తెగినవి. కామమద మప్పటికి దిగినది. పశ్చాత్తాపమెత్తుకొన్నది. ప్రాయశ్చిత్త మాలోచించినాడు. ఊరి గుడిగోపుర మెక్కిదుమికి చావబోయినాడు. చావక బ్రతికినాడు, రక్షింపబడినాడు. గుడిలోని సుబ్రహ్మణ్యుడే వచ్చి రక్షించినాడనుకొన్నాడు. భక్తుడై కవిత చెప్పినాడు. అది తమిళములో పదగుంఫనకు పేరెక్కినది. అత డజరామరుడైనాడు. ఇది కట్టు కథకానిండు, యథార్థముకానిండు, ప్రబలముగానున్నది. విరక్తి కలిగించు ఘటన మాత్రమనిపించును. అట్లుండవలెను. ఈ ముచ్చట నింతటితో ముగించి వేమన సంసారము మాట చెప్పుకొందము.

అతడును కుదుటబడి ధర్మపత్నిగా వచ్చిన కొత్త యువతితో మనసార కాపురము జేయుటకే నిశ్చయించుకొన్నాడు. ప్రయత్నించినాడు. ఆమెనంటకాగినాడు.

అంచనాకట్టి పంటలో రాజు రైతులపాళ్లు 'న్యాయమెరిగి తగు నుపాయమెరిగి' నిర్ణయముజేసి వ్రాయనేర్చుమన్నట్లును, ముప్పదియారడుగుల పొడవుగల కొలత గడలనుగూర్చి, పగ్గములనుగూర్చి, గడలు పగ్గాలతో కొలిచిన కొలతలను అంగలతో కూడ అదుపుజేయుటనుగూర్చి 'తెలుపుచున్నట్లును, 'హద్దుకోసరంబు పెద్దపోరిడుకొని జగడములను పరులజంపుకొనకు'మని సరిహద్దు తగాదా తీర్చుటను గూర్చివిపులముగా వ్రాసిపెట్టియున్నాడు.

న్యాయాధికార నిర్వహణమునందుకూడ మెలగినట్లుగా పద్యములున్నవి. భుక్తము, లిఖితము, సాక్ష్యములను మూడింటి బలాబలములను, ఎప్పుడేది సందర్భించునదియు, సాక్ష్యముల విశ్వాస యోగ్యతలను, 'ముడబడిలేని యుత్తరముల భుక్తి'; 'పుడమినడ్డులేని భుక్తి యిరువదేండ్ల'ని, అరువుమీద వడ్డిమీద క్రయము చెల్లదని క్రయమనగా రచ్చలో ద్రవ్యమిచ్చినదేయని, దానములు, దానపాలనమును స్వపర దానదత్తముల ననుభవించుటలను, శాసన ఫలకములు కూర్చుటలను, తాకట్టుబెట్టిన భూములను అదనముగా అనుభవించుటను, సొమ్ములను వాడుకొనుటను చర్చించి నిర్ణయములను చేసియున్నాడు. ఇవన్నియు అతనిని రాజోద్యోగియని ఎంతగా జెప్పుచున్నవో, అందతని పరిష్కారములు కొలువుకూటమందలి పలుకుబడిదార్లకు అధికార్లకు ప్రభువర్గమునకు ఇష్టముకానివని, బక్కబడుగులకు న్యాయము నిరాకృతముగానీయక దుర్బలస్య బలమ్ రాజాయనినట్లు మొగమోటములేని న్యాయనిర్ణయ బుద్ధితో చెప్పినవని అతడందుచే ఎంతోకాలమా కొలువునందిముడలేదనికూడ తప్పక సూచించుచున్నవి.

అధికుడైన తన రాజుకొల్వులో అల్పులధికారమునుపొంది ఆజ్ఞచెల్లించుకొనుచున్నారనుకొన్నాడు కొన్నాళ్లు.

> ఆధికుడైన రాజొ కల్పుని చేపట్ట వానిమాట జెల్లు వసుధలోన
> గణకు లొప్పియున్న గవ్వలు చెల్లవా..........
> అల్పబుద్ధివాని కధికారమిచ్చిన దొడ్డవారినెల్ల తొలఁగగొట్టు
> చెప్పుదినెడికుక్క చెరకు తీపెరుగునా..........

అతనికాతడు దొడ్డవాడే. ఒక నాటికతనిచేతనే ఉసరాపాటు తప్పక పోపునని మనసులో నున్నది. రాజు విషయముగూడ కొన్నాళ్ళలో అసలర్థమైనది. రాజ్య భారము మోయుటతని శక్తికిమీరిన పనియని కనుగొని సూటిగా వానిమీదే ఎవరి ముందో ఒక పద్యము చెప్పినాడు.

రాజసంబుగోరి రాజ్యభారమునందు నోర్పులేని యాత డుభయతజెడు.

నీటిపైన గుండు నిలుచునా మునుగక............అని యాతడే చెప్పవలసిన సందర్భమేదో కల్గినది. రాజసమొలికించుటకే, అధికారదర్పములు ప్రదర్శించుటకే రాజ్యముగాని, దాని నిర్వహణ భారము వహించుటకు వలసిన ఓర్పులేనివాడు అతనిరాజు. అతడొక బండరాజట. మొద్దు. ఇకనాతని కొడుకా దుంపగీడు. కొలువా కొండెగాళ్ల పుట్ట. ఇకనేమి చెప్పవలెను ? వేమనవంటి స్వతంత్రునకు, న్యాయచక్షువునకు ఆ కొండెగాళ్ల పీడ కొండంతయగుట కెంతోకాలము పట్టదు. కొండెగాళ్లగూర్చి వేమన గట్టిగా అన్నాడు. ఆ బాధ బాగుగా అనుభవించినాడు. కొండెగాళ్ళ ప్రస్తావన మాతనిలో నెక్కువే.

కొండెకాడు చావ కొంతదనుకెబోవు వంతుకింతెగాని వగపులేదు
కొంకనక్కచావ గొఱ్ఱెలేమిటి కేడ్చు............
అసలాతడు కొలిచిన కోటలోని చిల్లర దొరతనము పరిస్థితి ఎట్టిదనగా,
కొడుకు దుండగీడు-కొండీడు చెలికాడు-బండ రాజునకును బడుగుమంత్రి
కొండముచ్చునకును కోతియే సరియగు............
కొండముచ్చుపెండ్లి కోతిపేరంటాలు, మొండివాని హితుడు బండవాడు
దుండగీడునకును కొండీడు దళవాయి............
ప్రభువు కోతియైన ప్రగ్గడ పందియౌ, సైనికుండు పక్కి సేనపసులు
ఏన్గులశ్వచయము నెలుకలు పిల్లులు............

అట్టి కొలువులో న్యాయ నిర్ణయమున వేమన కూర్చుండి, పల్లకాళ్లదున్ని వాగు లడ్డముగట్టి తుమ్మకంప ద్రుచ్చి త్రోవగట్టు గట్టివారికి అడిగొట్టు మోతుబరులకు 'దండుగలు' విధించి, వసూలు జేయించి, ఆ భూమి అతనికిగాకుండ జెప్పి, దండుగైనబెట్టు ధర్మానకోర్వడు అని ఎగతాళించినాడు. ఒకప్పుడు రాజుగారి అంతఃపుర ద్రోహమున కొడిగట్టి దొరికిపోయిన ఒకానొక రాజోద్యోగి విషయమున,

చెరకునందునైన చెడ్డ గుణంబున్న తీసివేయకుండ తినగజనదు
అంతిపురము ద్రోహి యాతడెట్లుండురా............యని వాని యుద్యోగ మూడదీయవలసినదేయని చెప్పినాడు. ఇట్లు ఆ కొలువు అతని నిర్మొగమోటమైన తీర్పరితనమును తట్టుకోలేక పోయినది. అధికారి వర్గమునకు కావలసిన పలుకుబడి దార్ల విషయమునైన ఎట్టి సిఫారసులకు లొంగకవంగక పేదసాద ఫిర్యాదీల పక్షమే

న్యాయమని చెప్పియుంతును. కొండెగాళ్ళిక విజృంభించినారు. చాడికానిమాట చావడిలోనిక్కినది. అతని యుద్యోగము ఊడగొట్టుకొన్నాడు. అచటి దుస్సహ పరిస్థితుల కతడే మానుకొనియైననుండును. రాజసేవ నిదిగో ఇట్లు కంటగించుకొన్నాడు.

ఎంత సేవజేసి ఏపాటు బడినను రాచమూక నమ్మరాదురన్న
పాముతోడి పొందు పదివేలకైనను........ ..

కోతిబట్టితెచ్చి కొత్త పుట్టము గట్టి కొండముచ్చులెల్ల గొలిచినట్లు ఉన్నదా రాచరికము. ఇకనట్టిచోట నైతిక చేతనతో నిలువెల్ల నిండిపోయిన వేమన ఎట్లుండగలడు_అదే అన్నాడు: నీతిహీనులొద్ద నిర్భాగ్యులుందుమ.........అని. అ పద్యమును అట్లు పూర్తిజేసి, తనఉద్యోగమును పూర్తిజేసినానని జెప్పినాడన్నమాట. అసలానాడురాజవిధులేమో తెలిసి నిర్వహించురాజే లేకపోయినాడని, 'మహిపతి యనుపేరుమనుజున కేడదో' అనుచు, అనుటకు

పుడమి నుప్పరంబు పురికొల్పి జగముల రక్షసేయగల్గు రాజులెవరును కానరాలేదన్నాడు. పుడమి నుప్పరంబు పురికొల్పుటనగా పడిన వానను పంటల కనువుగానిల్వజేయుటకు చెరువులు, చెరువుకాల్వలు త్రవ్వించి మరమ్మతులుచేయించి వార్త నిర్వహింపజేయుట_అది ఆనాటికసలు మూలబడినదన్నమాట. వ్యవసాయము దెబ్బతినసాగినది.కరవులు తరచైనవి.అ కాలపు చారిత్రకాధారములదే చెప్పుచున్నవి. కరవుల మాట వేమన యందెక్కువ. మరి రాజు అప్పుల పాలగుచున్నాడు. రాజులకు అప్పుపెట్టువారైనారు వైశ్యులు.రాజ సమితికెల్ల సంపములై కోయుచున్న వైశ్యులను వేమన చూచినరోజులవి. ఇట్లు దుర్బలమైన రాజరికము నీతిహీనమై స్వసుఖమే చూచు కొని ప్రజాసౌభాగ్యము దేశ సుభిక్షము రక్ష కర్తవ్యమని మరచిన ఘోరదుర్దశను వేమన కంటగించుకొన్నాడు. ఇకనాటి రాజోద్యోగులను ఇట్లు మందలించినాడు.

భూపతి కృపనమ్మి భూమిజెరచువాడు, ప్రజల యుసురుదాకి పడునుపిదప
నెగురవేయ బంతి ఎందాకనిల్చురా.........

అట్టి రాజులన్న ప్రజలకు భయభక్తులు నశించినవి. వేమనకు తన ప్రభువుపై భ్రమలు తొలగకున్నప్పుడే ఒక ఘటన జరిగినది. ప్రజలు ప్రభువును వేళాకోళముజేసిన ఘటన యది. వేమనకది ఆశ్చర్యము, కొంత అనుచితము నని పించినది. అచే పద్యము జేసినాడు ;

ఔర ! ఎంతవారలల్లరి మానవుల్ ప్రభువునైన గేలిపరతురెన్న,
దాటగించువారు దండియౌ భువిలోన.........స్వానుభవముచేత ఒకప్పటికి

వేమనయేవారిలో చేరిపోయినట్లయినది. వేమన వేళాకోళమిందాకనే చూచినారు.

రాజదూషణకు ధూర్జటిని పేర్కొనుటొక పరిపాటిగా నున్నది. అతడు రాజ కీటములన్నాడని, రాజుల్మత్తులు వారిసేవ నరకప్రాయంబు, వారిచ్చిన భోగములెల్ల ఆత్మవ్యధా బీజములన్నాడని, ఏమేమో అతని రాజసేవా విరక్తిని, ఖండనను కొని యాడుదురు. కాని అతని రాజవైముఖ్యమునకు హేతువులేమో, అవియు వేమన హేతువులును ఒక రాశివో కావో అరయవచ్చును. అతని యందు ఏవిరక్తియున్నను ఏరాజునకు నాతడు కృతినియ్యక పోయినను రాజాదరణకై మాత్రము ప్రాకులాడి, అందుత్రోపువడిన భక్తశిఖామణి యనక తప్పదు.

క్షితినాథోత్తమ ! సత్కవీశ్వరుడు వచ్చెన్ మిమ్ములం జూడగా
నతడే మేటి కవిత్వవైఖరిని సద్యఃకావ్య నిర్మాత త
త్ప్రతిభల్ మంచివి తిట్టు పద్యములు చెప్పండాతడన్నన్ మముం
గ్రితమే చూచెను బొమ్మటందురధముల్ శ్రీకాళహస్తీశ్వరా !!

అత డేరాజునొద్ద 'సంభోజాక్షీ చతురంతయాన తురగీ భూషాదులొంది పరితృప్తింబొందితి'నన్నను, ఆ రాజేగిన పిమ్మటెవరెవ్వరి మొగసాలలోద్రొక్కి పోపొమ్మటన్న యీ అనుభవము గడించుకొన్నాడనుమాట నిశ్చయము. ఇట్లు కోట కోటదిరిగి వారందరను లోకకంటకులనుగా దేల్చి, సత్యదానదయాదుల్ గల రాజు నా కొసం గుమవానినీయట్ల దినంబున్ ముదమొందుదున్....అని దేవునినే చేతై నచో అట్టివాని జూపించుము, నేకానగ లేక పోయితినన్నాడు-అట్టి రాజులు లేక, ఉన్నరాజు లర్థాతురులైనచో ఎచట ధర్మంబుండు నన్నదేగాక, అంత వైరాగ్యము నందును భక్తియందును 'రూపాజీవాళికి నేదిదిక్కు ?' అని పాపము పాతవేశ్యలను వేశ్యావ్యవస్థ భద్రతను, విషయలోలత్వాలంబనోద్దీపన విభావముల రక్షపోషణలను మరువజాలినవాడు కాకపోయెను. ధూర్జటి రాజధూత్కార కారణమిట్టిది కాగా, వేమన కారణములు తన కారణములు గావు: అవి ఇతరుల కారణములు, ప్రజల కారణములు. న్యాయము కారణములు, కవుల కారణములుకూడనై యున్నవి.

గంపయైనదొంగ కవుల సొమ్మెగవేసి కండకావరమున కదిసి బలిసి
గండుకుక్కవలెను కాటుకు తిరుగును...........అని తిట్టినాడు. తన

విషయమననా ? తన కవిత్వము నేరాజుకొనును ? తోటకూరకైన దొగ్గలాకునకైన కావ్యములమ్ముకొన వచ్చిన కవి గార్ధభములకా కాసంత సొమ్మే ఎగబెట్టిన రాజులను గూర్చి వేమన నోరుజేసుకొన్నాడు. తక్కిన కారణము లింతకు ముందరసినవే.

రాజోద్యోగపర్వమాతని పాలికొక పెద్ద పాఠశాల. లోకవృత్తమాతని కచటనే అవగతమైనది. మానవుని స్వభావమంతయు, పాలకపాలితవర్గముల సంబంధస్వరూపమంతయు ఆ కొద్దిపాటిరాజు ధర్మాసనము ముందునకు వచ్చి విచారణకు నిలబడుచుండినది. మానవుని స్వార్థము పాలకవర్గముల ప్రవర్తనమంతయు ప్రదర్శితమగుటకు ప్రశస్తమైన నర్తనశాల ఆ దేవిడీయే. సంఘమందలి సర్వ ఘర్షణములు నక్కడ ధ్వనించవలసినవే. సంఘజీవనమునందలి బలము దుర్బలతలు రెండును కొలమానమునకు అందవలసినదక్కడే. కలిమిలేములు, కులములు, మతములు, కళలు తమ్ముతాము పండించుకొనుటకు పొలమది. నాటికవులు, నాటి కవితా పరిణామ పరిపాకములు తత్స్థితులు అచటికన్న వేరొకచో దెలియవు. వేమన కారాజోద్యోగము సంఘముయొక్క విశ్వరూప సందర్శన లాభమునకు హేతువైనది.

రాజోద్యోగమందలి ఆర్థికస్వాస్థ్యమున విజ్ఞాన విచారమును బట్టియేమి జోగిజంగాల చేనేమి, యాచకార్థుల చేనేమి అతని యిల్లొక సత్రమైనది. 'బతుగు నరయలేని ప్రాభవం బదియేల'యన్నట్లు నడచినాడు. అతని న్యాయపక్షపాతము నిష్ఠ ఆ సీమలో నలువురకు తెలిసినవి. అతడొక ఆకర్షణమైనాడు. అతని ఉద్యోగము ఊడుసరికి అతని తలనిండ విశ్వాసము, దాని సమస్యలే నిండి యున్నవి.

ఇంట గంపెడు సంసారము సమస్యయున్నది. ఇల్లాలు గయ్యాళించినది. ఇంటిలోని పోరు ఇంతంతగాదయాయనిపించినది. ఆమె సోక్రెటీసు భార్యకు చెల్లెలైనది.

అతని ఆర్థిక పరిష్కారములు వ్యగ్రమైనవి. ఉగ్రమార్గము ద్రొక్కినవి. ద్రోహబుద్ధినైన దొంగతికమునైన నటలనైన సాహసమునైన సంపదధికు నుండి సాధించి ధనమును బతుగుకిమ్మని, అదురుబెదురులేక అన్యులసొమ్ములు పంచిపెట్టినదే పెద్ద విశేషమని పరులకుపకరించి పరుసొమ్ము పరులకు పరగనిమ్మని పరముకన్న నేమి పావనమా సొమ్ము అని పరము నన్వేషించువారలకు గూడ కర్తవ్యముగా జెప్పిన జీవిత సన్నివేశమిప్పుడుగాకున్న మరెప్పటిది కాగలదు? పరుల సొమ్మెట్లయిన పరులకు పెట్టుమనగా నింకేమున్నది? అదొక ఉద్యమము. సంఘమందొక అలజడికి సాహసచర్యలకు దారితీసినది కావలెను. అతని వినువారు, అనుసరించువారు ఆ సీమలో అప్పటికి కలిగియుండుటెంతయు సంభవము. కలిగిన వారి సొమ్ములుకొట్టి లేనివారికి పెట్టునభిప్రాయ మొకటి పుట్టిసీమలో ప్రాకినది.

అట్టి చర్యలును కొన్ని తప్పక జరిగియుండును. ఆంధ్రదేశమున ఉదయగిరి—కందుకూరి సీమలకును — శ్రీశైలమునకును మధ్యప్రదేశము నందెక్కడనోగాని వేమన సిద్ధాంత బోధలవల్ల సంఘములో ఆర్థిక సంఘర్షణములు చెలరేగినవని తలంపవలసి యున్నది. వానిజాడతీయవలసియున్నది. కలవారియిళ్ళు కన్న పెట్టబడినవి, కొల్ల పెట్టబడినవి, తిండిగింజలు బట్టబంగారము ఇతర వస్తుసంచయము పేదలకు పంచిపెట్టబడినవి. కుదువసొమ్ములు విడిపింపబడినవి.పద్దుపత్రములు చించివేయబడినవి. వేమనకారణముగా నిట్టిఉద్యమమొకటి ఒకప్రాంతమున తలయెత్తియుండును కానిఅదేమంత కార్యకారియై యుండదు. దారిద్ర్యసమస్య తీరియుండదు. నాటి చచ్చురాచరికము క్రింద అణచి వేయబడినదనుకన్న దానంతనదే క్షీణించినదనవలెను దానివలన తాత్కాలిక ఫలితములే గాని స్థిరమైన ఫలితములు కలుగకపోవలెను.

సంపదధికునుండి సాధించి పేద సాదల కడుపునిండించు నుద్బోధ విఫలమగుటతో వేమన బంగారు చేసితెచ్చి పేదల కిచ్చెదమని తలచినాడు. రససిద్ధుల నాశ్రయించి హేమకారవిద్య నేర్చుటకై అసలే కంటిలోనినలుసైన యిల్లాలును, యిల్లు సంసారమును దిగవిడచినాడు. తిన్నగా శ్రీశైలమెక్కినాడు. అచట చేరి రస యోగులగుంపులకు దక్కినాడు. అచటిపాతాళగంగకు దగ్గరగాగల గుహలో సిద్ధనాగార్జునుని శిష్యుడైన ఆత్రేయునినాటినుండి నెలకొల్పబడిన రసయోగ ప్రయోగశాలకు చేరినాడు. శుశ్రూషించినాడు. రససిద్ధులు చెప్పినట్లెల్ల చేసినాడు. ఏమిసాధించినాడో, ఏమోగాని బంగారమునుచేయు రీతులని ఎన్నింటినో ఎన్నో పద్యములబెట్టి చెప్పినాడు.

కరవుకాటకముల బారిపడిన కర్షక జనముల బాధానివారణకు స్వర్ణయోగ ముండగా చింతవలదని చిట్కాలు చెప్పినాడు. కరవులకే హేమతారక విద్య పరిష్కారముగా చాటినాడు. ఉప్పుచింతపండు నూరిలోనుండగా కరవదేలవచ్చె కాపులార! ఉప్పుజెముడుపాలు నూరనేయుండంగ కరవు కరవటంద్రు కాపులార! తాటికల్లుతెచ్చి తాళకంబును వండి కూటికింతయేల గురుతుమీర అనుచు రసయోగమురహస్యము జెరచి రైతులెల్లరకునది వెల్లడివిద్యను జేయసంకల్పించినాడు.

ఇందాతని విజయసిద్ధి ఎట్టిదో ఎరుగరాదుగాని వైఫల్యముమాట మాత్ర మాతని పద్యములలో లేదు. స్వర్ణయోగమందతనికి అఖండమైన నమ్మకము కానవచ్చుచున్నది. కాని అతడందు విజయము సాధించినాడని తలపవలసినదేనా?

కరవులు మాత్రము దీరలేదు. కాపులకావిద్య పట్టుబడలేదు. వారి చేతికి బంగారము రాలేదు. ఆ బంగారముచేవారు సుభిక్షములైన ప్రాంతములగు తావుల నుండి అన్నపానములు కొని తెప్పించుకొని కరవు గడవబెట్టలేదు. ఇహమున సుఖియింప హేమతారక విద్య, పరమున సుఖియింప బ్రహ్మవిద్య అని నమ్మకముగా

జెప్పుకొన్నవాడే మరల తాముగలుగుచోట క్షామడామరమైన పరగుదేశమునకు జరుగ వలయు– కొలనదెండిపోవ కొక్కెరలుండునా'యని వలసబొమ్మని సలహా చెప్పవల సిన వాడయ్యెను. ఇంక హేమకారవిద్యలో విజయమేమున్నది? ఎంతయున్నది?

కాని తానెక్కిన శ్రీశైలమున, తాను గలిసిన జోగులొద్దను రసయోగ మొక్కటే విద్యగాదు. ఆ కొండమీదనే వనౌషధులున్నవి. ఆ రససిద్ధులొద్దనే తత్త్వమున్నది. శైవ సంప్రదాయములన్నియు శ్రీశైలమందేయున్నవి. నాథసిద్ధులు నందేయున్నారు. నాల్గుయోగములచ్చటనేయున్నవి. ఆ పర్వతమున గుహలు, అర ణ్యము, ఏకాంతమునెట్లున్నదో, పట్టణము రాజ్యపాలనము ఆ నాటికి అట్లేయున్నవి. నాడు శ్రీశైలమొక నగరము– సంపన్నమైన నగరము. అదొక రాజ్యము. క్షేత్ర రాజ్యము. 1606లో గొబ్బూరి గిరియప్ప శ్రీశైలపాలకుడు. * రావెళ్ళమల్లా నాయుడు 1662 వరకు శ్రీగిరి మండలపాలకుడు ** ఇంతేగాదు; అచటి శైవ మఠములు–భిక్షావృత్తిమఠము, అరసమఠములవంటివి పాలనాధికారులను, ఆస్థాన కవు లను నియమించినవి. కవిగౌరన భిక్షావృత్తిమఠములో ఆస్థానకవి. శ్రీనాథునిశివరాత్రి మాహాత్మ్యము అందలి అధికారికి అంకితము. వేమన కాలమున కాకునూరి అప్పకవి అచట ఆస్థానకవి. కొండదిగువఅగ్రహారములు అసంఖ్యములు. వానిఆదాయముఅధికము. స్థిరమైన విపణి–వర్తకవర్గము ఏర్పడి శ్రీశైల నగరము వైభవమును గాంచినది.

అట్టి శ్రీశైలముపై– హిందువులుకూడ దాడిచేసి దోచుకొన్నారు. వేమన ఆ కొండపైనుండగా తురకల దోపిడీ సాగినది. అది 1618లో బీజపూరు సైన్యాధి పతులుగావించిన దాడి. దానినే "శ్రీగిరిపయినెక్కి చెలరేగి తురకలు సొమ్ము లెల్ల జూచి చూఱబుచ్చి చెడుదురు తమయిల్లు చేరికలోపల"యని శాపనార్థపు పద్యము చెప్పినాడని ఇంతకుముందే చూచినాము. శ్రీగిరి కొల్లగొట్టిన హిందువుడన్నవాడు ఒక బ్రాహ్మణదేశాయియట. వానిపేరు తుక్కరసు. బీజపూరు తరపున కర్నూలు నేలుచున్న మునావర్‌ఖాన్‌పై నతిరుగబడి, సేనలతో శ్రీశైలమెక్కినాడు. యిల్లిల్లు మఠము మఠము సొచ్చి పుంటిక్రిందదాచినసొమ్ముకై గడ్డపారలతో త్రవ్వించి దోచు కొన్నాడు. వీనిచావుకై ఏలూరి శేషయ్యయను కవినామకుడొకడు ఐదవ అక్షరము కకారముగజేసి పద్యముచెప్పగా తుక్కరసు మూడవనాటికిచచ్చినట్లు కాకునూరి అప్ప కవి ఉదాహరించినాడు;

మునుపొకకేల రావణుడు మోదమునన్ రజతాద్రి యెత్తినం
తనె హరుడప్పుడే తన పదంబున త్రొక్కి మదంబడంచె గా

---

*Carnatic, chronology –Brown P. 67.

** కమ్మవారిచరిత్ర –కొత్తభావయ్య చౌదరి పే 223

వనమయగోరి తుక్కసచివా యల శ్రీగిరి గడ్డపారలన్
గనలుచు ద్రవ్వి సర్వమును గైకొననీకిపుడాతడోపునే॥
(అప్పకవీయము —ద్వితీయ, 375)

ఈ అప్పకవి 1656 వరకు శ్రీశైలమునందేయున్నాడు. వేమన నెరిగియే యుండవలెను. వేమన విశ్వదాభిరామ వినురవేమయని అక్కడే కవిత వర్షించుచున్నాడని పైపద్యమే చెప్పుచున్నదిగదా!

*చీపరపాపరతీగల చేపలబుట్టల్లినట్లు చెప్పెడు నీయీ
కాపుకవిత్వపుకూతలు బాపన కవివరుని చెవికి ప్రమదంబిడునే॥

అనుచాటు పద్యమున్నది. అది రామరాజభూషణుని గూర్చి తెనాలిరామలింగడుఅన్నట్లు చెప్పుచున్నారు. ఆ వసుచరిత్రకారునికవిత 'చీపరపాపరతీగల చేపలబుట్ట"యని అనగలుగుటెట్లు? అతడు కాపుమాత్రమెట్లగును? భట్రాజుగదా! ఈ పద్యము రామరాజభూషణునందు చెల్లనేచెల్లదు. తెనాలివాడంత అసందర్భపు పద్యము చెప్పడు. కాపు కవిత్వము— చేపలతట్ట అల్లకము ననుటకు వేమనదప్ప వేరొకడెవ్వడును ఆంధ్రసాహిత్యమున లేనేలేడని ఘంటాఘోషముగా చెప్పవచ్చును. "ఉపమగల్గిన శయ్యలనొప్పియున్న అంఘ్రిభవుని కావ్యంబు గ్రాహ్యంబుగాదు" అని శాసించిన ఆ కాకునూరి అప్పకవే శ్రీశైలము మీదనుండగా వేమననిట్లు ఈసడించియుండలేదుగదా!

ఈ విషయమిట్లుంచి వేమన వైద్యము మాట కొంత చెప్పుకోవలసియున్నాము. ఉక్కుకళ్ళు మందుగా జెప్పినాడు. (ఉక్కుసున్నము దినినడుగు క్షయము) పిత్తమునకు మందతదెరిగినవాడు. (కొంతసిందురమ్ము కడుపిత్త వ్యాధికి ఒనరతేనెతోడ నొసగినంత ..) వేపాకుతోవైద్య మెరుగును. పుప్పిపంటికి, కుక్కకాటు వగైరాలకు ములలో వైద్యఅతని పద్యమున్నది. ఆవుపాలకున్న ఔషధగుణములతనికి దెలియును. కర్ర పళ్ళుకట్టుట[తొర్రివానికేల కర్రపళ్ళు] కంటిపొరలు కోయుట [కన్నుపొరలుగప్పికనిపింపకనరుండు పొరలుదీయ మంచుపొరలుచుండు ..అనుశస్త్రచికిత్సలు అతని ఎరుకలోనున్నవి. రతిలేకముదియునంగన యనును.అతడొక గొప్పవైద్యుడుగాకపోవచ్చును. వైద్యములో కొంతపరిచయమున్నది. రసవాదము,వైద్యము నాడు మిశ్ర విద్యలు. యోగాభ్యాసము తత్త్వవిచారముకూడ నట్టివే. ఆనాల్గును కలిసియుండుటకూడ తరచే. మనసంప్రదాయమున వానిస్థితియట్టిది. తీగలాగిన డొంకకదలినట్లైనది రసవాదమున బంగారమునకై వెడలిన వేమన బంగారముమాట ఎట్లున్నను అదివరకే అతనియందున్నతత్త్వభావపరిచయమునకు అనుభవమును,అంతరాంతరావగాహనమును, ఉత్తరోత్తరవికాసమును సాధించుమార్గమున వెనుదిరుగకుండ ప్రయాణించుటకు వీలుచిక్కినది.

---

* వేటూరి ప్రభాకరశాస్త్రిగారి చాటు పద్యమణిమంజరి ద్వితీయ.

యోగసిద్ధులలోగూడి శ్రీగిరియందెంత కాలమున్నాడోగాని, అతనిని తిరిగి సంసారోన్ముఖుని జేసికొనుటకు, యింటిగడప ద్రొక్కించుటకు కడపటియత్న మొకటి జరిగినట్లున్నది. అతనిపద్యములే అట్లుచెప్పుచున్నవి. ఇంటిలోనిపోరు ఇంతంత గాదయా యనిపించిన భార్య కూతురునకు పెండ్లిజేయగలిగినది. అల్లుని అరయికలో కుటుంబము నీదుకొనుచున్నది. ఒకనాటికి అల్లునంపించిగాని, వెంటబెట్టుకొని తానుగా శ్రీశైలమునకు శివరాత్రి యాత్రకుగావచ్చి కాన్పించుకొనిగాని మగనినింటికి ఆహ్వానించినది-బ్రతిమాలుకొన్నది. ఏమోచెప్పికొన్నది. వేమన ససేమిరా పొమ్మన్నాడు. కఠినముగా మొగముమీదనన్నాడు.

అపుడు నాదుమాట ఆనందమనుకొన, కిపుడురమ్మటన్న నేమిగలదు?
మదము నిల్చువరకు మనసెవ్వరికినిల్చు........ [ బందరుప్రతి–135 ]

అల్లుని రాయబారమునుకూడ నిరాగసుడుగా, బంధరహితుడుగా తిరస్కరించి తాను మాటాడిన తీరునకు తన అంతేవాసులేమో యనగా ఇట్లన్నాడు.

అల్లుడైననేమి అన్యుడయిననేమి చెప్పవలయురీతి చెప్పినాము
హరునియాజ్ఞలేక ఆకునల్లాడునా............

వేమన ఇట్లు సంసారబంధములు తెగగోసుకొని అచంచలుడై తత్త్వము నన్వేషించుటలో పడిపోయినాడు. తత్త్వమును సాధించినాడు. బోధకుడైనాడు. దానితో విశ్వకుటుంబియైనాడుగాని స్వకుటుంబమును కన్నెత్తి చూడలేదు.

అతడు శ్రీశైలమందే యుండిపోలేదు. అతడు నిత్యపథికుడు. క్రొత్త ప్రదేశములకు క్రొత్త తత్త్వములకును పథికుడు. పడమర కొంకణమువరకు, దక్షిణమున రామనాథమువరకును అతని సంచారము విన్నాము. అతని తత్త్వయాత్రలెట్టివో ఎన్నోచూచినాము. అవన్నియు మరల ఏకరువు పెట్టుకోనక్కరలేదు. ముందెక్కడను ప్రసక్తముకానివేవైనగలవేని చూడవలెను. అదొకటున్నది.

సగుణోపాసనలో సగుణబ్రహ్మోపాసనగాక, అంతకన్న దిగువగా వింతగా బ్రహ్మదేవుని పూజజెప్పిన వేమన కర్మవాదమును మీమాంసాచ్ఛాయలో చూడకున్నాడాయని ప్రశ్నించుకొనగా కర్మమీమాంసను తలకెత్తుకొన్న పద్యములును తగిలినవి. కర్మమే దైవమని, కర్మఫలితములమార్చ వీలులేదని, కర్మలు తమంత తాము ఇతరాపేక్షలేక, ఇతర నియామకమును గోరక ఫలింపగలవన్నది పూర్వమీమాంసవారి విచారధార.

బ్రదుకులన్నిమాయ భవబంధములుమాయ, తెలివిమాయ,
తన్నుదెలియమాయ

తనదుకర్మ మొకటె తనరును స్థిరమయి.... .... ....
ఎన్ని తపములోర్చి ఎన్ని నోములునోచి ఎంత కష్టపడిననేమి సుఖము?
కర్మఫలమెగాని కలుగదెందునుముక్తి.... .... ....
మూలమెవ్వరనుచు ముగ్గురిలోపల మూలమెరుగలేరు మూఢజనులు
మూలమంతటికిని ముఖ్యము కర్మము.... .... ....
మతములెన్నియైన సతములు గావవి సతము కర్మమగును జగతిలోన
అన్నిమతములందు నరయనొక్కటిలేదు.... .... ....

కర్మమే స్థిరరాశియట. ముక్తికూడ కర్మవశమట. ముగ్గురు మూర్తులకు పైనే కర్మమున్నదట. కడకు ఏ మతమును శాశ్వతముకాదట. అందెందును ఆ ఒక్కటి యన్నదసలులేదట. ఆ ఒక్కటన్నదే కర్మము అన్నాడు. కర్మయొక్క ప్రశస్తినిట్లు ఉత్తరోత్తరోన్నతిగాచెప్పి, అతనికి తారసిల్లిన పండితులమీదో, బోధకులమీదో ఒక సవాల్ విసిరినాడు:

కర్మజాలమనుచు ఘనులెల్ల (బల్కేరు; కర్మమేమి? దాని ఘనతయేమి?
తెలుపో నలుపో యెరుపో తెలిసిన బల్కుడు.... .... .... .... .... ....
వారితోనే కాబోలు, సవినయముగా చిన్నవాడై వెనుకవాడై అనుచున్నాడు:
మునుతెలిసినవారు మొగినష్టమైరిల, తిరిగి చెప్పితనుచు తిట్టవలదు
తెలియజెప్పువాడ తెలియుము గర్మంబు.... .... ....•.... .... ...

ఇక ఈ కర్మమతమును వదలుకొన్నాడని, కర్మలను కోయుటను చెప్పినాడని, కర్మలను మానుమన్నాడని ప్రత్యేకించి ఉదాహరింపవలసిన పనిలేదు. అదివదలుకోక అద్వైతికాలేడు. ఆపైన శూన్యవాది కాలేడు; అచల మెరుగలేడు.

ప్రాపంచిక జీవితమందెంత మోసము, దంభము, వేషధారితనము నాటకము, అనృతము, కుట్ర కూహకమును వేమనజూచినాడో, చూచిఖండించినాడో, శతపోరినాడో–సన్యాసి ప్రపంచమున తత్త్వసాధనా ప్రపంచమున అంతకెక్కువ మోసమును, దంభమును, కల్తీని, నకిలీతనమును, ఉదరంభరిత్వమును, కీర్తికాముకత్వమును దానికై పలుపాట్లను చూచి, కేలెత్తిచూపించి, గొంతెత్తి ఖండించి ముముక్షువ్వన్య లోకమున ఎవ్వరునుచేయని పోరాటమును చేసినాడు. బహుభాషలసన్యాసులను, బహువేషముల సాధువులను బహుసంప్రదాయముల బోధకులను కలిసినాడు. మోసమును పసిగట్టి మొకముమీదే వడ్డించినాడు. చెంపచెంపలు కొట్టినాడు :

బాసలాడ నేర్చి పలుమోసములుచేసి, గ్రాసమునకు భువిని ఖలుడవైతి
దోసకారి! నీకు దొరకునా మోక్షంబు..,. ... .... .... .... .... ....

బహుభాషల బోధకునిట్లును, మరొక కంసాలి గురువు నింకొక తీరుగను తిట్టినాడు:

> స్త్రీల వ్రతముజెరచి శిష్యునకును శిష్యుడగుచు నీమమెల్ల నడవిగలిపి
> విశ్వ కర్మకులము వీడేలబుట్టెరా.... .... .... .... .... .... .... ....

వ్యక్తిగతముగా పట్టుకొని నిలువబెట్టి తిట్టి చీవాట్లుబెట్టిన దిట్టుండ, జోగి జంగాల ప్రపంచమునగల మోసములమీద అతడు చెప్పిన పద్యములు అసంఖ్యములని పించును. చిత్రచిత్రములైన ఆచారములు, వేషములు విననివి, విని నెవ్వర వోవలసి నవి ఎన్నో ఇతని నిరసనలో చదువగలము.

చీరగట్టిరాత్రి సిగ్గుతో నెరినుండి పగలు చీరవిడుచు జోగిణి, కల్లునీళ్ళు ద్రావి కడుపెద్దవారిలో చీరవిడచితిరుగు సిద్ధురాండ్రు, శివునిభక్తి చిందుసేయనైవ ముసలిముండలగుంపు—తల్లితోడ జాణతనములాడి తల్లినాలనియెడి తత్త్వములు — యోనికడిగినీరు ఒనరంగ త్రావి, క్రతువుజేసెదమని కడువిప్రవీగెడువారు — వచ్చి మలము వట్టి తిని గర్రని త్రేన్చి గొప్పజూపితిమనుకొనువారు, ఇంకేవో అసహ్య చేష్టలు నియమముగా పాటించినవారు వేమన నిరసనలో కానవచ్చెదరు.

గురువులనువారి గుట్టంతయు తెలిసినవాడు, తెలిపినవాడు, గురువులకు గుండెగాలమై పరిణమించినవాడు. హఠ, లయ, మంత్ర, రాజయోగములు, కాయ సాధనలు మున్నైన ఏవే సాధనామార్గము లెవరెవరివద్ద ఎక్కడెక్కడ నున్నవని విన్నాడో ఆయాతావులకు ఆయా గురువులవద్దకు చేరినాడు. వారుచెప్పినవెల్ల చేసినాడు. కఠోరనియములందెల్ల నెగ్గినాడుగాని తగ్గలేదు. అందాతని లోపము, చాలమి, చేతగామి యన్నమాటకు ఎడమీయకనిలిచినాడు ఆసాధనలసత్తా ఆతనికి అవగతము.అందేమియు లేదని తానన్నచో గురువులేదో ఇతని చేతగామిని చెప్పుటకు చోటులేదు—అది అధికారికమే అన్నంతపనియైనది. దాని వైఫల్యమేగాని అతని వైఫల్యమును చెప్ప వీలులేదు. దానిచే ఆచార్యపురుషులు, సిద్ధులు, యోగులు, మహిమా ప్రదర్శకులు అతనిముందు వెలవెలబోయినారు. అతనికి దారిచ్చినారు. తొలగి నిలుచున్నారు. ఆతని కానాటి వారెల్లరునులొచ్చె. అతనికే పూజా పురస్కారయోగము పట్టినంతస్థితి కలిగినది. అతనినే ఒక యోగిమహారాజుగా నిలిపి చాటించుననుసరణములు, భక్తిఅభి మానములు తలెత్తినవి. అతని నేకొండమీదనో, ఏ కోనలలలోనో కూర్చుండబెట్టి పూజావేదిక ఏర్పరుపజూచినారు.

> వేమననగయోగి వెలసె లోకములోన, పూజలిడుడు పుణ్యపురుషులార
> పూజలిడినయంత భుక్తిముక్తులువచ్చు.... .... ....
> గంగనీటికన్న గయతీర్థములకన్న నెన్నవేమ తీర్థమెచ్చువేమ!!

అని అతనిగూర్చి కూర్చిచెప్పిచాటించువారు కలిగినారు. బ్రాహ్మణులే అతని ననుసరించువారు కలిగినారు. కాని తన్నుతాను వెర్రివేమనగానే చెప్పుకొన్నాడు. ఒక్కచో గూర్చుండి ఒకగురుపీఠమును స్థాపించుటకు నిరాకరించినాడు. ఊపిరున్నంత వరకు తిరుగాడినాడు.

వేమడిట్లుజెప్పు వివరపు వాక్యముల్ వేమడిట్లుపోవు వెర్రిపోక
పామరులకునెల్ల ప్రతిపక్షమైయుండు పండితులకు నెల్లవరము వేమ॥

గోచికూడ లేకుండగనే – ఏ అవధూతలొద్దనో ఏ శివయోగులొద్దనో లజ్జా త్యాగములో భాగముగా, చివరిత్యాగముగా గోచిపేలికనుకూడ విడచి దిసమొల కలవాటుపడినవాడట్లే – వారివలె జనసంచారమునకు తొలగి దూరముగా మాటుకొని యుండిపోక – కావలెనని తన పరమశివావతారముతో ఊరుపల్లె ప్రవేశించి, ప్రజల నుద్దేశించి ప్రబోధించు ప్రవక్తగా గాలివలెవచ్చి గాలివలె పోవువాడైనాడు.

అట్టిచోనతనిని తొలుతజనులు కోతికొండముచ్చునువలె ఆటాడించి, గేలి చేసి, యీసడించి, వెంటబెట్టి ఊరుదాటించిన ఘటనలుండినవి.

గోచియూడెనంచు కోతియాటాడించి వెర్రియోగి నూరువెడలుమంద్రు
ఎవరి గోచులూడవీ ప్రొద్దుకుంకిన.... .... ....

వానినెల్ల తట్టుకొన్నాడు. తట్టుకొని జనులకేదో చెప్పవలెననుకొన్నాడు. ఒక్క తత్త్వమేగాదు. జన జీవితవిధానమునుగూర్చి – ఐహిక జీవితరీతినిగూర్చి– సాంఘిక ప్రవక్తగా, ఆర్థిక ప్రవక్తగా, నీతిప్రవచనకారుడుగా జనులకు ఉపదేశించ వలసిన భారమేదో తనమూపులందున్నదని, ఇతరులెల్లరు గుప్తవిద్యగా ఒకరకమైన కానరాని అంగడి అమ్మకముగావించిన వేదాంతసారమును ఉర్వివారికెల్ల ఊరక విప్పి చెప్పవలెనని ఉద్యమించినాడు.

విషయములుడిగి సాధనయందు పండి, పరిణతుడై, జ్ఞానియై దిగంబరియై ప్రవక్తగా ప్రజల ఎదుట కాతడు వెలువడుసరికి అతనిలో కులనిర్మూలనము ఒక మత దీక్షగామారి మెండై చండరూపమెత్తినది. కాగా ఆర్థిక వ్యత్యాస నిర్మూలనము మాత్రము చల్లారి ప్రబోధముగా గౌరవ గణ్యతలకెక్కినది.

కుల నిర్మూలమునకై సహపంక్తి భోజనమును దాటి ఏకపాత్రభుక్తినిబం ధించి "ఉర్వివారికెల్ల ఒక్కకంచముబెట్టి పొత్తుకుడిపి కులముపొలియజేసి తలను చేయిబెట్టి తగనమ్మజెప్పు' నొకమతదీక్షనేర్పరచి ఎంగిలితిండికేవగింపరావనుమతము

నుపదేశింపసాగినాడు. అతని ఉపన్యాసమంతయు - బోధ అంతయు ప్రజలకు సమ్మతమే, ఒక్క ఎంగిలిబోధ భాగముదప్ప. అట్లని అతడు గుర్తించినాడు. గుర్తించి చెప్పుకొన్నాడు.

"ఎంగిలంతవట్టు హితవుగా నెంచక, ఒగ్గియుందురంత నుర్విజనులు" అని తాను గమనించికూడ అది విరమించుకోలేదు. కన్నఎంగిలికిని కనులెంగిలెక్కువౌ.... అని ఉపహాసముజేసినాడు. ప్రజలకది సమ్మతము గాకపోవుటే తప్పనుకొని మరింత వాదనచేసి ఉద్బోధ గావించినాడు.

అతని అర్థికోద్యమము ప్రబోధముగా ఆత్మసంస్కారకముగా మారినది. కర్మవాద, పునర్జన్మ వాదములను దానధర్మ ప్రబోధముతో జోడించినాడు. పెట్టి పుట్టితివి; పుట్టి పెట్టుము. ఉత్తరజన్మమునమరల కలవానివై పుట్టుటకు ధర్మమేదారి- మరువకుము అనిపరార్థమును స్వార్థముగా కలిపి చెప్పినాడు. అడిగినచో పెట్టక పోతివేని ముందుజన్మలో నీకును పెట్టువారుండరు. బలవంతముగా తప్పక పోయినట్లు పెట్టితివేని నీకునంతే బలిమినిదొరకును అన్నట్లు భయము కలిగింప జెప్పినాడు. దానయాచన ప్రకరణమనితర సాధ్యముగా పల్కినాడు. "ఇరుగుపొరుగువాని కెనయుసంపదజూచి, తనకు లేదటన్న ధర్మమేమి, ధర్మమన్న తొల్లి తన్నుకుచచ్చిర'ని తన ఉద్యమ పరిణామమునుచూపించి అసూయా ద్వేష ఘర్షణములులేని ప్రబోధమునెన్నుకొన్నాడు. కలిమిలేములు రెండును మానవత్వమునకు అపాయమని రెండింటికి నడిమి స్థితియే మంచిదని, ఆర్థిక మాధ్యమక సిద్ధాంతమును- కలవారి. లేనివారినడుమ మనువు వియ్యములు కావించుకోమనిచూపి, వివాహమును సంఘమునందలి ఆర్థిక పునర్వ్యవస్థీకరణకు ఉపకరణముగా వివేచించి, గ్రహించి పూర్ణమైనబోధగా ఆర్థికసంస్కారకత్వము నెరపినాడు. "అన్యులకును వచ్చునాపద తనదిగానెన్నువాడు భువినినున్నవాడు" అన్నది తన ఉపదేశ సారమేగాదు తన జీవితాచరణముగా జూపినవాడు. జీవితములో, తత్త్వములో, దాని సాధనలో అంత ప్రయోగముచేసిన మహాపురుషుడింకొకడు అతని తర్వాత చరిత్రలో లేడని చెప్పవచ్చును.

అట్టియాతడు దీర్ఘజీవియై కడకు పామూరు గుహలోనే సమాధినిష్ఠుడైనాడో, కడపమండలము చిట్వేలుకు దగ్గరగా చింతపల్లిలో సమాధిచేయబడినాడో మరొక తావున గతించినాడోగాని ఆంధ్రులనిండుగుండెలలో అజరామరుడై నిలిచి పోయినాడు. ఇక ప్రపంచము నలుగడల ఎల్లమానవుల గుండెల కెక్కవలసి యున్నాడు.

# పోలికలేని ప్రజ్ఞ

వేమన భావభాండారము బీగముదీసి, సొచ్చిశోధించి, అందలివస్తు జాతము నంతను గుర్తించి, జాబితావేసి, దేనికిదానికిగా వెలకట్టి, అన్నింటి వెలలువెరశి అతడింత ధనవంతుడని మదింపు ఒకటి ఒకపాటిగా ఒక కొలికికిరాక, తేక అలస్య మగుచుండగా — వేమనను వలువురింటిలో వారితోను, ఇరుగుపొరుగు వారితోను, దూరదూరములవారితోను పోలికజేసి చెప్పసాగించినారు. ఎప్పటినుండియో చెప్పు చున్నారు. మన పొరుగువారే ఇందు మనకన్న ముందున్నారు. మనలో గడుసరి పండితులు కొందరు ఏగంటివారితోను, ఇటీవల వేమననుఅచ్చువేయించిన ఒకముత్యాల నారసింహయోగి యనువానితోగూడ కడకు పోలికబెట్టుట ఉచితమనుకొన్నవారు అనుకొని అట్లేచేయగా, దక్షిణభారత పటముపై నాయనను నిలుపుటకుగాను బలవంతపుపోలికలు తెచ్చి చూపించుటకు దిగినవారు దిగినారు. బలవంతపు పోలిక లనగా తమిళుల తిరువళ్ళువరు, అవ్వయ్యారు, అరుణగిరి—మహారాష్ట్రుల తుకారాము లతో తెచ్చిన పోలికలని తాత్పర్యము. వల్లువరు వేమనలొక రాశివారు — ఒక ధోరణి వారు — ఒక కోవలోనివారు — అసలు కానేకారు. అర్థవంతములు ప్రబలములు ప్రధానములైన పోలికలు వారిద్దరకు శూన్యము. వారివారి ప్రత్యేకతలు సరిపోలునవి కావు. ఎవరిధోరణివారిది, ఎవరిగొప్పవారిది. అంతే. కాని విశ్వవిద్యాలయముల పరిశోధ నలోకూడ వల్లువరు వేమనల సాదృశ్యము బలత్కారముగా సాగిపోవుచున్నది. దుర దృష్టము. తక్కినవారితోపోలికమాటచెప్పనక్కరలేదు. నిజమైన సహజమైన నిండైన పోలిక కర్నాటక సర్వజ్ఞమూర్తితోనేయని చెప్పవలసియున్నది. ఆపోలిక పర్వమేదో కర్నాటక జానపదులే చెప్పుకొన్నారు. 'సర్వజ్ఞ వేమన సంవాదము'అను గాథొకటి సృష్టించుకొన్నారు.

దక్షిణ భారతరంగము మీదికి వేమనను దెచ్చు పాట్లిట్లుండగా, ఇంతలో తెలుగుదేశమున హిందీపరిచయము పాండిత్యము పెరిగి పెంపొందుటతో వేమన కబీరు చాయవాడని హిందీలో వ్రాయసాగినారు. పరిశోధక పట్టములు పొందగలిగినారు. కబీరు వేమనలకు ప్రధాన ధోరణులలో పోలికలు నిజముగానున్నవి. స్థూలదృష్టికే అవి తగులుచుండును. కబీరు ననుసరించిన ఇతర ఔత్తరాహులతో భావ సారూప్య మున్నది. అదెంత జేసినారో తెలియదు.

అపైన భారతీయ సంస్కృతి పరిశోధక వ్యాఖ్యాతలు ఆ సంస్కృతిలో వివిధ భాషాప్రాంతముల భాగస్వామ్యము నజదీసికొని, పాళ్ళు నిర్ణయించి అంగ్లమున వ్రాసిన నవీనద్రష్టలు ఉన్నారు. వారి రచనలవలన వేమన పేరు అఖిలభారత పట్టికలకెక్కి ప్రచారము గడించుకొన్నది. ఆ ఆచార్య వ్యాఖ్యాతలు వారుగా వేమనను అనువాదములో చదువుకొనితమంత సొంతముగా అభిప్రాయమేర్పరచుకొన్నారేగాని, వారు చదువుటకు ఉన్నంతలో మనమదింపులు వారిముందు లేకపోయినవి. అయినను వారివారి పరిమితులలో వారుచేయగలది చేసినారు. చేసినవారు కొందరు మనవారికన్న

మిగిలి వేమన్నను మన్నన చేసినారుకూడ. ఇదిగో, ఆచార్య వినయకుమార్ సర్కారుమాట.

'His (Vemana's) place in Hindu Positivism is of the same rank as that of Kabir, Chaitanya and others, if not even higher'
(Positive Background of Hindu Sociology)

ఇంత వ్రాసినప్పటికిని – ఇవి చెదురుమదురు వ్రాతలేయని చెప్పవలసినప్పటికిని – వేమనలోతు వారి రచనలలో ఆకళింతకాలేదని చెప్పకతప్పదు.

భక్తి ఉద్యమమొకటి మధ్యయుగ భారతములో తలయెత్తినదని, అది పలుభాషా ప్రాంతములలో భిన్నశతాబ్దములలో వ్యక్తమైనదని, అదొక మార్మిక విప్లవమని (Mystic Revolution), దైవమును మతమును మతానుభవమును ప్రజలపర మొనర్చినదని, కులముపై తిరుగబడినదని, దైవము ముందు అందరను సమానులను జేసినదని, అది (Bhakti Egalitarianism) అని, సాంఘిక ఆర్థిక వ్యవస్థలో మార్పురాని, రాజాలని పరిస్థితులలో అది ఛాయా విప్లవమని (Mirror Revolution in the absence of a fundamental change of the Indian Social Economy.) తీర్మానము జేసిన ధూర్జటిప్రసాద్ రచనలున్నవి. వశ్నువరునుకూడ ఈ మార్మికులలో, భక్తులలోచేర్చి మధ్యయుగము మాటెత్తువారున్నారు: బసవన్న, జ్ఞానదేవ్, నామదేవ్, తుకారామ్, రామానంద్, కబీరు, దాదూ, నానక్, లాల్‌దాస్, రాయ్‌దాస్ చైతన్యులను వీరు పట్టికచేసిచూపుచున్నారు. ఆ జాబితా చివర వేమనపేరు మనేముగా చేర్చుటకో, జాబితానడుమ వారిసరసన ఎక్కడనోచేర్చి, వారుచేసిన మదింపుతో మనమేకీభవించుటకో మనముపరిమితము కారాదనుకొందును. కబీరు చాయలోవాడు వేమనయనుచోగూడ ఆ కబీరును మనముగా మదింపుచేయవలసియుండును. అంతపని యిప్పుడిందు తలపెట్టకుండగానే, ఉత్తరాదివారు, తదితరులు వారివారి భక్తసంస్కర్తలనుగూర్చి యిచ్చిన వివరణలను మదింపులను బట్టియే, వేమనను వారిపాటివానిగనో, దిగువాయివానిగనో ఆయా జాబితాలందు ఆయా ఉద్యమముల చట్రములలోపల బిగించుటను ఇంచుక పరిశీలించెదము.

కబీరులోగాని, ఇంకితర మార్మికులు భక్తులు మరెవ్వరిలోగాని మనుష్య జీవితపు ప్రాథమిక విషయమైన ఆర్థికవిచారకోణము వేయి దివిటీలువేసి వెదకినను కానరాదని– అది వేమన యొక్కనియందే కానవచ్చునని ముందే గ్రహింపవలసి యున్నది.

వీరికి సాంఘిక 'తిరుగుబాటుదారు'లని [Social Rebels] నవీనులిప్పుడు నామకరణము జేసినంతమాత్రాన వీరేదో అనేకానేక అగాధసాంఘికసమస్యా విచారకులని అనుకోనక్కరలేదు. వీరి "సాంఘిక తిరుగుబాటు" అన్నది కులవ్యవస్థను కూలద్రోయుటకును, ఇంతకుమిగిలి హిందూఇసాంసామరస్య సమానతలను చెప్పుటకునుపరి

మితమేగాని, మరేయితరమైన సంఘ సమస్యా వివేచనము, పరిష్కారమును వీరివద్ద అనవాలునకైననులేదు.

హిందూ-ఇస్లాం సామరస్య సమన్వయ సహనములన్న విషయమెట్లును మత విషయమే. ఇక కులసమస్య స్వచ్ఛముగా నూటికినూరుపాళ్ళు సాంఘిక సంగతికాదని చెప్పవలసియున్నది. మధ్యయుగమందది మరిమరియు మతము పాలెక్కువగా గలసంగతి. అధ్యాత్మ తత్వమునుండి మతాచార విశ్వాస కర్మకాండలనుండి భారతదేశ కులవర్ణవ్యవస్థకు పునాదులు గట్టి పదిలమైయుండినదిగదా! కన్యాశుల్కము వలె స్త్రీ పునర్వివాహమువలె, వేశ్యావ్యవస్థవలె, బాల్యవివాహమువలె, స్త్రీవిద్యవలె కులసమస్య ఒక్కసాంఘిక సమస్యమాత్రమేకాదు. ఇంతకును చెప్పవచ్చినదేమనగా, వీరిని సాంఘిక తిరుబాటుదార్లనిపించిన సమస్యలు భక్తి ఉద్యమములలో మత పరిధిలోనివిగాకుండ సాంఘికములుగా విడబడినవికావనుటే.

ఆమాట యట్లుంటగా, కులసమస్యనైనను కూలంకషముగా నలుకోణములనుండి వేమన చర్చించినంత సూక్ష్మాతి సూక్ష్మముగ వీరెవ్వరును చర్చించి యెరుగరన్న నివ్వెరపోనక్కరలేదు. ఆహారనియమములను నిషేధములనుబట్టి, అనులోమ విలోమ వివాహముల స్థితినిబట్టి,కామాతిరేక విషయములనుబట్టి, ఆచారవిశ్వాసములనుబట్టి వేమన జేసిన కులవత్యాస విచారములోతులు వైశాల్యమునువీరివద్దలభించవు. ఇందేఆవిషయమై యిచ్చిన పాటియును వారెవ్వరికన్న వేమనఎంతో సునిశితవీక్షగలవాడని రూఢిజేయజాలి యుండును. ఆపైన ఈడుజోడుగాని పెళ్ళిళ్ళువద్దని,పెళ్ళికిదరిసమ్మతి ప్రేమయుండవలె నని, యుక్తవయస్సు సంకల్పములేని పెళ్ళిళ్ళనుగాదని, వడుపువృత్తిలో జొనుపరాదని హత్యా మరణశిక్షల మాటలోను, మానవునిలో ఆకలికిపైన మానాభిమానములమాట, మనుష్యుని వ్యక్తిత్వముమాట, వావివరుసలు నీతినియమములు దైవనిర్ణయములు గాక మనుష్యులేర్పరచుకొన్నవను మాటవరకు గల సాంఘిక సమస్యలను గూర్చి అతని వివేచనము వంటిది వీరెవ్వరి యందును లేరు.

జ్ఞానదేవ చైతన్యులు తత్త్వవ్యాఖ్యాతలు, తత్త్వశాఖాసంప్రదాయ ప్రవర్తకులును గావచ్చును. సహజశూన్యత వరకును కబీరు చేరుకోవచ్చును. తక్కుంగల వారెంధరో అతని శూనీసహజ నుచ్చరింపవచ్చును. కాని వేమన ఎరుకకెక్కినన్ని, సాధన చేసినన్ని తత్త్వసిద్ధాంతములు శిక్షణలు వారెవ్వరునెరుగరని మాత్రము విన్న వించవలసియున్నది. కబీరిందులో విగ్రహములను విసరివేయించి రామనామజపమొక దానిని విధించి, తనరాముడు అయోధ్యారాముడు, రాజారాముడు, నరరూపరాముడు కానేకాదని - ఆత్మారాముడని, సహజశూన్యతకు కేవలము సంకేతమాత్రుడని ఇంకను మతములవారి బాహ్యాచారమైన నామరూప సంకేతశకలములను పట్టుకొని ప్రేలాడుచుండగా, వ్యవస్థాగతమైన మతముతో నిమిత్తములేని ఆధ్యాత్మికతను మతముల బాహ్యసంజ్ఞావశేష నిశ్శేషముగా పరిణతుడైన తార్కికావధి వేమన.

ఇంత కలిగిన వేమనను యోచనాపరుడు (Thinker) అని అనుటకు వెనుకాడ వలసినదేమున్నది? కాని ఒకందుకు ఉండవచ్చునేమో? నవీనార్థమున యోచనా పరుడు కార్యశీలి కాకపోయినచేత, అట్టిదోషమంటుకోకూడదను జాగరూకతచేత వెనుకాటమేగాని, యోచనాపరుడతడు కాకపోయినప్పుడు మరెవ్వరు కాగలరు? వేమన ఆర్థిక పునర్వ్యవస్థీకరణ మొదలు తత్త్వపారమ్యమువరకు చింతనతోపాటు ఆచరణ శాలి.

ఇక నాతనినొక ప్రవక్తయందుమా? ప్రవక్తయనువాడు, ఉన్నపరిస్థితితో తృప్తిపడక, అందు లోపమని తాననుకొన్నదానిని దిద్దుటకొక పరిష్కారమును చెప్పి, దాని సాధనకై ప్రచారము ప్రయత్నము చేయుననన్నంతవరకు వేమన ప్రవక్తయే. కాని తన పరిష్కారమే పరిష్కారము, ఆ పైన మరొకమాట లేదను నిర్ధారణాబుద్ధి, అసహనము ప్రవక్తల సొత్తుగానున్నది. వారు పరిమిత విచారకులు. విచారమునిక కట్టిపెట్టి కార్యరంగమున దిగినవారు. దిగినపిమ్మట వారిదిక మూసిన మనస్సు. ఇకనది తెరచుకోదు. వేమనదట్టి మూసిన మనస్సుగాదు. అందుకే అతని యందంత పరిణామ వికాసములున్నవి. ప్రయోగమాతని ఊపిరి. మతరాహిత్యము ఒక విధముగా అతనిలో పిడివాదరాహిత్యము. నమ్మినమ్మకుంట నయమెల్లకద్దురా? అన్నదతనిమాట.

తాత్త్వికునిగా (Philosopher) మాత్రము జెప్పుకొన్నచో భారతీయ తాత్త్వికునకున్న కీర్తినిబట్టికేవలము పరమునన్వేషించుచు ఇహమునలక్ష్యము జేసిన వానిగా లోకజీవనరీతుల చింతలేనివానిగా జెప్పినట్లుకాకపోయినదేని, ప్రాపంచిక జీవిత మునుమార్చుటే తాత్త్వికుని సమస్యయని తెలిసిన తాత్త్వికుడనవలసియున్నది.

సాంఘికజీవనమున ఐహికతత్త్వమును (Secularist) పూర్వ భారతమున తొట్టతొలుతను తుట్టతుదకును జెప్పిన ఏకైకమహాపురుషునిగా చూపుదమన్నచో భౌతికవాదినిగావించినట్లు అపార్థమురాకున్నచో, ఐహికతత్త్వమును జెప్పుటకు ఆధ్యాత్మికత అడ్డుగాకపోయినచో (కాదు-పశ్చిమదేశములలోకాలేదు; అమెరికా సెక్యులర్ రాజ్యాంగమే ఆధ్యాత్మికులిచ్చినది. కడపటికి మనమహాత్మ గాంధీయే రాజ్యవ్యవహారములో, రాజకీయములలో మతమువదన్నాడు. మతము వ్యక్తిగత మన్నాడు.*) వేమన నట్టివానిగా జెప్పుటకు సంకోచములేదు.

కవిగా నాతనికీర్తికేతనము నెగురవేయుదమన్నచో కవిత కేవలము అలౌకికానందానుభవ నిషానెదోసమకూర్చునదని కాకుండ, తేజస్వంతము చేతనామయమునైన విశిష్టానందముతో ఆలోచనామృతమగునదన్నచే అతనిని కవిశబ్దవాచ్యునిగావింప వచ్చును.

---

*ఐహిక తత్వము-గాంధీజీ దృక్పథం రచయిత రేడియో ప్రసంగము (20-1-1970)

అతడిక తిరుగుబాటుదారని (Rebel) తీర్మానించెదమన్నచో, ఉన్నవ్యవస్థ పై నెంతో అతడు నిజముగా విరుచుకొని పడినను, అక్షరాల తిరుగుబాటే చేసినను, ప్రత్యామ్నాయ ప్రతిపాదనము లేనివానిగా అర్థము అనర్థము అంటుకొనునను శంక చేత కాదనవలసి యున్నది.

అతడు సంస్కర్తయా-విప్లవ కర్తయా యన్నచో విప్లవ కర్తయనియే అసందిగ్ధముగా చెప్పవలసియున్నది. కాని మరో ప్రపంచ రూపకల్పన (UTOPIA) జేసినవాడుగాడు. మరోప్రపంచ రూపకల్పన భారతీయ సంస్కృతిలోనేలేదు, స్వర్గ రాజ్యము బంగారుకాలము భారతదేశమున గతమందేగాని భవిష్యవిషయముగాదు. యూరపులో ప్లేటో మొదలు మార్క్సు వరకు మరో ప్రపంచ రూప శిల్పకులే. అట్టిస్వాప్నికుడు కాకుండ జీవితయాథార్థ్యమును వ్యక్తులు, సంఘముఎట్లు నిరంతరము మలచవలెనో చెప్పినవాడు.

నాస్తికుడని చెప్పుదమన్నచో భౌతికవాదియే అని అనుకొందురనియే గాని వేదప్రామాణ్యము నంగీకరింపనివాడు (నాస్తికోవేద నిందకః) త్రిమూర్తుల వంటి ఈశ్వర తత్వమును కాదన్నవాడు, శంకరాదుల చైతన్య స్వరూపమైన బ్రహ్మము దాటినవాడును అగుటచే భారతీయ సాంప్రదాయమునఅభ్యంతరము లేదు.

హేతువాది (Rationalist) యని చెప్పినచో మార్మికానుభవమును తిరస్కరించినట్లు కాకపోయినచో, భౌతికవాదులు కానివారు, ఆధ్యాత్మికులైనవారు కూడ ప్రశస్తమైన ప్రచండమైన హేతువాదులు కాగలరని ఒప్పుకొందురేని, అతడు నిస్సంకోచముగా హేతువాది. అట్టి అవకాశమున కితడొక ప్రబలోదాహరణము.

మానవతావాదియని నిర్వచించ దలచితిమేని దానికున్న అతి నవీనార్థమున కున్న అన్ని కోణములును అతనియందున్నవని తిరుగులేకుండ చెప్పుకోవచ్చును.

ఆ యా అపార్థములు కలుగకుండ అయా పేర్లన్నియు అన్వయించు మహా పురుషుడతడు. నార్లవారన్నట్లు అతనిది నిజమైన అరుదైన ప్రజ్ఞ (TRUE AND RARE GENIUS) అసలిన్నికోణములుగల ప్రజ్ఞ లేదేమో! లేకపోయి నచో అదొక పోలికలేని ప్రజ్ఞ.

వేమననుగూర్చి పాశ్చాత్యుల రచనలన్నింటిని శ్రమపడి సేకరించి వెలుగు లోనికి దెచ్చిన నార్లవారు బయటి ప్రపంచమునకు చూపి, చెప్పదగిన పూర్వకవి తెలుగువారిలో ఒకే ఒక్కడున్నాడు - అతడువేమన (There is, I believe, only one old Telugu poet who could and should be presented to the wider world and he is Vemana) అనియన్న మాట తిరుగులేనిమాట. వేమన తెలుగువారి విశ్వకవి. భారతీయులవిశ్వకవి.

సమాప్తము

# కదిరీపతి శుకసప్తతిలో వేమన

అభినవవినీతివార్తా విభవంబభిరామలీల వినుచున్నతఱిన్ — 1 – 167 ప.

'విపది ధైర్యమథాభ్యుదయేక్షమే' తివార్తా నిపుణస్థితిన్ — 1 – 280 ప.

'జాతి వార్తలు దొలక, రసంబుగులుక కవిత రచియించు' — 111 – 14 ప.

'లంబికావలంబన మహాయోగి చందంబున కొండొకతడవు నిశ్చల ధ్యానపరాయణంబై .... 1 – 160 ప.

'ఒక శూద్రుండభిరామనాముడొక యుద్యోగంబుపై వచ్చి 111 – 578 ప.

దొడ్డ కొంచెమనక 1 – 140

కంచంబు చెంతపిల్లి కరణి

ఎదిరింటి వాకిలి గాచియుండు 11 – 181

బగిసి, బైసిగాండ్రు 111 – 94, 11 – 548

కూపంబునంగల పడుకులూది 11 – 395

పెటుకులు .... .... 11 – 334

తచ్చన .... 111 – 70, 130

మల్లసాల .... .... 11 – 408

పెండ్లియాడిన చాలున్

వరదక్షిణతో నిచ్చెద .... 11 – 150

ఉంకువ నూరుమాడలు .... 11 – 91

పదిమాళ్ళకు గొన్నతొత్తు 111 – 137

తొత్తులకాంక్ష .... 11 – 138

సెట్టితొత్తులకేమో .... 11 – 113

లంజ మందులకుజల్లి IV – 120

యెడ్డెదుప్పటి .... .... 11 – 362

యెడ్డెడు .... .... 1 – 529

యెడ్డెవీకయున్ .... .... 11 , 212

యుగము ద్రుంకినట్లైన 111 – 149

అడుగుతప్పినచో

దప్పు పిడుగటంచు 1 – 32

ఉపము 111 – 141

తామసించె, తామసము 111 – 93

11 – 308, 260

(ఆలస్యమను నర్థమున)

మారులేకగంజి

వోయుదురే 111 – 182

తాళిక 11 – 32

పడుకులు 11 – 395

మాళ్ళు 11 – 406

మంకు 111 – 18

బసివి 111 – 49

తొత్తుపడుచు 1 – 151

తగిన బానిసెలతోడ 1 – 125

11 – 375

తొత్తు, తలారి, బానిసలు, లంజ, ఎడ్డె అన్నమాటలు కడుతరచు.

ఇంతకు కొంత తక్కువగా అయ్యలరాజు నారాయణలోను (హంసవింశతి) గట్టు ప్రభువుతోను (కుచేలోపాఖ్యానము) వేమన పదప్రయోగములున్నవి. వేమన ఆటవెలదులకు తొలి అనుకరణము తెలంగాణములోని పరశురామపంతుల రామమూర్తి పటుగుణాభిరామ పరశురామ యను మకుటముతోగల శతకము – 206 పద్యములు.

# ముఖ్యమైన తప్పులు

| పేజీ | పంక్తి | ఉన్నది | ఉండవలసినది. |
|---|---|---|---|
| III | 16 | 1968 | 1972 (17 జనవరి) |
| III | 26 | 1967 | 1976 |
| XXXI | 8 | ఉదాత్తమర్శకవితాధురీణుడు | ఉదాత్తమర్మకవితాధురీణుడు |
| XXXX | నుండి నలువది నుండి అరువది వరకు రోమన్ అంకెలు తప్పుగాపడినవి. | | |
| lVI | 12 | egarded | regarded |
| lX | 7 | లక్షణిక | లాక్షణిక |
| lXII | శీర్షిక | వేమకాదు | వేమనకాదు |
| lXIX | 23 | 'ఇస్తూవచ్చారు.' అన్న తర్వాత – | D – 1774 నంబరు వ్రాతప్రతిలో బ్రౌన్ (1841) యీ పాఠం యిచ్చారు. అనిచేర్చిచదువుకోవాలి. |
| lXV | 11 | విశ్యవినుతనామ | విశ్వవినుతనామ |
| lXXVI | 21 | మాధ్వ | మధ్వ |
| lXXIX | 18 | సూక్తిముక్తావాణి | సూక్తిముక్తావళి |
| 15 | 18 | వజ్రాయుధము | వజ్రయానము |
| 19 | 5 | దుర్జాతము | దుర్జ్ఞాతము |
| 22 | 27 | విశిష్టాద్వైతము | శక్తివిశిష్టాద్వైతము |
| 23 | 13 | భేదాభేద, విశిష్టాద్వైతములు | భేదాభేద శక్తివిశిష్టాదైత్వములు |
| 48 | 16 | గ్రామాధికారము | రాజాధికారము |
| 68 | 7 | తిరస్కరించుచు | తిరస్కరించు |
| 75 | 9 | కావ్యాలాపః వర్జయేత్ | కావ్యాలాపాంశ్చ వర్జయేత్ |
| 103 | 15 | ఓలికింతై యుండు | ఓకిలింతై యుండు |
| 120 | 10 | రామవేమమరలననుచే కానుప్రాసము | రామవేమలలోమరల ననుప్రాసము. |
| 120 | 14 | రువర్ణా వృత్తి | ఉవర్ణావృత్తి |
| 120 | 16 | మంచి మడుజేయుపు | మంచి మడుపుజేయు |

| | | | |
|---|---|---|---|
| 153 | 9 | యీశ్లోకమునుకర్త | యీశ్లోకము శ్లోకకర్త |
| 160 | 3 | కొద్దికాలము కొండవీటిని | కొద్దికాలము హింపీ నుండియు, మరొకపరి కుతుబ్‌షాలనుండియు (1591-1600) కొండవీటిని |
| 163 | 14 | 1596 | 1592 |
| 182 | 2 | సొగసి తఱిగి | సొగసి తిరిగి లేక చూఱబుచ్చి. |
| 185 | 6 | కొంకణం | కొంకణాః |
| 187 | 20 | విశేషములకు | మరికొన్ని విశేషములకుగూడ యనియీవలకుదెచ్చి చదువుకోవలెను |

*బ్రౌన్ యిచ్చివుంటే, వ్రాతప్రతుల్లో వున్నట్టే. గోపీ యీ ప్రతి చూడలేదా?



# నామపద సూచి


అ

అద్వైతం iv, v, x, xii, xiii, xiv, xvi, xvii, xx, xxiii, xxiv, 3, 7, 8, 10, 11, 12, 14, 20, 21, 22, 23, 26, 28, 30, 33, 75, 77, 78, 95, 99, 102, 105, 106, 107,
అచలము xix, 27, 28, 29, 30, 31, 32, 33, 75, 181.

అచల భూమిక, అచలేశ్వరుడు, అచల పురం అచలయ్య, అచల దేవయ్య 27
అల్లమ ప్రభు, ప్రభుదేవర iv, x, xi, xvi, xxi, xxii, 17, 22, 23, 24, 27, 28 29, 32, 184

అల్లయ్య 23
అజాతవాదము 29, 68
అద్వయము 21, 24, 28, 29
అద్వయవాది 24
అన్నపూర్ణాదేవి 38, 39
అపశూద్రాధికరణము 93
అరవిందుడు III
అలరాజు 4
అలంపురం 180, 183
అకాలవర్షుడు 186
అక్కమహాదేవి 24, 25, 184
అక్బరు 158, 187
అభిధాన చింతామణి 188
అభినవుడు 110, 124, 126
అఘోరఘంటుడు 183
అరుణగిరినాధుడు 193
అప్పకవి 119, 202, 203
అంబేద్కర్ 5
అయిన్‌స్టీన్ 70, 72
అయ్యలరాజు నారాయణ 178, 214
అహమ్మదనగర్ 185
అబ్దుల్ వాహబ్ 182
అబ్దుల్ మహమ్మద్ 182
అనవేమారెడ్డి 166
అనంతపురం 157, 159, 180
అనంతామాత్యుడు 178

ఆ

ఆంధ్రపత్రిక xii, 170
ఆదోని 159
ఆలూరు 159
ఆలమూరు 157
ఆజీవికము 44
ఆర్యదేవుడు xxxxix
ఆర్కిమెడీస్ 131
ఆరుద్ర xxxxvi. xxxxvii. 47. 153, 155. 174

ఇ

ఇందపూర్ 157
ఇమ్మడి వెంకటపతి రాయలు 156, 158
ఇమ్మడి దేవరాయలు 55, 159
ఇబ్రహీం కులీకుతుబ్‌షా 182

ఈ

ఈస్టిండియా కంపెనీ xxxxxvii
ఈశ్వర తోపం xxxxvii

ఉ

ఉన్నవ లక్ష్మీనారాయణ, మాలపల్లి xxxxiii, xxxxiv, xxxxv, 37, 38
ఉజ్జయిని 183
ఉజ్జేణి పాండ్యుడు 187
ఉడిపి 183
ఉగ్రనరసింహస్వామి 187
ఉదయగిరి 175, 181
ఉమాకాంతం 173
ఎడ్డెరెడ్డి 174, 176
ఎలక్ట్రో ఎన్‌సిఫలోగ్రామ్ 73
ఎల్లెస్లి 76

ఏ

ఏకోజీ 157
ఏకపాత్రభుక్తి 4, 207
ఏలూరి శేషయ్య 202

ఒ

ఒడ్డెరులు 165
ఓవెన్ xxxxxvii

ఔ

ఔరంగజేబు xxvii, 159, 187

క

కమియా, జె. 75
కంకంటి పాపరాజు 114, 115
కందుకూరి వీరేశలింగం lxxiv, lxxv 53, 54, 110
కంసాలి బత్తుడు 101
కాంప్ బెల్, డబ్ల్యు. హెచ్. xi, xxxii. 96, 168
కాంట్, ఇమ్మాన్యుయల్ 81
కోలారు 157, 159, 184
కాలనుపాక 24
కాల్విన్ 81
కాలా ముఖము 3
కాలికట్ 185
కళ్యాణి 23
కళ్యాణ కటకము 4
కాళహస్తి 157
కాళిదాసు 126 193
కాళీచాముండుడు 186
కోట్రెడ్డి 136
కమ్మ 179, 180
కమ్యూనిజం xxxxiii
కబీరు xx, 12, 13, 14, 15, 16, 71, 100
కట్టగోసి 186
కర్నూలు xxvi, 156, 157, 158, 163
కడప 156, 157, 158, 159, 163
కన్నెగ బ్రహ్మయ్య xiv, xxxxiv, xxxxv, 36
కవి చౌడప్ప 1, 188
కర్నాటక్ క్రోనాలజీ 180, 185,
కందుకూరు 162, 175
కందుకూరి వీరేశలింగం lxxiv
కదిరి, ఖాద్రి, xxv, 32, 170, 171
కటారుపల్లె v, xxv, xxvi, xxix, 32, 95, 170, 171
కాపు కులము 177, 179, 180
కాపాలికము 3, 10, 11, 180, 182, 183

కొటయ వేమారెడ్డి 162
కుంభమేళా—26
కొమరాజు xii
కుమారగిరి 162, 191
కొమ్మరాజు 4
కొల్లా వెంకయ్య lxxiii lxxiv
కొంకణము 183, 184
కొంకణ మహాధికారాయలు 185
కొమ్మారెడ్డి 180
కొండవీడు xxv,156, 159, 160,161, 163, 164, 166, 167, 169, 173
కోస్లరు, ఆర్థర్ xxxxxix , 72, 77, 131
కోపర్నికస్ xxxxxix
కోమటి వెంకారెడ్డి 173
కోట సింగరాజు 39
కీట్సు 72
కృష్ణదేవరాయలు 160, 161, 162,
కృష్ణపాముడు 16
కృష్ణదేశికుడు, భాగవతుల27,
కృష్ణారావు, జి.వి. I, xi, xii, xvii, 144
కృష్ణశాస్త్రి —lxvi
క్రిష్టిపాడు 165
క్రీస్తు, క్రైస్తవము 81, 82, 83, 86, 91, 156, 157, 163

## గ

గరిమెళ్ల గంగరాజు xxxxiv
గట్టు ప్రభువు xxxxx, 214
గజపతులు 163, 165
గండికోట xxv, xxix, 158, 165, 180, 181,
గంగమాంబ 39
గవ్వ నాణెములు 168
గాంధీ III, xxi, 212
గ్రియర్సన్ xxviii
గుత్తి 159
గుణరత్నుడు 182
గురజాడ అప్పారావు xxxxxi, lxxiv 53. 54, 55, 56
గుంటూరు xxvi
గుండేరి 186
గుంటుపల్లి ముత్తమంత్రి xxv,xx ix, xxxi, 39, 156, 159, 160, 163,
గూడూరు 156
గెలీలియో xxxxxix, 70
గొబ్బూరి గిరియప్ప 202
గొల్లలు 180
గోపాల్, యన్. ఎ. 8,38, 39, 41, 42, 43, 45, 47, 49, 53, 54, 56, 63, 66, 67, 80, 81, 85, 86, 102, 153
గోరాజ వేమాహ్వయా 178
గోపి, యన్. xxxxvi, xxxxxiii
గో.నాధ కవిరాజు 24
గోకర్ణము 183
గోవా 183
గోమంతకము 183
గోదావరి xxv, 180, 181
గోల్కొండ 156, 157, 158, 159
గోరక్షుడు 17
గౌతముడు xxxvii
గౌడపాముడు 95, 106
గౌరన 16, 202
గ్రిబుల్, జె. డి. బి. 168

## చ

చండరోశనుడు 29
చంద్రగిరి 156, 157, 158, 174, 175, 180
చలసాని ప్రసాదు 1 xxiii
చతుర్వ్యూహ్మ విహారములు 29
చార్వాక 9, 44, 65, 182, 186
చారుదత్తుడు xxxv
చాకన్ 157
చిదంబరము 157
చిలకమర్తి xii
చిచ్వేలు 165, 208
చిత్తూరు 157,
చిక్కబళ్ళాపురము 157
చింతపల్లె 169, 208
చుండి 179
చెన్నకేశవాలయము 169, 170, 171
బెలిదేవ వేమనారాధ్యుడు xxvii
చేమకూర వేంకటకవి v, 114, 121
చైతన్యుడు 71, 210, 211
చౌదరితనము 179, 180
చౌపది 178

## ఛ

ఛాయా విప్లవము 210

## జ

జంగము ix, x, xiii, xv, 12. 36 164
జమ్మలమడుగు 168
జాగరగల్లు సుబ్బారాయుడు 169
జిజియాపన్ను 187
జింజి 157, చెంజి 163
జూలూరి అప్పయ్య xxxvii
జెన్ – 77.
జేమ్సు, జాయిస్ 128
జోన్సు, విలియమ్ ix, x
జోరాష్ట్రులు 187.
జ్యోతిషం xxxxxx, 66
జైనము 10,14,24,25,26,27,44,100, 162, 187

## ట

టావో 3
టేకుమళ్ళ కామేశ్వరరావు xxxxii

## డ

డెమొక్రిటస్ x, xxxxxviii
డ్రైడెన్ 144

## త

తంజావూరు xxiv, 157
తల్లికోట, రాక్షసి తంగడి 156, 159,
తమిళదేశము 188
తాతాచార్యులు 161
తాళ్ళపాక అన్నమయ్య 162
తానీషా 163
తాడిపత్రి 159
తాపీ ధర్మారావు 116
తిక్కన 7, 111, 124
తిరుమంగై అళ్వారు xiv, xxxxiv, xxxxv, 36
తిరుపతి 157, 180
తిరుపతి వెంకటకవులు xxv
తిరువళ్ళువరు 1, 209
త్రిపురనేని రామస్వామి 60, lxxxiii.
త్రిపురనేని మధుసూదనరావు xxxxxvii

త్రిపురాంతకము 182. 183
తుక్కారము 202
తుంగ చెన్నరాయుడు 172
తుంగ పుల్లారెడ్డి xxx, 172
తుంగవంశము 171
తెనాలి రామకృష్ణుడు iv, 27, 203
తెలంగాణా 181
తోటకూర ఘంటయ్య 38

ద

దండి 154,lxxxv,lxxxvi
దక్షాధ్వరం xxxxx
దత్తాత్రేయ సంప్రదాయము 33
దయానందుడు 92
దశభూమికలు 27
దామా 16, 71, దాదుపంథీలు 187
దిగంబరజైనము 26
దిఙ్నాగుడు 106
దినమొల యోగము 182
దుగరాజుపట్నము 156
దుబాయి, అబే 1, 166, 177
దేవరవేము 178
దేహాత్మవాదులు 186
దేశింగురాజు 163
దేవరగిరి 181
ద్వాదశాక్షరి 29
ద్విపద వేమన తాళపత్ర గంథము xxv, xxx 168, 169, 171
దృష్టి సృష్టివాదము 106
ధనవత్తత xxxxxii
ధర్మవరము 157, 159
ధర్మకన్నాలు xxxxiii, xxxxiv
ధూర్జటి lxi, 199,140
ధూర్జటి ప్రసాద్ 210
థియరీ ఆఫ్ సర్ప్లస్ వ్యాల్యూxxxxxiv

న

నక్సలిజం xxxxiii
నవబ్రహ్మాలయము 183
నరసింహ దేవరాయలు 162
నంద్యాల 158
నంది దుర్గము 181, 184, 187
నాగపట్టణము 36
నాగలింగ శివయోగి lxx
నాగార్జునుడు I, vi, vii, xxi, 10, 15, 16, 18, 21, 24, 28, 29, 30, 32, 33, 43, 68, 89, 150, 151,
నాథ-సిద్ధులు, మతము 10, 16, 17, 100
నారాయణపురము 27, 181
నార్ల వెంకటేశ్వరరావు II, xii xxxiii, xxxiv, 143, 144, 213
నార్సిస్టిక్ సెక్ 86,
నాస్తికత్వం xxxxvi, xxxxxx, 213
నాస్తికయోగి 68, 69
నిజాం అసఫ్ జాహీ 156, 157, 158 163
నిరీశ్వరసాంఖ్యము 68
నెల్లూరి హనుమంతు xxxxiv,
నెల్లూరు xxvi, 157
నేదునూరి III, 8, 9, 16, 40, 42, 44, 52, 53, 54, 56,-58, 59, 60, 63, 64, 65, 66, 78, 79, 80, 85, 89, 93, 94, 96, 99, 150, 151, 153, 161
న్యూటన్ 70
నృసింహస్వామి విగ్రహం 182

## ప

ఎమ్మిత్యాగరాయసెట్టి xi, xxxxvi,188
పల్నాటి బ్రహ్మన్న 4
పల్నాటి వీర చరిత్ర 173
పంచాగున్నల xii, xxxvii, 169
పండితరాయలు xxxii, 151. 159
పంటవారు 179
ప్రభురెడ్లు xxx, 177
ప్రసంగరత్నావళి xxxiii
ప్రకాశానందుడు 106
ప్రతాపరుద్రరెడ్డి 180
ప్రళయకావేరి (పులికాటు) 156
పాకనాటిరెడ్డి 178
పామూరు 175, 208
పాల్కురికి సోమన్న 23
పార్థసారథి అయ్యవారు xxxxvi
పాశుపతము 3
పుచ్చకాయలరెడ్లు 175
పుంగనూరు 157
పూనా 157
పూర్ణమ్మలు 56
పెనుగొండ 159
పెరంబూరు 188
పెన్నానది 184
ప్లేటో ix, x, xxiv, 3
పొదిలి xxvi, 170, 171, 174
ప్రొద్దుటూరు 166
పో, అల్లెన్ 128
పోతన 162
పోతులూరి వీర బ్రహ్మము 163, ixxiii
పోపు, Dr G. U. 144
పోరంకి 38
పోర్చుగీసు 185
ప్రౌఢదేవరాయలు 173
ఫ్రామ్, ఎరిక్ 71
ఫ్రాయిడ్ 86
ఫ్రెంచి విప్లవం xxxxxvii
ఫోండా ఘాటీ 185
ఫోరియర్ xxxxxvii

## బ

బంగోరె xxxvi, xxxxiv, 184
బందారు xii, xlii, xiv, xv, xvi, xviii, xxv, xxvii, xxxiv, 8 10, 101, 142, 143, 155, 160 170
బయలు 21, 22, 23, 26, 27, 28, 29, 30
బయోఫీడ్ బాక్ పద్ధతులు 74
బల్లి గ్రామము 187
బలిజ 165, 180
బళ్ళారి 180
బసవేశ్వరుడు ix 23, 29, 33, 36 45, 49, 184
బాడ్లేర్ 130, 131
బాలచక్రవేమన xxviii, 168
బాలారామ పండితులు 27
బారామతి 157
బ్రాహ్మణదేశాయి 182
బిజ్జలుడు 4, 23, 36
బీజపూరు 156, 157, 159, 182, 185
బుక్కరాయలు 162
బుక్కారెడ్డి 189
బెంగుళూరు 157
బేగూరు కొళ్లగరాధిపతి 186
బైబిలు 51
బౌద్ధం, బుద్ధుడు II, iv, v, xix, 5, 10, 14, 15, 17, 21, 23, 24, 26,

27, 29, 30, 36, 44, 46. 68, 70, 71, 73, 98, 100, 104, 105. 106. 107, 108. 168
బ్రౌను I, vii, x. xi, xii. xiii. xiv. xv. xvii, xxiii. xxiv. xxxii, xxxiv, xxxxxviii. 8, 10, 13, 14. 17, 18, 24, 27, 30, 31. 32. 39. 40, 42, 44. 45, 46. 48, 49, 57, 58, 59. 63. 64. 67, 79. 99. 100, 103. 144. 153, 155. 162. 164
బ్రూనో xxxxxix

భ

భవభూతి 183
భక్తి ఉద్యమము 219
భర్తృహరి 45, 90. 91. 135. 136
భద్రాద్రి 36. 163
భద్రగిరి స్వాములు 188
భట్టిప్రోలు 168
భాగవతుల కృష్ణదేశికుడు 27
భారతీతీర్థులు 187
భారంగి 187
భీమకవి 119
భీమఖండము 179
భూసుఖపాదుడు 16
భోస్లేరాజులు xxvi
భోజరాజీయము 178
భైరవుని కోన 181, 183

మ

మదకసిర 159
మద్రాసురాష్ట్రము 167
మదురై 157
మలకీలు 187
మలయాళము 1
మలార్మె 128
మల్కాపురము 183
మల్లణ చరిత్ర 179
మల్లిదేవుడు 4
మతప్రసక్తి రాహిత్యము 9, 10. 11. 30. 137
మధ్యమ ప్రతిపత్తు III. xx, xxxxxx. మాధ్యమికము 19. 29. 53. 70
మధుసూధన సరస్వతి 75
మనువు xv
మహమ్మదు 92
మహారాష్ట్రము 184
మహా సంకల్పము 184
మృచ్ఛకటికము xxxv
మాక్డోనాల్డు, ఆర్. యం. xi, 166. 167. 168
మాండ్విట్ 157
మానాటన్ 79
మార్లో, అబ్రహాం iv. 74, 76
మాసూవాదం II, 20. 30, 78, 108
మాత్యూ 91
మార్కాపురం xxvi, 169 170. 171 174
మార్క్సు, మార్క్సీయము xxxxxvii. 111. 138, 150
మాదిగుబ్బ 157
మాధ్వలతురీయము 184
మాలతీ మాధవము 183
మీర్జుమ్లా xxxxxvii, 158
మునావర్ ఖాన్ 182
మూగచింతల xxvi, xxviii, 169, 170. 174. 175. 176

మూగసేత 174
మూలచింత 174
మొలకచింత 174
మొరుసు-రెడ్లు, రాజ్యము-178, 184
మోటా(టి)రెడ్డి 178
మోపిదేవి 181
మేక్లీష్, ఆర్చిబాల్డు 130, 131
మైలపూరు 156

య

యజుర్వేద వివాహోపనయనములు 185
యామని 165
యుటోపియన్ సోషలిస్టులు xxxxxvii
యోగిరాయడు వేమన 178

ర

రఘునాధరాయలు 114
రఘునాధయ్యావార్తాకవి v
రట్టడి 179
రసవాదం xxxxxii. హేమతారకవిద్య 201
రస్సెల్, బెర్ట్రెండ్ 71, 73
రాయిదాసు 71 210
రమణారెడ్డి lxxiv
రామకృష్ణ lxxiv
రాయవరం పూర్ణయాచార్యులు xi,xxiv. xxv. 176
రాయని బాచన్న. భాస్కరుడు,160, 161
రాయలసీమ 167, 180
రాయ్, యం. యన్. II
రాజయోగం 13, 14, 31, 33
రామచంద్రరావు, సి వి. xxxxii
రామరాయలు 159
రామనాథక్షేత్రము 184
రామరాజ భూషణుడు 203
రామదాసు, కంచర్లగోపన్న xiv. xxxxiv. xxxxv, 36, 163
రామమూర్తి పరశురామ పంతులు lxvi
రామాయణ సారోద్ధారము 185
రామస్వామి అయ్యంగార్, యస్. lxxvii
రామారావు, యం. 182
రామారావు చేకూరి xii
రామానందుడు 71
రామానుజుడు 162
రావెళ్ళ మల్లా నాయుడు 202
రాళ్ళపల్లి I, iv, v, xi. xii. xiii xiv, xv,xvi, xvii, xviii, xix, xxiii xxiv, xxv, xxxi, xxxiv, xxxviii xxxxv, 10, 14, 17, 20, 32, 90 92, 93, 95, 98, 101, 104
రింబాడ్ 128
రిస్టైజాన్స్ xxxxxix
రికార్డో, డేవిడ్ xxxxxiv
రెడ్డివారి పద్యములు 178
రెడ్డి తాసిల్దారు 166, 167
రెడ్డి సంఘము 177
రెడ్డిసాని 179
రెడ్డి, సి. ఆర్. 1, xviii, xxxiv, xxxvi, xxxviii, 110, 132, 150 172,
రేవణుడు 17, 24, 25
రైతుబిడ్డ 180

ల

లకులీశ శైవమతాధిపతి 187
లింగధారులైన సాలీలు 188

లింగబలిజులు 188
లింగాయతులు 188
లీవిస్, సిసిల్‌డే 130
లీగాక్ 157
లెవెల్లర్స్ xxxxxvii
లేబర్ థియరీ ఆఫ్ వ్యాల్యూ xxxxxiv 47
లోకాయతము lxix,11.186,187

వ

వత్యం అద్వైతబ్రహ్మశాస్త్రి xxxvii
వరదక్షిణ xxxxxI. 58
వర్డ్స్‌వర్త్ 130. 131
వశిష్ఠుడు 106
వందవాసి 158
వంగూరి xii, xvii, xviii, xix. xxiv, xxv. xxvi. xxxii. xxxiv 101 151, 155 169. 188
వృద్ధాచలము 157
వాత్స్యాయనుడు 66
వావిళ్ళ iii. xii, xiii xv. xix, xxii xxv. xxxvii, 8,9,17. 32, 93,iii. 155
వాసిరెడ్డి 180
వామాచారము 98,99
వాయలార్పాడు 157
వాల్మీకి 94, 109
వాల్తేరు 82. 83, 144
వార్తకవి రామచంద్రరావు 116
వార్తాకవిత్వం v,xxxviii. xxxxx. 1t9, 113. 114, 115, 116. 117, 118, 138, 154.
వ్యాపారస్తులకవి xxxxxv.
వ్యాసుడు ix. x. xxiv. 109
వినయకుమార్ సర్కార్ xxxxvii
విశ్వకవి2
విశ్వనాథ xxxxiii. 140
విశ్వద 101
విశ్వబ్రాహ్మణుడు xxxxii
విజయనగరము. హంపి. 55, 156, 162, 173, 184
విజ్ఞానవాదము 26. 70, 105, 106 107. 108
వివేకానందుడు xix.
వినుకొండ 164, 165
విల్కిన్స్ x
విద్యారణ్యులు 186, 187
వీరభద్రరావు, కొత్తపల్లి xxxiv
వెంకటగిరి 157
వెంకటేశ్వరరావులు త్రిపురనేని Ixxxiii Ixxxiv, Ixxv. 61, 212
వెలమ 178. 179, 180
వెలుగోటివారి చరిత్రము 180

వెల్లూరు 157
వేమరెడ్డి 165
వేమయసామి 165, 168, 175
వేమడు 178
వేమనయోగి విరచిత వేదాంత సిద్ధాంతములు 168
వేమన యోగీంద్ర చరిత్రము 168
వేమన చరిత్ర xxvi
వేమన సమాధి 172
వేమన చిత్ర పటము 188
వేమనృపాలశేఖరా 178
వేమనామాత్యుడు 165
వేమనారాధ్యుడు 165
వేమని 165
వేమ చమూపతులు 165
వేమారెడ్డి పద్యములు 178
వేమాయలు 165
వేమారెడ్డి 165, 178
వేమినేని 165
వేములయ్య 165
వేములు 165
వేమూరి విశ్వనాథశర్మ xvii, xix xxiv, xxv, xxviii, 169. 170
వెంకటరెడ్డి 179
వేదం వేంకటరాయశాస్త్రి xxxv. xxxxxix
వేదం వెంకటాచలయ్య xxxvi
వేదాంతము ix, x. 94. 103. 106 108. 150. 151. 164
వేటూరి xii, xxv, xxvii, xxxiii, xxxiv, 155
వేల్చేరు నారాయణరావు lxii.
వైష్ణవ స్వాముల సమస్య xxxxv
వైట్ హెడ్. ఏ. యన్. lxxix

శ

శంకరుడు 10. 11. 24. 30. 95 105 106. 108
శతకకవుల చరిత్ర xxv
శబరి 94
శృంగేరి పీఠాధిపతులు 186. 187
శేషగిరిరావు బి. lxxvii
శ్రీకాకుళ మండలము 27 31.
శ్రీశ్రీ lxvi. xxiv 129, 146.
శ్రీధరుడు 27
శ్రీశైలము శ్రీగిరి 16. 17. 157. 181. 182. 202.
శ్రీనాథుడు iv. 9, 23, 145. 173. 179. 184
శ్రీరంగం 188
శ్రీరంగ దేవరాయలు 180
శ్రీవైష్ణవము 4
శ్రీహర్షుడు 24

శాక్తేయము 10, 99, 100, 182
శాంతాజీ 157
శ్రాద్ధ మంత్రాలు xxxvi
శివరామ దీక్షితులు 27, 28
శివాజి 157, 158, 187
శూన్యవాదం II, v, x, xvi, xx, 10, 15, 16, 17, 18, 19, 20, 21, 22, 23, 24, 26, 27, 28, 29, 30, 31, 32, 33, 63, 68, 70, 108
శూద్రకరాజకవి xxxv.
శేషాద్రి రమణకవులు xii, xxviii, xxxviii, iii, 169
శైవం, వీరశైవం iv, v, x, xii, xiii, xiv, xv xvi, xvii, xx, xxxxxii, 3, 4, 5, 6, 7, 8, 9, 10, 11, 12, 14, 17, 19, 21, 22, 23, 24, 25, 26, 31, 32, 33, 36, 38, 39, 45, 46, 49 68, 83, 100, 101, 111, 151, 161, 162, 184, 188
శ్వేతాంబరజైనము 26

ష

షా, బెర్నార్డు 144
షాజహాను xxxiii, 158, 159
ష్వైయిట్జర్, ఆల్బర్టు 71

స

సర్వజ్ఞుడు 1, 188
సర్వజ్ఞవేమన సంవాదము 188
సర్వదర్శన సంగ్రహము 186
సర్వోదయము 49
సర్వాయి పాపన్న xxxxiv, xxxxv
సహజయానము 15, 16, 17
సహజయోగము 93
సహజానందులు 15, 16
సృజన xxxxxvii.
సాంఖ్యము 44, 68, 100
సామ్యవాదము సామాజికవాదము 49
సామంత శూద్రకయ్య 186
సారహపాదుడు 1, 16
సాహిత్య అకాడెమి I, vii, x, xxxvii
సిద్ధవటము 157
సిద్ధురాండ్రు 25
సిద్ధనాగార్జునుడు 201
సీతారాముల పెండ్లి 60
స్పినోజా 71
స్వీడన్‌బర్గ్ 128
స్మిత్, ఆడం xxxxxiv, xxxxxvii
సుందరదాసు 16
సూఫీలు 73
సుపా 157

సురేశ్వరుడు 33
సూ్కమేకర్, E. F. xxxxxvii
సూ్కల్ ఆఫ్ పొలిటికల్ అరిథ్మెటిక్ xxxxxvii
సెయింటు సైమన్ xxxxxvii
సెప్ట్రాల్ ఏరియా ఆఫ్ రినెన్
సిఫలాన్ 74
సేలటోర్ 187
సోనారెతు 1
సోమేశ్వరసూరి 187
సౌర, గాణాపత్యములు 3
హడ్మార్డు, జాక్వే 72
హండేనాయకులు 182
హక్స్లీ, ఆల్డస్ 76
హాఫర్, ఎ. 76
హాల్డేన్, జె. బి. యస్. 71, 77
హార్వర్డు యూనివర్శిటీ xxxxxix

క్ష

క్షేత్రజ సంతానం xxxvi, xxxvii

